# మానవ కర్తవ్య సందేశం

# మానవ కర్తవ్య సందేశము

## MESSAGE TO HUMANITY



రచన

శ్రీ బాలానంద స్వామి

(పేరంటపల్లి)



అనువాదము

'నిర్మలం'



ప్రకాశకులు

బాలానంద భక్తబృందము (రిజిష్టర్డు)

రాజమహేంద్రవరము

1960



మూల్యము 5—00

# విషయ సూచిక







# సాంకేతిక పద వివరణము



1) సర్వాంతర్యామి - భగవంతుడు All-in-All.
2) స్థూలశక్తి - రక్తము Blood
3) సృజనశక్తి - పరిణామము పొందిన రక్తము - శుక్లశోణితములు.
4) ఇంద్రియములు - నరములు senses, nerves.
5) స్థూలేంద్రియములు - రక్తము ప్రసరించు ఇంద్రియములు.
6) సృజనేంద్రియములు - సృజనశక్తి ప్రసరించు ఇంద్రియములు.
7) సహజ వివేకేంద్రియము - ఏ ఇంద్రియము పెంపొందుటవలన మానవేతర జీవులు మానవజీవి అగుచుండు Common sense.
8) సూక్ష్మశక్తి - పరిణామము పొందిన సృజనశక్తి.
9) సూక్ష్మేంద్రియములు - సూక్ష్మశక్తి ప్రసరించు ఇంద్రియములు.
10) అతి సూక్ష్మశక్తి - పరిణామము పొందిన సూక్ష్మశక్తి Fine energy.
11) అత్యధిక సూక్ష్మశక్తి - పరిణామము పొందిన అతిసూక్ష్మశక్తి Finer energy.
12) మహాసూక్ష్మశక్తి - పరిణామముపొందిన అత్యధికసూక్ష్మశక్తి Finest energy.
13) ఆధ్యాత్మికశక్తి - పరిణామము పొందిన మహాసూక్ష్మశక్తి Spiritual energy.
14) విశ్వజీవి - సర్వాంతర్యామియొక్క సాక్షాత్కారము Universal being.
15) జీవి - మనస్సు, అహముల కలయికవలన ఏర్పడినది.
16) వ్యక్తీకృతజీవి - విశ్వజీవియొక్క లక్షణ రహితమైన సాక్షాత్కారము.
17) వ్యక్తిజీవి - విశ్వజీవియొక్క లక్షణ సహితమైన సాక్షాత్కారము.
18) విశ్వఅహము - సర్వాంతర్యామి విశ్వమనస్సుగా సాక్షాత్కార విధానములో ఏర్పడును.
19) వ్యక్తీకృత విశ్వఅహము - విశ్వజీవి వ్యక్తిమనస్సుగా సాక్షాత్కరించుటలో ఏర్పడును.
20) సశరీరస్థితి - భూమిపై జీవించి యుండిన కాలము.
21) అశరీరస్థితి - మరణానంతరస్థితి.
22) నవ్యమానవులు - క్రొత్తగా మానవజన్మను పొందినవారు.
23) పునరవతారిత మానవులు - మానవులుగా పునర్జన్మను పొందినవారు.



ఓం

జై శ్రీరామకృష్ణ

# ఈ గ్రంథము - గ్రంథకర్త



మానవ కర్తవ్య సందేశము (Message to Humanity) అనబడు ఈ గ్రంథాన్ని పూజ్యులగు మా గురువర్యులు శ్రీ బాలానందస్వామివారు ఆంగ్లములో రచించారు. శ్రీ స్వామివారిచేత స్థాపింపబడి పోషింపబడిన పోవర్టీ రిలీఫ్ సేవాసంస్థ ఈ గ్రంథాన్ని మొట్టమొదటిసారిగా 1951 లో ప్రచురించింది. ఆధ్యాత్మిక విజ్ఞానాన్ని అన్నిమూలలకూ వెదజల్లడం ఆ సంస్థ ఆశయాలలో ఒకటి గనుక ఈ గ్రంథము యొక్క ప్రతులను ప్రపంచమందు అన్నిదేశములలోగల విజ్ఞానవంతులకీ, రాజకీయ వేత్తలకీ ఉచితంగానే అందజేసింది. ఆ మరుసటి సంవత్సరము స్వర్గీయ కొలన దాసయ్యగారు "మానవ హిత సందేశము" అనే పేరుతో ఈ గ్రంథాన్ని తెలుగులోనికి అనువదించారు. పోవర్టీ రిలీఫ్ సేవాసంస్థవారే దానిని కూడా ప్రచురించి విరివిగా ప్రచారం సాగించారు. ఇంగ్లీషు ప్రతులు అతి త్వరితంగా అయిపోవడంవల్ల మరల చిన్నసైజులో ముద్రింపించారు.

తొలి ప్రచురణలోని విషయాలు సూత్రప్రాయంగా నుండి, అవగాహన చేసికోడానికి సులభంగా లేకపోవడం మూలాన్ని, తమ అనుయాయులయొక్కయూ ఇతర మిత్రులయొక్కయూ కోరికలను మన్నించి ఆ గ్రంథస్థ విషయాలను విపులంగా వివరించి స్వామివారు వ్రాసి అదేపేరుతో 1956 లో ప్రచురించారు. దాని అనువాదమే ప్రస్తుత గ్రంథము— ఈ మానవ కర్తవ్య సందేశము.

శ్రీ స్వామివారికి చాలామంది శిష్యు లున్నారు. వారి ఆదర్శాలను ఆశయాలను మెచ్చుకొని సహానుభూతి చూపించి సహకరించే భక్తజన మున్నారు. ఇంతే కాకుండా, లౌకికమైన కార్యకలాపాలలో పూర్తిగా మునిగి, స్థూలమైన భోగభాగ్యానుభూతులను పొందుచున్నప్పటికినీ, వాని అశాశ్వతత్వాన్ని తెలిసికొని, ఏదో తీరనీ తెలియనీ అసంతృప్తివలన మథనపడుచూ, ఆధ్యాత్మిక పిపాసను కలిగియుండియూ

ఆ తృష్ణను తీర్చుకొనుటకు సరియైన మార్గమును పొందలేక, ఎటుచూచినా బలీయమైన మత సాంఘికాది కట్టుబాట్లు అడ్డమై నిలుస్తూంటే వెలుగుకోసం దేవులించే ప్రజానీకమూ ఉన్నారు.

అట్టివారందరికీ ఈ గ్రంథం దారి చూపిస్తుంది.

వస్తు విషయాదులలోగల స్థూల సూక్ష్మ ఆధ్యాత్మికావస్థలను విచక్షణచేసే విజ్ఞానాన్ని కలుగజేస్తుంది.

సర్వాంతర్యామి ఈ విశ్వమందలి వివిధజీవులుగా ఆవిర్భవించిన విధానాన్ని విశదపరుస్తుంది.

ఆ వివిధ జీవులలోగల వివిధ తరహాలలో జరిగే శక్తిప్రసార విధానాన్ని తద్వారా జీవులలో కలిగే అభ్యుదయక్రమాన్ని వివరిస్తుంది.

"ఇది మానవుల పూర్వస్థితి. ఇది వారి మధ్యమస్థితి. ఇది వారి ప్రస్తుతస్థితి. మనము ఆ స్థితినుండి బయలుదేరి ఈ స్థితికి దిగజారినాము. మనము పొందవలసిన స్థితి ఇలా వుండాలి. కాని తప్పటడుగు వేయుటవలన మనకు మన గమ్యం దూరమయిపోతోంది. మనము ఈ ప్రకారము నడుచుకున్నట్లయితే, చేరవలసిన స్థానం చేరతాము." అని విడమరిచి చూపుతుంది.

"ఆధ్యాత్మికతత్వం అంటే ఇది– ఇదే అందరు మానవులకూ కావలసినది. మనం అనుసరిస్తూన్న మత సాంఘిక పద్ధతులు మన ఆధ్యాత్మిక పురోగమనానికి అడ్డుతగులుతున్నాయి. ఏదో, ఎప్పుడో, ఎలాగో, ఏకొందరికో ఏర్పడిన కొన్ని హక్కులను రక్షించుకోడానికీ, బలపరచుకోడానికీ, ఎప్పటికీ పోకుండా చేసికోడానికీ దోహదం చేస్తున్నాయి. ఇదీ అసలు స్థితి. దీనిని తెలిసికోండి. దీనిని తెలిసికొన్న తరువాత మీకు తోచినరీతిని సమస్యలను యెదుర్కొండి. ఆ పరిష్కారాలన్నీ, సక్రమంగానే, ఆధ్యాత్మికంగానే ఉంటాయి." అని హెచ్చరించి ప్రబోధిస్తుంది ఈ గ్రంథం.

ఆధ్యాత్మికౌన్నత్యాన్ని పొందడానికి మనం ఏమిచెయ్యాలి? ఇల్లూ వాకిలీ విడచి అడవులవెంట పోవాలా? అనే ప్రశ్నకు సమాధానం చెబుతుంది ఈ గ్రంథం.

అందరు మానవులకు పూర్వీకులు ఒక్కరే అనీ, వారు అత్యున్నత భూప్రదేశమైన హిమాలయ శిఖరాలపై నివసించేవారనీ, నిరూపించి, తద్వారా మానవు లందరిలో కల ఏకత్వాన్ని స్పష్టపరుస్తుంది ఈ గ్రంథం.

ఆదికాలంలో సంపూర్ణ శక్తిమంతులైన మన పూర్వీకులు ఆహార విహారాదులలో తమ ప్రయత్నంతో నిమిత్తంలేకుండా ఎట్లు జీవించెడివారో విశదపరచి ఆ స్థితి నుండి మనకు కలిగిన పతనాన్ని సమగ్రంగా వివరిస్తుంది.

పతనావస్థలోని ప్రస్తుత మానవానీక మంతా తమకు గమ్యమైన విశ్వజీవిలో ఏకత్వానుభూతిని పొందాలంటే ఏమి చెయ్యాలి ? ఎట్లు జీవించాలి ? ఎటువంటి ఆహారాన్ని తినాలి ? అనే వివరాలను విశదపరుస్తుంది.

ఈ శరీరానికి ఆహారం ఎందుకు అవసరం ? మనం తినే ఆహారం ఏయే పరిస్థితుల్లో ఎటువంటి పరిణామం పొంది ఇంద్రియాలకు బలాన్ని చేకూర్చి స్థూల. స్పజన. సూక్ష్మ. అతిసూక్ష్మాది శక్తులుగా పరిణామం పొందుతూ మానవుల అభ్యున్నతికి ఎట్లు సహాయపడుతుందో వివరిస్తుంది. అటువంటి ఆహారాన్ని మనం యెంత పవిత్రంగా పరిగణించాలో సూచిస్తుంది. ఆహారంలో పవిత్రత. అపవిత్రతలు ఎట్లు కలుగునో వివరిస్తుంది. అపవిత్రమైన ఆహారం తినడంవలన కలిగే దుష్ఫలితాలను స్పష్టపరుస్తుంది.

వస్తు విషయాదులతోడి వ్యవహారాములలోనూ. సాటి మానవులతో జీవించే పద్ధతులలోనూ. మనం అనుసరించవలసిన అలవాట్లయొక్క మంచిచెడ్డలను సోదాహరణంగా నిరూపిస్తుంది.

అదే రీతిగా వస్తు విషయాదులయందునూ ఇతర జీవులయందునూ మనం కనబరిచే ప్రేమలోని నిజాన్ని పరిశీలింపజేస్తుంది. ఒక వస్తువునిగాని. ఒక వ్యక్తిని గాని ఆ వస్తువుయొక్క గాని. ఆ వ్యక్తియొక్కగాని అభ్యున్నతికై ప్రేమించడం నిజమైన ప్రేమ అని నిరూపిస్తుంది. తన సౌఖ్యంకోసమో. లాభంకోసమో. కీర్తి ప్రతిష్ఠలకోసమో. ఇతర జీవులయొక్క. వస్తు విషయాదులయొక్క అభ్యున్నతిని కోరెడు ప్రేమ నిజమైన ప్రేమ కాదనియు. అదే వ్యామోహము. మమకారము అనియు విశదపరుస్తుంది. మానవు లందరూ ఈ వ్యామోహానికి అతీతులై నిజమైన ప్రేమను అలవరచుకోవాలని ప్రబోధిస్తుంది.

మానవ సమాజమునందు. అందరూ అభ్యున్నతి పొందడానికి ఒకరితో నొకరు ఎట్లు సహకరించుకోవాలో వివరిస్తుంది.

మానవుని జీవితపథంలో గార్హస్థ్య జీవితం ఎంతవరకు అవసరమో. ఆ గార్హస్థ్యంలో ఉండికూడా ఆ విధానాలకు అతీతులై సమాజ పురోభివృద్ధికి ఎట్లు సహాయపడాలో. అందుకు మనం ఏమిచెయ్యాలో సూచిస్తుంది.

ఆదికాలంనుండి నేటివరకూ కలిగిన మత, రాజకీయ, సాంఘిక సంబంధము లైన ఒడుదుడుకులను వివరిస్తుంది.

విశ్వమందు శాంతిని స్థాపింపజేయడానికి, భారతీయులకు ప్రత్యేక స్థానం ఎట్లు కలిగిందో విశదపరుస్తుంది.

విశ్వ శాంతిస్థాపనకు భారతీయులకు గల ప్రత్యేక స్థానము. ఆ స్థాన నిర్వహణానికై భారత రాజకీయ సాంఘిక సారథులు, సామాన్యప్రజలు అనుసరించ వలసిన విధానాలను వివరిస్తుంది. నేటి మానవ సమాజంలో అనేకంగా ఉన్న గడ్డుసమస్యలను ఎదుర్కొనడానికి ధైర్యం కలుగజేస్తుంది.

ఆధ్యాత్మిక విధానాలు అర్థంచేసికొని, ఆ పద్ధతులను అనుసరించవలసిన [illegible] మని ప్రబోధిస్తుంది. మన వ్యావహారిక విద్యలను నేర్చుకోవడానికి [illegible] గడిపినన్నాళ్లు, అనగా మూడు నాలుగు సంవత్సరాలయినా ఆ ఆధ్యాత్మిక జ్ఞానం కోసం, నిర్భీకత్వాన్ని, నిశ్చలత్వాన్ని, ఏకాగ్రతనూ, ఆసేతు శక్తిని సాధించుకోవడానికి వినియోగించాలి అని హెచ్చరిస్తుంది. అలా వినియోగించుకుంటే గొప్ప విజయం కలుగుతుంది. ఆ విజయం విశ్వమానవ రక్షణానికి సాధన మవుతుంది. అందుకు మనం తప్పక ప్రయత్నం చెయ్యాలని బుజ్జగిస్తుంది.

అక్కడితో ఆగదు. అలా చెయ్యకపోతే "మీ కర్తవ్యాన్ని మీరు విస్మరిస్తు న్నారు. మీ పురోవృద్ధిని మీరు పొందలేకపోవడమే కాకుండా, మీ సంతతివారి యొక్కయు రాబోయే తరాలవారి యొక్కయు పురోవృద్ధికి కూడా మీరు అడ్డు తగిలినవా రగుచున్నారు. మీ అసమర్థత విశ్వక్షేమానికే భంగకరం. మీరు రావణాది రాక్షసవర్గంలో జమ అయిపోతారు" అని మందలిస్తుంది.

మళ్ళీ– భయములేదు. ఆధ్యాత్మిక మహావ్యక్తుల కృపావిశేషంవలన, ఆధ్యా త్మిక పద్ధతులను అర్థంచేసుకొనుటద్వారా, యుక్తా యుక్త విచక్షణ అలవరచుకొని సత్సాంగత్యము సంతృపర్కము వలన విశ్వశ్రేయోదాయకమైన ప్రవర్తనను మనం అలవరచుకొనుట సాధ్యమవుతుంది. జయం లభిస్తుంది– అని మనలను ప్రోత్స హిస్తుంది.

ఇది ఈ గ్రంథముయొక్క విశేషం.

ఈ గ్రంథము ఇంగ్లీషులో నుండుటవలన స్వామివారి శిష్యవర్గానికి చెందిన తెలుగు ప్రజలకు, ఈ గ్రంథములో ఏముందో తెలిసికోవాలనే తీవ్రమైన ఆకాంక్ష యేర్పడుటవలన ఈ అనువాదం ప్రచురించటానికి పూనుకోవడమయింది.

ఈ గ్రంథము కొంతవరకు క్లిష్టమయినది. వాడుకలోనున్న ఆధ్యాత్మిక పరిభాషకు నిర్వచనాలు వేరువేరుగా నుండుటవలన, అనుకోని అర్థాలు రావటానికి అవకాశాలు లేకుండా చేయడంకోసం చేసిన ప్రయత్నంలో కొంత క్లిష్టత్వం తప్పనిసరి అయింది. పునరుక్తి కూడా అవసరమయింది.

ఇటువంటి క్లిష్టమైన గ్రంథాన్ని నేను అనువదించడానికి పూనుకోవడం కొంతవరకు సాహసమే. శ్రీ స్వామివారితోగల సన్నిహిత సంబంధంవలనా, తద్వారా పొందిన అపార కృపావిశేషానుభూతి వలనా, వారివలన బడసిన ఆదేశమూ ఆశీర్వచనమువలనా ఇందుకు పూనుకొని, ధైర్యము తెచ్చుకొని. అనువదించడమయినది. వ్రాత ప్రతిని స్వామివారికి చదివి వినిపించి పరిష్కరించటానికి అవకాశాలు కలిగాయి.

ఈ అనువాదం తయారు చెయ్యడంలో కుమారి పులిగుర్త అనంతలక్ష్మీనరసమాంబ చేసిన సహాయం ఇంతా అంతా కాదు. స్వామివారి ఆశీర్వచనంవలనా, ఆమెలో గల పూనికవలనా ఆమె తన గమ్యాన్ని సాధిస్తుందని నా నమ్మకం, కోరికాను. ఈ కార్యక్రమంలో సోదరులు లక్ష్మీనారాయణ, మహంకాళిరావులు మిక్కిలి సహాయపడి, అతి ఉత్సాహంతో సహకరించారు.

ఈ గ్రంథం అచ్చు వేయించడానికి పూనుకొని అందుకు అవసరమైన ఏర్పాట్లు అన్నీ చేసిన మా 'మధుబాబు' రామారావుకి భక్తబృందం తరఫున నా ధన్యవాదాలు.

* * * *

అన్యభాషలోనున్న ఒక గ్రంథాన్ని అనువదించి ప్రజానీకానికి అందించేటప్పుడు ఆ గ్రంథకర్తని గూర్చి కొంత చెప్పడం అనువాదకులకు సహజం. అందువలన శ్రీ స్వామివారినిగూర్చి సంక్షిప్తంగా చెప్ప ప్రయత్నిస్తాను.

* * * *

గోదావరీతీరపు దుర్గమారణ్యాలలో, పాపికొండల ప్రాంతంలో, ఆ కొండల లోయలో, ఏడెనిమిది ఆటవిక కుటుంబాలకి ఆశ్రయమిచ్చే పూరి గుడిసెలతో కూడియున్న ఒక కుగ్రామము పేరంటపల్లి. ఆ కొండలపైన ఎక్కడో పుట్టి పొర్లి

కుంటూ, గంతులు వేసుకుంటూ అయిదారు మైళ్ళు ప్రవహించి ఆ గ్రామందగ్గర గోదావరిలో కలుస్తుంది ఒక సెలయేరు. ఆ సెలయేటియొక్క రెండు పాయలమధ్య నడుమ, అత్యున్నతములైన మద్ది, మామిడి పనస మొదలగు వృక్షముల నీడలో నిర్మింపబడింది శ్రీరామకృష్ణ మునివాటం. ఇటికలతో కట్టబడి, చెక్కలతో కప్పబడి. నేలకూ నింగికీ కూడా ఓంకారాన్ని ప్రదర్శిస్తూంటుంది. ఆ పనసచెట్లక్రింద నిర్మింపబడిన ఆశ్రమ దేవాలయం. పన్నీరూ, పరిమళద్రవ్యాలతో మిశ్రితమైన సెలయేటి శీతలోదకములో స్నానమాడి, చందనచర్చ గావించుకొని, ఎఱ్ఱని గులాబీల దొంతరలతో కూర్చబడిన తులసిమాలతో అలంకరించుకొని, బిల్వదళాలచే పూజింపబడి, వస్త్రయజ్ఞోపవీతాదులచే అర్చింపబడి, కర్పూర నీరాంజనాన్ని, రకరకాల పూల హారాన్ని, అగరువత్తుల ఘుమఘుమనీ ఆఘ్రాణించి, ఆనందిస్తూ, గోష్ఠీగానాలతోనూ, మహా నివేదనతోనూ తృప్తుడై, ఆనందమయుడై, సచ్చిదానంద స్వరూపుడై, వెలుగొందు తూటాండు పరమేశ్వరుడా దేవళములో ఉదయసంధ్యలయందు రామ, కృష్ణ, శ్రీరామకృష్ణ, విష్ణు, శివ, లలిత, ఇత్యాది సహస్రనామ పరంపరలతో పూజిస్తారా దివ్యమూర్తిని. పరమశివుడంటూ బిల్వపత్రాలర్పిస్తారు. మహావిష్ణువంటూ తులసిపూజ చేస్తారు. ఆదిమాత అంటూ పసుపు కుంకుమ లర్పిస్తారు. ఎలా పిలిచినా పలుకుతారా సర్వాంతర్యామి.

ఆ దేవాలయానికి ఒకవైపు యజ్ఞశాల మరొకవైపున స్వామి కుటీరం ఉన్నాయి. యాత్రికులు, ఆశ్రమవాసులు బసచెయ్యడానికి మరో రెండుమూడు కుటీరములున్నాయి. శ్రీరామకృష్ణ మునివాటం అని పిలువబడు ఈ ఆశ్రమాన్ని స్థాపించినవారే శ్రీ బాలానందస్వామివారు. వీరినే పేరంటపల్లి స్వామివారనీ, పేరంటపల్లి సాధువుగారనీ అంటూంటారు ప్రజలు.

సుమారు 35 సంవత్సరముల క్రితము గోదావరీతీర సంచారానికి స్వామివారు వచ్చినది లగాయతు వారిని గురించి చాలామందికి తెలుసును. కాని అంతకుపూర్వము వారెక్కడ ఉండేవారో, ఎక్కడ జన్మించారో ఇత్యాది వివరములు ఎవరికీ తెలియవు.

శ్రీ స్వామివారికి ఏకాగ్రత, సత్యాన్వేషణ జన్మతోలబ్ధ విద్యలు. చనిపోయిన తరువాత మనుష్యుడేమౌతాడు? మరల జన్మిస్తాడా? అట్లు జన్మించినచో తన పూర్వ జన్మపు బంధువులతో ఎట్టి సంబంధ బాంధవ్యాలుంటాయి? ఇటువంటి ప్రశ్నలు

వారిని బాల్యంనుండీ కలవరపెట్టేవి. ఈ ప్రశ్నలకు సమాధానాలు తెలిసికోవాలనే జిజ్ఞాసకూడా బయలుదేరింది.

శ్రీ రామకృష్ణ పరమహంస ప్రబోధాలను పఠించారు. వివేకానంద శంఖారావము విన్నారు. ఆ స్వామి యిచ్చిన 'నా గురుదేవుడు' అనే ఉపన్యాసం వారిని అమితంగా ఆకర్షించింది. "ప్రక్కగదిలో అమూల్యములైన ధనరాసు లున్నట్లు గ్రహించిన దొంగ, తాను బంధింపబడియున్న గదిలో తానుండి, ఆ ధనరాసులను పొందుటకై పడెడి ఆవేదన, వాటిని గూర్చిన తపన అడ్డంకులవలన కలిగెడి నిరాశ, మరల పొందగలమనెడి ఉత్సాహం ఉద్వేగం, కార్యాచరణకై పూనిక– మానవుడు భగవంతుని పొందుటకు చూపించినచో ఆ భగవంతుడు తప్పక పలుకుతాడు. ప్రసన్న మవుతాడు. ప్రత్యక్ష మవుతాడు." శ్రీ రామకృష్ణులు చెప్పిన చిన్నికథ వారికి మార్గదర్శక మయింది. "నా గురుదేవుడు" అనే చిన్ని పొత్తము చేతబుచ్చుకొని పరివ్రాజకులై సత్యాన్వేషణోన్ముఖులై దేశాటన ప్రారంభించారు స్వామివారు.

శ్రీ రామకృష్ణునియందచంచల విశ్వాసముతో, ఆ సర్వాంతర్యామి సాక్షాత్కారాన్ని సాధించడమే ప్రధానలక్ష్యంగా పర్యటన ప్రారంభించారు స్వామి. దేశమునందన్నిప్రాంతాలు సంచారం చేశారు. అన్ని తీర్థాలూ సేవించారు. ఏఏ ప్రదేశాలు చూచినా, ఏఏ తీర్థాలు సేవించినా, ఏఏ పుణ్యనదులలో గ్రుంకు లిడినా, తమ లక్ష్యం ఒక్కటే. ఆ ఆశయం సిద్ధించడంకోసమే ఒకచోటు విడిచి మరొక చోటునకు పోవడం. ముందుకు పోవలెననే స్ఫురణ కలిగినవెంటనే వెడలిపోవుటయే. ప్రయాణంలోగల కష్టసుఖాలుగాని, ఆయా ప్రదేశాలలోగల వసతి సౌకర్యాలుగాని, ప్రయాణానికి కావలసిన డబ్బుగాని, వారికి ప్రతిబంధకా లయేవికావు. వారి అవసరాలకు వారు ఆ దివ్యమాతపైననే ఆధారపడేవారు. ఆమె కరుణాకటాక్షంవల్ల అన్నియు సమకూరెడివి. దేశమంతా తిరిగినా వారితోగూడా ఏసామానులూ ఉండేవికావు. కృష్ణాజినమూ, కమండలాన్ని కూడా విడిచివేశారు. 'నా గురుదేవుడు' అనే చిన్ని పొత్తము, పెనసలు మాత్రమే వారిని ఎడబాయని సహచరులు. క్షుత్పిపాసలు కలిగినప్పు డాయాచోటులలో లభ్యమయ్యే ఆహారపానీయములతో తృప్తిపడేవారు. శరీరానికి కావలసిన సౌకర్యాలను సమకూర్చుకొనుటయందు వారెట్టిప్రయత్నము చేసెడివారు కారు. మనస్సు లక్ష్యమునందే లగ్నమైయున్నపుడు అన్యవిషయముల ప్రధానములేకదా ! కాని శరీరము నిలబడియుండుట కూడ నవసరమేగనుక అప్రయత్నముగా లభించి ఆహారంతో ఆ శరీరం నిలబెట్టుకొనేవారు.

సర్వాంతర్యామి సాక్షాత్కారాన్ని పొందాలనే మహదాశయంతో సర్వమును త్యజించి సాధనచేసే వ్యక్తులను, అదేసాధనలో సిద్ధినిపొందిన తమ పూర్వపు ఆధ్యాత్మిక మహావ్యక్తుల సాధనావిధానములు, అనుభవవిశేషములు, ప్రబోధములు ఉత్తేజపరుస్తాయి. రామతీర్థస్వామి జీవితము మన స్వామి నుత్తేజపరచింది. ఆధ్యాత్మిక సత్యసాధనకొరకు రామతీర్థస్వామి చేసిన త్యాగము, పడినకష్టములు, పొందిన అనుభవములు, చూపిన అచంచల విశ్వాసము, సాధించిన విజయము వారిని అమితంగా ఆకర్షించాయి. తమ లక్ష్యసాధనయందు తాము పురోగమించడానికి సహకరించాయి. శరీరమును మరపింపజేశాయి. పదిరోజులు నిద్రాహారములు లేకుండా నిరంతరము అదేధ్యానలో నుండిపోయారు. జీవితమునందు రోత పుట్టినది. శరీరమును త్యాగము చేయవలెననే ప్రయత్నము చేశారు. ఎదుట కనిపించిన కత్తితో పొడుచుకొనుటకు ఉద్యమించారు. అంతలో సమాధిస్థితి కలిగింది. బాహ్యస్మృతి వచ్చేసరికి, స్వప్నలబ్ధమైన పరమేశ్వ రాజ్ఞానుసారము, ఎవరో యొక నూతనవ్యక్తి ఆహార పానీయములు తెచ్చి యెదుట నిలువబడ్డాడు. స్వామిచేత అప్యాయతతో భోజనము చేయించాడు.

1925 ప్రాంతములో స్వామి రాజమహేంద్రవరం వచ్చారు. అక్కడి నొక్కి చక్కంది, గోదావరీ తీరారణ్య సంచారానికి బయలుదేరారు. పాపికొండల ప్రాంతంలో సంచారం చేయుచూ, గోదావరీ సైకతములపై నొకనాటిరాత్రి విశ్రాంతి తీసుకొను చుండగా, దివ్యమాత సాక్షాత్కరించి వారిని పేరంటపల్లి తీసికొనివెళ్ళి ఇప్పటి ఆశ్రమ స్థానమునకు జేర్చి, పానవట్టముతో కూడిన పరమేశ్వర స్వరూపాన్ని చూపించిరి. ఆ పరమేశ్వర స్వరూపమే ఆశ్రమములో అర్చనలు పొందుచున్న శివలింగము.

పేరంటపల్లిలో ఆశ్రమము నెలకొల్పిన తరువాతకూడ స్వామి రాజమహేంద్రవరం దుమ్ముగూడెం, భద్రాచలం తరచు వెడుతూండేవారు. వివిధప్రాంతములలో వివిధములగు అనుభూతులను పొందేరు. అనేక కష్టములను అనుభవించారు. కొందరు స్వార్థపరులు కలిసి వారి శరీరమునే అంతమొందించడానికి యత్నం చేశారు. అనుకోని చోటులనుండి, అనుకోనివిధంగా, సర్వాంతర్యామి సహాయము లభ్యమయింది. భగవంతుని ఆశ్రితరక్షణ విధానము వారిని అద్భుతపరిచింది. ఆ సంచారములలో సర్వాంతర్యామి యందు వారికిగల విశ్వాసమును సుస్థిరపరచెడి సంఘటన లెన్నియో జరిగినవి. పరాత్పరుని సర్వాంతర్యామిత్వాన్ని సుస్పష్టంగా చూడ

గలిగారు. దివ్యమాత కరుణని పొందారు. గోపాల బాలుడు శ్రీకృష్ణుని సందర్శించారు. చైతన్యప్రభు సంకీర్తనలో తామే చైతన్యు లయారు. భాగవత భక్తభగవానుల ఏకత్వాన్ని అనుభవించారు. మహత్తర దివ్యానుభూతుల నెన్నిటినోపొంది. శ్రీ రామ కృష్ణునివల్ల సాంఘిక రాజకీయాది విషయాల్లో అనేక సూక్ష్మాలను తెలిసికొన్నారు.

1932 నాటికి సంచారం పూర్తయింది. తమ ఆశ్రమ పరిసరాలలోగల కొద్దిపాటి మానవ సంపర్కాన్ని కూడా సహించలేకపోయారు. ఆ సెలయేటి వెంబడి పాసికొండలమీదకిపోయి అక్కడ కుటీరం నిర్మించుకొని తపశ్చర్యకు పూనుకున్నారు. అన్యమానవ సంపర్కరం సహాయంలేని ఆ నిర్జనారణ్యంలో, వ్యక్తులు తమ సౌఖ్య క్షేమాలికి సర్వాంతర్యామిపైననే ఆధారపడాలి. నిర్భీకత్వం సుస్థిరమవుతుంది. ఒకనాడు పండ్లకొరకు వారొక ఫలవృక్షమువద్దకు వెళ్ళారు. అక్కడొక ఆడపిపంది తన ముండ్లను విప్పుకొని వారివైపు భయంకరంగా చూచింది. వన్యమృగ సంకీర్ణమైన ఆ అరణ్యంలో ఎంతో నిర్భయంగా తిరుగుతూన్నప్పటికీ, ఆ క్షణంలో ఏలనో వారికి భీతి కలిగింది. అంతలో సమాధి స్థితులయారు. వారికి బాహ్యస్మృతి వచ్చేసరికి రాత్రయింది. ఆ వరాహం మెటో పోయినది. వారు తమ కుటీరానికి చేరుకున్నారు. అంత మాత్రమైనను భయము కలుగుట వారికొక లోపముగా కన్పించినది. సంపూర్ణమైన నిర్భీకత్వాన్ని అలవరుచుకోవాలనుకున్నారు. అందుకు చేయవలసినది తమ శరీరాన్ని తమకు ప్రాణభీతిని కలిగించిన ప్రమాదానికి తమంత తాము గురిచేసుకోవడమే అనుకున్నారు. వారి కుటీరానికి దగ్గరగానే, ఆ సెలయేటిలో జంతువులు నీరు త్రాగేరేవు వుంది. అక్కడకు ఆ యడవిలోని జంతువులన్నీ నీరు త్రాగడానికి వస్తాయి. అక్కడ కాకపోతే, చాల దూరంవరకు నీరు త్రాగడానికి జంతువులకు అనుకూలమైన రేవులేమ. తమకు కలిగిన భయం పోగొట్టుకోవానికి, ఆ రాత్రి జంతువులు నీటికి వచ్చేదారికి అడ్డముగా పడుకున్నారు. ఆ యడవిలోని జంతువులన్నీ స్వామిదాకా వచ్చి వారిని చూచి, దాటి ముందుకు పోవుటకు ఇష్టపడక కొంచెముసేపాగి, వెనుతిరిగిపోయాయి. దానితో వారికి నిర్భీకత్వం పరిపూర్ణంగా అలవడింది.

అనుదినము అనేక దివ్యానుభూతులను పొందుచు, ఆ కొండపై ఒక సంవత్సరకాలం తపశ్చర్య సాగించారు. ఒకనాటిరాత్రి సువర్ణమూర్తియైన శ్రీరామకృష్ణ సందర్శనం కలిగింది. శ్రీరామకృష్ణులు స్వామి బుగ్గలపై తమనాలుకతోరాసి అంతయు దాగుంటుందని ఆశీర్వదించారు. శ్రీరామకృష్ణుని స్పర్శవలన వారికి అనిర్వచ

సీయమగు ఆనందం, మహత్తరమగు శాంతి లభించాయి. సర్వాంతర్యామి కృపా విశేషం వారికి పరిపూర్ణంగా లభించింది. మరునాడు వారు కొండదిగి క్రింది ఆశ్రమమునకువచ్చి వుండిపోయారు. మరల పైకి పోలేదు.

నిర్జనారణ్యంలోనుంచి మానవసమాజంలోనికి వచ్చినప్పటికిని వారికీ ప్రజలతో మాటలాడవలెనని యుండేదికాదు. తప్పనిసరిగ అవసరమయినపుడు సన్నిహితులకు సౌజ్ఞలవలన సూచించేవారు. ఆశ్రమ కార్యకలాపాలు అలాగే యధావిధిగా జరిగేవి.

వరరామచంద్రపురంనుండి కేసరిసింగుగారు, పోలవరంనుండి గాదం అప్పారావుగారు వస్తూండేవారు. వారు వచ్చినప్పుడు వారితోపాటు వంటపాత్రలు ఆహార పదార్థాలూ తెచ్చుకొని వంటచేసేవారు. దేవునికి నివేదనచేసి ఆ ప్రసాదాన్ని తాము తినేవారు. స్వామికూడా వారితోకలిసి ప్రసాదం పుచ్చుకునేవారు. ఎవ్వరునూ లేనప్పుడు ఒక చిన్న పిడతతో కొంచెము ప్రసాదము తయారుచేసి నివేదన చేసి కాకులకు కొంత, ఇతరులకు కొంత వినియోగము చేసి మిగిలినది స్వామి తినెడివారు.

ఆశ్రమములో ఏ సమయములో ఏ పనులు చేయుచున్నప్పటికిని వారిధ్యాన అంతయు సర్వాంతర్యామిపైననే యుండెడిది. సర్వాంతర్యామి ఈ వివిధరూపములలో నెట్లు సాక్షాత్కరించెను ? ఆ సర్వాంతర్యామి సాక్షాత్కారములైన ఈ వివిద జీవుల కర్తవ్యమేమిటి ? అవి మరల సర్వాంతర్యామిలో ఎట్లు లీనమగును. అట్లు లీనమగుటకు వివిధ జీవరాసులు ఏమి చేయవలెను ? ఎట్లు జీవించవలెను ? సర్వాంతర్యామి అనగానేమి ? ఈ విషయములను గూర్చిన జిజ్ఞాసతో నిద్రాహారములు మరచి రాత్రింబవళ్లు ధ్యాన నిమగ్నులై యుండెడివారు. శ్రీరామకృష్ణుని కృపావిశేషమువలన తమ తపశ్చర్యల ఫలితముగా తమ ప్రశ్నలకు సమాధానములను పొందగలిగారు. ఆ ప్రశ్నలకు సమాధానమే వారు రచించిన "మానవ కర్తవ్య సందేశము".

ఈ విశ్వమంతయు ప్రేమ జ్ఞాన సామర్థ్య శక్తుల ప్రసారముతో నిరంతరము నిండి యుండును. ఈ ప్రేమ జ్ఞాన సామర్థ్యములను మూడు శక్తులను అన్ని జీవులయందు నుండును. కొన్ని జీవులయందు సామర్థ్యశక్తి అధికముగా నుండును. మరి కొందరియందు జ్ఞానశక్తి యుండును. మరికొందరియందు ప్రేమశక్తి యధికముగా నుండును. కొందరిలో ఏ రెండు శక్తులైనను అధికముగా నుండవచ్చును. ఈ మూడు శక్తులను సంపూర్ణస్థితిలో కలిగియున్నవారిని సర్వాంతర్యామి సంపూర్ణావిర్భావమని చెప్పవచ్చును. ఆధ్యాత్మిక మహావ్యక్తులైనవారు ఈ శక్తులలో కొన్నిటిని అధి

యముగ కలిగియుండి నిరంతరము వ్యాప్తి చేస్తూంటారు. అట్టి మహావ్యక్తులచే విని ర్గతమైన శక్తులు విశ్వమందు ప్రసరిస్తూంటాయి. మన ఇష్టాయిష్టములతో నిమిత్తము లేకుండా విశ్వవ్యాప్తమైన యాశక్తులు అందరిలోనూ ప్రవేశిస్తూంటాయి. అర్హమైన జీవులలో అవి నిలిచిపోయి అట్టివారిపై తమ ప్రాబల్యమును చూపిస్తాయి. అట్టివారు ఆ యా శక్తిసంపన్నులౌతారు. అనర్హులలో ఆ శక్తులు నిలువకుండా పైకి పోతాయి. ఈ నిరంతర శక్తి ప్రవాహమునుండి ఆ యా శక్తులను గ్రహించుటవల్ల జీవులు పురోవృద్ధి పొందుతారు. చెట్లు జంతువులవుతాయి. జంతువులు మనుష్యులవుతాయి. ఆ మనుష్యులు ఆధ్యాత్మిక జీవనులై సర్వాంతర్యామిలో లీనమవుతారు. ఈ శక్తిప్రసార సిద్ధాంతమే ఈ విశ్వనిర్మాణానికి, ఈ విశ్వమందలి సర్వజీవ వ్యవహారములకు మూలము. ఈ మూడుశక్తులు, ఆ యా శక్తిపదార్థములు, ఆ శక్తులకు మూలము, ఆధారము అన్నియు నొక్కటే ఆదియే అన్నిచోటులలోనున్నది. అన్నిటికంటె శక్తివంతమయినది. సర్వత్రావస్థితము. సర్వశక్తిమంతమునగు సర్వాంతర్యామి ఆ సర్వాంతర్యామి ఇచ్ఛానుసారమే విశ్వనిర్మాణము జరిగినది. ఆ విశ్వము చైతన్యవంతమయినది. ఆ చైతన్య స్వరూపమే సర్వాంతర్యామి. ఈ విశ్వనిర్మాణ సూత్రములను, ఆధ్యాత్మిక సత్యములను. తమలోతాము తర్కించి తర్కించి, అనుభవమువల్ల నిరూపించుకొన్నారు స్వామి.

ఇట్లు తమలోతాము తర్కించి, సిద్ధాంతములను స్థిరీకరించుకొనిన తరువాత, వారికి తమ జీవితమును చాలించుకొనవలెనని కోరిక జనించినది. శరీరమునకు కావలసిన పోషణపదార్థములను తినుట మానివేసినారు. ఆలయములోని దేవునికొరకు చేసిన నివేదనను పక్షులకు ప్రక్కనున్నవారికి పంచియిచ్చి తాము పాలును పంచదారయును లేని తేనీరు త్రాగి యూరకొనెడివారు. ఈ రీతిగ శరీరమును శుష్కింపజేసి ప్రాణమును పోగొట్టుకొనవలెననుకొన్నారు. కాని భగవదేచ్ఛ అన్యథాయయియుండుటవలన అట్లు జరుగలేదు. 'విశ్వాసము' అని పిలువబడే అప్పారావుగారు తమ బిడ్డలను నలుగురిని తీసికొనివచ్చి స్వామివద్ద విడిచిపెట్టి వెళ్ళిపోయారు. కావలసిన ఆహారపదార్థములన్నీ తెచ్చి, బిడ్డలను అక్కడ పదిరోజులుంచుకొనమని స్వామిని కోరేరు. తమ ఏకాంతానికీ, నిరశనోద్యమానికీ భంగకరమని స్వామి అంగీకరించలేదు. కాని చివరకు, శిష్యుని ప్రార్థనలను నిరాకరించనూ లేకపోయారు. అక్కడ నివసించుటలోగల కష్టములను చెప్పి పిల్లలను బెదరించారు. గిన్నెలు తోముకొనుట, పుల్లలు కొట్టుకొనుట వారే చేసుకోవాలని హెచ్చరించారు. అయినా

ఆ పిల్లలు బెదరలేదు. అన్నిటికీ సిద్ధమేనన్నారు. వంట చేసేవారు. స్వామి ప్రసాదం తీసికొంటేగాని తాము తీసుకోమన్నారు. ఎన్నివిధముల ప్రయత్నించినా స్వామి తప్పించుకో లేకపోయారు. ఆ బిడ్డల పట్టుదలవల్ల తమ నిరశనవ్రతానికి స్వస్తిచెప్పి, తాము శరీరాన్ని విడిచిపెట్టడం దైవేచ్ఛ కాదనుకొని ప్రసాదం పుచ్చుకొన్నారు. ఈ రీతిగ 'విశ్వాసము' ద్వారా, వారి బిడ్డలద్వారా దైవము వ్యవహరించి స్వామి తమ ఉద్యమమును విరమించునట్లు గావించెను.

మానసికముగ, వారెటువంటి ధ్యానములో నున్నప్పటికినీ, ఎట్టి ఎక్కువ విచారములలో నున్నప్పటికినీ ఆశ్రమ కార్యకలాపముల నన్నిటినీ యథావిధిగా చేస్తూనే యుండెడివారు. సెలయేటి తాకిడికి ఆశ్రమముగట్లు కోసుకొనిపోకుండా, వాగులోని రాళ్ళను యేరి చుట్టూ రాతిపేర్పు పేర్చారు. అనవసరమయిన చెట్లను, పొదలను తీసి వేసి వాసయోగ్యముగా చేశారు. పూలమొక్కలు నాటారు. ఈ కాలంనుంచి ఒకరిద్దరు శిష్యులు ఆశ్రమంలో ఉంటూండడం ప్రారంభించారు. స్వామివారి కీర్తి అన్నివైపులా వ్యాపించి యాత్రికులు రావడం ప్రారంభించారు. ఆ వచ్చినవారితో స్వామి ఎక్కువగా మాటలాడెడివారుకాదు. తప్పకపోయినపుడు రెండుమాటలు చెప్పి తమధ్యానములో తాముండెడివారు. ప్రజలు వారివద్దకు వచ్చినప్పటికినీ, వారు ప్రజలకు దూరముగనే ఉంటూండేవారు.

ఇట్లు జరుగుచుండగా, ఒకనాడు "నా లీలలో నిమగ్నుడవై యుండుటమాని, నాలోనే నిమగ్నుడవై యుండుము"ని వారికి ఆజ్ఞ వినిపించినది. అంతవరకు వారి ధ్యాన అంతయు సర్వాంతర్యామి సాక్షాత్కార విధానమునందు, విశ్వ నిర్మాణ సూత్రములయందుండెడిది. ఈ యాజ్ఞ పొందిన తరువాత, వారికి నిరంతరము శ్రీకృష్ణ సందర్శనమయ్యెడిది. శ్రీకృష్ణుడు మురళి మ్రోయించుకుంటూ ఆశ్రమములో తిరుగుచుండెడివారు. ఆ కృష్ణునితో స్వామి మాటలాడేవారు. కృష్ణునితో కలిసిపోవుటకు తమలోకల కోరికను వెలిబుచ్చారు. కాని కృష్ణుడు అంగీకరించలేదు. 'నీవు చేయవలసిన కార్యక్రమము చాల యున్నది. అంతవరకు నీవిక్కడ యుండవలసినదే', యన్నారు. 'మానవుని యిచ్ఛకు లొంగి వ్యవహరించిన కాని ఈ ప్రపంచమునందే, పనులును జరుగవు. అందుకు తమకు ఇష్టము లేదన్నారు'. అనుకొనిన ప్రకారముగ అన్ని పనులు జరుగునని అభయమిచ్చారు. కృష్ణపరమాత్మ అంతర్థానమయ్యారు. ఆ కృష్ణస్వరూపము, చర్మము కప్పిన అస్థిపంజరములుగా రూపొందినది. ఆ యెముకలకును చర్మమునకును మధ్యగల ఖాళీ నింపమని సూచన కలిగినది. తినుటకు

తిండిలేక, కట్ట గుడ్డలేక, అటమటలాడే దీనజనుల ఆర్తిని పోగొట్టవలెనని నిశ్చ యించుకున్నారు.

తమ చుట్టునుగల ఆటవికులు పరిస్థితులు మిక్కిలి దుర్భరముగ నున్నవి. ఆ దీనజన సముద్ధరణ కార్యక్రమమునకు పూనుకొనుట తమ కర్తవ్యమని నిర్ధారణ చేసికొన్నారు. దిగువ ప్రాంతాలనుండి ఆశ్రమానికి వచ్చే భక్తజనానికి, ఆ యాటవి కుల సమస్యలను గూర్చి చెప్పేవారు. ఆ ప్రజలు అనుభవించే దుర్భర దారిద్ర్యాన్ని, హీనిన జీవితాన్ని గురించి స్వామి చెబుతోంటే భక్తుల హృదయాలు కరిగిపోయేవి. వారిచేత ఆ గిరిజనులకు సంతర్పణలు చేయించేవారు దసరా, ముక్కోటిఏకాదశి, మహాశివరాత్రి మున్నగు పర్వములలో ప్రత్యేకము పూజలేర్పాటు చేశారు. ఆ పూజ లకు దిగువ ప్రాంతాలనుండి అనేకమంది భక్తులు వచ్చి, ఆశ్రమములో నాలుగైదు రోజులుండెడివారు సమస్యలను సమగ్రంగా చర్చించడానికి అవకాశాలు కలిగేవి. భక్తుల సహాయ సంపదలద్వారా ఎంత సేవచేసినసూ, అది సమస్యాపరిష్కారము నందు సానుభూతి ప్రదర్శన మాత్రమే యయ్యేడిది. ఆ గిరిజనుల దుర్భర పరిస్థితులకు కారకులైన వర్తకులకు ఇంతమాత్రము సేవకూడ దుస్సహమయింది. ఆ సేవ తమ యిష్టప్రకారము జరగాలని వారు ప్రయత్నించారు కాని స్వామి అందుకు అంగీక రించలేదు. వారు స్వామిని తుదముట్టించడానికి రెండు మూడు ప్రయత్నాలు చేశారు. కాని సర్వాంతర్యామి కృపావిశేషంవల్ల ఎదుటనే యున్నప్పటికినీ, హంతకులకు స్వామి కనిపించలేదు. ఆశ్రమముతో సంబంధము కలిగియున్న గిరిజనులపై ఒత్తిడి ఎక్కువైనది. వారు ఆశ్రమంలో ప్రసాదం తీసుకొనకుండా అరికట్టడానికి ప్రయత్నిం చారు. వర్తకుల దురాగతాలకు అది శిఖరావస్థ అనుకున్నారు స్వామి. వర్తకులనుండి విమోచన కలిగించడము తమ విధి అని నిశ్చయించుకున్నారు. నిజాంప్రభుత్వపు ఉన్నతాధికారుల సహకారంవల్ల కూపులపద్ధతి ఆ ప్రాంతపు అడవులలో ప్రవేశపెట్ట బడింది. ఆ కూపులను వర్తకుల హస్తగతం కాకుండా, ఒక సంస్థను ఏర్పరిచి, ఆ సంస్థద్వారా స్వామి నిర్వహించడం ప్రారంభించారు.

అటవికుల పరిస్థితులు చాలా బాగుపడ్డాయి. సంస్థ వ్యాపార కార్యకలాపాలు కూడా చాల యెక్కువయాయి. పెట్టుబడిధనం చాలా యెక్కువగా కావలసివచ్చింది. స్వామి రాజమహేంద్రవరం వచ్చి కో ఆపరేటివ్ సెంట్రలు స్టోర్సు ద్వారా పెట్టుబడి పొంది వ్యాపారం కొనసాగించారు. స్టోర్సు యిచ్చిన పెట్టుబడికూడా చాలలేదు. ప్రభుత్వ సహాయం కోరారు. అప్పుడు గవర్నరుకు అడ్వయిజరుగానున్న శ్రీ శాంతి

వేంకటరామమూర్తిగారు రెండు లక్షల రూపాయిలు మంజూరు చేశారు. ఈ సందర్భంలో కో ఆపరేటివు రిజిష్ట్రారు సత్యనాథన్‌గారు. ఆశ్రమానికి వచ్చారు. సంస్థ యొక్క వ్యాపార కార్యకలాపాలను గురించి సమగ్రమైన చర్చలు జరిగాయి. రిజర్వ్ నిధిని యేర్పరచమన్న సూచనను స్వామి అంగీకరించలేదు. తమది సేవాసంస్థ కాని వ్యాపారసంస్థ కాదన్నారు. తమ రిజర్వ్‌నిధి సర్వాంతర్యామియే యన్నారు. తమ ద్వారా సేవాకార్యక్రమం యెంతకాలం జరగాలో అంతకాలము భగవదనుగ్రహంవల్ల ఏదో రీతిగా పెట్టుబడి లభిస్తుందన్నారు. పెట్టుబడికి ధనము లభించకపోవుటయే కార్యక్రమముల ముగింపుకు సూచనగా భావిస్తామన్నారు. ప్రభుత్వము చేయవలసిన సేవా కార్యక్రమమునే తాము చేయుచున్నామన్నారు. ఏనాడు ఆ కార్యక్రమానికి ప్రభుత్వం పూనుకుంటుందో ఆనాడు తాము విరమించుకుంటామన్నారు.

సుమారు పది సంవత్సరములు ఈ సేవా కార్యక్రమము చక్కగా నిర్వహింపబడినది. ఈ యుద్యమనిర్వహణలో స్వామిచేసిన సూచనలు, నడిపించిన విధానములు సర్వాంతర్యామిపై వారికిగల అచంచల విశ్వాసమును అనుదినము దృఢపరుస్తూండేవి. వ్యాపారము ఉచ్ఛస్థితిలో సాగుతూంది. స్థిర చరాస్తులెన్నో సంపాదింపబడ్డాయి. ఇవ్వవలసిన బాకీలను మించిన సరుకు నిలువలు డిపోలో ఉండేవి. ఈ స్థితిలో ఒకనాడు వారు గోదావరి దాటుచుండగా "ఈ నాటితో ఈ వ్యాపార కార్యక్రమము ఆపు చేయు" మని ఆజ్ఞ వినిపించింది. వెంటనే ఆ విషయాన్ని ప్రక్కనేయున్న కార్యకర్తలకు చెప్పారు. దిగ్విజయంగా సాగుచున్న వ్యాపారం ఆపుచేయడానికి వారు ఇష్టపడలేదు. కాని ఆ మరుచటి సంవత్సరం వ్యాపారం ఆపుచేయవలసి వచ్చింది. ఈయవలసిన బాకీలక్రింద స్థిర చరాస్థులన్నీ పోయాయి.

నిజాం రాజ్యంలో రాజకీయ కల్లోలం ఏర్పడింది. గూండాలు విజృంభించి ఆ ప్రాంతాన్ని తురుష్క రాజ్యంగా చేయాలనుకున్నారు. గ్రామాలపై దాడిచేసి గృహదహనాలు, దోపిడీలు, అత్యాచారాలు, మతాంతరీకరణలు చేయుట ప్రారంభించారు. ప్రజలకు రక్షణ లేకపోయింది. నాయకులంతా జైళ్ళలో నున్నారు. కొందరు ఇతర రాష్ట్రాలకు పోయి. అక్కడనుండి పనిచేయుట ప్రారంభించారు. గ్రామీణులు రక్షణకొరకై ఆక్రందనం చేశారు. స్వామివారి సహాయాన్ని రక్షణనూ ఆపేక్షించారు. "ప్రజలను రక్షించే బాధ్యత ప్రభుత్వానిది. రాజకీయసంస్థ తన బాధ్యతను తాను సమర్ధవంతముగా నిర్వహించలేనపుడు, ఆ బాధ్యతను ప్రజలే వహించాలి. తమను తామే రక్షించుకోవాలి. అసమర్థమైన ఆ రాజకీయ సంస్థను మార్చి. సమర్థ

మైన సంస్థను ప్రతిష్ఠించాలి" అని స్వామి హెచ్చరించారు. ప్రతి గ్రామములోను గ్రామరక్షక సేనలను యేర్పాటు చేశారు. తాము నాయకత్వం వహించి ప్రజలకు ధైర్యం రక్షణ కలుగజేశారు. గూండాలు దుశ్చర్యలను ఆ ప్రాంతంలో అరికట్టారు. ఆశ్రమవాసు లందరినీ వరరామచంద్రపురం పంపారు. కేంద్ర ప్రభుత్వం పోలీసు చర్య తీసికొని, నైజం రాజ్యాన్ని స్వాధీనపరచుకొనుటతోనే ఈ ఉద్యమం విరమింపబడింది.

రాజకీయ ప్రశాంతత ఏర్పడడానికి కొంతకాలం పట్టింది. ఈలోగా కొందరు దుండగీడులు రాజకీయపు ముఠాలు తిరుగుబాటుదారులను అణచడం అనేపేరుతో దోపిడీలు ప్రారంభించారు. స్వామివారిపై అసత్యారోపణలు చేశారు. అప్పుడు వారు హైదరాబాదువెళ్ళి మిలిటరీ గవర్నరును సైనిక అధికారులను కలిసికొని వారికి యావద్విషయములు తెలియజేసి వారి అనుమానములను తీర్చారు. స్వామివారూ, మిలిటరీ అధికారులు కలిసి ఆ గ్రామములలో సంచారముచేసి ప్రజలలోగల భయమును పోగొట్టి మరల ప్రశాంత వాతావరణము వర్ధిల్లునట్లు చేశారు. ఆశ్రమవాసులందరనూ మరల పేరంటపల్లికి మార్చారు.

ఈ రీతిగ ప్రజాపోషణ రక్షణ రంగములయందు అద్వితీయమగు సేవా కార్యక్రమములయందు నిమగ్నులై యున్నప్పటికినీ, ఆశ్రమమునందు జరిగెడి నిత్య పూజావిధానములకు, శిష్య శిక్షణకు ఎట్టి అంతరాయములును కలిగెడివికావు. వారు కొండమీదనుండి, క్రింద ఆశ్రమములో స్థిరపడినది లగాయతు ఎందరో స్త్రీలు, పురుషులు వారినాశ్రయించిరి. వారిలో కొందరు ఆశ్రమములో స్థిరముగ నుండిపోయిరి. అనుదినము గురు శుశ్రూష, దైవచింతనతో కాలము గడుపుచున్నారు. ఈ సాధనా విధానములో కొందరత్యున్నత దశలను పొంది దేహములను చాలించియున్నారు. అమితములగు కష్టనిష్ఠురములతో కూడియున్న ఆశ్రమజీవితమను అసిధారావ్రత చర్యను కొందరింకను సాగించుచున్నారు. అనేకమంది గృహస్థులు తమకు తీరిక, అవకాశములు కలిగినపుడు ఆశ్రమమునకు వెళ్ళి, గురుసేవ చేసికొనుచు, గురు ప్రబోధములను మననము చేసికొనుచు వారి అపార కృపావిశేషమువలన, సంసార పంకిలమున నుండియు కూడ అభ్యుదయ పథమున పురోగమించుచున్నారు. స్వామివారి యుపదేశములవలన ఆకర్షింపబడి, కర్మాచరణకు ముగ్ధులై, వారికి ప్రీతిపాత్రులై పురోగమించుచున్న యువకులనేకులున్నారు.

దీర్ఘ తపస్సువలన, భగవత్ [illegible] [illegible] అనుభవమునకు వచ్చిన ఆధ్యాత్మిక పద్ధతులను తర్కించి తర్కించి, భగవదాదేశాను [illegible] మానవ కోటికి సందేశరూపమున నందించారు. [illegible] ఆధ్యాత్మ విచారణ యను మరియొక గ్రంథమును [illegible].

గ్రంథరచనా కార్యక్రమమయినట్లు [illegible] ఆరోగ్యము చెడినది. [illegible] సహాయము పొందినప్పటికిని యథాస్థితి [illegible] విశ్రాంతి [illegible] నది. గ్రంథరచన, శిష్యశిక్షణ కార్యక్రమములనుండి [illegible] విశ్రాంతి తీసికొనుచున్నారు.

భక్తి జ్ఞాన కర్మయోగముల సమాశించిన [illegible]. నిరూపించిన మహాయోగి శ్రీ బాలానందస్వామి [illegible] పరచి, శివకేశవాది భేదముల [illegible], [illegible] ప్రేమ, జ్ఞాన [illegible] శక్తు లన్నిటినీ విశ్వాభ్యుదయమునకై వినియోగించి, [illegible] లక్ష్యమును సాధించినవారు శ్రీ బాలానందస్వామి. నేటి మానవుల [illegible] నకై, ఎట్టి త్యాగమునకైనను వెనుదీయని కారణ జన్ములు శ్రీ బాలానందస్వామి. వారి ప్రబోధమే ఈ 'మానవ కర్తవ్య సందేశము'.

ఓం, జై శ్రీరామకృష్ణ.

బాలానందవిహార్,
శ్రీరామనగరం,
రాజమహేంద్రవరం,
12—9—1960.

'నిర్మలం.'



ఓం

జై శ్రీ రామ కృష్ణ

# మానవ కర్తవ్య సందేశము

## ఒకటవ అధ్యాయము

### మహావిశ్వము — మానవకోటి.

సర్వాంతర్యామి (All-in-All) ఈ విశ్వమందు స్థూల (gross) సూక్ష్మ (subtle) ఆధ్యాత్మిక (spiritual) ములను మూడు స్థితుల యందు సాక్షాత్కరించి యుండును. స్థూల ఆధ్యాత్మిక స్థితులకు నడుమ నాలుగు దశలున్నవి. అవి సూక్ష్మ (subtle), అతిసూక్ష్మ (fine), అత్యధిక సూక్ష్మ (finer), మహాసూక్ష్మ (finest) దశలు. ఈ నాలుగు దశలును కలసి సాధారణముగ సూక్ష్మదశ యనబడును.

సర్వాంతర్యామి సాక్షాత్కారములలో అచరములగు సస్యజీవులు, మానవేతర జీవులు, మానవులును కలరు. మానవులు కాని యితర జీవులు రెండురకములు. మొదటివి అల్పములైన ఇంద్రియములు కలవి. ఇవియే క్రిములు, కీటకములు మొదలగునవి. ఈ సందేశములో అల్పేంద్రియ మానవేతర జీవులనుటన్నైనది. రెండవజాతి ఉత్తమమైన యింద్రియములుకల జంతుజాలము. ఇవి యీ సందేశమునందు ఉత్తమేంద్రియ మానవేతర జీవులనబడినవి.

వ్యక్తీకృత విశ్వమనస్సు (Individuated Universal Mind), వ్యక్తీకృత విశ్వ అహములు (Individuated Universal Ego), కలయికవలన జీవులేర్పడును. ఇట్టి వ్యక్తీకృతజీవులు వ్యక్తి అహములతో కలసి సస్య శరీరములను దాల్చినప్పుడవి సస్యజీవు లనబడును (Vegetative beings). వానికి వ్యక్తి అహములే (Individual Egos) కాకుండ, స్థూలేంద్రియములు (Recreative senses), సృజనేంద్రియములు (Creative senses) కూడ నుండును. అవి ఒక చోటు నుండి మరియొక చోటునకు కదలలేవు. కాని సౌఖ్యముకొరకు ఆకాంక్ష కలిగి, ఆ సౌఖ్య సముపార్జనకై ప్రాకులాడును.

వ్యక్తీకృత జీవులు వ్యక్తి అహములతో కలసి అల్పేంద్రియములను పొంది, శరీరములను దాల్చినపుడు, అవి అల్పేంద్రియ మానవేతర జీవులనబడును. వానికి స్థూల సృజనేంద్రియములు కూడ నుండును. అవి సౌఖ్యము కొరకును, క్షేమము కొరకును కూడ ఆకాంక్షయు, ఆవేదనయు కలిగియుండి, ఒక చోటునుండి మరియొక చోటునకు కదలగలవు.

వ్యక్తీకృత జీవులు, వ్యక్తి అహములతో కలసి అల్పేంద్రియములను, ఉత్తమేంద్రియములను పొంది శరీరములను దాల్చినపుడు అవి ఉత్తమేంద్రియ మానవేతర జీవులనబడును. వానికి స్థూలేంద్రియములు, సృజనేంద్రియములునుకూడ నుండును. వానికి అల్పేంద్రియ జీవులకన్న సౌఖ్య క్షేమములయందు తీవ్రతరమైన ఆకాంక్షయుండి అట్టి సౌఖ్యక్షేమములను పొందుటకు సమర్థవంతములుగ పనిచేయును.

వ్యక్తీకృత జీవులు, వ్యక్తి అహములను, స్థూల సృజనేంద్రియములను, సహజవివేకేంద్రియములను (Common sense) సూక్ష్మ, అతిసూక్ష్మ, అత్యధికసూక్ష్మ, మహాసూక్ష్మ ఆధ్యాత్మికేంద్రియము

లను కలిగియుండి శరీరములను దాల్చిన యెడల మానవులనబడును. మానవులు సౌఖ్యక్షేమములను పొందుటకై తీవ్రమగు ఆకాంక్ష కలిగి, ఆట్టివానిని పొందునిమిత్తము, ఒక చోటునుండి మరియొక చోటునకు కదలగలుగు శక్తిని కలిగియుండుటయేగాక, ఆ సౌఖ్యక్షేమములు పురోవృద్ధిపై నాధారపడియుండునని యు, ఆ పురోవృద్ధిని గూర్చినట్టియు జ్ఞానమునుకూడ కలిగియుందురు.

సస్యజీవులును, జంతుజీవులును, మానవులును అను నీ మూడు విధములగు జీవులును ఈ మహావిశ్వమునందు స్థూలము, సూక్ష్మము, ఆధ్యాత్మికము (gross, subtle and spiritual) అనియెడు మూడు స్థితులలో నున్నవి. ఈ మూడు విధములైన జీవులయందును, మానవులు, ఇతర జీవులంతరిలోని సనసంబంధము గలిగినట్టి సర్వోత్కృష్టమైన జీవులు. ఈ సందేశమునందు, సమస్త జీవులను గూర్చియు, ముఖ్యముగ మానవులనుగూర్చియు ప్రబోధము చేయబడినది. మానవులు స్థూల, సూక్ష్మ ఆధ్యాత్మికములను మూడు స్థితులలో నుందురు. శరీరమును కలిగియున్నట్టి స్థితిలో. అనగా, స్థూలమైన స్థితిలో వారికి శరీరమును, మనస్సును, అహమును, సహజ వివేకమును, స్థూల, సృజన, సూక్ష్మాదింద్రియములును నుండును. సూక్ష్మ, అతిసూక్ష్మాదింద్రియములు కూడ నుండును. కాని ఆ యింద్రియములు సక్రమముగ పనిచేయుచు నుండవచ్చును, లేదా, చేయుచు నుండకపోవచ్చును. శరీరముతో కూడుకొని యుండని సూక్ష్మస్థితిలో శరీరమే కాక, స్థూల, సృజనేంద్రియములు కూడ నుండవు. స్థూలమైన స్థితియందు, అనగా శరీరముతో కూడియుండి, అన్ని యింద్రియములు కలిగియున్నప్పుడు పొందబడినట్టియు, సహజ వివేకముచే పెంపొందింపబడినట్టియు అనుభవములతో నిండియున్న అహముపై సూక్ష్మస్థితియందు ఆధారపడి యుండును. ఆధ్యాత్మిక స్థితిలో స్థూలేంద్రియములును, సృజనేంద్రియములును, సహజ వివేకేంద్రియములును కూడ నుండవు. సక్రమ

ముగ వ్యవహరించుచున్నట్టి సూక్ష్మ, అతిసూక్ష్మ, అత్యధిక సూక్ష్మే దింద్రియములు మాత్రముండును.

అన్ని తరగతులకు చెందిన జీవుల స్థితులన్నిటియందును (స్థూల gross, సూక్ష్మ subtle ఆధ్యాత్మిక spiritual స్థితులు) అనగా విశ్వ అహము (Universal Ego) తో కూడిన మనస్సునందు ఆయా జీవుల (Beings) తో పాటు వ్యక్తి అహములు (individual egos) మాత్రముండును. సహజ వివేకమును ఇతర యింద్రియములును నుండవు. అన్ని స్థితులయందును, జీవుల 'వ్యక్తి అహము' (Individual ege) లలో సౌఖ్య క్షేమములను పొందవలెనను తీవ్ర కాంక్ష యుండును. సస్యజీవుల యహములలో సౌఖ్యమును పొందవలెనను గాఢ యాకాంక్ష మాత్రమే యుండును. వాని శరీరములలో స్థూలేంద్రియములు, సృజనేంద్రియములును నుండును. అందుచేత ఆ జీవులు తమ యింద్రియములకును, తమ శరీరస్థితికిని అనువగునంతవరకును సౌఖ్యమును పొందుటకొరకై చేసెడి ఈ వ్యవహారములో, ఈ తీవ్రమైన అన్వేషణలో, సంపూర్ణమైన సంతృప్తి కలుగువరకును వ్యవహరించుచునే యుండును. ఆ జీవులకు, సౌఖ్య, క్షేమములను సంపూర్ణముగా పొందుట అసాధ్యము గనుక తమకు సాధ్యమైన సౌఖ్యమును పొందుటయందు మాత్రమే తీవ్రమైన కృషి చేయుచుండును. ఇట్టి స్థితిలో, ఆ జీవుల ద్వారా సౌఖ్యమును పొందుటయను తీవ్రమైన కోరిక, ఆకాంక్షలతో కూడిన శక్తులు ప్రసరించుచుండును. ఆ శక్తులు విశ్వమంతటను వ్యాపించుచుండును. ఇదేరీతిగ, ఉత్తమతరగతికి చెందినట్టి, ఉత్తమేంద్రియములు కలిగిన జీవరాసులుద్వారా తమ శరీరములకును, తమ యింద్రియములకును అనువైనట్టి సౌఖ్యక్షేమములను సంపూర్ణముగ పొందవలెనను ఆకాంక్షతో కూడిన శక్తులు ప్రసరించుచుండును. ఆ శక్తులుకూడ విశ్వమందంతటనూ వ్యాపించుచుండును. ఈ రీతిగ అభివృద్ధమైన ఇంద్రియ

ములు కలిగినట్టియు, సౌఖ్యప్రాప్తికొరకు మాత్రమే ఆ కాంక్షతో కూడియున్న అల్పేంద్రియములు కలిగిన జీవరాసులద్వారా విస్తృతమై వ్యాపించుచున్న శక్తియును, ఉత్తమమైన యింద్రియములు కలిగినట్టియును, సౌఖ్యము క్షేమములను రెండిటి కూడ పొందుటకైన ఆ కాంక్షతో కూడినట్టి జీవరాసులద్వారా విస్తృతమై, వ్యాపించుచున్న శక్తులను విశ్వమందు కలిసికొనును. ఈ రెండు శక్తులును ఒకేవిధమయిన ఆ కాంక్షలతో కూడియుండిన వగుటవలన, ఉత్తమేంద్రియములను కలిగిన ఉత్తమజీవరాసులద్వారా విస్తృతమైన ఉత్తమశక్తి, యీ శక్తుల కలయికవలన నేర్పడిన మార్గముద్వారా అల్పేంద్రియములుగల అల్ప జీవరాసులలో ప్రవేశించును. ఈ విధానము ఆధ్యాత్మికసిద్ధాంతము (Spiritual principle) ననుసరించి నిరంతరము సాగుచున్నది.

మనస్సులు విశ్వఅహములతో కలిసినపుడు, ఆ కలయికవలన జీవులేర్పడును. ఆ జీవులు శరీరములను కలిగియుండవచ్చును, లేదా అశరీరస్థితియందుండవచ్చును. విశ్వఅహముతో కూడిన మనస్సులు సస్యశరీరములను దాల్చినపుడు వానిని సస జీవులందురు. ఈ సస్యజీవులకు మనస్సును, శరీరమును, సౌఖ్యమును పొందుటకు తగినశక్తి కలిగిన స్థూలేంద్రియములును, సృజనేంద్రియములును నుండును. సౌఖ్యము కొరకు మాత్రమేగాక, క్షేమముకొరకుగూడ ఆ కాంక్ష కలిగి పాటుపడెడు శక్తితోగూడిన యింద్రియములుగల అహములతో కూడిన మనస్సులతో, అనగా వ్యక్తిజీవులతో (Individual beings) సాంగత్యము కలిగి, వానినుండి ప్రసరించుచు విశ్వమందు వ్యాపించుచున్న శక్తులను గ్రహించి, సస్యజీవులు తమ క్షేమమునుకూడ కాంక్షించుటకు తగినశక్తిగల యింద్రియములను పొందుటకు అర్హులగుచున్నవి.

సౌఖ్యము, క్షేమము అను నీ రెంటినీ పొందుటయందు ఆకాంక్షయు, ఉన్ముఖతయుగల యింద్రియము లీ సందేశములో అల్పేం

ద్రియము లనబడుచున్నవి. సస్యజీవులకు అల్పేంద్రియములు లేవు. అల్పేంద్రియములను పొందుటకు అనువైన శరీరములు వానికి లేవు. సౌఖ్యము, క్షేమము రెండింటికొరకును పొందదగిన ఇంద్రియములను పొందుట కొరకు అనువైన శరీరములుగల జీవులు అల్పేంద్రియ జంతు జీవులు. అనగా క్రిమికీటకాదులు. ఆహారము, ఘ్రాణ, స్పర్శ అల్పేంద్రియములును గల జీవులను అవి సశరీరులై యుండినను, అశరీరులై యుండినను అల్పేంద్రియ మానవేతర జీవులందురు.

ఈ అల్పేంద్రియ మానవేతర జీవులచే విసర్జితమై, విస్తృతమగు చున్న శక్తి ఆ జీవులకన్న శ్రేష్ఠమైనదియును, ఉత్తమమైనదియునగు జీవులచే విసర్జితమై, విస్తృతమగుచున్న శక్తులతో కలియును. ఈ కలయికవలన అల్పేంద్రియ జీవుల అల్పశక్తులలోనికి ఉత్తమేంద్రియ జీవుల ఉత్తమశక్తి ప్రవేశించును. అందువలన అల్పేంద్రియ జీవులు, ఉత్తమమైన యింద్రియములను పొందుటయును, అల్పేంద్రియములవలన పొందదగు సౌఖ్యక్షేమములకంటె అధికమగు సౌఖ్యక్షేమములను కాంక్షించుటకు తగిన ఉత్తమేంద్రియములు పనిచేయుటకు వీలగు శరీరములను పొందుటయును సాధ్యమగును. ఉత్తమశక్తులను కలిగియున్న ఇంద్రియము లీ సందేశమునందు ఉత్తమేంద్రియము లనబడినవి. ఘ్రాణ, స్పర్శ, అల్పేంద్రియములేగాక ఉత్తమేంద్రియములను, అవి వ్యవహరించుటకనువైన శరీరములను పొందిన తరువాత ఆ జీవులు ఉత్తమేంద్రియ మానవేతరజీవులుగా ఈ సందేశమునందు చెప్పబడినవి.

అల్పేంద్రియ మానవేతరజీవులును, ఉత్తమేంద్రియ మానవేతర జీవులును రెండునుకూడ ఎల్లప్పుడును సౌఖ్యక్షేమములు పొందుట యందు ఆసక్తి గలిగియుండును. సౌఖ్యక్షేమములయందు సంపూర్ణమైన సంతృప్తిని పొందవలెనని వాని యింద్రియములు ప్రేరేపించుచుండును. సౌఖ్యక్షేమములను పొందవలెననెడి యారాటమే కాని, ఆ

సౌఖ్యక్షేమము లెట్లు కలుగును నెడి జిజ్ఞాసయు, జ్ఞానమును వానికి లేవు. అందువలన సౌఖ్యక్షేమములయందు వానికిగల యున్ముఖయు, వాని శరీరములకుగల యింద్రియముల ఆశక్తతయు వానిలో తీవ్రతరమైన ఆవేదనను రేకెత్తించును.

ఇట్టి ఆవేదనతో కూడినవియును తగిన యింద్రియములును, అనువగు శరీరములును లేని ఉత్తమేంద్రియ మానవేతర జీవులచే విసర్గతమై, వ్యాపించుచున్న శక్తి, వానికన్న వేరైనట్టియు, సౌఖ్యక్షేమములను పొందెడి విధానము నెరిగినట్టియు, ఆ విధానమునుగూర్చిన జ్ఞానమును పొందుటకు అనువైన శరీరములను, ఇంద్రియములను కలిగియున్నట్టి జీవులచే విసర్గతమై వ్యాపించుచున్న శక్తులతో కలియును. ఈ శక్తుల కలయికవలన నేర్పడిన మార్గముద్వారా ఉన్నతశక్తులు, ఉత్తమేంద్రియ మానవేతరజీవులలో ప్రవేశించును.

సౌఖ్యక్షేమములను పొందెడి విధానమునుగూర్చిన జ్ఞానమును కలిగినట్టి యింద్రియము లీ సందేశములో మానవేతరజీవుల ఉన్నతేంద్రియము లనబడినవి. ఈ యున్నతశ్రేణికి జెందిన మానవేతరజీవులు తాము జంతుశరీరములలో నున్నపుడే, ఉన్నతేంద్రియములను పొందినప్పటికినీ, ఆ శరీరములు గతించువరకును మానవేతరములుగనే యుండును. మానవేతర జీవులు, అట్టి శరీరములలో నున్నంతవరకును, ఆ శరీరము అంతమగువరకును నుండెడి స్థితిలో, సౌఖ్యక్షేమములను పొందెడి జ్ఞానము కలిగిన యింద్రియములను, మానవేతరజీవుల యున్నతేంద్రియము లందురు. మానవేతర శరీరములు గతించిన తరువాత ఆ యున్నతేంద్రియములే సహజ వివేక మనబడును. స్థూల, సృజనేంద్రియమును, అల్ప, ఉత్తమేంద్రియములును సహజ వివేకమును ఇవన్నియును సౌఖ్యక్షేమాకాంక్షలతో పనిచేయుటకు మానవశరీరములే యనువైనవి. ఈ రీతిగ ఉన్నతేంద్రియములను పొందిన మానవేతర జీవులు, సహజ వివేకముగల మానవజీవులగుదురు.

ఉన్న తేంద్రియములను పొందుటకు అర్హమై, ప్రపంచములో మానవ శరీరములతో నవతరించుచున్నవి. కాని మానవులు మాత్రము, తమకు పూర్వము మానవేతరములగు శరీరములతో నున్నప్పుడు గల భావముల తోడనే యుండి, ఆ జీవుల శరీరములకు తగినటువంటి సద్గతులనే యనుస రించుచు, తమకు ముందు రాబోవు కాలములో, కలుగబోయెడి స్థితు లను, అట్టి స్థితులను పొందుటకు చేయవలసిన సాధనలను గూర్చిన జ్ఞానములేక, సక్రమమైన పురోవృద్ధిని పొందకనే యీ ప్రపంచమునందు మిగిలిపోవుచున్నారు. ఈ రీతిగ జీవకోటియొక్క పురోవృద్ధి మొత్తముగ కుంటువడి పోయినది.

సౌఖ్యక్షేమములను పొందవలెననెడి యాకాంక్ష మానవులలో నిరంతరమైనది. వానికి మూలమైన పురోవృద్ధిని సాధించెడి ప్రయత్న ములు అవిరామముగ నున్నవి. కాని పురోవృద్ధియొక్క ఆనుపానులు, అవసరము వారికి తెలియవు. అందులకు పర్యవసానముగా మానవులకు తమకు లభించుచున్న సౌఖ్యక్షేమములయందు తీవ్రమైన యసంతృప్తి గలుగుచున్నది. ఈ యసంతృప్తివలన, వారు కాలము చెల్లి, శరీరము లను విడిచిపెట్టినప్పటికినీ, సౌఖ్యక్షేమములను పొందుచుండవలెననెడి యున్ముఖతతోడనే యుందురు. కాని శరీరములు గతించిన తరువాత, అశరీరస్థితియందున్నపుడు, వారికి శరీరము స్థూల సూక్ష్మేంద్రియములు కూడ నుండవు కావున తమతమ యపేక్షలను తీర్చుకొనుటకు పరిశ్రమ చేయలేరు. వారెట్టి సాధనయును చేయలేరు. అందువలన, నట్టి అసహాయ స్థితియందు వారి యపేక్ష యింకనూ తీవ్రమగును. ఈ తీవ్రమైన యపేక్ష వలన వారు మరల అనువగు శరీరములను దాల్చుటకవకాశము కలుగును. వారదివరకే, మానవశరీరముల కనువైన యింద్రియములను పొంది యుండుటవలన, వారు మరల మానవ శరీరములను మాత్రమే ధరిం

తురు. పురోవృద్ధిని సాధించి సౌఖ్యక్షేమములను పొందుటయందు తృప్తిని పొందవలెననెడి యపేక్షతో భూమిపై మరల మానవ శరీరములతో నవతరింతురు.

మానవ శరీరములతో కొంతకాలము ప్రపంచములోనున్న వ్యక్తులు (individuals) ఆ శరీరములు గతించిన తరువాత మరల మానవ శరీరములనే ధరించి యవతరింతురు. శరీరములు గతించి మరల శరీరములు ధరించెడి వరకు గల, యీ మధ్యకాలములో ఆ వ్యక్తులు సూక్ష్మావస్థయం దుండెదరు. వారు సూక్ష్మప్రపంచమునందు సూక్ష్మస్థితిలో నుండెదరు.

ఇదెట్లనగా, ఒకవ్యక్తి అన్ని అవయవములును సక్రమముగ పనిచేయుచుండిన స్థితిలో కొంతకాలము జీవించె ననుకొనుడు. అంతలో నా వ్యక్తియొక్క శరీరమునకు చెవుడును, మూగయు, గ్రుడ్డితనమును, కదలలేని తనమును కలిగెను. తరువాత కొంతకాలమునకు చెవుడు, మూగ, గ్రుడ్డితనము కదలలేనితనము అన్నియుపోయి యథాస్థితిలోనికి వచ్చెను. ఇవన్నియు నొకేయొక జీవితకాలములో జరిగెను. ఆ వ్యక్తికి ఆ జీవితకాలమంతయును ఆలోచనలు భావములు, వివేకము అవిరామముగ సాగుచునే యుండెను. ఆ వ్యక్తి శరీరమునకు వినపడుట, మాట, చూపు, కదలికయు పోయినప్పుడు, వానితో బాటు భావములు ఆలోచనలును పోలేదు. ఇంద్రియములన్నియు సక్రమముగా పనిచేయుచున్న కాలములో ఆ వ్యక్తి తన శరీరముద్వారా బాహ్య ప్రపంచముతో వ్యవహరించుచుండెను. ఇంద్రియములు పని చేయకుండనుండిన కాలములో భావములను వెల్లడి చేయ లేకుండెను. శరీరముద్వారా వ్యవహరింప లేకుండెను. ఇంతకు మించి శరీరావయవములు పనిచేయు చుండెడి స్థితికిని, చెడిపోయినప్పటి స్థితికిని ఏమియు

భేదములేదు. ఇదేరీతిగ, అవయవము లన్నియు పనిచేయుచున్నప్పటి స్థితి వంటిది సశరీరస్థితి. అవయవముల యొక్క శక్తులుపోయి ప్రపంచముతో వ్యవహరింపలేనప్పటి స్థితి వంటిది అశరీరస్థితి. అవయవములకు శక్తులు మరల వచ్చిన పిమ్మట కలిగిన స్థితివంటిది మరల శరీరములతో నవతరించెడి స్థితి. (Re-embodiment or Re-birth) అవయవముల యొక్క పటుత్వము పోయిన కాలములో ఆ వ్యక్తి శరీరమును కలిగి యుండి నప్పటికినీ, శరీరము ద్వారా పనిచేయ లేకుండెను. అదేరీతిగ, అశరీరస్థితియందు శరీరము లేని కారణముచేత ఆ వ్యక్తి శరీరముద్వారా పనిచేయ లేకుండెను.

అందుచే మానవవ్యక్తు లదివరకే సహజ వివేకమును పొంది యుండుటవలన, సౌఖ్యక్షేమములు పురోవృద్ధిపై నాధారపడి యున్నవని తెలిసికొనియుండి యుండుటవలన, సూక్ష్మస్థితినుండి మరల భూమిపై నవతరించునపుడు మానవేతర శరీరములతో నవతరింప వలసిన యవసరము లేదు. మానవేతర శరీరములకు సహజ వివేకమును కలిగి యుండెడి శక్తిలేదు. అందువలన వానికి పురోవృద్ధి యనుస్థితియే తెలియదు. పురోవృద్ధి యందు వానికి ఆసక్తిలేదు. ఆ జ్ఞానము మానవేతరులకు కూడ కలిగినపుడు వారు మానవశరీరములతో నవతరింతురు.

పురోవృద్ధి యొక్క ఆనుపానులు తెలియకపోవుటవలన, వారు మానవ శరీరముల కొరకు గాని మరి యే యితర శరీరముల కొరకు గాని ఆశ పడకుండగనే, సౌఖ్యక్షేమములందు పరిపూర్ణమైన తృప్తిని పొందుటకు మాత్రము తీవ్రముగా కాంక్షించుదురు. వా రిదివరకే సహజ వివేకమును కలిగి యుండుటవలన, వారి యాకాంక్షల కనువైనవి మానవ శరీరములే యగుటవలన వారు మరల మానవశరీరములతోడనే యవతరించెదరు. పురోవృద్ధిని గూర్చిన వివరములు తెలియక

పోవుట వలన మరల శరీరములతో నవతరించినది మొదలు ఇంద్రియ ములద్వారా పురోవృద్ధికై పాటుపడ నారంభించెదరు. స్థూల సృజ నేంద్రియములతో సంపర్కము కలిగిన వెంటనే సూక్ష్మస్థితిని మరచి పోవుదురు. తాము కొంతకాలము సూక్ష్మస్థితియందుంటిమనికూడ వారు మరచి పోవుదురు. పురోభివృద్ధియొక్క వివరములు తెలియక పోవుటవలన, సూక్ష్మస్థితినుండి ఆ పైనగల భావిస్థితులను పొందలేరు. అందువలన వారు మరల భూమిపై నవతరింతురు.

ఈ రీతిగ, ఒక పర్యాయము, మానవులుగ ప్రపంచమునం దుండిన తరువాత కూడ వారు మరల మానవులుగనే యవతరింతురు. ఈ స్థితియందు వారి యాకాంక్షలు పూర్వపు స్థితియందలి యాకాం క్షలవలెనే యుండును. పురోవృద్ధియొక్క వివరములను గ్రహింప కుండగనే పురోవృద్ధికై పాటుపడుచుందురు. ఇక్కడ వారికేవియో కొన్ని వస్తువులను గూర్చియు, విషయములను గూర్చియు, వ్యక్తులను గూర్చియు, తామున్న ప్రపంచమునకు సంబంధము లేనివియును, కాని ఒకేజాతికి సంబంధించినట్టివియునైన వానినిగూర్చి యేవియో అస్పష్ట మైనట్టియు, పూర్తిగా అవగాహనకానట్టి విషయములు జ్ఞాపకమునకు వచ్చును. అట్టి జ్ఞాపకములనుగూర్చి వా రాలోచింప సమర్థులునుకారు. వర్ణింపనూలేరు. కాని యిట్టి అవ్యక్తము, అస్పష్టమునైన స్మృతులు మాత్రము వారికి కలుగుచుండును. ఈ స్మృతివిషయములు తామున్న ప్రపంచము ననుసరించినవి కాకపోయినప్పటికినీ సాధారణముగ మాన వులు పొందదగిన వాని కతీతమయిన వగుటవలన నిట్టి అవ్యక్తములు అస్పష్టములును నయిన స్మృతివిషయములనుగూర్చిన పరిశీలన, సాధన మాత్రమే పురోవృద్ధియొక్క పరమావధి యనుకొందురు. వాని వలననే తమకు సౌఖ్యక్షేమములు కలుగు ననుకొందురు. ఇట్టి అస్పష్టములైన

జ్ఞాపకముల నాధారము చేసికొని, అట్టి స్వర్గములలో వారికి గోచరించిన స్థితులను సాధించుటకై ప్రయత్నించెదరు. ఈ ప్రయత్నము లన్నియుగూడ, సౌఖ్యక్షేమములు పురోవృద్ధిపై నాధారపడి యుండు నను జ్ఞానముపై నాధారపడినవేకాని, పురోవృద్ధియొక్క వివరములను గూర్చి తెలిసికొనకుండ జరుగుచుండును. వారు మానవేతర శరీరములలో నున్నప్పుడుకూడ, ఇట్టి ప్రయత్నములనే సాగించిరి. అప్పటికిని, నిప్పటికిని భేదమేమనగా, సౌఖ్యక్షేమములు పురోవృద్ధిపై నాధారపడి యుండునని అప్పుడు తెలియదు. ఇప్పుడు తెలియును. ఎన్ని పర్యాయములు మానవ శరీరములతో నవతరించి నప్పటికినీ, పురోవృద్ధి యనన నేమి ? అదెట్లు సాధింపబడునను వివరములు తెలుసుకొనువరకును నిట్లే సాగుచుండును.

పర్యవసాన మేమన, ఆధ్యాత్మిక సిద్ధాంతము ప్రకారము, ఎందరో వ్యక్తులు మానవులుగ నవతరించుటకు అర్హతనుపొంది, మానవులుగ నవతరించు చున్నారు. కాని, వారింకను మానవేతరము లైన (Nonhuman), ఆకాంక్షలను, అన్వేషణలను, విధానములను విడిచిపెట్టుటలేదు. అదివరకే మానవులైన వారెందరోకూడ, ఎన్నియో పర్యాయములు మానవులుగ నవతరించి నప్పటికినీ, తమ పూర్వపు మానవేతర నైజములతోనే యున్నారు. వారు మానవేతరములైన యున్ముఖత, ఆశయములు, సిద్ధాంతములతోడనే వ్యవహరించుచున్నారు. ఇదియే యీమహావిశ్వమునందలి మానవకోటి. ఇదియే యీప్రపంచము నందలి మానవుల ప్రస్తుత స్థితి. ఇదియే యీ ప్రపంచ మానవకోటికి నేడుగల విషమసమస్య.

అందువలన,

మానవకోటి తమ ప్రస్తుతస్థితిని గుర్తించెదరు గాక !

మానవకోటి పురోవృద్ధియన నేమియో దానిని సాధించు టెట్లో తెలిసికొనెదరు గాక !

మానవకోటి తమకు, తమ శరీరములకు గల యింద్రియములను గూర్చి తెలిసికొనెదరు గాక !

మానవకోటి మానవులుగ తమ పురోవృద్ధిని యెట్లని తెలిసికొనెదరు గాక !



# రెండవ అధ్యాయము

# మానవ విస్తరణము

ప్రపంచమునం దిప్పుడున్నంత జనసంఖ్య, యిదివర కెన్నడును, ఏ కాలము నందును నుండియుండలేదు. ఎరిగియున్నంతవరకును, చాల పురాతనకాలపు మానవచరిత్రలో కూడ, అనేక ప్రాంతములందు, అనేక పద్ధతుల ప్రకారము జనాభా లెక్కలు సేకరింపబడియున్నవి. కాని యే ప్రాంతములోనుగూడ అవి సరియైన పద్ధతిలో సేకరింపబడి యుండలేదు. ఆ యున్న లెక్కలైననూ అన్ని కాలములలో లేవు. సరియైన జనాభా లెక్కలు లేకపోవుటకు ఆయా ప్రాంతములలో కలిగిన రాజకీయపు మార్పులును, మతముల వలన కలిగిన మార్పులును, సమాజమునందు కలిగిన మార్పులును, కారణములు. ప్రస్తుత కాలములో జనాభా లెక్కలను క్రమముగ సేకరించెడిపద్ధతి, కొన్ని ప్రాంతములలో ప్రారంభమయి, అన్ని ప్రాంతములకును వ్యాపించుచున్నది. కాని, ప్రపంచమందంతటను ఇంకను వ్యాపించలేదు. ఆక్రమింపబడిన భూభాగము నందంతటనూ నింకను అమలులో లేదు.

సరియైన పద్ధతి ప్రకారము తయారుచేయబడిన జనాభాలెక్కల ప్రకారము కొన్ని ప్రాంతములందు కొన్ని కొన్ని కాలములలో జనాభా తగ్గినప్పటికినీ, మొత్తముమీద నేటికాలము వరకును, పెరుగుచున్నట్లే కనపడుచున్నది. కొన్ని కొన్ని ప్రాంతములలో కొన్ని కొన్ని దేశములలో, పెరుగుదలయొక్క పరిమాణములు వేరువేరై యుండవచ్చును.

దీనిని బట్టి చూడ, యీ జనసంఖ్య ప్రళయకాలమందు, ప్రపంచమంతయు సర్వాంతర్యామిలో లీనమగువరకును, ప్రతిసంవత్సరము పెరుగుచునేయుండునట్లు స్పష్టముగా కనబడుచున్నది.

సౌఖ్యక్షేమములు పురోవృద్ధిపై నాధారపడియున్నవి. కాని, ఆ పురోవృద్ధి యననేమో, దానినెట్లు పొందవలయునో తెలియక పోవుటవలన, మానవులు తాము సహజముగా పొందుచున్న సౌఖ్యక్షేమములయందు తృప్తిని పొందలేకున్నారు. ఆ కారణమువలన సౌఖ్యక్షేమములింకనూ అధికముగా పొందవలెననెడి యాకాంక్ష వారిలో నింకను నెక్కువై, అందుకొరకు వారు మరల మరల మానవశరీరములతో నవతరించుచున్నారు. వారదివరకే సహజవివేకమును పొంది యుండుటవలన మరల మానవేతర శరీరములతో నవతరించనక్కరలేక పోవుటవలన, మానవులుగనే యవతరింతురు. ఇట్లు మరల మరల మానవదేహములను పొందినవ్యక్తులే సందేశమునందు పునరవతారితే (Re embodied), మానవులనబడిరి. పురోవృద్ధి యననేమో, దానిని సాధించుటయెట్లో తెలియువరకును వారీ విధముగనె యెన్ని పర్యాయములైనను, నవతరించుచు నుండవలసినదే. ఆ పురోవృద్ధిని గూర్చిన జ్ఞానమును పొందుటకు వారికొకటికన్న అధికముగా జన్మలు కావలసి వచ్చును. జనసంఖ్య నిరంతరము పెరుగుచుండుట కిదియొక ప్రబల కారణము.

పురోవృద్ధి రెండువిధములు – బాహ్యముఖము ఊర్ధ్వముఖము. బాహ్యముఖపురోవృద్ధిని బాహ్యాభివృద్ధియనియు (Outward Progress) ఊర్ధ్వముఖపురోవృద్ధిని అభ్యుదయమనియు (Upward Progress) యీ సందేశములలో చెప్పబడినది. బాహ్యాభివృద్ధియనెడి స్థితిలో మానవులు సౌఖ్యక్షేమములను పొందుటయందు సంతృప్తి గాంచలేకపోవుట

వలన మరల మరల మానవులుగ నవతరించు చున్నారు. అభ్యుదయ మనెడి స్థితిలో అట్టి యవసరములేదు. మరల మరల అవతరించవలసిన యవసరమునకు వా రతీతులయ్యెదరు. వారికి పునర్జన్మయుండదు. సౌఖ్య క్షేమముల ననుభవించుటయందు పరిపూర్ణమైన తృప్తిని పొంది పునరవ తరణావశ్యకత నధిగమింతురు.

సామాన్యముగ, విశ్వనిర్మాణ విధానము ననుసరించి, అల్పేంద్రి యములను కలిగినట్టియును, ఉత్తమేంద్రియములను కలిగినట్టియును, మానవేతర జీవులు మానవులతో సంపర్కము పొందుచుండెదరి. అన్ని రకముల జీవులచేతను విసర్జితమగుచుండి, వ్యాప్తినొందుచున్న శక్తులు ఆ యా వర్గములకు చెందిన యితర జీవులచే విసర్జితమగుచుండి, వ్యాపించు చుండిన శక్తులతోనేగాక, యితర వర్గములకు జెందిన జీవులచే విసర్జిత మగుచు వ్యాపించుచుండిన శక్తులతో గూడ విశ్వ సిద్ధాంతము ప్రకారము కలియుచున్నవి. ఈ కలయికవలన, అభ్యుదయ సిద్ధాంతముల ననుస రించి సౌఖ్యక్షేమములయందుగల యున్నతవలన, తమకు మానవత్వ మును పొందునట్టి అర్హతను కలిగించునట్టియును, అనగా మానవులుగా నవతరించెడి యవకాశమును కలిగించునట్టి యున్నతేంద్రియములను మానవేతర జీవులు పొందుచున్నవి.

మానవేతర శరీరములతోనున్న జీవులు, పై జెప్పిన విధముగా శక్తుల కలయికద్వారా పొందిన యున్నతేంద్రియము, మానవ శరీ రముతోనున్న వ్యక్తులకుగల సహజ వివేకేంద్రియములు. ఉన్నతేంద్రి యములను పొందుటవలన మానవత్వార్హతను బొందిన మానవేతర జీవులు, తమ శరీరములు గతించిన తరువాత, సహజ మానవ ప్రజ్ఞను (Standard human awareness) పొందుదురు. అప్పుడు వారు మానవ వ్యక్తులగుదురు.

అందువలన, మానవులతో సంపర్కము కలిగి, మానవులచే వినిర్గతమగుచున్న శక్తులను గ్రహించిన మానవేతర జీవులు ఆధ్యాత్మిక సిద్ధాంతము ప్రకారము ఉన్నతేంద్రియములను పొంది తాము ప్పుడు పొందియున్న మానవేతర శరీరములు గతించిన తరువాత, సహజ వివేకముగల మానవులుగ నవతరించు చున్నారు. ఈ రీతిగ, అవిరామముగ, అంతులేకయే నిత్యము పెరుగుచు మానవసంఖ్య పెద్దది యగుచున్నది. సౌఖ్య క్షేమములను పొందవలెననెడి యాశయము మానవులలో కూడ, మానవేతరులలో వలెనే యున్నప్పటికినీ, తమ ప్రయత్నములు ఆ యాకాంక్ష ననుసరించి మాత్రముకాదు. అయినప్పటికిని అట్టి ప్రయత్నములు తమ సహజ వివేకముపై నాధారపడి యుండును. కాని వారికిగల సహజ వివేకపు శక్తిగూడ పరిమితమైనదే. పురోవృద్ధిలో బాహ్యాభివృద్ధి, అభ్యుదయము నను రెండు రకములు గలవని సహజ వివేకము గ్రహింపనేరదు. సూక్ష్మేంద్రియములు సహాయపడినగాని, సహజవివేకము యీ విషయమును గుర్తింపలేదు. అభివృద్ధి అభ్యుదయముల ఫలితము, పర్యవసానములను తెలిసికొనలేదు. అందువలన బాహ్యాభివృద్ధి ద్వారా సౌఖ్య క్షేమములను పొందుట అసాధ్యమను విషయమును మానవులు గుర్తింపలేకున్నారు.

సాధారణముగా, ఉన్నతేంద్రియములను పొందిన మానవేతర జీవులు, ఆ యా శరీరములు గతించిన పిమ్మట, సహజ వివేకమును పొంది, మానవులుగ నవతరించిన తరువాత కూడ, తాము తమ పూర్వ శరీరములలో నుండినప్పుడు పొందిన అనుభవములను, ఉన్ముఖతల ననుసరించియే చాల కాలమువరకు, అనగా వారిలో సూక్ష్మ శక్తి కలిగి సూక్ష్మేంద్రియములు చురుకుగ పనిచేయు నంతవరకు బాహ్యాభివృద్ధియందే ఆసక్తిగలవారై, అభివృద్ధికొరకును, తన్మూలమున సౌఖ్యక్షేమముల కొరకును పాటుపడుచున్నారు. ఈ నవ్య మానవు

లకును (fresh humanity) అనగా మొట్టమొదటిసారిగ మానవ శరీరములతో నవతరించిన వ్యక్తులకును, మానవేతరములైన జంతువు లకును గల తారతమ్యమేమన, ఒకరికి మానవ శరీరము లున్నవి, రెండవ వారికి జంతు శరీరము లున్నవి; అంతియే! ఈ నవ్యమానవులకు గల సహజ వివేకమే ఉత్తమేంద్రియములుగల మానవేతరులు పొందగోరెడి, పొందెడి యున్నతేంద్రియము. ఉత్తమేంద్రియ మానవేతర జీవులచే, కాలానుగతముగ కూడబెట్టబడిన ఉన్నతశక్తియొక్క అణువులు ప్రసరించి పని చేయుటకు వారి శరీరములయందు అనుకూలమైన మార్గములు లేవు. అట్టి శక్తులకు తగిన యింద్రియములు పనిచేయుటకు తగిన ఆధారములు ఆ శరీరములలో లేవు.

కాని, ఆ శక్తి జడముగ, స్తబ్ధముగ చైతన్యరహితముగ పడి యుండలేదు. ఆ మానవేతర జీవులలోగల సౌఖ్యక్షేమములను పొందుటను గూర్చిన తీవ్రమగు నొత్తిడిచే నీ యున్నతశక్తి బలమును పొంది, చైతన్యయుతమై, ప్రకోపించి పని చేయవలెనని ప్రయత్నించును. ఈ యారాటము వలన, ఆ జీవులు పొందదగిన యభ్యుదయము, ఉచ్ఛస్థితిని పొంది, తాము మరల భూమిపై నవతరించుటకు అనువగు శరీరము లేర్పడును. మానవేతర జీవుల యున్నతేంద్రియములే, మానవులలోగల సహజ వివేకము గనుక, అట్టి శరీరములు మానవశరీరములై యుండును. ఈ రీతిగ మానవేతర జీవులు పొందదగిన యభ్యుదయము నందలి యుచ్ఛస్థితి మానవులకు ప్రారంభదశయు, మానవత్వములోని మొదటి మెట్టును మాత్రమే యని విశదమగుచున్నది.

ఉన్నతేంద్రియములు లేని మానవేతర శరీరములుగల జీవులలో, అల్పేంద్రియములు మాత్రమేగల జీవులనేకములున్నవి. అల్పేంద్రియములును, ఉత్తమేంద్రియములును రెండునూ దాల్చిన జీవులు

మరికొన్ని యున్నవి. అల్పేంద్రియములను మాత్రమే గలిగియున్న జీవులు, అల్ప, ఉత్తమేంద్రియములు రెంటిని గల జీవుల సంపర్కము వలన ఉత్తమేంద్రియములను పొందెడి యర్హతను పొంది, ఉత్తమేంద్రియ జీవులగుచున్నవి. ఆ రెండింద్రియములకును కూడ అభివృద్ధికి, సౌఖ్యక్షేమములకు గల సంబంధమును గుర్తించెడి శక్తి లేదు. కాని ఆ జీవులెల్లప్పుడును, సౌఖ్యక్షేమములను పొందుటయందు ఆకాంక్ష గలిగియుండును. బాహ్యాభివృద్ధి యందుగాని, అభ్యుదయమునందుగాని ఆకాంక్ష కలిగియున్నట్టియు వానికొరకై అతితీవ్రముగా కృషిని సాగించు చున్నట్టియు. మానవులచే వినిర్గతమగుచు వ్యాపించుచున్న శక్తి అణువులు, పైజెప్పిన మానవేతర జీవుల యాతురతచే నాకర్షింపబడి వారి యింద్రియములచే గ్రహింపబడును. అందువలన, ఉన్నతేంద్రియములు లేని ఆ జీవులు ఆ యింద్రియములను పొందుట కర్హులయి, ఆ యింద్రియములను పొంది, తామప్పుడు ధరించియున్న మానవేతర శరీరములు గతించిన తరువాత మానవులుగ నవతరించెదరు.

అభ్యుదయమును పొందుటయందు ఆకాంక్ష గలిగిన మానవ వ్యక్తులచే వినిర్గతమగుచు వ్యాప్తి జెందుచున్న శక్తులయొక్క అణువులను ఆకర్షించి గ్రహించి, వాని మూలమున ఉన్నతేంద్రియములను పొంది, మానవులుగ నవతరించిన వ్యక్తులకు సూక్ష్మశక్తిని పొందుటకు ప్రత్యేకమైనట్టి అవకాశములు గలవు. కాని బాహ్యాభివృద్ధిని పొందగోరెడు వ్యక్తులచే వినిర్గతమగుచు వ్యాపించుచున్న శక్తులను గ్రహించి మానవులైన వారికి, పైవారికన్న, అట్టి అవకాశములు తక్కువగ నుండును.

ఈ విధముగ, విరామములేకుండ, మానవసంఖ్యాబలము నిరంతరము హెచ్చగుచున్నది. మానవులయొక్క పూర్వస్థితిని గూర్చి

ఊహించగలిగినంత వెనుకకు ఆలోచించి చూచినచో, లెక్కల ప్రకారము, యీ ప్రపంచము నందొకప్పుడొక పురుష శరీరముగల వ్యక్తి, ఒక స్త్రీ శరీరముగల వ్యక్తి మాత్రమే యుండి యుండెడివారని తెలియుచున్నది. ఈ ప్రపంచములో గత కాలములో నుండినట్టియు ప్రస్తుతము జరుగుచున్న కాలములో నున్నట్టియు, యింక రాబోవు కాలములో నుండునట్టియు సమస్త మానవులకు వారుభయులే ఆది పితరులు. స్త్రీ శరీరముగల వ్యక్తికన్న ముందు పురుష శరీరముగల వ్యక్తియుండెను. అంతకన్నను పూర్వపు కాలములో ఆ పురుష శరీరముగల వ్యక్తికూడ లేకుండెను. అప్పుడో అనంత మహావిశ్వములో, విశ్వరూపములోని సర్వాంతర్యామి తప్ప యితర మేమియును లేవు.

సౌఖ్యక్షేమములయందు, ఆకాంక్ష మూలమున వానికొరకు అన్వేషణలో అభ్యుదయ మార్గమున ముందుకు పోవుచూ సస్యజీవులు మానవేతరులై, మానవేతరులు సహజవివేకమును పొంది మానవులగుచున్నారు. ఆ వివేకము వలన, సౌఖ్యక్షేమములు పురోవృద్ధిపై నాధారపడియుండునను జ్ఞానము కలుగును. ఆ పురోవృద్ధియే అభ్యుదయమై, ఆ యభ్యుదయ మార్గమున ముందుకు పోయి పోయి ఆ వ్యక్తులు విశ్వజీవితో (Universal Being) యేకత్వమును పొందుదురు. ఆ విశ్వజీవియే తమకును యితర సమస్తవ్యక్తులకును మూలము. ఆధారము. ఈ రీతిగ విశ్వజీవితో యేకత్వము పొందుటవలన, ఆ విశ్వజీవి యొక్క సాక్షాత్కారములే యయిన, యితర సమస్త వ్యక్తులతోడనూ వారు యేకత్వము పొందుదురు. ఇట్టి స్థితియందు వారికి విశ్వత్వమేగాని (Universality) వ్యక్తిత్వము (Individuality) లేదు. అందువలన వారు విశ్వజీవియే యగుదురు.

పై జెప్పిన విధముగా, అభ్యుదయమార్గమున ముందుకు పయనించిన వ్యక్తులు తమ పురోగమనపు ఫలితముగ, తమ కందరకును

ప్రాతిపదిక, మూలము, ఆధారమునైన విశ్వజీవితో, గుర్తుపట్టుటకు వీలులేని విధముగా, అవినాభావముగ కలిసిపోవుదురు. ఆ విశ్వజీవితో నేకమైపోవుదురు. అందువలన ఆ వ్యక్తులు విశ్వజీవియే యగుదురు. ఈ విశ్వజీవియే సమస్తమగు నితర వ్యక్తులకు కూడ ప్రాతిపదికయు, మూలమును, ఆధారమును నగుటవలన, సర్వవ్యక్తుల సౌఖ్యక్షేమముల కొరకైన ఆకాంక్ష అన్వేషణములు కూడ విశ్వజీవియొక్క ఆకాంక్ష అన్వేషణములే యగును. అందువలన, అద్దే ప్రయత్నములు విశ్వజీవితో నేకత్వము పొందిన సమస్తమగు నితరవ్యక్తుల ప్రయత్నములునునగును. అందరు వ్యక్తులచేత. తమ తమ అన్వేషణముల ఫలితముగా పొంద బడిన సౌఖ్యక్షేమములు, విశ్వజీవితో తాదాత్మ్యము పొందిన సమస్తమగు నితర వ్యక్తులవియు నగుచున్నవి. అందుమూలమున విశ్వజీవి యందు గల సమస్త వ్యక్తుల సౌఖ్య క్షేమములు నగుచున్నవి. ఇవియే మానవాభ్యుదయ శిఖరము. మానవపురోగమన పరమావధి. వారి అభ్యుదయ సంపూర్ణత్వము.

ఈ స్థితియే. తమకు మూలమును ఆధారమునునైన విశ్వజీవితో అవినాభావముగ కలసిపోయి, తాదాత్మ్యమును పొందెడిస్థితియే సమస్త మానవులు పరిపూర్ణతను పొందెడి స్థితి.

ఇట్లు సంపూర్ణముగ సౌఖ్యక్షేమములకు అతీతమయినట్టిది యును, వానిని మించినదియును మరియొకస్థితి యేదైనగలదా యను విచారము చాలా ఉచితమైనదే. కాని అట్టి స్థితిని గూర్చి సాధారణ ముగ మానవులలో గల యభిప్రాయము మాత్రము సరియైనది గాదు. ఈ సౌఖ్యక్షేమములు రెంటికిని అతీతమైనట్టిదియును, వానిని అధిగ మించినట్టిదియును నగు స్థితి మానవుల యూహకు మాత్రమే సాధ్య మైనదిగాని, అనుభవమునకు సాధ్యమైనట్టిదిగాదు. అది ఆలోచనా

గమ్యమేగాని, అనుభవగమ్యముగాని స్థితి. ఏలయనగ, మనస్సు, విశ్వ అహము కలసి, వ్యక్తి యగుచున్నవి. ఆ వ్యక్తి అభ్యుదయ మార్గమున పురోగమించుచు, తనకు మూలమును, ఆధారమును నగు విశ్వజీవితో నేకత్వము పొందునపుడు, అట్టి వ్యక్తియై యున్న మనస్సు భాగము, వ్యక్తిగా నుండెడి స్థితికి అతీతమగుటవలన, వ్యక్తిగా తన యునికిని, వ్యక్తిత్వమును గోల్పోయి తనకు మూలమైన విశ్వమనస్సులో నేకమగును. వ్యక్తిత్వము కలుగజేసిన విశ్వఅహము, విశ్వజీవిత్వము కలుగజేసిన విశ్వఅహముతో లీనమగును. ఇక్కడ వ్యక్తీకృత మనస్సు, విశ్వీకృతమైనది. ఇప్పుడు వ్యక్తి వ్యక్తియే గాదు. విశ్వత్వమయము. అనగా వ్యక్తులు విశ్వజీవితో అవినాభావముగ కలసిపోయి తాదాత్మ్యము పొందిన తరువాత, వ్యక్తులు విశ్వీకృతమైన తరువాత, ఆ విశ్వజీవియే వ్యక్తులకు మూలము, ఆధారమునై నపుడు, ఆ విశ్వములో లీనమైన జీవులకు వ్యక్తిత్వ మెక్కడిది? లేదు! మానవులు పొందగల సంపూర్ణ సౌఖ్యక్షేమముల కతీతమైనట్టియు, వానిని అధిగమించినట్టియు, ఆలోచనా గమ్యమేగాని అనుభవగమ్యము గానట్టి స్థితి యిదియే! వ్యక్తులు విశ్వజీవి యగుటయే యీ స్థితి. విశ్వజీవితో కలసిపోయిన తరువాత యిక వ్యక్తిత్వము లేదు. కనుక, అప్పటి స్థితి, ఆ కలయిక తరువాత గల స్థితిని, అనుభవించుటకు వ్యక్తులే లేరు. ఈ విచారణ సరియైనదియే. సాధ్యమైనదియే, విశ్వావశ్యకత ననుసరించియే యున్నది.

ఈ మహా విశ్వము నందంతటను ఒకే ఆదివ్యక్తి యుండినప్పటి స్థితి, అంతకంటె పూర్వము గల స్థితిని గూర్చిన విచారణ జిజ్ఞాస, మానవుల కుచితము గాదు. ఆ విషయముల యొక్క వివరములను గూర్చిన విచారణ వారికి అసంగతమైనది. అసంభవము కూడ!

అందువలన, విశ్వసిద్ధాంతము ప్రకారము మానవుల కర్తవ్యము నెరవేర్చుటకు మానవ కర్తవ్యమును, మానవుల కుచితమగు రీతిని నెరవేర్చుటయందు సర్వాంతర్యామియందు తమకు గల దృఢ విశ్వాసమునకు దూరముగాకుండ, సర్వాంతర్యామితోడను, ఇతరముల తోడను ఏకత్వమును పొందుటయందు మానవులు విపరీతములగు భిన్న మార్గములను అవలంబింపరాదు. సక్రమ ప్రవర్తన కలిగి యుండవలెను. అన్ని జీవులు ఆదిపితరులతో అంతమందు తప్పక తాదాత్మ్యము పొందగలరని ధృఢవిశ్వాసము కలిగియుండవలెను.

మానవులలోను, సస్యములలోను, ఇతరమానవేతర జీవులలోను కూడ తమ తమ బంధువులు స్నేహితులు, సన్నిహితులపై తిరుగుబాటు చేయుటకొక అలవాటు. సస్యవర్గములలో నీ తిరుగుబాటు కొమ్మల వలన వ్రేళ్లవలన జరుగును. ప్రతిమొక్క యొక్క వ్రేళ్లును, ఇతర మొక్కల వ్రేళ్లను తప్పించుకొనుటకేగాక, అడ్డుపెట్టుట, అణచిపెట్టుటకు కూడ యత్నించును. కొమ్మలు కూడ నదేవిధముగ చేయును. కొమ్మలు వ్రేళ్లు కూడ నితర మొక్కల సంబంధమగు కొమ్మలు, వ్రేళ్లు చేయు ప్రయత్నములను మించి, ఓడించవలెనని తమ శక్తి నంతటిని వినియోగించి ప్రయత్నించును. వానికొక చోటునుండి మరియొక చోటునకు పోవు శక్తి లేకపోవుటచే; అవి తమ కందుబాటులో నున్నంత ప్రదేశశములోనే యింత సంరంభము చేయును. దానికి మానవేతర జీవులకు వలె అల్పేంద్రియములు, ఉత్తమేంద్రియములు లేనప్పటికిని, స్థూల సృజనేంద్రియములు కలిగియున్నప్పటికినీ, క్షేమము నెఱుగకుండ అవి సౌఖ్యమును మాత్రమే వాంఛించునవి యయినప్పటికినీ, తిరుగుబాటు స్వాభావము కలిగియుండి నప్పటికిని స్వవర్గీయములతో కలసి గుంపులు గుంపులుగా జీవించుచుండును.

పెంపుడు జాతులకు చెందిన జీవరాసులలో ఏ జంతువులుకూడ, మరియొక ప్రాంతమునకో గుంపునకో చెందిన వానిని మేయునపుడు గాని, నిద్రించునపుడు గాని, దరికి జేరనీయవు. ఒకే గుంపునకు చెందిన వానిలో కూడ మేయుట, నీరుత్రాగుట, ఒకే చోటున జరిగినప్పటికిని నిద్రించుట మాత్రము వేరు వేరు స్థలములలో జరుగును. వానిలో తిరుగుబాటు స్వభావము సహజముగా నుండుటవలన ఒక శాలలో నిద్రించ వలసిన జంతువు పొరపాటున మరియొక శాలలో ప్రవేశించినచో అవి పోట్లాడుకొనును. ఒకప్పుడా పోట్లాటలో నవి చనిపోవుట కూడ తటస్థించును. ఆటవిక జంతువులలో పులులు, సింహములు మొదలైనవి తమ ప్రాంతములలోనికి యితర ప్రాంతముల వానిని రానీయవు. ఈ జంతు జాలములలో అల్పేంద్రియములు, ఉత్తమేంద్రియములు, రెండునూ గలవి అల్పేంద్రియములు మాత్రమే గలవానికన్న తక్కువ సామరస్యము కలిగి యుండును. సహజీవనానుకూల్యము తక్కువగా కలిగియుండును.

మానవులలో, ముఖ్యముగా, పసిబిడ్డలలో ఈ విరోధ భావ మెక్కువగా ప్రకటితమగుచుండును. అన్నదమ్ములును; అప్పచెల్లెండ్రును, అన్నదమ్ముల బిడ్డలును నొకే యింటిలో నివసించుచుందురు. ఒకే వంటలో తినుచుందురు. వారి పోషణకు, భోజనమునకు ఇతర అవసరములకు ఉన్నడిగనే యేర్పాట్లు చేయబడును. వారిలోవారు ఒకరి స్థలములో మరియొకరు కూర్చుండిరనియో, ఒకరినిచూచి మరియొకరు నవ్విరనియో మరి యేదేని యితర కారణములవలననో, తమలో తాము తగవులాడుకొని తిట్టుకొని యేడ్పులు ప్రారంభించెదరు. అదే రీతిగా వారు పరుండినపుడు కూడ నొకరు, మరియొకరి పడకలపైకి దొరలెదరు. ఒకరి నొకరు తన్నుకొనెదరు. ఒకరు ఎక్కువ స్థలమును ఆక్రమించిరనియో, లేదా తాము మొదట పండుకొనిన స్థలములోనికి

మరియొకరు వచ్చిరనియో జగడము ప్రారంభించి, కొందరు గాని, అందరు గాని, యేదో నారంభించెదరు. అప్పుడు పెద్దలు కలుగజేసికొనవలసిన అవసర మేర్పడును. మంచి మాటలతో పిల్లలను సముదాయించియో లేక కొంచెము కఠినముగా మందలించియో శాంతిని నెలకొల్పెదరు. పిల్లలకీ విషయములో ప్రత్యేకమైన తీవ్రత, కక్షలు లేకపోయినప్పటి కిని, ఆ తగవులాడు యలవాటు వారిలో జీర్ణించి యుండుటవలన, వారికి సహజమై యుండుటవలన, తగవులాడుట మాత్రము తరచుగ జరుగుచునే యుండును. కాని పెద్దలు పిల్లలందరియెడ సమానమైన బాధ్యత వహించి యుండుటవలన, యితర బిడ్డల పోరును సహింప నేరని బిడ్డలకు వేరువేరు పడకల నేర్పాటు చేయుదురు. అయిననూ బిడ్డలలో తగవులాడెడు స్వభావము సహజముగా నుండుటవలన వేరు వేరు పడక లేర్పాటైన తరువాతగూడ ఒక పడకపైనుండి మరియొక దానిపైకి దొరలుచు మరల పెనగులాడుచుందురు. ఇక నీ తగవులాట సహింపలేక, ఆ బిడ్డల నడుమ తగవులాట కవకాశము లేకుండ చేయు టకై గోడలు కట్టి వేరువేరు గదులలో వారిని పరుండబెట్టెదరు. పిల్ల లలో కొందరు దృఢమైన శరీరములు గలవారు తగవులాడుట కల వాటుపడియుండుట వలన గోడలు బ్రద్దలుగొట్టియైన అవతలవైపునకు పోయి తగవులాడెదరు. ఇంటిలోని పెద్దలకిది అసంతృప్తిగ నుండును. అందువలన కొందరు పిల్లలను స్వయముగా తమ కండ్ల యెదుట నుంచు కొని పరిస్థితుల ననుసరించి కొందరను వేరువేరు ప్రదేశములకు బంపు దురు. కాని పిల్లలలో సహజముగా వచ్చిన అలవాట్లు మారనందున ఆ క్రొత్త ప్రదేశములో కూడ నిట్టి విషమ పరిస్థితులే యేర్పడును. ఈ రీతిగ చాల కాలముక్రిందట వేరువేరు ప్రదేశములలో నివాసము లేర్పరచుకొన్న బిడ్డలు నేడు పెద్దలు. వారు మరల తమ బిడ్డలలోగల తగవులను తీర్చుటకు తమ పెద్దలనుసరించిన విధానమునే వారుకూడ

అనుసరించెదరు. ఈ విశ్వ గృహామునందలి బిడ్డలనుండి బయలు దేరిన యీ యేర్పాటు సౌఖ్య, క్షేమములను పొందుటకు, ప్రజలు నివసించుటకు ఒక తరమునుండి మరియొక తరమునకు వ్యాపించి యీ మానవానీకము విశ్వవ్యాప్తమగుటకు కారణమైనది. ఇట్లు అనన్యమైన భూభాగము నందంతటను మానవులు వ్యాప్తినొందుటకు నీ అలవాటే ముఖ్య కారణము.

శీతోష్ణపరిస్థితులు వేరువేరు ప్రాంతములలో వేరువేరుగ నుండును. ఈ శీతోష్ణ స్థితులయందలి మార్పులవలన మానవుల శరీరములయొక్క రంగులు మారుచుండును. కొంతవరకు శరీరతత్వములోనే మార్పులు వచ్చుచుండును. ఆ యా పరిస్థితుల ననుసరించి శరీరములయొక్క రూపములు మారుటయేగాక, ఆ యా ప్రదేశములయందలి అన కాశములనుబట్టి ఆహారపద్ధతులు, జీవనవిధానములుకూడ మారు చుండును. ఈ విధమైన భిన్నత్వములవలన వేరువేరు ప్రాంతముల యందు నివసించు ప్రజలు వేరువేరు వర్గములుగా పిలువబడుచున్నారు.

ఈ విధముగా నూతన నివాసము లెక్కువగుసరికి కొంతకాల మైన తరువాత అనేకములగు గుంపులు నివసించుచున్న ఆవాసములను గుర్తించుట కష్టమై పోయినది. అందువలన ఆయా ఆవాసములకు వేరు వేరు గుర్తుల నుంచవలసివచ్చినది. ఆ యా వర్గములు నివసించు ఆవాసములకు ఆ యా పేర్లనుపెట్టి పిలువవలసి వచ్చినది. ఈ విధ ముగా ఒకప్పుడు, ఆదికాలమునందు, ఆది పితరుల కొక్కరికే నివాస స్థలమైన యీ ప్రపంచ మిప్పుడనేక భాగములైనది. ఆ భాగము లన్నియు అనేక నామములతో పిలువబడుచున్నవి.

సాధారణముగ, గ్రామములోని పెద్దలందరు అప్పుడప్పుడు సమా వేశ మగుచుండుట అలవాటు. అట్టి సమావేశములలో అనేక విషయ

ములు చర్చింపబడుచుండును. తరచుగా చర్చింపబడు విషయములలో తమ ఆవాసములును, తమ పరిసరములును, తమ తాతముత్తాతలనాటి పరిస్థితులును, తాము పసిబిడ్డలుగ నున్నప్పుడు తమ పెద్దలవలన విన్న విషయములును ముఖ్యముగా నుండును. ఆ సమావేశములోని చిన్నవారలకు పెద్దలనాటి విషయములను వినుటకన్న సంతోషముగా మరియే విషయమును నుండదు. అట్టి చర్చలప్రకార మిపుడు సుమారు వంద గడపలుగల తమగ్రామములో తమపెద్దల చిన్నతనములో నిరువది యిండ్లమాత్ర ముండెడివని తెలియును. వారి పెద్దలయొక్క పెద్దల చిన్నతనములో రెండిండ్లు మాత్రమే యుండెడివని తమతాతలు చెప్పెడివారట. అందులో నొకటి తమదట. తమకు బాగుగా జ్ఞాపకములేని ఏవియో పరిస్థితులవలన తాము ఏదియో గ్రామమునుండి అచటికి వచ్చిరట. ఈ పరిస్థితులే ప్రతిపల్లె, గ్రామము, తాలూకా, జిల్లా, దేశము, ఖండములకు వర్తించును. ఈ రీతిగా నేడు సమస్త మానవులకు మానవేతరజీవులకు ఆలవాలమైన యీ విశ్వ మొకప్పుడు ఆదిపితరులకు నొకేయొక గృహమైయుండెడిది. ఈ మహావిశ్వమును అందరి జీవులతో సహా విభజింపవలెనని మానవులిప్పు డెన్ని కుత్సిత ప్రయత్నములు చేయుచున్నప్పటికిని, యిది ఆదిపితరులకు నేకైక గృహమై యున్నది. అది యెప్పటికి నట్లే యుండును.

గుంపులుగా, సమిష్టిగా జీవించుటకు కావలసిన సామరస్యము మానవులలో కన్న మానవేతరులలో నెక్కువ. మానవేతర జీవులలో కూడ ఉత్తమేంద్రియములు గల జీవులలో క్రిమికీటకాదులలో కన్న తక్కువ. క్రిమికీటకాదులలో సస్యజీవులలో కన్న తక్కువ.

మానవులలో, సహజ వివేకము పూర్తిగా పెంపొందని నవ్య మానవులలో, అనగా మొట్టమొదటి సారిగా మానవ శరీరములతో

నవతరించిన వారిలో ఈ సమరసభావము ఎక్కువగా నుండును. సహజ వివేకము పెంపొందినది మొదలు సూక్ష్మేంద్రియములు సక్రమముగ పని చేయుట ప్రారంభించువరకు, సరసత, సామరస్యము తక్కువగా నుండును, తమ వర్గమునకు చెందిన వారిలో కూడ సమిష్టిగా సామరస్యముగా జీవింపలేరు. కాని, అవే సూక్ష్మేంద్రియములు సక్రమముగా పనిచేయుట ప్రారంభించిన వెంటనే యీ పరిస్థితి పూర్తిగా మారిపోవును. అప్పుడు వారు సాటి మానవులతోనే గాక, మానవేతరులతోను, సస్యజీవులతోను కూడ సామరస్యములో జీవింపగలరు. సమస్త జీవరాసులతోడను ఏకత్వభావము వారిలో పెంపొందుటయే గాక ఆ భావము స్థిరమైపోవును. పైకి చూచుటకు విశ్వాత్మైక్యతగా కన్పడినప్పటికి లోపలనున్న విశ్వైక్యతా భావమువలన ఈ సమరస భావము ఏర్పడును.

వ్యక్తులందరి యందును తిరుగుబాటు, తగవులాట లక్షణములు, ఆహారపానీయముల యందు, తినిన ఆహారము జీర్ణమగుటకు అవసరమైన విశ్రాంతి, నిద్ర యందే హెచ్చుగా ప్రకటిత మగుచున్నవి. తినుట, త్రాగుట, నిద్రించుట అను నీ మూడు సందర్భములందు తప్ప యితర సందర్భము లన్నిటిలోను మానవేతరములైన వివిధ జీవులలో వివిధ తరహాలలో నీ సమరసభావము ప్రకటితమగు చుండును. వాని వాని శరీరతత్వముల ననుసరించి సౌఖ్యక్షేమములను పొందుట యందలి ఆకాంక్ష ననుసరించి ఈ సమరసభావ ముండును. ఇది న్యాయమైన విషయమే. కాని, సంఘమునందు సమరస జీవనమున కనువైన శరీరమును, శరీరతత్వములును గల మానవులలో తిరుగుబాటు, పేచీకోరుతనమును పెంపొందించు లక్షణములు మాత్రము సమర్థనీయములు గావు. అన్యాయము. కాని, మానవులు ఆహార విహారాదులలో తమలో తమకు వివాదములు లేకుండ నుండ లేకున్నారు. తమకును,

మానవేతర జీవులకును గల తారతమ్యమును గ్రహించి, తమకు ప్రజ్ఞ సహజ వివేకము గలదనియు, జంతువుల కదిలేదను విషయము మానవులు గుర్తించనంతవరకు వారికి సమరస జీవనము అసంభవము. సహజ వివేకము గలిగియుండుటవలన మానవులకు ఎప్పుడేమి చేయవలయునో యేమి మాట్లాడవలయునో తెలియును. ఈ వివేకముండుట వలన అడుగడుగునకును, తమకును, జంతువులకును గల తారతమ్యమును తెలిసికొనుచుందురు. తమకు, తమ శరీరములకు గల తత్త్వములను కొంతవరకైననూ సరిగా అవగాహన చేసికొందురు. సహజ వివేకము ననుసరించి ప్రవర్తించుటకు తమ స్థూల సృజనేంద్రియములు శక్తివంతములు గావని తెలిసికొందురు. వ్యక్తిగత అహముల ఆజ్ఞల ననుసరించి నడచుకొను స్థూల సృజనేంద్రియములు, జంతుశరీరములలో వలెనే పనిచేయుచుండును. అట్టి వ్యక్తులు మానవశరీరముతో నున్నప్పటికిని వారి అలవాట్లు జంతువుల అలవాట్ల వలెనే సాగుచుండును.

ఇట్టి స్థితియందు సహజవివేకమును అనుసరించిన మాత్రమే మానవుల కుచితమైన లక్షణములు, స్వభావములు కలుగుననియు గ్రహించెదరు. వ్యక్తిగత అహముల ననుసరించుచున్న తమ స్థూల సృజనేంద్రియముల మానవేతర స్వభావములు, లక్షణములు కలిగియున్నవని గ్రహించెదరు. వ్యక్తులు తాము ముందుగా లోబరచుకొనవలసినది స్థూలసృజనేంద్రియములను కాదనియు, అహములనే లోబరచుకొనవలెననియు, అప్పుడు ఆ అహములు తమ స్థూలసృజనేంద్రియములను మానవోచితముగా నడిపించుననియు తెలిసికొందురు. అప్పుడా వ్యక్తులకు తమ యొక్క నిర్మాణములో సూక్ష్మేంద్రియముల యొక్క ఉనికియు, వాని తత్త్వమును, శక్తియు కర్తవ్యమును గూర్చియు విశదముగా తెలియును.

సూక్ష్మేంద్రియములు అహమును సంచాలనము చేయుటకు
తగిన శక్తులు కలిగి అందుకొరకే నిర్మింపబడిన వనరులవలన స్థూలసృజ
నేంద్రియములను కూడ సులభముగ నడిపింపగలవు. కాని ఆ సూక్ష్మేంద్రి
యములలో చాలినంతసూక్ష్మశక్తియుండే యుండవలెను. సూక్ష్మేంద్రి
యములు తగినంత శక్తిని కలిగియున్నవైనచో అప్పటి వరకు జంతు
భావముల ననుసరించియున్న అహమును స్థూల సృజనేంద్రియము
లను సౌఖ్యక్షేమములను పొందుటయందు మానవునకు పవిత్రమైన
మార్గముల ననుసరించునటుల జేయును.

సూక్ష్మేంద్రియముల ఉనికిని, శక్తిని, కర్తవ్యములను గ్రహిం
చిన మానవులు ఆ యింద్రియములను తమ సౌఖ్యక్షేమములను
పొందుటయందు సక్రమముగ వినియోగించెదరు. సూక్ష్మేంద్రియము
లను తమ కార్య కలాపములయందు వినియోగించి వానివలన తగు
ప్రయోజనము పొందగల్గిన వ్యక్తులు తమంతతాము ఆ ఇంద్రియము
లకు పటుత్వము, శక్తి, సామర్థ్యము కలిగించుట కుద్దేశించెదరు.
ఈ యుద్దేశ్యమువలన తమ శరీరములలో సూక్ష్మ శక్తులను నిలువ
జేసికొందురు. పరిణామము పొందిన సృజన శక్తియే సూక్ష్మశక్తి.

ఈ రీతిగ తగినంత సూక్ష్మశక్తి మానవులలో కలిగినపుడు వారి
సూక్ష్మేంద్రియములు సక్రమముగా పనిచేయ ప్రారంభించినపుడు,
వారు సౌఖ్యక్షేమములను పొందుటకు వినియోగించు సిద్ధాంతము
లును, మాటలును, పనులును తమ సహజ వివేకము, అహము, స్థూల
సృజనేంద్రియములతో సామరస్యము కలిగి యుండును. ఇవి వారి
అభ్యుదయముతోడనే గాక విశ్వావశ్యకతతో కూడ సామరస్యము
కలిగియుండును.

అందువలన,

మానవులు, జంతువులకును తమకును గల భేదమును సూచించు సహజ వివేకమును గుర్తింతురుగాక !

మానవులు తమ సహజ వివేకానుసారము సమరసత్వముతో ప్రవర్తించి అభ్యుదయమును పొందెదరుగాక !



మూడవ అధ్యాయము

# మానవ నిర్మాణము

ఈ మహావిశ్వము స్థూల సూక్ష్మ ఆధ్యాత్మికములను మూడు విధములగు వస్తువులతో (Matter) కూడియున్నది. స్థూలమునకును, ఆధ్యాత్మికమునకును మధ్య సూక్ష్మ, అతిసూక్ష్మ, అత్యధిక సూక్ష్మ, మహా సూక్ష్మములను నాలుగు స్థితులున్నవి. ఈ అన్నిరకములగు వస్తువులలోనను, వివిధ స్థితులలో పంచభూతము (Elements) లుండును. అవి ఆయా వస్తువులలోని స్థితులలోని మార్పు ననుసరించి మారుచుండును. ప్రతి భూతములోను ఆయా పదార్థము (Substances) లున్నవి. భూతములోగల ప్రతిపదార్థములోను ప్రేమజ్ఞానసామర్థ్యము లను (Love, knowledge and strength) మూడు విధములగు శక్తులున్నవి. ప్రతి శక్తిలోనూ ఆశక్తిని గూర్చిన జ్ఞానము (awareness) న్నది. ఆ జ్ఞాన శక్తిలో, ఆ జ్ఞానమును గూర్చిన స్వజ్ఞానమున్నది. జ్ఞానము, (awareness) స్వజ్ఞానము, (awareness of awareness) ప్రేమ, (Love) జ్ఞానము. (Knowledge) సామర్థ్యము (strength) లును సంపూర్ణత్వముతో అన్ని భూతములయందు నుండును. అట్టి భూతములు, వానికి మూలములును, ఆధారములునైన, స్థూల, సూక్ష్మ, ఆధ్యాత్మికవస్తువుల (Matter) యందు ఆనిర్భవించి యుండును. ప్రారంభమేలేని భూతకాలము నందుండి యుండెడివి. భవిష్యత్తులేని వర్తమాన కాలమునందున్నవి. అంతమే లేని అంతమందుండును. భూతభవిష్యద్వర్తమానములలో ప్రత్యక్ష

మయ్యెడి వస్తు భూతసహార్థ శక్తులు. వీనినన్నిటిని భరించునది, భిన్న భిన్న వస్తువులలో ప్రేమ, జ్ఞాన, సామర్థ్య శక్తులు, స్వజ్ఞానములుగ సాధించునదియే, సర్వత్ర అవస్థితము, సర్వశక్తియుతము, సర్వజ్ఞము నగు సర్వాంతర్యామి.

మానసికము, భౌతికము శాక్తికములు నయిన కార్య కలాపములలో సమరసములు, అసమరసములు నైన వానియొక్క సంఘర్షణ, ఒత్తిడి అతి శ్రమల మూలమున విశ్వమందు బయలుదేరెడియు అసాధారణమును, అత్యధికమును నైన ఉష్ణమువలన కలిగెడి, అంతిమ ఫలితముగ నీ ప్రపంచము ప్రళయజలములలో మునిగిపోవును. ఈ రీతిగ జలములలో మునిగిపోయి, ద్రవీభూతమై నిద్రాణమైయున్న స్థితియే మానసిక, భౌతిక, శాక్తిక, కార్యకలాపముల యొక్కయు, వాని మూలము, ఆ మూలమునకు మూలము, విశ్వమునందలి చైతన్యము నకు, విశ్వ చైతన్య క్రియాకలాపములకును విశ్వ విశ్రాంతి కాలము. ఇదియే విశ్వమునందలి చైతన్య కార్యకలాపరహితకాలము (undynamic or static). కాని యీ విశ్వము, అనగా ప్రదేశము మాత్రమున్నది. దానికి విశ్రాంతియు లేదు. చైతన్యమును లేదు. విశ్వ నిద్రాకాలమున కాని, విశ్వ చైతన్య కాలమునందు కాని ప్రదేశమునకు కార్యకలాపములు లేవు. విశ్వమందలి యీ ప్రదేశముతో బాటు, చైతన్య రహితమైనదియు, విశ్రాంతిని కోరనిదియు, విభజింపబడనేరనిదియు నింకొకటి గలదు. అదికాలము. కాలము, ప్రదేశము అను నీ రెంటికినీ, పైన, క్రింద అనునవి లేవు. విశ్రాంతియు లేదు. కార్యకలాపములును లేవు. విభజింపరానివియు, విశ్రాంతిరహితములు, చైతన్యము లేనట్టియు, సహస్థితములైనట్టియు, కాల, ప్రదేశములలో నను, వానిద్వారాయున్న సర్వాంతర్యామి యునికిగలదు.

ప్రతి వ్యక్తికిని దినమంతయు కష్టపడి పనిచేసిన తరువాత కొంత పరిమిత కాలము విశ్రాంతి అవసరమైనట్లుగనే, చాలకాలము విశ్వ చైతన్య క్రియాకలాపములు జరిగిన తరువాత పరిమితమైన కొంత కాలముపాటు విశ్వవిశ్రాంతి, లేక, చైతన్య కార్యకలాప రహిత కాలము కూడ అవసరమగుచుండును. ఈ పరిమితమైన విశ్వవిశ్రాంతి కాలము ముగిసిన తరువాత విశ్వమందుగల అచైతన్యత ముగిసి, చైతన్యము, చైతన్యక్రియ, పదార్థమూలము, పదార్థములు, శక్తి అన్నియు నిద్రాణస్థితి నుండి మేల్కొని మరల చైతన్యవంతములగును. ఏక కాలమునందున అదే సమయములో చైతన్యములేనివి, చైతన్య వంతములగుట వలన విశ్వచైతన్యము (universal dynamism) మేల్కొంచిన తోడనే ప్రళయ జలములు తగ్గుట ఆరంభించును. వరదలు తగ్గగా తగ్గగా విశ్వమందలి ప్రదేశము బయటపడ నారంభించును. ఈ రీతిగ బయటపడిన ప్రదేశమునందు, తమతమ శక్తులతో కూడిన పంచ భూతములు నిద్రనుండి మేల్కొంచును. క్రమముగ వరదలు తగ్గెడి యీ కాలము విశ్వనిద్రాణ స్థితి యంతటి దీర్ఘ కాలము. ఈ విశ్వ ప్రళయముయొక్క ఫలితముగా భూమిలోనను; భూమిపైనను గల సమస్త వస్తువులు ప్రళయ జలముల యందు లీనమగును. ప్రళయ జలములు తగ్గుట ప్రారంభమైనది మొదలు తమతమ శక్తులతో కూడిన పంచభూతములు మేల్కొంచినవి మొదలు, ద్రవీభూతమైన భూమికూడ మరల ఘనీభవించి జలాంతర్గతమైన ప్రదేశములు మరల నేర్పడును. క్రమముగా వరదలు తగ్గినకొలది ప్రదేశమునందు మరల నేర్పడిన భూమియొక్క ఘనరూపములో నిప్పటికిని చూడబడుచున్న "కైలాసగిరి" యనెడి మహా మేరుశిఖరము ప్రప్రథమముగా బహిర్గత మయ్యెను.

ఈ విశ్రమించుచున్న విశ్వచైతన్యము ప్రళయము తర్వాత మేల్కాంచినప్పటికిని, ఘనరూపములో భూభాగము బయట పడినప్పటి నుండి అనగా, మహామేరు శిఖరము బహిర్గతమైనప్పటినుండి పనిచేయ నారంభించెను.

ఈ ప్రళయకాలమందు విశ్వమనస్సు సర్వాంతర్యామిలో లీనమై యుండును. విశ్వ అహము ఆకాలమునందు జడస్థితి యందుండును. అప్పుడు పదార్థమూలము. పదార్థములు విశ్రాంతి స్థితి యందుండును. అవి మేల్కాంచిన స్థితియే విశ్వమునొక్క చైతన్యస్థితి. వాని కార్య కలాపములో ప్రారంభమే విశ్వమందలి భూశిఖర, ఆవిష్కరణ.

పదార్థమూలము (Basic matter), పదార్థము (matter) పంచభూతములు (five elements) భూమి, భూమిమీదనైన, లోనగల సమస్తము ప్రళయజలములందు లీనమై యుండినపుడు వ్యక్తిజీవు లన్నియు (Individual beings), విశ్వజీవి (Universal being) యందు లీనమై యుండును. వ్యక్తి మనస్సులు విశ్వమనస్సునందును, వ్యక్తి అహములు (Individual ego) విశ్వఅహము (Universal ego) నందును లీనమగును. విశ్వజీవి తనను తన అహమునుండి విము క్తము చేసికొనుటవలన తన యునికి ఉపసంహరింపబడి తాను సర్వాం తర్యామి (All-in-All) లో లీనమగును. ప్రళయమునకు పూర్వ కాలమునందు శరీరములు కలిగియుండినట్టియు, శరీరములు లేనట్టియు, విశ్వఅహముతో గూడిన విశ్వజీవి, పంచభూతములు, వాని పదార్థములు, వస్తువులు, వస్తుమూలములు యివి యన్నియు చైతన్యయుతములై యున్నవి. వీనికి చిరంతనత్వమేగాని శాశ్వతత్వము లేదు. అవి చిరకాల ముండునుగాని శాశ్వతముగా నుండవు. అవి ప్రళయకాలము వరకు నుండి, ప్రళయములో ద్రవీభూతమై శాశ్వతమైన కాలము, ప్రదేశము లలో నేకత్వము పొందును. కాలము ప్రదేశములలో నేకత్వము

పొందుటవలన సర్వాంతర్యామితో ఏకత్వము పొందును. అవి మరల మేల్కొనినపుడు మరల వస్తుమూలము, పంచభూతములు, విశ్వజీవి, విశ్వచైతన్యము యుండునుగాని వ్యక్తీకరణ మాత్రములేదు. అనగా అవి మేల్కొనినవిగాని చైతన్యవంతములుగా లేవు. ప్రవిభూతజీవులకు విశ్వజీవితో ఐక్యమునొందిన జీవులకు ప్రత్యేక వ్యక్తిత్వములేదు. విశ్వ జీవితో నైక్యమగునప్పటికే వాని వ్యక్తిత్వము పోయినది. ప్రళయ కాలమునకు పూర్వము జీవిత పరమావధులను కర్తవ్యములను సాధింప లేని వ్యక్తులు, మానవత్వము పొందని మానవేతర జీవులును మానవ కర్తవ్యమును సాధింపలేని మానవులును ప్రళయము ముగిసిన తరువాత మరల అవతరించరు. అవధులులేని ఆ ప్రళయ స్థితియందు అవధులు గల వేవియు నుండజాలవు. ప్రళయకాలమునందు నిరవధికమైనట్టియు, శాశ్వతమైనట్టియు, కాలము, ప్రదేశము, విజ్ఞానము, స్వవిజ్ఞానము, ప్రేమ, జ్ఞాన, సామర్థ్యములు మాత్రము శాశ్వతత్వములో నుండును. అవధులుగల వ్యక్తులు, అహములు సంపూర్ణముగ లీనమైపోవును.

తమ తమ కర్తవ్యములను సాధించువరకు, శరీరములు గతించిన తరువాత తాము పొందిన అభ్యుదయముల ననుసరించి, అనువగు శరీరములతో వ్యక్తులు మరల మరల అవతరించెదరను సిద్ధాంతము ఆ యా వ్యక్తులు ప్రళయకాలమునందు విశ్వజీవితో నైక్యమగువరకే. సంపూర్ణ ప్రళయమునందు వ్యక్తిజీవు లన్నియును విశ్వజీవితో నేకత్వము పొందును. విశ్వజీవి తన యహమును విడిచిపెట్టి తన యునికికి ఆధారము, మూలమునైన సర్వాంతర్యామితో లీనమగును.

నిద్రాణ స్థితినుండి మేల్కొనినప్పటికిని, భూమి బయట పడు వరకును వస్తుమూలము, వస్తువులు, భూతములు, చైతన్యరహితముగ నుండును. భూమి బయటపడిన వెంటనే విశ్వచైతన్యము ప్రారంభ

మగును. అప్పటినుండి విశ్వజీవి తన యహము, వస్తుమూలము, వస్తువు, భూతములద్వారా తన కార్యకలాపములను సాగించును.

సంపూర్ణ ప్రళయములో సర్వాంతర్యామియొక్క సప్త శాశ్వత లక్షణములు మాత్రమే యుండును. అవి ప్రళయమునకు ముందు, తరువాతనుకూడ నుండును. కాలము, ప్రదేశము, స్వవిజ్ఞానము, విజ్ఞానము, ప్రేమ, జ్ఞాన, సామర్థ్యములు అనునవియే యీ సప్త శాశ్వత లక్షణములు. ప్రళయకాలానంతరము వరదల తిరోగమనముతో పాటు విశ్వచైతన్యము ప్రారంభమగుటకు పూర్వము జడస్థితి యందున్నను విశ్వజీవి, భూతములు, సప్త శాశ్వత లక్షణములతో పాటుగా నుండును. విశ్వచైతన్యారంభముతో, తన అహము ద్వారా, శాశ్వత లక్షణ సిద్ధాంతానుసారము, శాశ్వత, అశాశ్వతములైన భూతములు, భూతపదార్థములద్వారా విశ్వజీవి వ్యక్తీకరణ మారంభించును.

విశ్వసిద్ధాంత విధానము మేలుకొనుటయే సర్వాంతర్యామి విశ్వజీవిగా సాక్షాత్కరించుట. జడస్థితినుండి, తనంతతాను బయట పడి విశ్వ అహము, విశ్వ మనస్సుతో కలియుట ఫలితముగా విశ్వజీవి యేర్పడును. విశ్వ చైతన్య క్రియాకలాపముల ప్రారంభముతో విశ్వ శరీరముగా విశ్వజీవి సాక్షాత్కారము ప్రారంభమగును.

సర్వాంతర్యామి విశ్వజీవిగా సాక్షాత్కరించుటతో ఆధ్యాత్మిక స్థితియందున్న విశ్వములో సూక్ష్మస్థితు లేర్పడుట పూర్తియగును. విశ్వజీవి విశ్వశరీరముగా రూపొందుటతో విశ్వములోని సూక్ష్మ, ఆధ్యాత్మిక స్థితులలోని, స్థూలస్థితి రూపొందుట పూర్తియగును.

అవతరించిన ప్రతి దానిలో, అనగా రూపమును పొందినవాని యన్నిటిలోనను అహమున్నది. సర్వాంతర్యామి విశ్వమనస్సుగా సాక్షాత్కరించుట తప్ప, యే యితరములకును, అహముతో సంబంధము లేకుండ అవతరించుట సాధ్యపడదు.

విశ్వమనస్సు అప్రపంచత్వముగా విశ్వ అహముతో కలిసి విశ్వజీవిమైనది. అవతరణ, లేక, సాక్షాత్కారము అహముతో కూడి యున్నదగుట వలన కొన్ని అవధులకు లోనై యున్నది. విశ్వజీవి కూడ నీ యవధులకు లోనైనదియే. విశ్వజీవిలోని అహము సర్వాంతర్యామి విశ్వమనస్సుగా సాక్షాత్కరించుటలో, సర్వాంతర్యామి విశ్వమనస్సు అగుటలో నుద్భవించినది. అందువలన విశ్వ అహము, విశ్వమనస్సు చేత సర్వాంతర్యామినుండి పొందబడినదికాదు. విశ్వమనస్సు సాక్షాత్కరించెడి విధానమునుండి ఉద్భవించినది. అందువలన విశ్వజీవి అవతరణకు పూర్వమును, విశ్వజీవి అవతరణకు అనంతరమును కూడ సర్వాంతర్యామిలో అహము లేదు.

సర్వాంతర్యామి, సర్వాంతర్యామిలోగల శాశ్వత లక్షణములు తప్ప ఈ విశ్వమందలి నే యితరములు అహము లేకుండ యుండలేవు. సర్వాంతర్యామియొక్క శాశ్వత లక్షణములును, వాని మూలమున సర్వాంతర్యామిని కలిగియుండని వేవియును నీ విశ్వమందు లేవు. సర్వాంతర్యామియొక్క శాశ్వత లక్షణములలో, తన్మాత్రలయిన సర్వాంతర్యామిలో లేనివేవియు ఈ విశ్వమందు లేవు. విశ్వసిద్ధాంతానుసారము విశ్వమందలి యీ లక్షణములన్నియు కూడ శాశ్వతములు. ఎందుచేతననగా నొకప్పుడుండిన వేవియును కూడ, (ప్రపంచముతో సహా), మరియొకప్పుడు లేకపోలేదు. అగుచో, అవస్థలనుబట్టి స్థితులలో మార్పులు చెందుచుండును. ప్రళయములో కూడ ఇవియన్నియు నుండును. ఇట్టి ప్రపంచ స్థితియందు విశ్వ అహము కూడ మార్పుచెందిన స్థితిలో ప్రళయకాలమునందు కూడ విశ్వమందుండును. విశ్వమనస్సు తనకు మూలమును, ఆధారమునైన సర్వాంతర్యామిలో కలియునపుడు విశ్వ అహమునుండి విడిపోవును. విశ్వమనస్సు సర్వాంతర్యామినుండి సాక్షాత్కరించుటలో విశ్వ అహము ఏర్పడినట్లే, విశ్వ

మనస్సు సర్వాంతర్యామిలో లీనమగునపుడు విశ్వ అహము విడివడి పోవును. ఈ రీతిగ విడివడిన విశ్వ అహము చైతన్యము లేనిదగుటవలన జడస్థితిని పొంది, ప్రళయము అంతమగువరకును, మరల విశ్వ చైతన్యము బయలుదేరువరకును, జలము తగ్గుట ప్రారంభ మగువరకును అట్లే జడస్థితి యందుండును.

జడస్థితి యందున్న విశ్వఅహముయొక్క ఉనికి సర్వాంతర్యామి యొక్క సప్తశాశ్వత లక్షణముల ఉనికివంటిది కాదు. ఈ సప్తశాశ్వత లక్షణములును ప్రళయమునకు ముందువలెనే ప్రళయ కాలములో కూడ పనిచేయుచుండును. చైతన్యము కలిగి యుండును. ప్రళయకాలములో అంతకు ముందువలెనే జలములో లీనమైయున్న యావత్ప్రపంచమును వహించుట ప్రదేశముయొక్క విధి. ప్రళయమునకు పూర్వము వలెనే ప్రళయస్థితిలో కూడ అట్టి స్థితిని కొలుచుట కాలముయొక్క విధి. ఇదే రీతిగ నితర శాశ్వత లక్షణములకు కూడ ప్రళయమునకు ముందు తాము నిర్వర్తించుచున్న విధులను నిర్వర్తించెడు ఆవశ్యకత గలదు. అందువలన కూడ సర్వాంతర్యామి సర్వావస్థలయందును అహము లేకుండగనే యున్నది.

విశ్వజీవి విశ్వశరీరమును పొందినపిమ్మట, విశ్వజీవి వ్యక్తులుగ సాక్షాత్కరించుట ప్రారంభమయ్యెను. సర్వాంతర్యామి శాశ్వత లక్షణము ననుసరించి భూతములు, భౌతిక పదార్థములు అను శాశ్వతములును, అశాశ్వతములును నైన వస్తుసముదాయముతో విశ్వ అహము ద్వారా విశ్వజీవి వ్యక్తిజీవులుగా రూపొందుట ప్రారంభమైనది. ఈ అవతరణ విధానము నుండియే "అహము" బయలుదేరెను. ఈ అహముతో కలిసియే విశ్వమనస్సు, విశ్వజీవి యయ్యెను. విశ్వ అహముద్వారా విశ్వమనస్సు అహముతో కూడిన వ్యక్తి మనస్సులుగా రూపొంది వ్యక్తిజీవులయ్యెను. వ్యక్తి మనస్సు అహముల ద్వారా, వ్యక్తి పురుషశరీరములను నిర్మించుకొని తనకు తాను

బహూకరించుకొని, అప్పటికి నివాసయోగ్యమైన, ప్రస్తుత భూశిఖరమైన అప్పటి భూమియందు నివసింపదొడగెను.

సర్వాంతర్యామి విశ్వ మనస్సుగా నవతరించుటలోగాని, విశ్వ మనస్సు, విశ్వ అహముతో కలిసి విశ్వజీవి యగుటలోగాని విశ్వజీవి వ్యక్తి జీవులగుటలోగాని, లేదా పురుష శరీరమును నిర్మించుకొనుటలో గాని, సర్వాంతర్యామి సంపూర్ణత్వమునకు లోపమును రాలేదు. సర్వాంతర్యామి శాశ్వత లక్షణములైన ప్రదేశము, కాలము, స్వవిజ్ఞానము, విజ్ఞానము, ప్రేమ, జ్ఞాన సామర్థ్యములకు లోపమును రాలేదు. అదేరీతిగ విశ్వజీవియు తన శాశ్వతత్వమునకు ప్రళయ కాలము వరకు అన్ని స్థితులలోనను నుండెడి తన లక్షణములకు లోపము రాలేదు. వ్యక్తిజీవియు విశ్వజీవితో తన యేకత్వమును గోల్పోవదు. ప్రపంచముగను, అందలి వస్తు, విషయ, జీవసముదాయములుగను, సాక్షాత్కరింపవలెనను సర్వాంతర్యామి నిశ్చయమే యిందులకు కారణము. సర్వాంతర్యామియొక్క యీ నిశ్చయము వలననే ప్రళయకాలమందు జడస్థితిలోనున్న విశ్వఅహము, విశ్వ మనస్సుతో కలసి విశ్వజీవిగా నిర్మితమైనది. సర్వాంతర్యామి యొక్క యీ నిశ్చయమువలననే విశ్వమనస్సునకు, వ్యక్తిమనస్సులకు అహములతో కలిసి జీవులగుటకును, శరీరములను నిర్మించుకొనుటకును సాధ్యమగుచున్నది. ఈ కలయిక మూలమున విశ్వజీవికి, వ్యక్తిజీవులకు విశ్వ అహము మూలముగా అవతరించుట, శరీరములను నిర్మించుకొనుట సాధ్యమగుచున్నది.

విశ్వజీవి, వ్యక్తిజీవులుగ సాక్షాత్కరించుటతో సమస్తములైన మానవులయొక్కయు మానవేతర జీవుల యొక్కయు, సస్యజీవుల యొక్కయు వ్యక్తీకరణ శాశ్వతముగ పూర్తియైనది. ఒక పురుష మానవశరీర నిర్మాణముతో విశ్వమందలి సమస్త జీవరాసులకు ఒక్కొక్క స్త్రీ, పురుష శరీరముల నిర్మాణము పూర్తియైనది.

పురుష మానవ శరీరముతో ప్రప్రథమముగ భూమిపై జీవించిన మానవవ్యక్తి మానవేతర సమస్తజీవరాసులతో కలసి జీవించుచు తన శరీరముతో ఎడతెగకుండ చాలకాలము కలసియుండుట వలన ఆ వ్యక్తి తన యొక్కయు తన శరీరము యొక్కయు నిర్మాణక్రమమును గూర్చి తెలిసికొనుటకును ఆక్రమమును ఉపయోగించు కొనుటకును ఉద్దేశించెను. ఆ వ్యక్తిలోగల అహము వలన నిట్టి ఆసక్తి బయలు దేరినది. అహములకు కూడ వ్యక్తులతోపాటు సహశాశ్వతత్వము కలిగి యుండుట వలన ఇంద్రియములకు అహములే వ్యక్తులవలె కన్పట్టు చుండును. అవి యహమునే వ్యక్తియని భ్రమించును. దీనినే వస్త్వంతర వస్తుధర్మమందురు. ఇదియే వస్త్వంతర వస్తు ధర్మ క్రియాకలాపము. ఆ వ్యక్తి యొక్క యీ ఉన్ముఖత వలన స్త్రీశరీరముతో మరియొక వ్యక్తి అవతరించెను. ఈ యిరువురు వ్యక్తులును చాలకాలము కలసియుండుట వలన ఆ యాదిపితరుల లక్షణములను పూర్తిగ కలిగినటువంటి సంతానము బయలుదేరెను.

భూమిపై ఎత్తగునట్టి భాగమైన మహా మేరుశిఖరమునకు ఆధారము హిమాలయ పర్వతములు, హిమాలయముల కాధారము ఇండియా యనెడి సమతల ప్రదేశము. హిమాలయము లీ ప్రపంచము నందత్యున్నతములైన నైనందున వానినీ సందేశములో స్వర్మాట్పర్వతములని పిలుచుటైనది. తరచు అదృశ్యమానమైన మహా మేరుశిఖరముతోకూడిన స్వర్మాట్పర్వతమే ఆదిపితరులకు ఆవాసమగుటవలన భూత భవిష్యద్వర్తమాన కాలములయందలి సమస్త మానవకోటికి, జీవజాలమునకిదియే పుట్టినిల్లు.

అసంబద్ధము, అసంపూర్ణమునైన స్థితిలోనైననూ, ఇండియా నుండి బయటకు, బయటనుండి ఇండియాలోనికి వలసపోయి, వలస

వచ్చిన మానవుల చరిత్ర గత అయిదు వేల సంవత్సరముల నుండి మాత్రమే యున్నది. అంతకు ముందే ఇండియానుండి ఇతర ప్రాంతము లకు వలస పోయిన మానవానీకము తామెక్కడనుండి బయటకు వచ్చిరో మరచిరి. అదేరీతిగ ఇండియానుండి బయటకు పోకుండ నిప్పటి వరకు ఇక్కడనే నివసించుచున్న మానవానీకము గూడ బయటకు పోయిన వారిని మరచిపోయిరి. బయటకు పోకుండ మాతృభూమి యందుండిపోయిన మానవానీకము నిప్పుడు హిందువు లందురు.

అందువలన,

మానవానీక మంతయు తమ పూర్వీకులను గుర్తించెదరుగాక !

మానవానీక మంతయును తమ కందరకును పూర్వీకు లొక్కరే యని గుర్తించెదరుగాక !



# నాలుగవ అధ్యాయము

# మానవ కర్తవ్యము

సక్రమమైన అవగాహననే జ్ఞానమందురు. ఆ జ్ఞానము సక్రమముగా ఉపయోగించుట అనగా భావములు, ఆలోచనలు, మాటలు, చేతలలో తనకు గల జ్ఞానమును సమస్త యితర మానవుల అభ్యుదయము కొరకు వినియోగించుటయే జ్ఞానముయొక్క స్వరూపము లేక ఆకారము. అందువలన జ్ఞానమునకు, రూపము ఎవరిచ్చుచున్నారో, ఎవరి ద్వారా జ్ఞానము రూపొందుచున్నదో వారికిని అభ్యుదయము కలుగును. ప్రేమ, సామర్థ్యములు కూడ ఇవ్విధముగనే రూపొందును.

ఒక దారిప్రక్కను రెండు గుంపులుగా చీలియున్న వ్యక్తులకు ఏదో విషయమునుగూర్చి తీవ్రముగా వాద వివాదములు జరుగుచుండె ననుకొనుడు. ఆ చర్చలు తీవ్రముగా సాగుచుండగా ఆ గుంపుల కది వరకే తెలిసినట్టియో, లేక తెలియనట్టియో ఒక వ్యక్తి అచ్చటికి వచ్చెను. చర్చింపబడుచున్న విషయముతోగాని, ఆ రెండు పక్షములతోగాని సంబంధములేని ఆ నూతన వ్యక్తి వివాదమునకు కారణమైన విషయమును, చర్చింపబడు అంశములను, వివాదములందును ఆ గుంపుల యందును గల గుణదోషములను, తప్పొప్పులను సమముగా అవగాహన చేసికొనగల శక్తి గలిగియుండెను. విషయమందలి అంశములు వానియందలి తప్పొప్పులు, వివాదపడుచున్న గుంపులయొక్క తప్పొప్పులు, వీనిని గూర్చి సక్రమమైన అవగాహనయే. ఈ విషయ

మునుగూర్చిన జ్ఞానమనబడును. ఆ వివాదము జరుగుచున్న స్థలమునకు వచ్చిన నూతన వ్యక్తియొక్క అభిప్రాయము ప్రకారము, ఆ వ్యక్తి సక్రమముగా నవగాహన చేసికొనిన ప్రకారము ఆ వివాదములోని ఒక పక్షమువారు చాల తెలివైనవారు. జిత్తులు, ఉపాయములు తెలిసినవారు. ఈ తెలివిగల పక్షమువారు, రెండవ పక్షమును మోస పుచ్చబోవు చున్నారు. ఈ తెలివిగల పక్షముయొక్క వాదము చాల అల్పమైనది. బలహీనమైనది, అన్యాయము అసంబద్ధమునైనది. కాని రెండవ గుంపు అవగాహన శక్తిలో వెనుకబడి యుండుటవలన, ప్రతి పక్షముయొక్క జిత్తులను గ్రహింపలేక వారియొక్క ప్రయత్న ఫలిత ముల నెదుర్కొన లేక తమ వాదము న్యాయమైన దైనప్పటికిని మోసమును పొందబోవుచున్నది. ఇట్టి పరిస్థితిలో అచ్చటకు ఆకస్మిక ముగా వచ్చిన, ఆ నిస్వార్థవ్యక్తి ఆ విషయములో తనకేవిధమైన లాభనష్టములు లేకపోవుటవలన, పరిస్థితులను సక్రమముగా అవగాహన చేసికొనగలుగుట వలన, వివాదమునందు కలుగజేసికొని, మోసము పొందబోవు గుంపును సమర్థించి, రెండవ గుంపు చేయదలచిన మోస మును, తప్పును ఋజువుచేసి, అన్యాయము జరుగకుండ ఆపుచేయ వలెను. ఎట్టి పరిస్థితుల యందును కూడ, ఆ నిస్వార్థవ్యక్తి అన్యాయ మును అరికట్టకుండ తృప్తిపొంది యూరుకొనకూడదు. "నేనీ విష యమునందేల కలుగజేసికొనవలెను. ఈ రెండు పక్షములతోడను కూడ నాకేవిధమగు సంబంధమును లేదు. ఈ వివాదము నాకు సంబంధించి నది కాదు. నా పరిధిలోనిది కాదు. ఈ వివాదములో నేను కలుగజేసి కొనినయెడల తెలివిగల గుంపునకు నాపై కోపము గలిగి వారు నాకేవిధమైన చిక్కులు కలుగజేయవచ్చును. వారు చాలమంది కలరు. సంఖ్యాబలసంపన్నులు. నేనొంటరిగా నున్నాను. ఏకాకిని, అవతల దాటిని పోయినచో నాకు నీ పీడ లేకుండ పోయెడిది. దురదృష్టముకొలది

యీ సమయమునకే యీ దారిని వచ్చితిని" అని ఆ వ్యక్తి ఆలోచింపరాదు.

ఇట్టి స్థితిలో ఆ తరుణమందచ్చట తానుండుటయే ప్రధాన కారణముగా నెంచి ఆ వ్యక్తి యిట్లు భావింపవలెను. "దీనిలో నాకేదియో సంబంధమున్నది. నేను తప్పక సంబంధము కలిగించుకొనవలెను. అవతల దారిని పోవలయునని నేననుకొనినప్పటికిని, యీ దారిని వచ్చుటలో నేదియో ప్రాధాన్యమున్నది. న్యాయముగానున్న పక్షము తమ అశక్తతవలన, తనను మోసగించు శక్తి లేకపోవుటవలన, తానే మోసమును పొందబోవుచున్నది. నాకు పరిస్థితులను సక్రమముగా అవగాహన చేసికొనెడి శక్తి కలదు. నాకట్టి శక్తి ఎందులకుండవలెను? ఆ గుంపునకు పరిస్థితులను సక్రమముగా అవగాహన చేసికొనెడి శక్తి, లక్షణములు లేవు. నాకున్నది. అందువలన సక్రమముగా అవగాహన చేసికొనుట యందు నాకుగల శక్తిని, అట్టి శక్తిని తక్కువగా కలవారి అభ్యుదయమునకై వినియోగింప వలయును. పరిమితమైన మానవ ప్ర ప్రకారము నాకును ఆ వ్యవహారమునకును నెట్టి సంబంధమును లేదు. కాని పరిమితులకతీతమైన విశ్వధర్మము ననుసరించి నిరవధికమైన ఆధ్యాత్మిక ధర్మప్రకారము, ఆ వ్యవహారమునందు నాకు తప్పక సంబంధము గలదు. అందువలననే యిప్పుడు తలవని తలంపుగా నేనిచటకు వచ్చుట తటస్థించినది." విషయములను గూర్చిన జ్ఞానముగల యిట్టి వ్యక్తి యీ రీతిగ నాలోచించి జరుగబోవుచున్న అన్యాయము నరికట్ట వెంటనే ప్రయత్నించును. అన్యాయపు గుంపునకు తమ వాదనయందలి తప్పులను, వారి యంశమునందలి యన్యాయమును వివరించి, బోధించును. ఆ గుంపు తమ వాదమును విరమించి తమ తప్పులను సరిజేసికొనిన చేసికొనవచ్చును. మోసము జరిగిపోకుండ ఆపుచేయవచ్చును. వివాదమంతయు, శాంతియుతముగ పరిష్కరింపబడవచ్చును.

మంచిది. అట్లుగాక, మోసము చేయదలచుకొనిన ఆ గుంపు తమ అన్యాయప్రవర్తనను సరిజేసికొనుటకు ఇష్టపడకపోవచ్చును. తమవిధానము లను మార్చుకొనక పోవచ్చును. అయినను, ఆ నిస్వార్థవ్యక్తి, తీవ్రముగా కలుగజేసికొని, అన్యాయము నరికట్టుటకు సర్వప్రయత్నములు చేయును. ఆ వ్యక్తి చేయు ప్రయత్నమే ఆ విషయమును గూర్చిన జ్ఞానము యొక్క రూపము. అదే రీతిగ ప్రతినామమునకును ఒక రూపముండును. ప్రతి రూపమునకును నొక నామముండును. ప్రేమ, జ్ఞాన, సామర్థ్యము లను మూడును, ఆయా రూపముల యొక్క నామములు. పైన చెప్పిన నిస్వార్థవ్యక్తి యొక్క ప్రయత్నమే అతనికి గల జ్ఞానము నుపయోగించు విధానము. ఇదియే జ్ఞానమున కొక ఆకారమును, రూపము నిచ్చెడి రీతి. ఇదియే ఇతరులకు మేలు కలిగించుటకు జ్ఞానము ధరించిన రూపము. ఈ ప్రయత్నము ఆ వ్యక్తిలోని జ్ఞానము నింకను అధికముచేయును. తప్పుదారిలో నున్న గుంపును సరిచేయును. మోసము పొందబోవుచున్న గుంపునకీ విషయము, ఇట్టి యితర విషయములను గూర్చిన జ్ఞానమును గలిగించి, మరల మోసము పొందుటకు అవకాశము లేకుండ జేయును. ఈ రీతిగ ఒక వ్యక్తి తనకు గల జ్ఞానమును సక్రమముగా ఉపయోగించుట వలన, ఆ వ్యక్తితో సహవాసము గల యితర వక్తులందరి పురోవృద్ధికిని అవకాశమును కలిగించును. అదేరీతిగ అట్టి పరిస్థితులయందు హృదయపూర్వకమైన ప్రేమను కూడ వినియోగించి అక్రమములను అరికట్టవలెను. ప్రేమ యెక్కువగ గల వారియొక్క యీ ప్రయత్నము వలన, వారితో సంపర్కము గల వారికి అభ్యుదయము గల్గుటయే గాక, ప్రేమ అభివృద్ధి పొందని వారిలో విశేషముగ ప్రేమను కలిగించి, దుష్ప్రవర్తనను అరికట్టును.

దేశపనులు జరుగకుండ చేయుటకు, విషయములందు కలుగ జేసికొని, అనేకముగా సామర్థ్యముగల వ్యక్తి, తన శక్తిని సక్రమముగా వినియోగపరచు పద్ధతి కూడ నిదియే. సామర్థ్యము అను దానిలో దేహమునకు కావలసిన అవసరమగు వస్తువులన్నియు నున్నవి. ఈ ప్రయత్నము కూడ సామర్థ్యము తక్కువగా నున్నవారిలో సామర్థ్యమును పెంపొందింపజేసి సర్వతోముఖాభివృద్ధికి దోహదమగును. ఈ ప్రయత్నమే సామర్థ్య స్వరూపము.

సామాన్యముగ వ్యక్తులలో ప్రేమ, జ్ఞాన, సామర్థ్యములను నీ మూడింటిలో ఒకటి మిగిలిన వానికంటె నెక్కువగా నుండును. చాల అరుదుగ, రెండు ఎక్కువగ నుండును. ఒక వ్యక్తికి ప్రేమ ఎక్కువగా నుండవచ్చును. ప్రేమ ప్రబోధము వలన, ఆ ప్రేమను సక్రమముగ నుపయోగించుటకు అతడు పాటుపడును. ప్రేమాధిక్యత వలన, ఆ ప్రేమ, ఆ వ్యక్తి యొక్క భావములు, ఆలోచనలు, మాటలు, చేతలు ద్వారా రూపొందును. యితర వ్యక్తులలో ప్రేమ లేకపోవుట వలన గాని, తక్కువగా నుండుటవలన గాని ఏర్పడిన పరిస్థితులయందు, విషయములయందు, జోక్యము కల్పించుకొనక చేయును. ఈ పరిస్థితిలో ప్రేమాధిక్యత గల వ్యక్తిలో తగినంత జ్ఞానము లేకుండుటచేత, విషయమందు గాని, పరిస్థితియందు గాని, సంబంధము గల వ్యక్తుల గుణ, దోషముల నిర్ధారణ సక్రమముగా చేయుటకు శక్తి లేకపోవచ్చును. కాని వివాదమునందలి ఉభయపక్షములకు కూడ, అన్యాయము, అపకారము జరుగకుండ అరికట్టుటయందు తన నిర్విరామ కృషి ఫలితముగా, విశ్వమునందలి శక్త్యాణువులలో తన కనుకూలమైన వానిని ఆకర్షించుకొనుటకును, ఎదుటి పక్షము వారిని వశపరచుకొనుటకును, అనువైన శక్తిని కలిగియుండును. ఇట్టి పరిస్థితులలో ఒక వ్యక్తియందు జ్ఞానాధిక్యత మాత్రమే యున్న యెడల నితర వ్యక్తుల విషయములను అవగాహన చేసికొనుట, సక్రమముగా

నిర్ధారణ చేయుట తథ్యము. కాని, ప్రేమ లేకపోవుటచే, ఆ జ్ఞానము రూపమునొంది వ్యవహరింపలేదు.

మానవులు సదా పురోవృద్ధిని కోరుచుండెదరు. "పురోవృద్ధి యననేమి? దానిని సాధించుటెట్లు?" అను విషయములు సహజముగ మానవు లెరుగరు. అట్టి మానవుల స్వభావము, ప్రవర్తన మానవేత రులకు అనువైనట్లుగ నుండును. వారి సూక్ష్మేంద్రియములు సక్రమ ముగ పనిచేయువరకును లేదా వారిలో సూక్ష్మ వివేకశక్తి ప్రవేశించి వృద్ధియై సహజ వివేకముయొక్క సూచనలను వారు అనుసరింపగల్గు నంతవరకును ఈ స్థితిలో నుండెదరు. అందువలన వారు తమ అహము లకును, స్థూల, సృజనేంద్రియములకును, ప్రీతి కలిగించునట్టి అల వాట్లను, ప్రవర్తనలును కలిగి యుందురు. ఈ యలవాటులు, ప్రవర్త నలు, మానవేతర జీవులకు అనువైనట్లుగా నుండును. కాని మానవుల కుచితమైన రీతిగ నుండవు. సౌఖ్య, క్షేమములు పురోవృద్ధిపై నాధార పడి యుండునను విషయమును గూర్చిన జ్ఞానమును కలిగియుండుట తప్ప, మిగిలిన అన్ని విషయములలోనను, వారి యింద్రియములు మానవేతరుల కనువైనట్లుగానే యుండును. ఆ జ్ఞానమైనను పూర్తి మైనదికాదు. "పురోవృద్ధి యననేమి? అదెట్లు కలుగును?" అను విష యము తెలియదు. అట్టి మానవులు మానవేతరులవలెనే తమయొక్క సౌఖ్యమును, క్షేమమును ప్రేమించెదరు. కాని, మానవులవలె, మాన వులు ప్రేమించవలసిన విధముగా ప్రేమించలేరు. మానవులైన తమ వాత కూడ కొనసాగుచున్నట్టియు, మానవేతరులకు మాత్రమే ఉచిత మైనట్టియు ఈ ప్రేమను మమకారము అందురు. దీనినే విపర్యాయ ప్రేమయని కూడ నందురు. ఇది అపసవ్యమైనది.

వారు సహజ వివేకమును పొంది, మానవ శరీరములతో అవత రించినప్పటికిని వారి స్వభావము, ప్రవర్తన, అలవాట్లు తమ పూర్వ

జన్మయగు, మానవేతరమగు విధముగనే యుండును. వారి పూర్వ మానవేతర జన్మవాసనలయొక్క బలమువలన, వారి యహములు, వారి సహజ వివేకములతో కలుగజేసికొని లోబరచుకొనును. సౌఖ్య, క్షేమములను సంపాదింపవలెననెడి యాకాంక్ష, అభిలాష, కొనసాగు చుండుటయేగాక, వానియందు బంధము బయలుదేరును. సౌఖ్య, క్షేమములయందు బంధము బలీయమైనకొలది, స్వార్థపరత్వము ప్రబలి విచక్షణను మరచిపోవుదురు. మంచి చెడ్డలను, యుక్తాయుక్తములను గ్రహింపలేరు. స్వలాభమునే ప్రధానముగా గణించెదరు.

ఇంతియేగాక ప్రేమ, జ్ఞాన, సామర్థ్యములను నీ మూడింటిలో ప్రేమ, వ్యక్తియందలి జ్ఞాన సామర్థ్యములకంటె బలీయమై వానిని అతిగమింపక పోయినచో ఆ వ్యక్తి హృదయము శిరస్సు, కండరములపై నాధిపత్యము వహింపకున్నచో, వారి అహములు వారిని వశవర్తులుగనే యుంచుకొనును. వారు సూక్ష్మశక్తిని గ్రహించి సంలీనము చేసుకొన్నను సరియే, ఆ వ్యక్తులలో సూక్ష్మశక్తి బయలుదేరి వారు సూక్ష్మశక్తిని పొందియున్నను సరియే, ప్రేమ ప్రాబల్యము లేనియెడల వారు అహమునకు వశవర్తులై యుండెదరు.

ప్రేమ, జ్ఞాన, సామర్థ్యములలో, సామర్థ్యమే ప్రబలమై యున్నచో తత్ఫలితము లింకను, హీనకరముగ నుండును. జ్ఞాన, సామర్థ్యములు వేరువేరుగా కాని, రెండును కలిసిగాని ప్రేమకంటె ప్రబలములైనచో, ఆ వ్యక్తులు, బాహ్యాభివృద్ధిని కలిగియుందురు. కాని ప్రేమయే ప్రబలముగా నున్నచో, ఆ వ్యక్తులు, సక్రమముగా అవగాహన చేసికొని సంచరించు స్థితిలో లేకపోయినప్పటికిని ఇబ్బంది లేదు. వారు విరామము, విశ్రాంతి లేకుండ చేయు ప్రయత్నములవలన వారికి ప్రత్యక్షముగనో, పరోక్షముగనో జ్ఞాన సామర్థ్యముల యాధిక్యతగల

అనేకులగు నితర వ్యక్తులతో సంపర్కము కలుగును. అట్టి జ్ఞాన సామర్థ్యముల ఆధిక్యత కలిగిన వ్యక్తులు, ప్రేమ ప్రబలముగా కలవారికి విధేయులై, అనువర్తులై యుందురు. ఇందు మూలముననే ప్రేమ, జ్ఞాన సామర్థ్యములకు మహాప్రభువు.

అదేరీతిగ, భగవంతుడు, సర్వాంతర్యామి, అనునవి ప్రేమ, జ్ఞాన, సామర్థ్యముల సంపూర్ణస్థితికి నామములు. ఈ మూడింటిలో ఏ యొకటియో రెండో లేక మూడింటియొక్కయో అవతరణయే వ్యక్తులద్వారా సర్వాంతర్యామియొక్క సాక్షాత్కారము. సర్వాంతర్యామియొక్క సాక్షాత్కారమే సర్వాంతర్యామియొక్క స్వరూపము. సర్వాంతర్యామియొక్క సాక్షాత్కారమునకు వేరు వేరు తరహాలలో, మార్గములుకాని వస్తువులు, విషయములు, జీవులు ఈ విశ్వమందు లేవు. ప్రేమ, జ్ఞాన, సామర్థ్యములను నీ లక్షణము లన్నిటియొక్కగాని, కొన్నిటియొక్కగాని, పరిపూర్ణ సాక్షాత్కారమునకు అనువైన నిర్మాణము జీవులలోనికెల్ల మానవులలోనే పూర్ణముగ నుండును. సర్వాంతర్యామియొక్క సంపూర్ణ సాక్షాత్కారమునకు మానవులే మార్గములు. ప్రేమ ప్రబలముగాలేని మానవులలో, జ్ఞానసామర్థ్యముల సాక్షాత్కారము గూడ సర్వాంతర్యామి స్వరూపములో అయినప్పటికిని, అందువలన ఫలితములు మానవులతో సహా ఇతర జీవుల అభ్యుదయమునకు కూడ అభ్యంతరములను కలిగించుచుండును గావున అట్టి శక్తులు అమానుషములు. ప్రేమ ప్రాబల్యము లేకుండ జ్ఞానసామర్థ్య శక్తుల సాక్షాత్కారమునకు ఆలవాలమైనట్టియు, మార్గములైనట్టి మానవులు అమానుషవ్యక్తులు. సాక్షాత్కారముయొక్క ప్రమాణము ఎంతయైనప్పటికిని, అట్టి సాక్షాత్కారమువలన ఒక్క జీవిద్వారానైనను అంతరాయములు, అభ్యంతరములు కలిగినచో, అట్టి అభ్యంతరమునకు కారణమ్మైన వ్యక్తులు అమానుషవ్యక్తులు. ప్రేమ ప్రబలము

కానంతవరకును ప్రేమ ప్రాబల్యము సిద్ధింపనంతవరకును, జ్ఞాన సామర్థ్యములు రూపుయున మానవులు సర్వాంతర్యామి సాక్షాత్కారమునకు తగిన అర్హతను పొందినప్పటికి, అట్టి వ్యక్తులు అమానుషవ్యక్తులు. అందువలననే జ్ఞాన సామర్థ్యములపై ప్రేమకు సర్వాధిపత్యము.

వస్తువులను గూర్చియు, విషయములను గూర్చియు, జీవులను గూర్చియు సక్రమముగా అవగాహన చేసికొను జ్ఞానమును; నూరుగురెదుర్కొనినను ఎదిరించి, ఓడింపగల సామర్థ్యమును కూడ గల్గిన ఒక వ్యక్తి యుండెననుకొనుడు. కాని అట్టి వ్యక్తియొక్క జ్ఞాన, సామర్థ్యములపై ప్రేమ ప్రాబల్యము లేదనుకొనుడు. అప్పుడట్టి వ్యక్తి తనకు గల జ్ఞానసామర్థ్యములను, తనయొక్క సౌఖ్య, క్షేమములకొరకు మాత్రమే రూపొందింపగోరును. ఆ వ్యక్తి చుట్టును ఎందరో యితర వ్యక్తులున్నారు. వస్తువులు, విషయములు, జీవులనుగూర్చిన జ్ఞానము వారికి లేదు. కొలది జ్ఞానమును, కొలది శక్తియుగల యితర జనులచే వారికి ఇబ్బందులు కలుగుచుండును. వారు బాధపడుచున్నారు. అపారమైన జ్ఞానము, అమేయమైన సామర్థ్యము కలిగి, ఆ ప్రక్కననే యుండిన ఆ వ్యక్తి తనలో ప్రేమ ప్రాబల్యము లేకపోవుటచే తన జ్ఞానమును, సామర్థ్యమును రూపొందించి పీడింపబడుచున్న ప్రజలయొక్క బాధలను, ఇబ్బందులను పోగొట్టుటకు ప్రయత్నింపకుండును. పైగా పీడించుచున్న ప్రజలకు సహాయపడి, పీడింపబడుచున్న ప్రజలను పూర్తిగా అణచిపెట్టుటకు ప్రయత్నము చేయును. ఆ ప్రయత్నములో విజయము పొందిన తరువాత, అంతవరకు తన సహాయము పొంది జ్ఞాన, సామర్థ్యశక్తులు కొంచెముకూడ లేని ప్రజలను పీడించిన వారిని కూడ పూర్తిగ అణచివేయును. ఈ విధముగ పరిస్థితులు లనుకూలముగ నున్నంతవరకు, ఎంత మందిని వీలయినచో, అంతమందిని అణచిపెట్టి తన జ్ఞానమును, సామర్థ్యమును అత్యున్నతమైన స్థితికి పెంపొందించుకొనును. ఇట్టి వ్యక్తులు

**అసురులు, రాక్షసులు** మొదలైన నామములతో పిలువబడుచుందురు. అదే వ్యక్తియొక్క జ్ఞాన, సామర్థ్యములు, ప్రేమ ప్రాబల్యము కలిగి యున్నవనుకొనుడు. అప్పుడావ్యక్తి తనకుగల ప్రేమ, జ్ఞాన, సామర్థ్యములను పీడిత ప్రజానీకముయొక్క సేవకై వినియోగించును. వారు అణచిపెట్టబడకుండ చేయుటకై కృషిచేయును. అందులకు ఫలితముగ పీడింపబడుచున్న ప్రజలలో ప్రేమ, జ్ఞాన, సామర్థ్యములు బయలు దేరును. అంతియేగాక ఆ వ్యక్తితో గల్గిన సంపర్క, సంసర్గములవలన పీడించుచున్న ప్రజలలోకూడ ప్రేమ జనించును. ఆ వ్యక్తి రూపొం దించు ప్రేమ, జ్ఞాన, సామర్థ్యములవలన ఇతరులందరిలోను కూడ ఆ వ్యక్తియొక్క సంపర్క, సంసర్గములవలన ప్రేమ జ్ఞాన, సామర్థ్యము లుదయించును. అట్టి మహావ్యక్తులనే దివ్యులనియు, ఆధ్యాత్మిక మహా వ్యక్తులనియు అందురు. అందువలన మానవులందరిలో జ్ఞాన, సామర్థ్య ములు, ప్రేమకు లోనై యుండవలసిన అవసరము సుస్పష్టమగు చున్నది.

ప్రేమ, జ్ఞాన, సామర్థ్యము లను నీ మూడు లక్షణములను ఒండొరుల అభ్యుదయమునకై, మానవులందరును సక్రమముగా విని యోగపరచవలెనని ఆదిపితరులు కోరుచున్నారు. మానవ కర్తవ్య మును, మానవోచితముగ నిర్వర్తించుట యను విశ్వావశ్యకతయు నిరంతరము కోరుచున్నది.

ఈ విశ్వమం దిప్పుడున్నట్టియు, కాలక్రమమున మున్ముందు రానైయున్నట్టియు, మానవ, మానవేతర సస్యజాతులకు చెందిన జీవ రాసు లన్నిటికిని, కావలసిన పోషణపదార్థములను, భూమి నిరంతరము పండించుచునే యున్నది. కాని, మానవులలో కొందరు అనేకములగు లోపములకు గురియగుటవలన తమకు కావలసిన పోషణపదార్థములను

ప్రేమ, జ్ఞాన, సామర్థ్యములను సంపాదించు కొనలేకున్నారు. మరి కొందరు తమ అవసరములకు మించి ఎక్కువగా కూడ బెట్టుకొనుటయే గాక, ఇతరులు తమ నిత్యావసరములను సంపాదించు కొనకుండ కూడ అడ్డుపెట్టుచున్నారు. ఆహారపదార్థములే గాక, వానిని సంపాదించు కొనుటకు వినియోగపడు వెండి, బంగారములు, ప్రేమ, జ్ఞాన, సామర్థ్యములు కూడ పోషణపదార్థములు క్రిందవచ్చును. కొన్ని ప్రాంతము లలో కొన్ని కాలములలో, ఇతర ప్రాంతములలోకంటె పంట యెక్కువగ నుండవచ్చును. ఏ జీవరాసుల యునికికి, మనుగడకు, పోషణ పదార్థము లవసరమో ఆ జీవరాసులు కూడ కొన్ని కాలముల యందు, ప్రాంతముల యందు మిగిలిన చోటులకంటె ఎక్కువగ నుండెదరు. ఏమైనప్పటికినీ పోషణపదార్థములను సంపాదించుకొనుటకు కొందరకు శక్తి లేకపోవుట వలననైననేమి, యితరులు వారి ప్రయత్నములకు అడ్డుపడుటవలన నయిననేమి, ఆహార పదార్థములను సంపాదించుకొనుట యందు, ఇతరులకు గల హక్కులను అణచిపెట్టుట యందు, బాధ్యతా రహితులగు మానవులు ప్రదర్శించు ప్రవర్తనవలననైననేమి, పోషణ పదార్థములు, ప్రేమ, జ్ఞాన, సామర్థ్యములు మానవకోటి యందధిక భాగమునకు లేకుండ పోవుచున్నవి. అధికముగ పంటలు గల ప్రాంత ములు సమస్త ప్రపంచమునకు, అందరి మానవులకు సంబంధించిన ధాన్యాగారములుగ నుండుటకు మారుగ పోషణపదార్థములకును, ప్రేమ, జ్ఞాన, సామర్థ్యములకును, బందీగృహములై పోయినవి.

పోషణపదార్థములు పురోవృద్ధికి మూలములైనవి. మానవ కోటి యందధిక భాగము కూడ పోషణపదార్థములును, ప్రేమ, జ్ఞాన, సామర్థ్యములును లేకపోవుట వలన బాధపడుచున్నారు. దారిద్ర్యము (పోషణపదార్థములును, జ్ఞాన, ప్రేమ, సామర్థ్యములును) వలన బాధ పడుచున్న యీ మానవానీకము తన దుస్థితిని గూర్చియే నిరంతరము తలంచుచుండును. తమ నిత్యావసరములకు కావలసిన, పోషణపదార్థము

లను, సమృద్ధిగా కలిగియుండుటయే గాక తను న్యాయమైన అవసరములకును. అన్యాయమైన అవసరములకును మించి అధికముగ పోషణ పదార్థములు కలిగియున్న వారిని అసూయాభావముతో చూచుచుండును. ఇట్టి దుఃఖ పరిస్థితులను గూర్చిన భావములు తీవ్రము, నిరంతరము నైపోయినవి. ఈ తీవ్రమైనట్టియు, నిరంతరమైనట్టియు, దుఃఖపరిస్థితులను గూర్చిన భావములు తమలో అత్యధికమైనట్టి శక్తిని జనింపజేయును. ఈ శక్తి యందసహ్యము, అసూయయు నుండగల్గినంత సంపూర్ణముగ నుండును. ఆ వ్యక్తులచే నీ అసహ్యము, అసూయలతో గర్భితమైన శక్తి నిరంతరము వెదజల్లబడుచున్నది. ఇట్లు వెదజల్లబడుచున్న యీ శక్తియందు గుణగ్రాహ్యత (Sensitiveness) కలదు. ఈర్ష్య, అసూయ, అసహ్యము వలన పుట్టినదియు, ప్రోత్సహింపబడినదియునైన గుణగ్రాహ్యశక్తి, యీ విశ్వమందలి సమస్తప్రదేశము నందును వ్యాపించి రూపమును పొంది సాక్షాత్కరించుటకు కృషి సల్పుచున్నది.

విశ్వమందలి ప్రదేశమునందు ప్రేమ, జ్ఞాన, సామర్థ్యములు గల వ్యక్తులచే విసర్జితమైన ప్రేమ, జ్ఞాన, సామర్థ్య శక్తుల యొక్క అణువులు వ్యాపించియున్నవి. పోషణపదార్థములు, వాని మూలమున ప్రేమ జ్ఞాన, సామర్థ్యములు తక్కువగాగల బీదజనులచే విసర్జితమై వ్యాపించుచున్న ఈర్ష్యాశక్తి, ప్రదేశమునందదివరకే వ్యాప్తిజెందియున్న శక్త్యణువులు (ప్రేమ, జ్ఞాన, సామర్థ్యములు) మూలముగ వర్ధిల్లి పెంపొందును. దుఃఖితులైన వారి భావములు, ఆలోచనలు, ఈర్ష్య అసూయల వలన పుట్టినవైనప్పటికి, విశ్వమందలి సమస్త మానవుల అభ్యుదయ సంసిద్ధితో సామరస్యము కలిగియుండుట వలన సమర్థనీయమై యున్నది. ప్రదేశమునందలి ప్రేమ, జ్ఞాన, సామర్థ్యశక్తులచే సహాకరింపబడి, బీదజనులచే వ్యాప్తిచేయబడిన, ఈర్ష్య అసూయాశక్తులనుండి పుట్టిన గుణగ్రాహ్య

శక్తులు, విశ్వసిద్ధాంతముతో సామరస్యము గలిగియున్న తమ ఆశయమును సాధించుటకు ప్రేమ, జ్ఞాన, సామర్థ్యములు, పోషణపదార్థములు అవసరమును మించి నిలువ చేయబడిన ప్రదేశమునకు పయనించును. అట్టి ప్రదేశములకవి (బీద జనులచే వ్యాప్తిచేయబడిన ఈర్ష్యా, అసూయా శక్తులనుండి పుట్టి, ప్రేమ జ్ఞాన, సామర్థ్యములు గల వ్యక్తులచే విని గతమై వ్యాప్తిచెందుచున్న శక్త్యణువులచే వర్ధిల్లి, పెంపొందియున్న శక్తి) విశ్వశాపోత్తరవులే! (Universal curse warrants). ఈ విశ్వశాపద్రూపములు నిర్బధింపబడియున్న ప్రేమ, జ్ఞాన, సామర్థ్యములకు, పోషణపదార్థములకు విమోచన కలిగించు నిమిత్తము బంధిఖానాలను బ్రద్దలుకొట్ట యత్నించును. పోషణపదార్థములను ప్రేమ, జ్ఞాన, సామర్థ్యములను అవసరమునకు మించి నిలువ చేయబడిన బందిగృహములను బ్రద్దలుకొట్టి, ఆ శక్తులను విడుదల చేయును. ప్రదేశమునందుగల సామర్థ్యశక్తి సహాయము, జ్ఞానశక్తియొక్క సలహాను పొంది ప్రేమ శక్తి ప్రయోగమువలన స్వార్థరహితమై, ఈ విశ్వశాపములు అప్రతిహతమగును. అవి యడ్డగింపబడనేరవు. వాని యాశయము న్యాయబద్ధమైనదగుట వలనను, విశ్వమందలి సమస్తజీవులకు, అభ్యుదయము సాధింపవలెననెడి విశ్వావశ్యకతతో సామరస్యము కలిగి యుండుట వలనను, యీ విశ్వశాపముల యధికారము అనతిక్రమణీయమైనది. ఎవ్వరును వానిని ఎదిరింపజాలరు.

అధికనిలువదారులారా! ప్రపంచమునందలి కొన్ని ప్రాంతములందు ప్రేమ, జ్ఞాన, సామర్థ్యములను అధికముగా నిలువచేసియున్న మీరు, యీ నిలువలకు గుణగ్రాహ్యశక్తి (sensitiveness) కలదని తెలిసికొనవలయును. ఏవో కొన్ని ప్రాంతములయందు నివసించుచున్న ప్రజలకు మాత్రమే వినియోగింపవలెనను ఉద్దేశ్యముతో మీరు నిలువ చేయుదురు. మిగిలిన ప్రాంతములలోని ప్రజలకు మీరు వానిని లేకుండ

చేయుచున్నారు. ఈ శక్తులు, పదార్థములు సర్వమానవులకు చెందినవే గాని ఏ యొకరివిని కావని మీరు తెలిసికొనవలయును.

నిలువ చేయబడిన ప్రేమ, జ్ఞాన, సామర్థ్యములకు కూడ గుణ గ్రాహ్యశక్తి కలదు. ఈ శక్తుల నధికముగా సంపాదించి నిలువచేయు టకు ప్రబల కారణము ఆ యా శక్తులను సంపాదించుకొనలేని వారి యందు మీకుగల అసహ్యత, అసూయ, ఈర్ష్యయే. ఈ ప్రోద్బలశక్తి (అనగా జ్ఞాన, ప్రేమ, సామర్థ్యముల సంగ్రహమును సంపాదించు కొనలేని వారియందు మీకుగల అసూయ, అసహ్యత, ఈర్ష్య) ఆధ్యా త్మిక సిద్ధాంతము ప్రకారము పరివర్తన పొంది గుణగ్రాహ్యశక్తి రూప మున మీచే నిలువచేయబడిన సంగ్రహములయం దిమిడి యుండును. ఈ విధముగ బందీగృహములయందు నిలువచేయబడిన సంగ్రహముల యందు గుణగ్రాహ్య శక్తిగలదు. సంగ్రహములయందలి గుణగ్రాహ్య శక్తి, విశ్వశాప్యములయందలి గుణగ్రాహ్యశక్తి ఒకే రూపముగలవి. ఒకే విధమైన శక్తిగలవి. అందువలన బందీగృహములను బద్దలుకొట్టి, ప్రేమ, జ్ఞాన, సామర్థ్య సంగ్రహ శక్తులను విముక్తము చేయుటకు అప్రతిహతమైన శక్తితోను ఎదిరించ నలవికాని అధికారముతోను పయనించు విశ్వశాప్యములలోని గుణగ్రాహ్య శక్తియును అన్యోన్య సంపూరకములు. ఒకదానితో నొకటి కలసిన సంపూర్ణమగును. ప్రేమ, జ్ఞాన, సామర్థ్య సంగ్రహములను విముక్తము చేయుటకు కార్య రూపమున బయటనుండి పనిచేయును. లోనున్న సంగ్రహములు కూడ తమ విమోచనము కొరకు పాటుపడును.

ఓ నిలువదారులారా! మీలోగల ప్రేమ, జ్ఞాన, సామర్థ్య శక్తుల సహాయముతో విశ్వశాప్యములను ఓడించి అవి యెక్కడనుండి బయలుదేరినవో అక్కడికే వానిని తిరిగి పంపగలమని మీరు ఆశిం

తురు. పీడిత మానవులవలన, వారి వద్దనుండి బయలుదేరిన విశ్వశాపములను మరల వారిపైకి త్రిప్పుటకు ప్రయత్నింతురు. మీకుగల ప్రేమ, జ్ఞాన, సామర్థ్య శక్తులను సర్వదా ఆ ప్రయత్నమందే వినియోగింతురు. కాని మీరు ఏ శక్తుల సహాయమువలన ఆ శాపముల నెదుర్కొనుచున్నారో ఆ సంగ్రహములలోనున్న గుణగ్రాహ్యశక్తులే ఈ శాపములయొక్క ఉద్దేశ్యములను సాధించుటకు ప్రయత్నించును. ఆ శాపముల ఆశయములను సిద్ధింపజేయును. ఏ ఆశయములతో మీరు శక్తులను నిలువ చేయుచున్నారో. అవే ఆశయములతో శాపములు విడిచి పెట్టబడుచున్నవి. శాపముల నోడించుటకు మీరేసిద్ధాంతములను వినియోగించుచున్నారో ఆ శాపములుకూడ నిల్వశక్తులను విముక్త పరచుటకు, అదే సిద్ధాంతములను వినియోగపరచుచున్నవి.

అందువలన జాగ్రత్తగ నాలోచింపుడు. మీ నిలువశక్తుల యొక్కయు, విశ్వశాపములయొక్కయు గుణగ్రాహ్య శక్తులకు గల సామరస్యమును గ్రహింపుడు. అంతియేగాక మీకును, మీ ఆశయములకును నిలువలలోగల గుణగ్రాహ్య శక్తికిని సామరస్యము లేదని గ్రహింపుడు. శాపములను వానిలోగల గుణగ్రాహ్య శక్తిని గుర్తింపుడు. మీరు ప్రేమ, జ్ఞాన, సామర్థ్యములను, పోషణ పదార్థములను నిలువ చేయుటవలన పీడిత ప్రజానీకమునకు ఆశక్తులు లేకుండ పోవుచున్నవి. వారి అభ్యుదయమును ఆటంకపరచుచున్నవి. అందువలన మీ ప్రయత్నములు అన్యాయములు. అసమర్థనీయములు. మీ ప్రయత్నములకు విశ్వావశ్యకతతో సామరస్యము లేదు. పీడిత ప్రజానీకముచే వినిర్గత విశ్వ శాపముల ఉద్దేశ్యము, మీ అత్యధికావసరములు తీరిన తర్వాతనే మీవద్ద అదనముగా ఇంకను నిలువయున్న శక్తులను వినియోగపరచుటయే. అట్లు విమోచన గావింపబడిన శక్తులు పీడింపబడిన ప్రజల యొక్క అభ్యుదయమునకు వినియోగింపబడును. అందువలన వారి

ప్రయత్నములు న్యాయమైనవి. సమర్థనీయములు. విశ్వావశ్యకతతో సామరస్యము కలిగియున్నవి. మీరు పీడిత మానవుల అభ్యుదయమును నిరోధించుచున్నారు. వారు, మీ అభ్యుదయమునకు భంగము లేకుండగనే వారుకూడ అభ్యుదయమును పొందగోరుచున్నారు.

విశ్వశాప్యములు న్యాయసమ్మతమైనవి. విశ్వావశ్యకతతో సామరస్యము కలిగియున్నవి గనుక విశ్వమందలి "సామర్థ్యము" గల వ్యక్తులచే నిరంతరము వినిర్గతమగుచున్న "సామర్థ్య" శక్తి అణువులను గ్రహించి బలమును పొందుచున్నది. అధికముగ జ్ఞానము కల వారిచే విడిచిపెట్టబడుచున్న జ్ఞాన శక్తి అణువులను గ్రహించి, సక్రమ మార్గమున పురోగమించుచున్నవి. ప్రేమ అధికముగా గల వ్యక్తులచే వినిర్గతమగుచున్న ప్రేమశక్త్యణువులను గ్రహించి స్వాగ్రహరహితములై నడుచుచున్నవి. అందువలన విశ్వసిద్ధాంతము ప్రకారము విశ్వావశ్యకతను సాధించుట కొరకు మీ వలన నిలువచేయబడిన ప్రేమ, జ్ఞాన, సామర్థ్యశక్తులు కూడ కాలక్రమమున విశ్వశాప్యశక్తులలో నేకీభవించును. మీపై విశ్వశాప్యములను ప్రయోగించుటయందు సహాకరించును. ఆ నిలువలకు మీరు హక్కుదారులై నప్పటికిని, మీ రెట్టి మహాప్రయత్నములు చేసినప్పటికిని, మీరు వానిని ఆపుకొనలేరు.

విశ్వసిద్ధాంత ప్రకారము మీ ప్రయత్నము లన్యాయములు. విశ్వావశ్యకతతో సామరస్యము లేనివి. అందువలన అవి తాత్కాలికముగా విజయము పొందినప్పటికిని అంతమందు వానికి పరాజయము తప్పదు. మీరు వీరలను శత్రువు లనుకొనెదరు. కాని, విశ్వసిద్ధాంతముతో సామరస్యము కలిగిన ఆశయములు కలిగియుండుటచే వారు మీకు మిత్రులే. విశ్వసిద్ధాంతము ప్రకారము న్యాయములై విశ్వా

వశ్యకతతో సామరస్యముకలిగిన ఆశయములు, అనేకములైన అడ్డంకులు ఎదుర్కొనవలసి వచ్చినప్పటికిని, చివరకు విజయమును పొందును. అంతిమ విజయము తథ్యము. న్యాయమైనవి, సామరస్యసిద్ధి కలిగిన ఆశయములు సర్వమానవులకు క్షేమకరమై యుండును. ప్రత్యేకించి అభివృద్ధి నిరోధకులకు కూడ క్షేమకరమై యుండును. అందువలన ఎవరు విశ్వశాస్త్రముల సాక్షాత్కారమునకు తోడ్పడిరో, ఇంకను తోడ్పడుచున్నారో, ఎవరి ద్వారా యీ విశ్వశాస్త్రములు రూపొందినవో, ఇంకను రూపొందుచున్నవియో అట్టివారు కూడ నిజముగ మీకు మిత్రులే. అంతియే గాక మీరనుకొనినట్లు, అనుకొనుచున్నట్లు వారు మీకు శత్రువులు కారు. కనుక, వారిని అదేరీతిగ మిత్రులుగ నెంచుడు. వారితో స్నేహమును సంపాదించుకొనుడు. అట్టి మానవుల యెడ మీ దృక్పథము ప్రవర్తన అలవాటులలో ఏ కొద్ది మాత్రము స్నేహభావమును చూపించినను వారి పురోవృద్ధికి తోడ్పడెదరు. వారు స్వార్థపరులు కారు. ప్రేమప్రాబల్యము గల వ్యక్తులచే నడిపింపబడుచున్నారు. మీరు చేసిన స్వల్పసహాయముతో మిక్కిలి తృప్తిని పొందుదురు. అందువలన మీకు సాధారణమైన పురోవృద్ధికి లోపమురాదు. మీరుభయులును పురోవృద్ధిని పొందెదరు. మీ పురోవృద్ధి అన్యోన్య సహకారిగా నుండును. మీ యిరువురి ఆశయములు న్యాయబద్ధములై విశ్వసిద్ధాంతముల ననుసరించిన వగుటవలన, విశ్వమందలి సమస్త జీవులకు అభ్యుదయ దాయకములగుట వలన, విశ్వావశ్యకతతో సామరస్యము కలిగియుండును.

అట్లుగాక విశ్వశాస్త్రముల బయలుదేరవలసిన దీన మానవుల యెడ మీ దృక్పథము, ప్రవర్తన, అలవాటులలో మీరు కనీసపు ప్రేమ స్నేహములు కనబరచినచో మీ యొద్ద అధికముగానున్న ప్రేమ,

జ్ఞాన, సామర్థ్యములను, సంగ్రహములను వారికై వినియోగింపకుండ ఆ శాప్యముల ప్రకోపమునకు అవకాశము లిచ్చినప్పటికిని దీనమానవులకు అంతిమ విజయము మాత్రము తప్పదు. మీ స్నేహసహకారములతో నిమిత్తములేదు. ఇట్లు కలిగెడి అంతిమ విజయము యొక్క రీతి మహా విపత్కరమై ఉభయులకును దుఃఖమును కలిగించును. మీకు కలుగబోయెడి అభ్యుదయమునకు అంతరాయము కలిగించును. ఇట్టి విధానము వలన ప్రేమ, జ్ఞాన, సామర్థ్యములు పోషణ పదార్థములు అదనముగా నిలువచేయబడిన స్థలములలో ధానివలన లబ్ధిపొందెడి మానవులలో విశ్వశాప్యములు రూపొందించిన మానవులయెడ ఈర్ష్య అసూయా, భావములు బయలుదేరును. కొంతకాలమునకు నీరీతిగ నిట్టి సంఘటనలెన్నియో జరుగును. అందువలన విశ్వశాప్యముల రూపొందించిన మానవుల యెడ మీరు స్నేహ, సౌహార్ద్రములుచూపించి అదనముగా నిలువచేయబడిన ప్రేమ, జ్ఞాన, సామర్థ్యములను వారి ప్రయోజనమునకై వినియోగపరచి విశ్వశాప్య ప్రకోపమునకు అవకాశములేకుండ చేయకున్న యెడల, ప్రస్తుతమున్న విపత్కరపరిస్థితులు శాశ్వతములై పోవును.

అందువలన, విశ్వశాప్యములను రూపొందించుచున్న దీనమానవుల పరిస్థితులనుగూర్చి మరల ఆలోచించుట అత్యవసరము. విశ్వశాప్యములలో గర్భితమైనట్టియు, అప్రతిహతమైనట్టియు వానిశక్తి, అనతిక్రమణీయమైన వాని యధికారమునుగూర్చి అతిముఖ్యముగ అవగాహన చేసికొనుడు. ఈ పరిస్థితులు పునరాలోచించి దీనమానవుల యెడ మీ ప్రవర్తన, దృక్పథము, అలవాటులను మార్చుకొని, వారి యెడల స్నేహ, సౌహార్ద్రభావములను పెంపొందించుకొని, సక్రమ

ప్రవర్తనకు మార్గదర్శకులు కావలెను. అప్పుడు ప్రపంచమందు విప త్కర పరిస్థితు లుండవు. అసూయా ద్వేషముల కవకాశములు కల్పించక, విశ్వశాంతికి తావు లేకుండ పోవును.

అందువలన,

మానవు లందరు న్యాయాన్యాయములను గుర్తించెదరుగాక !
మానవు లందరును విశ్వావశ్యకతను గ్రహించెదరుగాక !
మానవు లందరును స్నేహితు లయ్యెదరుగాక !



ఐదవ అధ్యాయము

# కర్తవ్య సంసిద్ధి

మానవానీకముయొక్క, సశరీర (embodied), అశరీర స్థితుల (disembodied) యందు, తదాధారముతో, తన్మూలముతో, ఎడ తెగని, అంతులేని ఏకత్వస్థితిని అనుభవించుట, ఆ యనుభూతిలో స్థిర త్వమును పొందుటయే మానవ కర్తవ్య సంసిద్ధి. మానవులు, విశ్వ అహము (universal ego), సహజ వివేకము, సూక్ష్మేంద్రియము లతో కూడిన వ్యక్తీకృత మనస్సులు (individualised minds) అట్టి మనస్సులు తమకు మూలమైన, విశ్వమనస్సుతో, ఏకత్వానుభూతిని పొందుట యనగా కాలానుగతముగా విశ్వసిద్ధాంతము ననుసరించి, విశ్వీకృత (universalise) మగుటయే. అందువలన వ్యక్తిత్వము నశిం పదు. ముందు వ్యక్తిమనస్సు, వ్యక్తి అహము (individual ego) నుండి విడివడవలెను. అప్పుడు వ్యక్తి అహము విశ్వఅహముతో (universal ego) అవినాభావ సంబంధమును పొందును. వ్యక్తి మనస్సులు విశ్వమనస్సుతో అవినాభావ సంబంధమును పొందును. ఈ రీతిగా విశ్వసిద్ధాంతానుసారము వానికి వ్యక్తిత్వముపోయి విశ్వ త్వము వచ్చును.

భూమి, సముద్రము, నక్షత్రములు, సూర్యచంద్రాదులతో కూడియున్న యీ విశ్వమందు, సమస్త వ్యక్తి జీవులకును ఆధారము, మూలమునునైన విశ్వజీవి సమస్త ప్రదేశమునందును వ్యాపించి

యుండును. అనేయే, ఆవిశ్వజీవియే, భూమి, సముద్రము, నక్షత్రములు, సూర్యచంద్రాదులకు ఆధారము. విశ్వజీవి సర్వవ్యాప్తము, సర్వోప స్థితమున్నైన, సర్వాంతర్యామి సాక్షాత్కారమే. సమస్తజీవులు, వస్తువులు, విశ్వజీవియొక్క సాక్షాత్కారములు. విశ్వజీవి సర్వాంతర్యామి యందు స్థితమై యుండును. ప్రదేశము అంతటను పంచభూతములు, వాని పదార్థములు, మూలశక్తులు, వాని పదార్థములు, విజ్ఞానము, స్వవిజ్ఞానములతో నిండియున్నవి. విశ్వమందలి సమస్తవస్తువుల ద్వారా పంచభూతములు, వానిపదార్థములు, మూలశక్తులు, వానిపదార్థములు విజ్ఞానము, స్వవిజ్ఞానము, అహము, మనస్సు, సర్వాంతర్యామియం దుండును. విశ్వమందలి సమస్తవస్తువులు, జీవులు, మనస్సు, అహము, విజ్ఞానము, స్వవిజ్ఞానము, శక్తిపదార్థములు, శక్తి, భౌతిక పదార్థములు, భూతములు ఇవన్నియు సర్వాంతర్యామి సాక్షాత్కారములే.

రాయి, చనిపోయినచెట్టు, మానవ, మానవేతర మృతకళే బరము – ఇవిజీవులుకావు. వస్తువులు మాత్రమే. రాయి, ఎండిపోయిన చెట్టు, మృతకళేబరముకూడ సర్వవ్యాప్తమైన, విశ్వజీవిలోనను, శాశ్వతము నిత్యమున్నైన సర్వాంతర్యామిలోనను స్థితమై యున్నవి. రాయి లోనను, ఎండిన చెట్టులోనను, మృతకళేబరములోననుగూడ సర్వాంతర్యామి, విశ్వజీవి, స్వవిజ్ఞానము, విజ్ఞానము, శక్తిపదార్థములు, శక్తులు, భౌతిక పదార్థములు, భూతములు నున్నవి. కాని అవి జీవులు కావు. వస్తువులు మాత్రమే. వానిలోకూడ, ఎన్నియో జీవులున్నవి. అయినను రాయి, నోడైనచెట్టు మున్నగునవి జీవులుకావు. వస్తువులు మాత్రమే. ఎందుచేత? వానిలో వ్యక్తీకృతజీవి లేకపోవుటవలననే! వానిలో వ్యక్తిజీవులు లేకపోవుట మూలముననే! జీవులలోవలెనే వానిలో భూతములు, భౌతిక పదార్థములు, శక్తులు, శక్తిపదార్థములు, విజ్ఞానము, స్వవిజ్ఞానము, అహము, మనస్సు, సర్వాంతర్యామియును

నున్నప్పటికిని అవి జీవులు కావు. వ్యక్తీకృత జీవమును కలిగియున్న పుడే, ఉన్నంతవరకే వస్తువులు జీవు లనబడును.

అందువలన సమస్త వస్తువులును, అశరీరములు, సశరీరములు నైన జీవులు, ఎల్లప్పుడును, సమస్త పరిస్థితులలోను, సర్వాంతర్యామి, విశ్వజీవి, స్వవిజ్ఞానము, విజ్ఞానము, శక్తులు, తత్పదార్థములు, భూతములు, తత్పదార్థములతో కూడియున్న ఈ మహావిశ్వమందు స్థితమై సంచరించుచుండును. అవి వేరువేరు రూపములలో, వేరువేరు పరిణామములలో నుండును. జీవులు, విశ్వజీవి, సర్వాంతర్యామియందు స్థితమై యుండును. విశ్వజీవియొక్క, సర్వాంతర్యామియొక్క స్థితుల యందెట్టి పరిస్థితులలోనను, ఏవిధమైన మార్పులు లేకుండ, వ్యక్తుల పరిభ్రమణ కనువగునట్లును, పరిభ్రమణ స్థితియందుకూడ సర్వాంతర్యామిని కలిగియుండుట కనువగునట్లును వ్యక్తుల శరీరములయందసంఖ్యాకములగు రంధ్రము లున్నవి. ఆకాశమందు, యీ మహావిశ్వమందు, విశ్వఅహముతో కూడిన విశ్వజీవసాగరమందు, స్వవిజ్ఞానము, విజ్ఞానము, శక్తిపదార్థములు. శక్తులు, భౌతిక పదార్థములు, పంచభూతములతో కూడియున్న సర్వాంతర్యామి మయమైన సర్వాంతర్యామి సాగరమందు, స్థితమై జీవులు పరిభ్రమించుచున్నవి. కాని ఆ పరిభ్రమణవలన ఎట్టి పరిస్థితుల యందును కూడ, విశ్వజీవియందు కాని, సర్వాంతర్యామి యందుగాని, ఎట్టి మార్పును కలుగవు. ఆకాశము, విశ్వము, విశ్వ అహముతో కూడియున్న విశ్వజీవి సాగరమును, స్వవిజ్ఞానాదులతో కూడియున్న సర్వాంతర్యామి సాగరమందు స్థితమై యున్నది.

జీవులు, వస్తువులు, స్థితమై యుండెడియు, పరిభ్రమించు చుండెడియు, ప్రదేశములోగల, సర్వాంతర్యామియు, విశ్వజీవియు, ఆ జీవులు,

వస్తువులయొక్క సంచారముతో నిమిత్తము లేకుండనే అదే ప్రదేశములో అదేరీతిగ నుండును. జీవుల పరిభ్రమణము ముందుగాని, వెనుకగాని, ఆ ప్రదేశములోని విశ్వజీవి యందుగాని, సర్వాంతర్యామి యందుగాని ఎట్టి మార్పులును నుండవు. జీవాదులు పరిభ్రమించెడు మొత్తము ప్రదేశమంతటిలోనను, పరిభ్రమణకు పూర్వపు ప్రదేశములోనను, అనంతరపు ప్రదేశములలోను కూడ, ఏవిధమైన పరివర్తనయు లేని సమాన స్థితియందు, విశ్వజీవి, సర్వాంతర్యామియు నున్నవి. భూతములు, భౌతిక పదార్థములు, శక్తులు, శాక్తిక పదార్థములు, విజ్ఞానము, స్వవిజ్ఞానముకూడ, పరిభ్రమణకు పూర్వపు ప్రదేశమునందును, తరువాత ప్రదేశమునందును, రెండింటికి మధ్యనుకూడ కలవు. కాని ఏకస్థితి యందుగాని, సమానస్థితిలోగాని యుండవు. విశ్వమందలి భౌతిక పదార్థములు, శాక్తిక పదార్థముల యొక్కయు, విజ్ఞాన, స్వవిజ్ఞానములయొక్కయు, ఏకైకస్థితి, సమానత్వము, సమకూర్చబడవలెనని మానవులు మానవ కర్తవ్యమును నిర్వర్తింపవలెను. ఆ ప్రయత్నమునందు సంసిద్ధిని పొందవలెను.

మానవేతర శరీరములలోని వ్యక్తులు అభ్యుదయమును పొందుటకు అనగా, ఉన్నతశక్తిని పొంది, మానవులగుటకు, అనువైన సహజ వివేకమును పొంది, మానవులుగా నవతరించుటకు, ఎన్నియో రూపములలో భూమిపై నవతరించుచు, ఆ యా శరీరముల మరణానంతరము మరల మరల అవతరించుచు, పరివర్తన పొందుచున్నవి. కాని మానవులకు తమ కర్తవ్య సంసిద్ధిని, ఒకేయొక శరీరకాలము, తదనంతరపు శరీర స్థితిలోనను. పొందుట కనువగు నేర్పాటులు కలవు. అభ్యుదయ మార్గములో పురోగమించి, మానవ కర్తవ్య సంసిద్ధిని పొందని, వ్యక్తులుకూడ మరల మరల మానవ శరీరములతో భూమిపై నవతరించవలసిన అవసరమున్నది. కర్తవ్య సంసిద్ధి పొందు

వరకు నీ విధానము తప్పదు. ఈ పునరవతరణలు ఎన్నియేని కావచ్చును. ఆ సంఖ్యకు పరిమితి లేదు. వానికి అవధి మానవ కర్తవ్య సంసిద్ధియే! కాని మానవులకు కలిగెడి పునరవతరణ లన్నియు మాత్రము మానవ శరీరములోనే యగును. ఒకమారు మానవశరీరములతో నవతరించిన తరువాత, మరల మానవేతర శరీరధారణ యుండదు. మానవేతర శరీరములలో మానవేంద్రియయలు పనిచేయుటకు వీలు లేకపోవుటయే యిందులకు కారణము. శరీరములయొక్క మరణముతో స్థూల సృజనేంద్రియములు మాత్రమే నశించును. సహజ వివేకేంద్రియము మానవ వ్యక్తులకు చెందినదేగాని, శరీరములకు చెందినదికాదు. సహజ వివేకేంద్రియమును పొందుటతో మానవేతరజీవుల అభ్యుదయము పూర్తియైనది. సహజ వివేక సంసిద్ధియే మానవేతర జీవుల అభ్యుదయ పరమావధి. మానవ కర్తవ్య సంసిద్ధిని పొందువరకును, ఎన్ని శరీరములను దాల్చవలసి వచ్చినను సరియే, ఆ వ్యక్తులు, మరల మరల మానవ శరీరములతోడనే యవతరించుచుండ వలసినదే!

ఒకేయొక మానవ జీవితకాలము, తదనంతరపు టశరీరస్థితిలోను, మానవులు మానవ కర్తవ్య సంసిద్ధిని పొందలేకుండుటకు ముఖ్యమైన ప్రతిబంధక మేమనగా మానవులు తమ ప్రస్తుత స్థితికిని, పూర్వస్థితికిని, అనగా మానవులకు, మానవేతరులకును గల తారతమ్యమును గ్రహింప లేకుండుటయే! ఈ విచక్షణాహీనతయే వారి అభ్యుదయమునకు ప్రధానమైన ప్రతిబంధకము. ఈ విచక్షణాహీనత వలన మానవేతర శరీరములతో నున్నప్పటివలెనే మానవ వ్యక్తులు, మానవ శరీరములతో నున్నప్పుడు కూడ, తమ శరీరములనే తమ్ముగా భావించుకొనుచున్నారు. ఈ రీతిగ మానవేతర జీవితములోని యలవాటు మానవ జీవితములోకూడ కొనసాగింపబడుచున్నది. మానవుల నిరంతరమైన పరిశ్రమ, శ్రద్ధ, స్థూల సృజనేంద్రియములకు తృప్తిని కలిగించి,

తద్వారా శరీరములకు సౌఖ్య, క్షేమ సంతోషములను సమకూర్చుటకే వినియోగింపబడుచున్నవి.

శరీరములలో వ్యక్తులు లేనియెడల ఆ శరీరములకు సౌఖ్యసంతోషముల ననుభవించి సంతృప్తి పొందెడు స్థితియే లేదు. ఆ శరీరములు కూడ వస్తువులే! అవివేకులగు వ్యక్తులు తమ శరీరములకు సౌఖ్యసంతోషములను కలుగజేయవలెనని యెంత ఆవేదన పడినను, ఎంత పరిశ్రమ చేసినను, సౌఖ్యసంతోషానుభూతి వ్యక్తులకే గాని, శరీరములకు మాత్రము చెందదు. తమ శరీరములకు సౌఖ్యసంతోషములను సమకూర్చుటకు శ్రద్ధ, శక్తులను వినియోగించెడి మానవులు, మానవేతర ప్రవర్తన, ఆశయములను, దృక్పథములను కొనసాగించుచున్నారు. ఇట్టి పరిశ్రమ అంతయు బాహ్యాభివృద్ధి కారకమేగాని అభ్యుదయ దాయకము కాదు. శరీరముల కొఱకై సమకూర్చ బడుచున్న సౌఖ్య సంతోషములు వ్యక్తులకే చెందుచున్నట్లుగనే, ఆ సౌఖ్యసంతోషములను పొందెడు ప్రయత్నములలో సమకూడిన ఆర్తి, దుఃఖములు కూడ వ్యక్తులకే చెందును.

మానవులచే ననుభవింపబడుచున్న సమస్తమగు ఆర్తిదుఃఖములలోను సాధారణముగా నెవ్వరును గమనింపనిదియు, ఎవరును గమనించినకూడ లెక్కచేయనిదియును, శరీరమును విడిచెడి సమయమున కలుగు దుఃఖము. మానవులందరకును తమ శరీరములయొక్క మరణ సమయములు ఏ కొంచెమైనను ముందుగా తెలియును. కొందరకు కొన్ని సంవత్సరములు ముందు తెలియును. కొందరకు కొన్ని నెలలు, మరికొందరకు కొన్ని వారములో, దినములో, కనీసము కొన్ని గంటలో ముందుగ తెలియును. ఆకస్మిక మరణములలో కూడ ఆయా వ్యక్తులకు నేకొలది క్షణములో ముందుగా తెలియును.

బాహ్యాభివృద్ధినే పొందుచు, అభ్యుదయముకొఱకై ప్రయత్నము చేయని వ్యక్తులకు, తమ శరీరమునకు మరణము దగ్గరకు వచ్చినదని గ్రహించిన క్షణము మొదలు మరణమునకు ముందు పూర్తిగ స్మృతి తప్పెడి కాలమందలి స్థితి మిక్కిలి దుర్భరముగ నుండును.

భావనలు, ఆలోచనలు, ప్రవర్తనలలో మానవేతర జీవుల వ్యవహార మెల్లప్పుడును సక్రమముగనే యుండును. అవి యెల్లప్పుడును, ఉన్నతశక్తిని, అనగా సామాన్య వివేకమును పొంది మానవులగుటకు పాటుపడుచుండును. గావున, అభ్యుదయ దాయకముగనే యుండును. యుక్తాయుక్తములను విచక్షణచేయుట కనువుగ ఆ జీవులును వాని శరీరములును నిర్మింపబడి యుండలేదు. ఏ శరీరములలో నుండగా సహజ శక్తి పొందబడినదో, ఆ శరీరములు మరణించిన తరువాత, సహజ వివేక వ్యవహారమునకు అనుకూలమైన నిర్మాణముగల మానవ శరీరములతో నవతరించును. సహజ వివేకములో ప్రమాణ మానవ ప్రజ్ఞయను సహజాతశక్తి కలదు. ఇదియే యుక్తాయుక్త పరిజ్ఞానము. ఇది మానవులేమి చేయవలయునో, ఏమి చేయకూడదో సూచించును. అట్టి సహజ వివేకముయొక్క సక్రమ వ్యవహారమునకు అనువయిన దేహములను కలిగిన మానవులు, వారికి వస్తువులు, విషయములు, జీవులతోగల సంబంధములలో మానవ దృక్పథము, అలవాట్లు, ప్రవర్తనలతో సంచరించుటకు తగినస్థితిలోనుందురు. మానవేతరములకు సంబంధించిన వారియొక్క పూర్వపు టలవాట్లుండవు. అభ్యుదయమును పొందుట కొరకు, మానవకర్తవ్య సంసిద్ధికొరకు పురోగమించెదరు. ఇదియే విశ్వావశ్యకతచే మానవానీకమునుండి కోరబడుచున్నది.

వ్యక్తులలో ముద్రితమ్మైన భావములు, ఆలోచనలు, చేష్టల యొక్క సముదాయమే వ్యక్తులలోని యహము. ఇదియే వ్యక్తి

యహము. ప్రతి వ్యక్తిలోను, అదివరకే, అనగా, విశ్వజీవి అనేక తర గతులుగ వ్యక్తీకరణ మగుటలోనే ఏర్పడియున్న వ్యక్తీకృత విశ్వ అహముతో, తన వ్యక్తిత్వమును పోగొట్టుకొనకుండ నీవ్యక్తి యహము ఏకత్వము నొందును. మనస్సు, అహముల కలయిక వలననే జీవి యేర్పడును. సర్వాంతర్యామి విశ్వమనస్సుగా సాక్షాత్కరించునపుడు ఆ విధానములో నేర్పడిన విశ్వఅహము విశ్వమనస్సుతో కలయికవలన విశ్వజీవి యేర్పడెను. విశ్వమనస్సు మరల వ్యక్తిమనస్సులుగ సాక్షాత్క రించునపుడు ఆ విధానములో ఏర్పడిన వ్యక్తీకృత విశ్వ అహము వ్యక్తి మనస్సులతో కలియుటవలన వ్యక్తిజీవు లేర్పడెను. 'జీవి' యనగా వ్యక్తీకృతమైన విశ్వ అహము మనస్సు కలిసిన మిశ్రమ రూప మగునదే భావము. ఆ కలయిక యున్నంతవరకే వ్యక్తిజీవు లుండును. మానవేతర జీవుల అహములలోగల ముద్రిత భావ సముదాయములు మానవేతర స్వభావములతోడనే యుండును. విశ్వ అహముతో ఐక్య మగు ఆ యా జీవుల వ్యక్తి అహములు తమ వ్యక్తిత్వమును నిలుపు కొనియే యుండును. కావున, తమ పూర్వపు మానవేతర స్వభావ ములు, లక్షణములులోనే యుండును. ఆ మానవేతర జీవులు సామాన్య శక్తిని, వివేకమును పొంది మానవులుగ అవతరించినప్పటి కిని వారి వ్యక్తి అహములలో మాత్రము పూర్వముద్రిత స్వభావములే ప్రకోపించి యుండును.

ఇచ్చటనే, మానవులను మానవుల కుచితమగు రీతిగా వ్యవహ రింప చేయుటకే సహజవివేకముయొక్క అవసరము కలుగును. ప్రమాణ మానవప్రజ్ఞను (Standard human awareness) సహజముగ కలిగి యుండుటవలన సహజ వివేకపు స్ఫురణతోనుండి మానవులేమి చేయ వలయునో, ఏమిచేయకూడదో స్ఫురింప జేయుచుండును. జీవులలోగల వ్యక్తి అహములు తమ వ్యక్తిత్వమును నిలుపుకొని ఆ యా జీవుల

శరీరములోగల స్థూల సృజనేంద్రియములను వ్యవహరింపజేయును. ఆ యా అహములు మానవేతర స్వభావములతో ముద్రితములై యుండుటవలన వారిప్రవర్తన మానవేతర స్వభావముల ననుసరించియే యుండును. కాని ఆ జీవులు, సహజ వివేక ప్రబోధములను గమనించి అనుసరించినచో మానవేతరమగు అభ్యాసములు పోవును. కాని వ్యక్తి అహములయొక్క పూర్వముద్రితములైన అనుభవముల ప్రాబల్యమువలన, సహజ వివేకపు స్ఫురణలను గుర్తింపలేక తమ కిష్టము లేకున్నను మానవేతర స్వభావములతోడనే యుండును.

చాలినంత సూక్ష్మశక్తిని పొందిన తరువాత, సూక్ష్మేంద్రియములు సక్రమముగ వ్యవహరించునపుడు మానవులు సహజ వివేక స్ఫురణలను గ్రహించి అనుసరింప గల్గుదురు. సూక్ష్మేంద్రియములు వ్యక్తి అహములను వ్యక్తులకు వశవర్తులుగ చేయగల్గును, చేయును. వ్యక్తులకు వారి యహములు వశవర్తులయినచో, వారిలో గల మానవేతర స్వభావములు మానవులకు ఉచితమగు రీతిగ పరిణమించును. మానవ స్వభావము పొందుటవలన వారి యహములు ఊర్ధ్వగమనము సాగించును. ఊర్ధ్వగమనముగల వ్యక్తి యహము ఎల్లప్పుడును వ్యక్తుల యాదేశానుసారము వ్యవహరింప నుత్సాహపడును. వ్యక్తి అహములు వశవర్తులగుటవలన ప్రమాణ మానవప్రజ్ఞను అనుసరించి సహజ వివేకముయొక్క అవధులకులోనై వస్తువిషయాదులతో మానవులు వ్యవహరింప గల్గుదురు. సహజ వివేకముయొక్క అవధులకు అతీతమైన వస్తువిషయాదులనుగూర్చి తెలిసికొనుటకు అవలోకించి, అనుభవించి, విశదపరచుకొనుటకు సూక్ష్మేంద్రియము లున్నవి. అట్టి మానవులు అభ్యుదయ పథగాములు. వారి అహములు, ఊర్ధ్వముఖములు. వారు తమ సహజ వివేకముతో సమరసత్వము కలిగి యుందురు. ప్రపంచమునందలి వస్తువిషయాదులయందుగల సూక్ష్మ

పరిస్థితిని అవలోకించి, అనుభవించి, వివరపరచుకొనదగు సూక్ష్మేంద్రియములు కలిగియుండును.

సహజ వివేకముతో సామరస్యమును, సక్రమముగ వ్యవహరించు సూక్ష్మేంద్రియములును, వశవర్తులైన అహములునుకలిగిన మానవులు, సూక్ష్మేంద్రియములద్వారా తమ అహముల నాదేశింపగలరు. ఆ యహములు స్థూల సృజనశక్తులను అభ్యుదయ మార్గమున నడిపించును. అంతవరకును మానవేతర స్వభావములతో కూడుకొని యుండుటవలన అభ్యుదయ మార్గమునకు అడ్డంకులుగ నిలిచియుండిన వ్యక్తి అహములు, అప్పుడు స్థూలసృజనశక్తులను, అభ్యుదయ సిద్ధి కొరకు, మానవ కర్తవ్యమును సాధించుట కొరకు వినియోగించుటలో బంటులవలె వ్యవహరించును. ఈ విధానములో వ్యక్తి అహములుగ ఏర్పడిన పూర్వముద్రితభావములు, చేష్టలు, ఆలోచనలు, ఒకదాని వెనుక నొకటి హరించగా, కొంతకాలమైన పిమ్మట వ్యక్తి అహముల యొక్క వ్యక్తిత్వముకూడ నశించిపోవును.

ఒక కుండలో నీరుపోయవలెనన్న ముందుగ కుండ కావలయును. ఆ కుండను తయారు చేయుటకు ముందుగనే నీరు కావలయును. మట్టి, నీటియొక్క కలయిక వలననే కుండ రూపొందినది. మట్టి కుండగా నేర్పడుటకు, అదేరూపముతో స్థిరముగ నుండుటకును కుండతో (అనగా కుండను తయారు చేసెడి విధానములో మట్టిని ముద్దగా, తగువిధానముగా తయారు చేయుటకు కలిపిన నీరు) నీరుండవలెను. మట్టి కుండగా తయారగుటలోగాని, ఆ కుండ కుండగా నుండుటలోగాని, ఆ కుండతో నీరు లేకున్నచో కుండ విడిపోవును. అనగా కుండ ఆ రూపమున నుండదు. అందువలన కుండ, తన రూపమును నిలబెట్టుకొనవలెనన్న కుండతో నీరుండవలెను.

ఇదే విధానమున విశ్వజీవి, వ్యక్తిజీవు లగుచున్నది. ఇదే విశ్వజీవిచేత విశ్వజీవియొక్క వ్యక్తీకరణ. ఇదేరీతిగ, అనగా, మట్టి నీరు కలసి కుండ అయినట్లు, కుండ తయారయిన తరువాత ఆ నీరు అందులో నిమిడియున్నట్లు, విశ్వమనస్సు, విశ్వఅహములు కలయిక, వాని వ్యక్తీకరణయు జరుగును. విశ్వజీవి వ్యక్తీకరణ మయ్యెడి విధానములో, ఇదేరీతిని కుండలో నీరు ఇమిడి యున్నట్లు, వ్యక్తిజీవులలో విశ్వఅహ ముండును. వ్యక్తిమనస్సులో విశ్వ అహము లేకున్నచో వ్యక్తిజీవియే లేదు. ఇదియే కుండలోని నీరు. ఇదియే వ్యక్తిమనస్సు వ్యక్తిజీవిగా వ్యవహరించువిధానము. ఈ రీతిగ వ్యక్తిమనస్సునకు వ్యక్తిత్వము సంక్రమించును. వ్యక్తిజీవియొక్క వ్యక్తిత్వస్థితికి అనగా వ్యక్తిగా నిలచి యుండుటకుకూడ నిదియే విధానము. ఈ వ్యక్తిజీవులే మానవ, మానవేతరాది సమస్త శరీరములను దాల్చుచున్నవి. ఈ రీతిగ సమస్త జీవరాసులు నిర్మాణమగుచున్నవి. వ్యక్తిజీవులు మొట్టమొదట శరీరములను దాల్చి యుండెడి స్థితిలో అనగా మొదటిసారిగా జన్మమెత్తినపుడు సౌఖ్యమును పొందవలెననెడి యున్ముఖత బయలుదేరును. ఆ యున్ముఖతతోనే, యేకకాలమందు ఆ జీవులలో వ్యక్తి అహములు ప్రారంభమగును. జీవులు అభ్యుదయమును పొందుటలో, తమ కర్తవ్యమును సాధించెడి విధానములోని, ఒకానొకస్థితిలో వారి వ్యక్తి యహములు తమ వ్యక్తిత్వమును గోల్పోయి ఆ జీవులయందలి విశ్వ అహముతో లీనమగును.

ఈ రీతిగ వ్యక్తులలోని వ్యక్తి అహములు, విశ్వ అహములతో లీనమగుటవలన ఆ వ్యక్తి జీవుల వ్యక్తిత్వమునకు భంగములేదు. అట్టి వ్యక్తులు తమ కర్తవ్య సంసిద్ధికొరకు, సశరీరులయిన వ్యక్తులు పొందగోరెడు కర్తవ్యసిద్ధికొరకు, అశరీరస్థితియందే విశ్వమందు వ్యవహరించుచుందురు.

ఇట్టి అశరీరస్థితియందు. విశ్వజీవితో లీనమగువరకు, అభ్యుదయము ను సాధించుచు జీవులు ముందునకు పయనించుచుందురు. అట్టి వ్యక్తులు, విశ్వజీవితో లీనమయ్యేడి లోగా, విశ్వావశ్యకత ననుసరించి, శరీరధారణ చేయుచుందురు. విశ్వమందు వారు సశరీరులై వ్యవహరింప వలసిన యావశ్యకత. అనగా విశ్వావశ్యకత కలిగినచో, వారు శరీరములను దాల్చెదరు.

మట్టి. నీటియొక్క కలయిక వలన కుండ యేర్పడినట్లే. వ్యక్తి మనస్సులు విశ్వ అహముల యొక్క కలయికవలన జీవులేర్పడును. వ్యక్తి మనస్సులతో విశ్వ అహము లేకున్నచో ఆ మనస్సులకు వ్యక్తిత్వము లేదు. అనగా జీవులు కారు. ఇమిడియున్న నీరు హరించిపోవుట వలన రూపొందిన కుండ విడిపోవునట్లు, విశ్వ అహము విడిపోయినచో, ఆ జీవులలోని వ్యక్తిత్వము పోవును. వ్యక్తిజీవుల సాక్షాత్కారము, సశరీరస్థితియందు వాని యునికి, కుండలో పోయబడిన నీరువంటిది. కుండయందు పోయబడిననీరు హరించిపోయినప్పటికినీ, కుండ మిగులునట్లుగనే, శరీరములు నశించిన తరువాత కూడ, అశరీర స్థితియందు, విశ్వమందు వ్యక్తిజీవులుందురు. కాని సశరీరులు కాకపోవుట వలన, అనగా కుండలో పోయబడిన నీరు లేకపోవుట వలన, ప్రపంచమందు వ్యవహరింపజాలరు. విశ్వజీవిలో లీనమగువరకును, వారివిశ్వమందు వ్యక్తిజీవులుగ వ్యవహరించుచునే యుందురు. కుండయందు పోయబడిన నీరు హరించి, కుండలోని నీరు హరించెడువరకు గల యీ మధ్య కాలములో. అనగా శరీరములు నశించిన తరువాతనుండి విశ్వజీవిలో లీనమయ్యేడి వరకునుగల యీ మధ్యకాలములో. మరల శరీరములు ధరింపవలసిన యవసరమునుండి తప్పించుకొనలేక పోయినచో అట్టి శక్తిని పొందువరకును, మరల మరల శరీరములను ధరించుచుండ వలసినదే.

ఈ అనివార్య మయిన ఆవశ్యకతనుండి తప్పించుకొనుట, సశరీర స్థితి యందలి ప్రవర్తనపై ఆధారపడి యుండును.

కుండలో నిమిడియున్న నీరు విశ్వ అహము. కుండగా నేర్పడిన మట్టియే వ్యక్తి మనస్సు. కుండలో పోయబడిన నీరు వ్యక్తిజీవుల సశరీర స్థితి. కుండలో పోయబడిన నీరుండుట, లేకపోవుట అనగా జీవుల సశరీర, అశరీరావస్థలు అసంఖ్యాకములు. కాని, వ్యక్తిజీవులు విశ్వజీవితో లీన మగుట అనగా కుండలో నిమిడియున్న నీరు హరించి కుండ విడిపోవుట మాత్రము ఒక్కసారియే.

వ్యక్తి అహములు విశ్వఅహముతో లీనమయిన తరువాత, జీవులకు దానితో ప్రమేయముండదు. వ్యక్తీకృత జీవులయొక్క భావములు, ఆలోచనలు, చేష్టలయొక్క ముద్రిత రూపముయొక్క ప్రభావమునుండి వ్యక్తులు విముక్తులగుదురు. విశ్వసిద్ధాంతానుసారము, వారిలో నిప్పుడు విశ్వజీవి వ్యక్తీకృతమగుటలో, విశ్వజీవిచే వ్యక్తీకరణ విధానములో, వారిలో కలసిన విశ్వఅహము మాత్రమే యుండును.

ఇట్టి స్థితియందు మానవులకు విశ్వత్వానుభూతి కలుగును. వ్యక్తీకృత జీవులైన తాము, తమకు మూలము నాధారమునైన విశ్వజీవితో నేకత్వానుభవమును పొందుదురు. వ్యక్తులయందుగల విశ్వ అహము, తమకు మూలము, ఆధారమునగు విశ్వజీవిలో లీనమయి యున్న విశ్వఅహముతో లీనమగును. ఇట్టి స్థితియందలి మానవుల యాశయము, ప్రయత్నము తమకు మూలము, ఆధారమునైన విశ్వజీవితో నేకత్వానుభూతి పొందుటయే!

వ్యక్తీకృత స్థితియందు సహజముగాగల దుర్భర పరిస్థితులను కాలక్రమమున అధిగమించుటకు తగిన అనుకూలములతో మానవులు, వారి శరీరములు నిర్మింపబడియున్నవి. వారు సర్వాంతర్యామికి తప్ప

యితరులకు అధీనులుకారు. సర్వాంతర్యామికి యే యితరముల పైనను అధీనతలేదు. వ్యక్తి అహములలోని వ్యక్తిత్వము పోవునంతవరకును, కనీసము వానిని బాహ్య ప్రవృత్తినుండి, అభ్యుదయ ప్రవృత్తిలోనికి మార్చునంతవరకును, మానవులు మానవేతర స్వభావములకు లోనై యుండక తప్పదు.

అందువలన,

మానవులు తమ వ్యక్తి అహములను అభ్యుదయపరము చేయుదురుగాక !

మానవులు తమ వ్యక్తి అహములను లేకుండ చేయుదురుగాక !

మానవులు విశ్వాత్మానుభూతిని పొందెదరుగాక !

మానవులు విశ్వాత్మానుభూతియందు స్థిరు లయ్యెదరుగాక !



# ఆరవ అధ్యాయము

# పోషణపదార్థముల యావశ్యకత

పోషణ పదార్థములు శరీరము యొక్క ఆరోగ్యము కొరకే కాకుండ, మానవ వ్యక్తుల యొక్క శిరోహృత్కండరముల యభివృద్ధి కొరకు కూడ కావలెను. ఈ శిరస్సు, హృదయము, కండరముల యొక్క అనగా జ్ఞాన, ప్రేమ, సామర్థ్యముల యొక్క యభివృద్ధి గుణరూపకము, పరిణామ రూపకము అను రెండు విధములు. సమస్త వస్తువులును వాని నిర్మాణ క్రమముల ననుసరించి, వేరు వేరు తరహాలలో జ్ఞాన, ప్రేమ, సామర్థ్యములయొక్క శక్తులను కలిగి యుండును. విశ్వమందలి సమస్త వస్తువులును, జ్ఞాన, ప్రేమ సామర్థ్యములను మూడు శక్తులను కలిగి యుండుటవలన (విశ్వ అహముతో కూడిన విశ్వమనస్సు) విశ్వజీవి యందంతర్భాగములయి యున్నవి. విశ్వమందు గల సమస్త వస్తువులలోనను, యీ త్రివిధ శక్తులును ఉన్నందువలన ఆ సమస్త వస్తువులును విశ్వజీవిలోననే యున్నవి. అనగా విశ్వ మనస్సుతో కలిసిన విశ్వ అహములో నున్నవి. విశ్వజీవి అవిభక్తము, అనశ్వరము, అయియుండి యీ త్రివిధ శక్తులును తనలో కలిగియుండి యున్నందున విశ్వమందుగల సమస్త వస్తువులును తనలో కలిగి యున్నది. ఈ యేకైక, అవిభక్త, అనశ్వర విశ్వజీవి అంతులేని కాలమును, ఆకాశమును ఆవరించియున్నది. అంతులేని కాలాకాశములు శాశ్వతము, సర్వ వ్యాప్తమునైన సర్వాంతర్యామిలో నున్నవి.

ఈ త్రివిధ శక్తులలోనను, విశ్వజీవి, కాలము, ఆకాశము, సర్వాంతర్యామి యొక్క శక్తులగూర్చిన జ్ఞానము, ఆ జ్ఞానమును గూర్చిన స్వజ్ఞానమును కూడ యున్నవి. పోషణ పదార్థములుకూడ విశ్వమందలి వస్తువులలోనివే యగుటవలన, సర్వాంతర్యామి, కాలము, ఆకాశము, విశ్వజీవి, స్వవిజ్ఞానము, విజ్ఞానము త్రివిధశక్తులు గూడ పోషణ పదార్థములయందున్నవి. పోషణ పదార్థములు వీని నన్నిటిని కలిగియుండుట వలన, మానవ శరీరములను పోషించినపుడు, ఇవి యన్నియును అదివరకే మానవ శరీరములందున్న స్వవిజ్ఞానము, విజ్ఞానము మొదలగు శక్తులన్నిటితో కలియును. శరీరములలో నున్న స్వవిజ్ఞానము మున్నగు శక్తులు పోషణ పదార్థములలో నున్న స్వవిజ్ఞానాది శక్తులను గ్రహించుకొనును. మానవులలోని శక్తి పదార్థములు, పోషణ పదార్థములలోని శక్తి పదార్థములను గ్రహించి శరీర పోషణకు కావలసిన శక్తి నందిచ్చును.

ఈ రీతిగ వ్యక్తులచే శరీరముల కందజేయబడిన పోషణ పదార్థములలోని శక్తులు, యథాకాలములో శరీరములవలన స్థూల, సృజన, సామాన్య శక్తులుగా మార్చబడి అదివరకే శరీరములందుగల ఆ యా శక్తులతో కలియును. స్థూల, సృజన, సామాన్య శక్తులు ఆ యా యింద్రియముల ద్వారా శరీరములందు ప్రసరించును. స్థూలశక్తియే రక్త మనబడును.

ఈ స్థూలశక్తి పరిమాణ రూపకముగను, గుణరూపకముగను కొంతవరకు అభివృద్ధి పొందిన యెడల, దానిని భరించుటకు అది ప్రసరించెడి యింద్రియములు సమర్థము లగును. అప్పుడా స్థూలశక్తిలోని కొంతభాగము సృజనశక్తిగా పరిణామము పొంది, అదివరకే శరీరముల యొక్క సృజనేంద్రియములలోనున్న సృజనశక్తితో కలియును. కాని

ఆ యింద్రియములను సక్రమముగ వ్యవహరింప జేయుటకు చాలదు. ఇదేరీతిని చాలినంత సృజనశక్తిని కూడబెట్టినచో సృజనేంద్రియములు చురుకుగ పనిచేయును. సృజనశక్తి పరిమాణరూపముగ పెంపొంది నపుడు ఆ యా యింద్రియములలో చురుకుగ ప్రసరించును. ఇట్లు ఈ శక్తి సక్రమముగా వ్యవహరించిన కొలది ఆ యింద్రియములు దానిని భరింపజాలవు. ఈ శక్తిని, ఉత్పత్తి ప్రారంభములోననే, సృజనవిధా నమునందు వినియోగించకుండ ఆ వ్యక్తికొరకై ఆ యింద్రియముల లోననే కొంతకాలము నిలువ చేసిన యెడల అందులోని కొంతభాగము సూక్ష్మశక్తిగా పరిణామము నొంది అవెవరకే సూక్ష్మేంద్రియములలో గల సూక్ష్మశక్తితో కలియును. కాని వానిని శక్తివంతముగ వ్యవహ రింప జేయుటకు తగినంత శక్తివంతము కానేరదు. ఈ రీతిగ సూక్ష్మేం ద్రియములకు కావలసిన సూక్ష్మశక్తిని కాలక్రమమున అందజేసినచో సూక్ష్మేంద్రియములు సక్రమముగా వ్యవహరించును.

సూక్ష్మేంద్రియములు సక్రమముగా వ్యవహరించుటకు చాలి నంత సూక్ష్మశక్తి నిర్మాణమైనచో అందులో కొంతభాగము అతి సూక్ష్మశక్తిగా మార్పునొంది ఆ యింద్రియములను వ్యవహరింప జేయును. ఇదేరీతిగ అతిసూక్ష్మ శక్తిలోని కొంత భాగము అత్యధిక సూక్ష్మ శక్తిగను మరల అందులోని కొంతభాగము మహాసూక్ష్మశక్తి గను, మరల అందులోని కొంతభాగము ఆధ్యాత్మిక శక్తిగను పరిణా మమునొంది ఆ యా యింద్రియముల ద్వారా ప్రసరించి, వానిని సక్ర మముగా వ్యవహరింపజేయును. ఈ రీతిగ మానవులలో శక్తి పరిణామ విధానము సాగుచునే యుండును. ఈ శక్తి పరిణామ విధానమునకు మూలమైనది స్థూలశక్తి, అనగా, రక్తము. మానవ అభివృద్ధికి అభ్యు దయమునకు సూక్ష్మశక్తి ఆధారము. ఇది స్థూలశక్తి యొక్క ద్వితీయ సంపుటీకరణము. రెండవకూర్పు. ఈ పరిణామ విధానమంతయు స్థూల

శక్తియగు రక్తముపై ఆధారపడి యుండుటవలన అభ్యుదయము, మానవ కర్తవ్య సంసిద్ధి పోషణ పదార్థములు లేకున్న అసాధ్యము.

శరీరములకు పోషణ పదార్థము అందించుట అనుదినము జరుగు చుండుటవలన స్థూలశక్తి నిర్మాణము...నిరంతరము...సాగుచున్నది. స్థూలశక్తియొక్క వృద్ధి, సృజనశక్తిగా పరిణామము, దాని పరిమాణ రూపకాభివృద్ధి, సాధారణముగా జరుగుచునే యున్నది. కాని సృజన శక్తియొక్క పరిమాణరూపక అభివృద్ధి సూక్ష్మశక్తిగా పరిణామము సాధారణముగా జరుగుటలేదు. చాల సకృత్తుగా, అరుదుగా జరుగు చున్నది. అందువలన, మానవుల సూక్ష్మేంద్రియములు సక్రమముగా వ్యవహరించుటలేదు. వస్తు విషయాదుల యెడల మానవ దృక్పథ ముతో మానవుల కుచితమైన రీతిని, పై కారణమువలన మానవులు వ్యవహరింపలేకున్నారు. వారు మానవులై యున్నప్పటికినీ ప్రవర్తన, స్వభావము అలవాట్లు మాత్రము మానవేతరములుగనే యున్నవి.

ఆధ్యాత్మిక సిద్ధాంతము ప్రకారము, ఆ యా వస్తువుల నిర్మాణ క్రమానుసారము అన్ని వస్తువులును వేరువేరు తరహాలలో ప్రేమ, జ్ఞాన, సామర్థ్య, విజ్ఞాన, స్వవిజ్ఞాన శక్తులను విలీన మొనర్చుకొను గుణము కలిగి యుండును. విశ్వమందలి మానవేతర జీవులలోని సమస్త జాతులు కూడ వేరువేరు తరహాలలో శక్తులను విలీన మొనర్చుకొని వానివాని శారీరక నిర్మాణానుసారము పరిస్థితులను భావించి, అనుభ వించి, విశదపరచగల శక్తులను కలిగియుండును. కాని మానవులు విజ్ఞాన స్వవిజ్ఞాన శక్తులను సంపూర్ణముగా ఆకళింపు చేసికొనెడి శక్తినికూడ కలిగియున్నారు. వస్తు విషయాదులనుగూర్చి, సంపూర్ణముగ భావించి అవలోకించి, అనుభవించి వెల్లడిచేయుటకు తగు పూర్ణానుకూలమైన

స్థితిని కలిగియున్నారు. ఇందుకొరకు కావలసిన సమస్త యింద్రియము లును వారికిని వారి శరీరములకును గలవు. విషయములను గూర్చిన ఆలోచనలు, అవలోకన, అనుభవములను విశదపరచి, విస్తృతముచేసి మానవ స్వభావములకు అలవాట్లకు అనుగుణముగా వెల్లడిచేయుటకు శక్తినిగల యింద్రియములను కలిగియున్నారు. మానవులు సమస్త మానవేతర జీవులయొక్క అభ్యుదయ ఫలసిద్ధి రూపములుగనుక మానవుల అభ్యుదయము సర్వజీవులకు అభ్యుదయ దాయకమగును.

అయినప్పటికినీ సాధారణముగా మానవులు తమకు కలిగి యున్నట్టి ఇంద్రియముల నుపయోగించుటలేదు. వారి ఇంద్రియములకు గల గ్రహణశక్తిని గూర్చిగాని, వారికిగల సాధన సంపత్తిని గురించి గాని వారికి తెలియదు. తామే మానవేతరజీవుల కర్తవ్యసంసిద్ధి ఫలి తములనియు, తాము మానవులనెడి జ్ఞానము నాధారము చేసికొని వ్యవహరింపవలెనని తెలిసికొనిన వారికి మాత్రమే తమకుగల సాధన సంపత్తి తెలియును. ఈ జ్ఞానమును సహజ వివేకము కలిగించును. కాని వారు ఆ ప్రబోధములను గణింపరు.

మానవేతర జీవులు తమ అభ్యుదయ శిఖరమైన మానవత్వ మును విశ్వసిద్ధాంతానుసారము పొందుచున్నప్పటికిని, మానవుల అభ్యు దయము మాత్రము ముందునకు కొనసాగుచుండుటలేదు. వారి అభ్యు దయము కుంటువడినది. జీవులు మానవత్వమును పొందెడి విధానము నిర్విరామముగ సాగుచున్నప్పటికిని మానవుల పురోగమనముమాత్రము నిరంతరము సాగుటలేదు. మానవులు విశ్వజీవితో నైక్యమయ్యెడి యీ విధానము కుంటువడుటకు ప్రబలకారణము, వారిలో సూక్ష్మశక్తి లోపించుటయే. సూక్ష్మశక్తి లోపమునకు ప్రబలకారణము తగిన

పోషణ లేకుండుటయే. ఈ రీతిగా మానవు లభ్యుదయ పురోగాములు కావలెనన్న, మానవ కర్తవ్య సంసిద్ధిని పొందవలెనన్న విశ్వజీవితో ఐక్యము కావలెనన్న వారి శరీరములకు తగు పోషణ పదార్థములు అత్యంతావశ్యకములు.

అందువలన,

సమస్త మానవ కోటికిని, తమ శరీరములకు కావలసిన పోషణ పదార్థములు లభించుగాక !

సమస్త మానవ కోటికిని తమ శరీరములందు చాలినంత రక్తము కలుగుగాక !

సమస్త మానవకోటియు తగినంత సూక్ష్మశక్తిని పొందెదరు గాక !



# ఏడవ అధ్యాయము

## అలవాట్లు; మంచి, చెడ్డలు



మానవులయొక్క అలవాట్లు, ప్రవర్తన, దృక్పథముల లోని మంచి చెడ్డలు కొంతవరకు సహజ వివేక ప్రబోధములను గమనించుటను, గమనించక పోవుటను బట్టి యుండును. చాలినంత సూక్ష్మశక్తి యుండుట, ఉండకపోవుటపై పూర్తిగ నాధారపడి యుండును. వ్యక్తులచే పోషణ పదార్థములనుండి యిమిడించుకొనిన శక్తి సారము (పదార్థము) వ్యక్తులలోగల శక్తి సారములలో లీనమై వానినుండి వినిర్గతమైన ప్రేమ, జ్ఞాన, శక్తి సామర్థ్యములు మానవశరీరములయందు ఆ యా దేహ నిర్మాణముల ననుసరించి మార్పుల నొందును. ఈ విధానములో పదార్థములలోని పోషణశక్తి శరీరములచే గ్రహింపబడును. ఈ గ్రహింపబడెడి పోషణశక్తులు యథాకాలములో దేహనిర్మాణ క్రమము ననుసరించి పరివర్తన పొందును. ఈ రీతిగ నిరంతరము పరివర్తన పొంది యీ పోషణ పదార్థములే రక్తముగా (స్థూలశక్తి) ఏర్పడును.

మానవశరీరములో కావలసినంత రక్తము నిర్మాణమై, ఆ యా యింద్రియములలో ప్రసారమైన తరువాత ఇందులోని కొంతభాగము సృజనశక్తిగా మార్పునొందుట ప్రారంభించును. స్థూలశక్తి అధికముగా నుండుట, సృజనశక్తి అధికముగా ఏర్పడుటకు సహాయపడును. కాని, ఇట్లు పరివర్తన పొంది యేర్పడిన సృజనశక్తియొక్క సంపూర్ణ

వికాసమునకు ముఖ్యముగా కావలసినదియు ప్రధానమైనదియు గుణ రూపక పరివర్తన.

మానవశరీరములలో పరిణామరూపకముగా, చాలినంత సృజన శక్తి యేర్పడి అందుకొరకు ఏర్పాటైన సృజనేంద్రియముల ద్వారా, ప్రసరించుట ప్రారంభించినచో అందులోని కొంతభాగము, సూక్ష్మ శక్తిగ పరిణామము నొందును. ఈ సూక్ష్మశక్తి కాలక్రమమున సూక్ష్మేంద్రియముల ద్వారా ప్రసరించును. ఇక్కడకూడ సృజనశక్తి అధికముగ నుండుట సూక్ష్మశక్తి ఉత్పన్నమగుటకు తోడ్పడును. కాని ప్రధానమైనది గుణరూపక పరివర్తనమే! అప్పుడే సూక్ష్మశక్తి సహజ వికాసముతో నుండును.

ఈ విశ్వమునందలి శక్తులన్నిటికిని మూడు గుణము లున్నవి. అవియే సత్వరజ స్తమో గుణములు. తమోగుణములో సహజముగా చైతన్యము, విజ్ఞానము చాల తక్కువగా నుండును. రజోగుణములో సహజ చైతన్యము అధికముగా నున్నప్పటికినీ సహజ జ్ఞానము మాత్రము తక్కువగా నుండును. సత్వగుణమునందు చైతన్యము, విజ్ఞానముకూడ ఎక్కువగా నుండును. ఇదియే చైతన్యముతో కూడిన ప్రశాంతస్థితి.

తమోగుణము అధికముగా కలిగిన వ్యక్తులు, వారి యజమానులు, అన్నవస్త్రాదులను సమకూర్చువారు, చెప్పినట్లెల్ల చేయు స్వభావము కలవారు. వారు తమ తమ పనులు చేయుచునే నిద్రపోవు చుందురు. తమ యజమానులు దగ్గర లేకపోయినను నిద్రించెదరు. వారు చేయు ప్రయత్నములయొక్క ఉద్దేశ్యములలోని మంచి, చెడ్డలను గూర్చిగాని, వారి ప్రయత్నములలోని పద్ధతులయొక్క మంచిచెడ్డలను గూర్చిగాని విచారించరు. వారి యజమానులు సంతోషించిన వారు

కూడ సంతోషించెదరు. వారి యజమానులు నవ్వినచో వారు సంతోష భరితు లగుదురు. యజమానులు కనుబొమ్మచేసినచో దుఃఖా క్రాంతు లగుదురు.

రజోగుణ ప్రధానులు తాము ఏ యే కార్యకలాపములందు పూనుకొనినను మాటలు చేష్టలలో చైతన్యవంతముగా నుందురు. వారు చేయుచున్న పనులయొక్క ఉచితానుచితములనుగూర్చి ఆలో చింప ప్రయత్నింపరు. వారి పనులను సాధించు నిమిత్తము తా మువ యోగించుచున్న పద్ధతులు జయప్రదమగునా? కాదా? యని మాత్రమే ఆలోచింతురు. తమ పనులయొక్కయు, అనుసరించెడు పద్ధ తులయొక్కయు, ఉచితానుచితములను సమన్వయ పరచలేరు. వారి ప్రయత్నములయందు అడ్డంకులు కలిగినపుడెల్ల కోపమునకు లోనగు దురు. ప్రయత్నములయందు విఫలత కలిగినచో వివేక విచారణలను గోల్పోవుదురు.

సత్వగుణము (శాంతము) ప్రధానముగా కలవారలకు, సువిచా రము ప్రముఖ లక్షణము. ఆశయములయొక్కయు, అనుసరించెడి విధానముల యొక్కయు ఉచితానుచితములగూర్చి బాగుగ ఆలోచించె దరు. వారి కార్యకలాపములయందు సరియైన పద్ధతులను, సక్రమముగ వినియోగించెదరు. అడ్డంకులు, ఆశాభంగములు కలిగినను ప్రశాంత పరిస్థితులలో పూర్తి చేయుదురు.

స్థూలశక్తి తమోగుణ ప్రధానమైనది. సృజనశక్తిలో రజస్తమో గుణములు ప్రకోపించును. సూక్ష్మశక్తులు సత్వగుణ ప్రధానమైనవి. సూక్ష్మేంద్రియములు సక్రమముగ వ్యవహరించుటకు చాలినంత సూక్ష్మశక్తి పొందబడువరకు మానవానీకము సాధారణముగా రజ స్తమోగుణములకే లోబడి యుండుదురు.

అతి సూక్ష్మశక్తియందు తమోగుణముండదు. కొంత రజోలేశమున్ననూ సత్వప్రాబల్యము కలిగియుండును. అత్యధిక సూక్ష్మ శక్తియందు రజోసత్వగుణముల సమరసముండును. మహా సూక్ష్మ శక్తియందు రజోగుణమే యుండదు. సంపూర్ణముగా సత్వమే యుండును. ఆధ్యాత్మిక శక్తియందు సత్వరజస్తమో గుణములు ఏవియు నుండవు. అది గుణాతీతము. గుణరహితము.

పోషణ పదార్థములను తయారుచేసెడి సమయములందు తయారు చేసెడి వారియొక్క భావములు, ఆలోచనలు, గుణములపై కొంతవరకును, ఆ యా పదార్థముల గుణములపై కొంతవరకును, వాని నుండి ఉత్పన్నమగు స్థూల సృజన శక్తుల గుణరూపక సామర్థ్యము ఆధారపడియుండును. మానవులయొక్క ఆలోచనలు, భావనలు సాధారణముగ వారి యింద్రియములందు ప్రసరించుచున్న శక్తుల ప్రముఖ లక్షణములపై ఆధారపడి యుండును. ఆహారపదార్థములను తయారు చేసెడి సమయములందు వ్యక్తులకుగల ఆలోచనలు, భావములయొక్క లక్షణములు ఆ యా పదార్థములలో ప్రవేశించును. ఆహార పదార్థముల యందిమిడియున్న యీ గుణములు, ఆ పదార్థములను భుజించిన మానవుల యింద్రియములందు అదివరకే ప్రసారితమగుచున్న అట్టి శక్తులయొక్క గుణములతో కలియును. ఈ రీతిగా కొంతకాలము తమోగుణము అధికముగా నున్న మానవులచే తయారు చేయబడిన ఆహారమును భుజించినవారిలో, తమోగుణ ప్రాబల్యము కలుగును. భుజించిన వారియొక్క యింద్రియములలో ప్రసరించుచున్న శక్తుల లోని తమోగుణము, భుజింపబడిన పదార్థములలోని తమోగుణము ఒక రూపమైన వగుటవలన ఒకదానితో నొకటి కలసి భుజించినవారి లోని తమోగుణ మెక్కువగును. ఇదేరీతిగా సత్వ, రజోగుణములు కూడ ఒక వ్యక్తినుండి మరియొక వ్యక్తికి ప్రసరించుచుండును.

ఒక వ్యక్తినుండి మరియొక వ్యక్తికి ఈ సత్వరజస్తమోగుణముల ప్రసారము మానవులలో మాత్రమేగాక, మానవులలోనుండి మానవేతరులకు కూడ వ్యాపించును. పెంపుడు జంతువులలో నిట్టి శక్తులధికముగా విదితమగును.

మానవులలో అయిదు, పదిహేను సంవత్సరముల మధ్య వయసు గల పిల్లలలో నీ స్వభావము ఎక్కువగా నుండును. అల్లరిలో ఎక్కువగా ఉత్సాహము చూపెడి వారలలో నూటికి ఎనుబదిమంది బజారులో అమ్మెడి పదార్థములనే తినెడివారు. వారు తరచుగా అమ్మకమునకు తయారు చేయబడిన పదార్థములపై నాధారపడి యుందురు. వారి తల్లిదండ్రులు, సంరక్షకులు వారికి పైఖర్చులకై సొమ్ము నిత్తురు. ఆ విధముగా సొమ్ము నిచ్చుటవలన బిడ్డలను వారతి ప్రేమగా పెంచుచున్నామని భావింతురు. పిల్లల సరదాల నిమిత్తము డబ్బు లిచ్చుట తమలోగల ఒక విశేషమని వారనుకొందురు. వారు, పిల్లల యల్లరిని చూచి పరమానంద భరితులగుదురు. తమ పిల్లలు చురుకైనవారు, చైతన్యవంతులు అని వారు భావింతురు.

ఆ పిల్లలు తమ స్నేహితులతో కలసి వీధులవెంట తిరుగుచు, స్నేహితులలో నే యొకరిదో జేబురుమాలో, టోపీయో తీసివేసి వారాందోళన పడుచుండగా సంతసించి, గంతులు వైచెదరు. అకస్మాత్తుగా, అకారణముగా ఏదియో ప్రమాదము సంభవించినట్లుగా, పెద్ద కేకలు పెట్టిచుట్టును చేరినవారిని గాబరాపెట్టి, వారికంగారునుచూచి వీరు సంతసింతురు. ఈ రీతిగ ఎన్నియో రకములుగ అల్లరులు చేయుచూ అది వారి చురుకుదనము, చైతన్యము అనుకొందురు. కాని చదువులమాట యటుంచి ఆటలలోకూడ వారు వెనుకబడి యుందురు. వారు అల్లరి చేయుటలో మాత్రము ప్రవీణులు. వారు ఏ విషయమునుగూర్చియు

తీవ్రముగా ఆలోచింపలేరు. మధ్యలో అనవసర ప్రస్తావనలకు దిగకుండ ఏ విషయమును గూర్చియైనను, పావుగంట సేపైనను, ఆలోచింపలేరు. వారి దురలవాట్లను గూర్చి యితరులు విమర్శించినను గ్రహింపలేరు. వారి బాగుకోరెడువారు హితవచనములు చెప్పినచో వారిని తప్పించుకొని తిరిగెదరు.

మరియొక రకపు బిడ్డలు కూడ కలరు. వారు అల్లరి పిల్లలతోడను, అల్లరి గుంపులతోడను కలియరు. వారిని తప్పించుకొనియు తిరుగరు. ఆ స్నేహితుల తోడను గుంపుల తోడను, కలిసియే యున్నట్లుండుదురుగాని కొంచెము ఎడముగా నుందురు. వారు అల్లరి చేయరు. వారు స్నేహితులు చేయు అల్లరి పనులయందు ఆపేక్ష కనపరచరు. విమర్శనలను శ్రద్ధగా గ్రహింతురు. హితము కోరెడి వారల సలహాలను గౌరవింతురు. వారు తీవ్రముగ ఆలోచింతురు. అనవసర ప్రసంగములకు దిగరు. చదువులలోనేగాక, ఆటలలో కూడ వారు ముందంజ వేయుదురు. వీరిలో చాలమంది సాధారణముగ బజారులో అమ్మజూపిన ఆహార పదార్థములను తినరు. వారియొద్ద సహజముగా పైఖర్చులకు సొమ్ముండదు. అట్టి సొమ్మున్నచో వారు తినుబండారములు గాక యితరములను కొనుటకు అపేక్షింతురు. వారి తల్లిదండ్రులు వారికి తినుబండారములు కొనుటకు సొమ్మునీయరు. వారిబిడ్డలకు ఏ యే పదార్థములు రుచించునో వారికి తెలియును. ఆ యా పదార్థములను వారి యిండ్లలోననే తయారుచేసి బిడ్డలకు పెట్టెదరు.

ఇండ్లలో చేసిన పదార్థములలో కూడ పైచెప్పిన లక్షణములు సహజముగ నుండును. ఇండ్లలో కూడ నౌకరులచే చేయబడిన పదార్థములు కొంచెమించుమించు అమ్మకమునకు చేయబడిన పదార్థముల వంటివే! కాని వీనిలో తల్లిదండ్రుల యొక్కయు, సంరక్షకుల

యొక్కయు, ప్రేమ అంతర్గతమై యుండును. పదార్థములు తల్లిదండ్రుల చేత చేయబడినను, సంరక్షకులచేత చేయబడినను, నౌకరులచేత చేయబడినను, తల్లిదండ్రులయొక్కయు సంరక్షకులయొక్కయు భావములు ఆలోచనలు, పదార్థములు చేయుటయందలి శ్రద్ధ, ఆ యా బిడ్డలయందు వారికిగల ప్రేమాభిమానములపై ప్రత్యక్షముగనో, పరోక్షముగనో ఆధారపడి యుండును. ఈ ప్రేమ, పదార్థములు తయారుచేయుట యందు చూపెడి శ్రద్ధ, వారియందుగల సత్వరజస్తమోగుణములతో పాటు పదార్థములయందు లీనమగును. ఇట్టి పదార్థములయందుగల ప్రేమ చాలవరకు వారిలోగల రజోగుణమును. తమోగుణమును అధిగమించును. ఇండ్లలోకూడ వారికొరకుగాని, వారి బిడ్డలకొరకుగాని వంటచేసికొనుటలోగల ప్రేమ భావములు ఆకస్మికముగా అనాహూతులుగా వచ్చిన స్నేహితుల కొరకు చేసెడి పదార్థములలో నుండదు. ఆ వచ్చిన అతిథులు పరాయివారైనచో ప్రేమ యింకను తక్కువగా నుండును. అట్టి సందర్భములో అమ్మకముకొరకు తయారుచేసెడి పదార్థములు ప్రేమతో చేయుట సంభవమని యూహింప నవసరములేదు. వారాపదార్థములను తమకొరకుగాని, తమ బిడ్డలకొరకుగాని చేయుచుండుటలేదు. వారి జీతముకొరకు వారు చేయుదురు. వారు పదార్థములను తయారు చేయునపుడు నెలలో తారీఖులనో, వారి జీతములనో లెక్క పెట్టుకొనుచుందురు. బాలుర శరీరములలోని స్థూల, సృజన శక్తులపై ఆహారముద్వారా కలుగు రజస్తమోగుణముల ప్రభావము ప్రబలముగ నుండును. మానవుల అలవాట్లయందలి మంచిచెడ్డల కివి యెంతగనైననూ కారణభూతము లగుచున్నవి. పదార్థములను తయారు చేసెడి వారుకాని, చేయించెడివారుకాని, ఎట్టివారైనను వారిలో సూక్ష్మశక్తి కలిగి పరిమాణరూపకముగను, గుణరూపకముగను, ప్రాబల్యమునొందు వరకును రజస్తమోగుణ ప్రాబల్యములో నుండక

మానరు. అందువలన, వారు తమ విధులను నిర్వర్తించునపుడు, అనగా ఆహార పదార్థములను తయారుచేయునపుడు ప్రేమపూరిత భావముల తోడను, అట్టి ఆలోచనలతోడను నుండవలెను.

ఇట్లు చేయుటవలన, బిడ్డలలో అనివరకే, పూర్వపు మానవేతర శరీరములకు సంబంధించినట్టియు, స్థూల, సృజనశక్తులలోగల రజస్తమోగుణములు ఇంకను అభివృద్ధిని పొందకుండ అరికట్టవచ్చును. బిడ్డలలోని రజస్తమోగుణములు హెచ్చకుండ నిరోధించుటవలన వారు తమ సహజ వివేకముయొక్క ప్రబోధములను గమనించుట సాధ్యమగును. ఈ గమనించెడి శక్తియే ఆ ప్రబోధములను అనుసరించెడి శక్తిని కలుగజేయును. ఈ వయస్సులయందే బిడ్డలలో స్థూలశక్తి, సృజన శక్తిగా మారుట ప్రారంభించును. స్థూల, సృజనేంద్రియములు సహజ వివేక ప్రబోధములను గమనించి అనుసరించెడి యీ వయసునందు స్థూలశక్తి సృజనశక్తిగా మారుట ప్రారంభమగుటవలన ఆ యువకులలో మంచి యలవాట్లు ఏర్పడుటకు అవకాశములు కలుగును.

మానవ, మానవేతర జీవులనెడి విచక్షణ సహజ వివేకము వలననే కలుగును. సహజ వివేకమే మానవుల కర్తవ్యములోని యుక్తాయుక్తములను సూచించును. ఈ ప్రకారము మంచి యలవాట్లను అలవరచుకొనినచో నవ్యమానవులలోని స్థూల సృజనేంద్రియములలో గల రజస్తమోగుణములు హెచ్చు కాకపోవుటవలన, ఆ వ్యక్తులు సహజ వివేక ప్రబోధముల ననుసరింతురు. మానవోచితముగ వ్యవహరింతురు. వారి యింద్రియములలో సృజనశక్తి పెంపొందుటతో మానవోచితమగు అలవాట్లు పెంపొందును. ఇట్లు కలిగిన సృజనశక్తిలో, గుణరూపక సంపూర్ణత్వ ముండుటవలన, పోషణ పదార్థములను నిత్యము

గ్రహించుచుండుటవలన, సాధారణముగా పరిమాణ రూపక సంపూర్ణత్వము కూడ కలుగుచుండును.

మానవ శరీరములలో సృజనశక్తి గుణరూపకముగను, పరిమాణ రూపకముగను పరిపూర్ణత నొందుటవలన, ఆ యింద్రియములు సక్రమముగ వ్యవహరించును. ఆ వ్యక్తులు మానవుల కుచితమగు రీతిని వర్తింతురు. అందువలన వారిలో సూక్ష్మశక్తి యేర్పడక మునుపే వారి అహములు వారికి వశవర్తులయి యుండును. వారి అహములలో, పూర్వవాసనలను బట్టి అంతవరకును మానవేతర స్వభావము లున్నప్పటికినీ, వ్యక్తులలో పొందిన సక్రమమయినట్టియు మానవోచితమునగు అలవాట్ల మూలమున వారికి అనువర్తులగును. ఈ అహములే స్థూల సృజనేంద్రియములను నిర్వహింప జేయును. అహములు వ్యక్తులచే నిర్వహింపబడును. ఆ వ్యక్తులు సహజ వివేకముచే ప్రబోధింప బడుదురు. అందువలన సూక్ష్మశక్తి కలిగి గుణరూపకముగను, పరిణామ రూపకముగను పెంపొందక మునుపే, ఆ వ్యక్తులు మానవుల కుచితమగు మంచి యలవాట్లను పొందెదరు.

ఈ యలవాట్లు, వస్తువులు, విషయములు జీవులను గూర్చిన నిశ్చయమయిన అభిప్రాయములవలన నేర్పడినవికావు. ప్రమాణ మానవప్రజ్ఞ (Standard human awareness or common sense) వలన యేర్పడినవి. అయినప్పటికిని, అట్టివారియొక్క అహములు వారి స్వభావములకు అనుగుణముగా నుండుటవలనను, సామాన్య వివేకము ననుసరించి వారు సక్రమ స్వభావము కలిగి యున్నందునను వారు వస్తు విషయాది జీవుల గురించియును, వాని వాని స్థితిని గురించియును సక్రమముగ అవగాహన చేసికొనుటకు అనుకూలమైన స్థితిలో నుందురు.

స్థూలశక్తి (రక్తము) యొక్క పరిమాణరూపక పరిపూర్ణతవలన సృజనశక్తి కలిగినప్పటికినీ, అందుమూలమున ఆ వ్యక్తులకు వస్తువులు, విషయములు, జీవులను గూర్చిన అవగాహనలకు అవకాశము కలిగినప్పటికీ, స్థూలశక్తియొక్క గుణరూపక పరిపూర్ణత్వముకూడ పొందువరకు, ఆ అవగాహనలు సరియైనవికావు. వారి పూర్వజన్మ సంబంధమైన మానవేతర ప్రాబల్యము కలిగియుండును. మానవ శరీరములను పొందుటకు పూర్వమున్నటువంటి మానవేతర స్వభావములు, ఆ యా అహములయందు ముద్రితములై యుండుటవలనను, స్థూల సృజనేంద్రియములు, అట్టి అహములవలన నడిపింపబడుచుండుట వలనను, సహజ వివేక ప్రబోధములను అనుసరించవలయు ననెడి కోరిక కలిగియుండియు కూడ వ్యక్తులు అందుక సమర్థులగుచున్నారు. అందువలన మానవులు వస్తువులు, విషయములు, జీవులను గూర్చి తప్పు భావములకు లోనై, తప్పు అలవాట్లకు గురి యగుచున్నారు.

మంచి అలవాట్లను, మంచి భావనలను, పెంపొందించుకొనిన మానవులు, సహజ వివేకముయొక్క ప్రబోధములను గమనింతురు. యుక్తాయుక్తములను విచక్షణచేయు జ్ఞానము కలిగియుందురు. అందువలన సాధారణముగ, సృజనశక్తియొక్క ప్రాధాన్యతను, పటుత్వమును గ్రహింతురు. అట్టి జ్ఞానము వలన వారి సృజనేంద్రియములలో రెండు విధముల (గుణరూపక, పరిమాణరూపక) సంపూర్ణత్వము సమకూడును. తమలో కలిగెడు సృజనశక్తిని తమ యభివృద్ధికొరకు తామే గ్రహించెడి శక్తి సృజనేంద్రియములకు కలుగువరకు సృజనశక్తి నిలువచేయుటయందు వారికి ఉత్సాహము కలుగును. అప్పుడు అందులోని కొంతభాగము సూక్ష్మశక్తిగా మారి, సూక్ష్మేంద్రియములలో ప్రసరించి అదివరకే ఆ యింద్రియములలోగల సూక్ష్మ

శక్తితో గలసి ఆ వ్యక్తులను అభ్యుదయ మార్గమున పురోగమింప జేయును.

మంచి అలవాట్లు, భావనలను పెంపొందించుకొని వ్యక్తులు, వారి అహములచేత నడిపింపబడు చుందురు. యుక్తాయుక్త విచక్షణ జ్ఞానము లేకుండ యుందురు. సాధారణముగ, సృజనశక్తియొక్క పటుత్వమును, ప్రాధాన్యమును గుర్తింపరు. ఇందువలన గుణరూపక పరిపూర్ణత్వము మాట యటుంచి, పరమాణురూపక సంపూర్ణత్వము కూడ లభించకుండగనే తమ సృజనేంద్రియముల యందలి సృజనశక్తిని, సృజన విధానమునందే వినియోగింతురు. తత్ఫలితముగా సృజనేంద్రియ ముల యందు సక్రమాభి వృద్ధినొందుటకు చాలినంత సృజనశక్తి లేక పోవుటవలన, ఆ శక్తి సూక్ష్మశక్తిగా పరిణామము నొందుటయును ఉండదు. సూక్ష్మేంద్రియముల వ్యవహారము నుండదు.

మరికొందరు మానవులు తాము పుట్టి పెరిగిన ప్రత్యేక వాతా వరణ పరిస్థితుల ననుసరించి సృజనేంద్రియములలో గుణరూపక సంపూ ర్ణత్వము లేకపోయినప్పటికిని, పరిమాణ రూపక సంపూర్ణత్వమును సాధింతురు. ఈ పరిమాణరూపక సంపూర్ణతకూడ, సూక్ష్మశక్తిగా పరిణతిపొంది సూక్ష్మేంద్రియ వ్యవహారమునకు సహాయపడును. కాని యిట్టి సూక్ష్మశక్తిలో గుణరూపక సంపూర్ణత్వము లేకపోవుట వలన ఆ వ్యక్తుల యొక్క స్వభావ ఉన్ముఖతలకును, వారి సృజనేంద్రియ ములకును సామరస్యముండదు. వారి వ్యక్తి అహములు సృజనేంద్రి యములకే ప్రబోధము కలిగించును. వారి అలవాట్లు పూర్వ వాసనల ననుసరించి యుండును. అందువలన వారివ్యక్తి అహముల యొక్కయు, సృజనేంద్రియముల యొక్కయు పద్ధతులను మార్చి ఆ వ్యక్తుల అభ్యా సములను చక్కదిద్దుటకు సూక్ష్మేంద్రియములకు శక్తి చాలకుండును

ఈ పరిస్థితిలో సూక్ష్మేంద్రియములు చైతన్యవంతములై, చురుకు కలిగినవై యున్నను వాని కార్యకలాపములు పూర్వ వాసనానుగతమై బాహ్యాభివృద్ధి దాయకములై యుండును.

ఈ విధముగా పూర్వవాసన ననుసరించియున్న అలవాట్లను కొనసాగించుచున్న మానవులు మానవేతరులకు మాత్రమే ఉచితము, మానవులకు అనుచితమునగు అలవాట్లకు లోనై తమతో సంబంధము గలిగిన ఇతర జీవవస్తు విషయానేకములందు వ్యామోహితు లగుచున్నారు. వారు శక్తివంతులుగ నుండుదురు. వారు బాహ్యాభివృద్ధిని కోరుచుండుటవలన వారిశక్తి సామర్థ్యములు ఇతర జీవ, వస్తు విషయాదుల అభ్యుదయమునకు భంగకరముగ నుండును. వారు తమ అహములకు వశవర్తులై యుందురు. వీని యన్నింటికినీ కారణము వారికి సక్రమము, మానవోచితమునగు అలవాట్లు లేకపోవుటయే.

మంచి అలవాట్ల నలవరచుకొని, పెంపొందించుకొనినవారు సక్రమముగ వ్యవహరించు సూక్ష్మేంద్రియములు గలవారై సూక్ష్మశక్తియొక్క, గుణ పరిమాణ రూపక సంపూర్ణత్వములను, పొంది యుండుటవలన వారి అహములు వారికి వశవర్తులై యుండుటవలనను, బాధ్యత గలిగి వ్యవహరింతురు. వారు అభ్యుదయమును కోరుచుండుట వలన వారి కార్యకలాపములతో సంబంధించిన యితర జీవ, వస్తు విషయానేకముల అభ్యుదయమునకు సహాయకారి యగుదురు. ఇట్లు వ్యవహరించుటవలన వారి అభ్యుదయ మార్గమునందలి ఒకానొక స్థితియందు, వారి వ్యక్తి అహములు విశ్వఅహములో లీనమయి, వారిలో గల అహము పోవును. ఇవి యన్నియును మంచి అలవాట్లవలన

సాధ్యమగును. కనుక సూక్ష్మశక్తిలో గుణరూపక, పరిమాణ రూపక సంపూర్ణత్వములు రెండును, సమానమైన ప్రాధాన్యము కలిగియున్నవి.

అందువలన,

మానవులు తమ ఆహార పదార్థములను ప్రేమపురస్సరముగా
పచనము చేయుదురుగాక !

మానవులు సూక్ష్మశక్తిలో గుణరూపక సంపూర్ణత్వమును
పొందుదురుగాక !



## ఎనిమిదవ అధ్యాయము

# ప్రేమ - ఉచితము - అనుచితము

అచరజీవులకు, మానవేతరజీవులకు, మానవులకు — మూడు విధము లగు జీవులకును, ప్రేమ సహజ లక్షణము. అచరజీవులకు వాని శరీర నిర్మాణము ననుసరించి సౌఖ్యముగ నుండుటయందు మాత్రమే ప్రేమ యుండును. మానవేతర జీవులకు వారి వారి నిర్మాణముల ననుసరించి సౌఖ్యక్షేమముల రెండిటియందును ప్రేమయుండును. మానవులకు వారి నిర్మాణానుసారము క్రమక్రమముగా అభ్యుదయమును పొందుచు తద్వారా సౌఖ్యక్షేమములను పొందుటయందు ప్రేమ యుండును. అచరములగు సస్యజీవులు సౌఖ్యమును మాత్రమే కోరును. కాని క్షేమ మును కోరలేవు. వాని నిర్మాణమునందు అట్టి ప్రేమకు తావులేదు. అందువలన అవి ఒక చోటునుండి మరియొక చోటికి కదలవు. మానవేతర జీవుల శరీర నిర్మాణము, సౌఖ్య, క్షేమముల రెండింటినీ కోరుటకు అనువై యున్నది. అందువలన, సౌఖ్యక్షేమములను పొందుట కొరకు అవి ఒక చోటునుండి మరియొక చోటునకు పోవును. కాని సౌఖ్య, క్షేమములు, ఎట్లు కలుగునో వానికి తెలియదు. మానవులు మాత్రము సౌఖ్యక్షేమములను రెండింటిని ప్రేమించెడి శరీర నిర్మాణ మును కలిగియుండుటయేకాక, అవి ఎట్లు కలుగునో అను జ్ఞానమును గూడ కలిగియుండిరి. సౌఖ్య, క్షేమముల నిమిత్తము వారు అభివృద్ధిని పొంద గోరెదరు.

ఈ రీతిగా, అచరములగు సస్యజీవులు సౌఖ్యముగా నుండుటను మాత్రమే ప్రేమించును. ప్రేమించ గలవు. కాని సౌఖ్యక్షేమముల రెండింటినీ ప్రేమించవు. ప్రేమించ లేవు. మానవేతర జీవులు సౌఖ్య, క్షేమములు రెండింటినీ ప్రేమించును. ప్రేమించగలవు. కాని అభ్యుదయమును పొంది తద్వారా సౌఖ్య, క్షేమములనే ప్రేమింతురు. సౌఖ్యములను మాత్రమే ప్రేమించెడి స్థితినుండి అభ్యుదయ ఫలమే, సౌఖ్య, క్షేమములు రెండిటిని ప్రేమించెడి స్థితి. అచరజీవులు మానవేతర జీవులగుటయే, సస్యజాతుల కర్తవ్య సంసిద్ధి. సౌఖ్య, క్షేమములను రెండింటిని కోరి, అభివృద్ధిని పొందుటయే, మానవేతర కర్తవ్య సంసిద్ధి. వారు మానవులుగ నవతరించుటతో ఆ స్థితి పూర్తి యగును. ఈ రీతిగ అచరజీవులు మానవు లయ్యెడి విధానము, ఆధ్యాత్మిక సిద్ధాంతము ప్రకారము యథాకాలములో ఆ జీవులయొక్క ప్రయత్నముగాని, ఎరుకగాని, లేకుండగనే సాగుచున్నది. కాని మానవులుగ అవతరించిన తరువాత మాత్రము. వ్యక్తులయొక్క ప్రయత్నము, ఎరుక లేకుండ అభ్యుదయమును పొందలేరు. అభ్యుదయమును సాధించవలసిన అవసరమును గుర్తించక అందుకొరకు ప్రయత్నము చేయకున్నచో, మానవులు అయియున్నప్పటికీ, అభ్యుదయమును పొందక పోవుటచే మానవేతర జీవులవలెనే వ్యవహరింతురు.

మానవేతర జీవులు అభ్యుదయమును పొంది మానవులుగ అవతరించుటకును, మానవులుగ అవతరించిన తరువాత కర్తవ్యసంసిద్ధిని పొందెడి విధానములలోగల తారతమ్యము తెలియక పోవుటవలన, వస్తువిషయాదులు, జీవులయెడ వారి ప్రేమాభిమానములు పూర్వపు రీతిగనే అనగా మానవేతర పద్ధతిలో వలెనే యుండును. ఇట్టి ప్రేమ మూలమున సౌఖ్య, క్షేమములను కలిగియుండుటకు వ్యవహరించెడి విధానములో నిట్టి మానవులు తమతో సంబంధము కలిగిన జీవవస్తు

విషయాదికములందు వ్యామోహమును కలిగియుందురు. ఈ వ్యామోహము అనుచితమగు ప్రేమ. మానవులుగ జీవించుచున్నను, మానవేతరుల కుచితమైన వ్యామోహముతో మెలగుచుందురు. ఈ అనుచిత ప్రేమఫలితమైన యీ వ్యామోహము మానవులను అపమార్గమున పెట్టును. ఈ మార్గమునందు మానవులు పొందు అభివృద్ధిని బాహ్యాభివృద్ధి యందురు. చెడు అలవాట్లు కొంతవరకు మానవులను బాహ్యాభివృద్ధివైపు మరలించును.

మానవుల యొక్కయు, మానవేతరుల యొక్కయు అభ్యుదయ విధానములలో గల భేదమును గ్రహించుటవలన జీవవస్తు విషయాదుల యందు మానవులు చూపు ప్రేమ ఉచితప్రేమ. ఆ భేదమునుగూర్చిన జ్ఞానము, వారి ప్రేమను మానవోచితముగ చేయును. మానవేతర ప్రేమ, వారు ప్రేమించెడి జీవులకు అభ్యుదయమును కలుగజేయును. మానవుల ప్రేమ ప్రేమింపబడెడు జీవులకుకూడ అభ్యుదయమును కలుగజేయును. అందువలన ఉచితమైనది. మానవోచితమైన ప్రేమచే ప్రబోధింపబడి, వ్యవహరించు మానవులు తమతో సంబంధముగల జీవవస్తు విషయాదికములతో బాధ్యత కలిగి వ్యవహరింతురు. బాధ్యత కలిగి, మానవుల కుచితమైన రీతిని, సవ్యముగ వస్తువిషయాదులయందు వ్యామోహము లేకుండ, వ్యవహరించు మానవు లట్టి ప్రవర్తన మూలముననే తమ అభ్యుదయమును సాధించుచున్నారు. మంచి అలవాట్లు కొంతవరకు అభ్యుదయమునకు సహాయపడును.

ఏ వస్తువునైనను ఆ వస్తువుయొక్క అభ్యున్నతికొరకు ప్రేమించుట ఉచితమైన ప్రేమ. ఉచితమైన ప్రేమ ఆ యా వస్తువిషయాదుల యందు బాధ్యతతోకూడి యుండును. తన మేలుకొరకు యితర వస్తువిషయాదులను ప్రేమించుట అనుచితమైన ప్రేమ. వ్యామోహముతో

కూడి యున్నది. బాధ్యత అభ్యుదయమును కలుగజేయును. వ్యామోహము బాహ్యాభివృద్ధిని కలుగజేయును.

భావములు, ఆలోచనలు, వ్యవహారములలో వస్తు విషయాదులతో ప్రత్యక్షముగనో, పరోక్షముగనో సంబంధము ఉచితమో, అనుచితమో యగు ప్రేమ మూలమున కలుగును. ప్రేమ సమస్త వ్యక్తులకును సహజ లక్షణము. మానవేతర జీవులలో అవధిగతమైన ప్రేమ మానవులలో నిరవధికమైనది. మానవులలో ప్రేమకు పెంపొందెడి స్వభావము నిత్యమైనది, దృఢతరమైనది. మానవులయొక్క, మానవేతరుల యొక్క అభ్యుదయ విధానములలో గల తారతమ్యమును గుర్తించలేక మానవు లింకను అవధిగతమైన ప్రేమచే బద్ధులగుచున్నారు. ఈ అవధిగతమైన ప్రేమను నిరవధికముగ మార్చుటలో కొంతవఱకు మంచి యలవాట్లు సహాయకారు లగును. సహజ వివేకమునకు (Common sense) అంతకంటె ముఖ్యమైన కర్తవ్యమున్నది. గుణరూపకముగను, పరిమాణ రూపకముగను సంపూర్ణత్వముగల సూక్ష్మశక్తిని చాలినంత సమకూర్చి సూక్ష్మేంద్రియములు సక్రమముగ పనిచేయుటకు సహజ వివేకము తోడ్పడును.

ఒక వ్యక్తి ఒక దీర్ఘ ప్రయాణము చేసిచేసి అలసిపోయి, కొలది రోజులు విశ్రమింప కోరెననుకొనుడు. ఆ వ్యక్తి ఒక గ్రామము చేరి, ఒక యింటి కడ కేగి ఆ యజమానికి తన పరిస్థితులను విన్నవించి, కొలది రోజుల వరకు వారి యాతిథ్యమును కోరెను. ఆ యింటి యజమానియును ఇంటిలోని యితరులును, ఆ యాగంతుకుని కోరికను మన్నించి ప్రేమ పురస్సరముగా, ఆతిథ్యమిచ్చుట కంగీకరించిరి. ఆ నూతన వ్యక్తికి ఒక గదిని, కావలసిన పాత్రలను ఇతర సామగ్రిని యిచ్చిరి. కొద్ది రోజులు గడచినవి. ఈకొలది రోజులలోనను, ఆ యింటి లోనిబిడ్డలు పరీక్షలలో నుత్తీర్ణులగుటయో, లేక, తలవనితలంపుగ అమిత

ధనలాభము గల్గుటయో, లేక ఆప్తులలో యెవరైనా వ్యాధినివారణము నొందుటయో, లేక, మరి యే యితర కారణముల వలననో అధికమైన సంతోషమును పొందుటకు ఆ యింటిలోని వారికి అవకాశములు కలిగినవి. అట్టి వార్తల వలన కలిగిన సంతోషమును ఆ యింటివారును, వారి కాప్తులైన యితరులును కలిసి అనుభవించిరి. ఆ యాగంతుకవ్యక్తి అదేయింటిలో ఒక భాగమునందు శాంతిగను, ప్రశాంతముగను, తృప్తితోడను నున్నప్పటికినీ ఆ యింటి వారును, వారి బంధువులును, పొందిన సంతోషములో భాగస్వామి కాలేదు. ఆ తరువాత ఆ వ్యక్తి తన ప్రయాణమును సాగించుటకు తగినస్థితి కలుగుటవలన నింటి యజమాని యొద్ద సెలవుతీసికొనగోరెను. ఇంతలో నా యింటి యజమాని యితరుల మాటల సందర్భములో ఆ నూతన వ్యక్తి పరాయివ్యక్తి కాదనియు, కొంత కాలము క్రిందట తమను విడిచిపెట్టి వెడలిపోయినట్టియు, తమ తల్లిదండ్రులు ఎంత వెతికినప్పటికిని దొరకకపోయినట్టియు తమ ఆప్తబంధువే యని తెలిసికొనిరి. ఆ క్షణమునుండి ఆ యింటి వారిస్థితి మారిపోయెను. ఏ నాడో పోయి, ఆకస్మికముగా తిరిగి వచ్చిన ఆ యాప్తబంధువును అందరును గౌరవించి తమ తమ సంతోషానుభూతులలో భాగస్వామిని చేయదొడగిరి. ఈ రీతిగ అప్రయత్నముగ, ఆకస్మికముగ ప్రేమ వృద్ధిపొంది ప్రవహించెడి స్వభావము మానవుల యెడనే గాక, జంతువులు, సస్యజాతులయెడల కూడ నుండును.

సస్యజాతుల పెంపకమునందు శ్రద్ధగల యొక వ్యక్తి ఒక చక్కని ఉద్యానవనమును పెంచుచుండెననుకొనుడు. చుట్టును గట్టిగా దడికట్టి, సమర్థులగు పనివారల సహాయమున దానిని కాపాడుచు మిక్కిలి శ్రద్ధతో చూచుచుండెను. ఒక నాడొక ఆవు దానిలో ప్రవేశించినది. కొన్ని మొక్కలను తిని, కొన్నిటిని విరుగగొట్టి మరికొన్నిటిని త్రొక్కివేసినది. ఇట్టి స్థితియుండగా యజమాని తోటలో ప్రవేశించి

కోపముతో వణకుచు, చేత కఱ్ఱ పట్టుకొని ఆ యావును కొట్టుటకు పోయెను. ఆ సమయమునందు కొట్టుటకు ఎత్తిన కఱ్ఱ ఆ యావుమీద పడెడు లోపున, ఆ యావు తమ ఆప్త బంధువులదో మిత్రులదో యని ఆ వ్యక్తికి తెలిసినది. వెంటనే ఆ యావును కొట్టవలెనను అభిప్రాయము పోయినది. దండన తేలికగా దాటిపోయెను. అదియైనను, ఒడలు తెలియని కోపముతో నుండుట వలన ఎత్తిన కఱ్ఱను ఆ వ్యక్తి ఆపుచేయలేకపోవుట వలన జరిగెను. ఆ యావు తమ యాప్తుల దని తెలియుటతోడనే, ఆ యజమానికి, ఆవు యజమాని యందుగల ప్రేమ, ఆవు లోనికి గూడ ప్రవహించి దండన ఆగిపోయెను.

ఇదేరీతిగ, ఆ తోట యజమాని, మిక్కిలి ప్రేమతో పెంచుచున్న ఒక మొక్కల వరుసలో, ఒక ముండ్లమొక్కను చూచెను. వెంటనే దానిని త్రవ్వి ఆవల పారవేయుటకు ప్రయత్నించెను. త్రవ్వుట ప్రారంభించిన తరువాత, ఆ మొక్క తమ ఆప్తులచే నాటబడినదని తెలియవచ్చెను. వెంటనే ఆ ప్రయత్నము ఆగిపోయెను.

ఈ రీతిగ, మానవులనుండి, వస్తువులకును, విషయములకును ప్రత్యక్షముగను పరోక్షముగను ప్రేమ ప్రవహించుట మహావేగముతో జరుగును. ఒక విషయమునుగూర్చి గాని, పరిస్థితినిగూర్చి గాని తెలియకున్నచో ఆ విషయమువైపు, పరిస్థితివైపు ప్రేమ ప్రవహింపదు. వస్తు విషయాదులనుగూర్చి, సంపూర్ణ జ్ఞానమున్నప్పటికినీ, ఇంద్రియముల లోనికి చాలినంత సూక్ష్మశక్తి లేకపోయినచో సూక్ష్మేంద్రియములు చైతన్యవంతముగ లేనట్టి మానవులనుండి, ఆ యా వస్తు విషయాదులలో ప్రేమ నిత్యమై, నిరంతరమై ప్రవహింపదు. అప్పుడా ప్రేమ, ఉపయోగింపబడని స్థితిని పొందుట వలన, ప్రేమ విజృంభణ ఆగిపోవును. ప్రేమయొక్క నిత్య నిరంతర ప్రవాహము సూక్ష్మేంద్రియముల సక్రమ

వ్యవహారముపై నాధారపడి యుండును. ఆ యింద్రియములలో చాలి నంత సూక్ష్మశక్తి యున్నపుడే అవి సక్రమముగా వ్యవహరించును. వస్తు విషయాదులను గూర్చి, పరిస్థితులను గూర్చి, సరియైన జ్ఞానము కలిగియున్నప్పటికిని ప్రేమ తనంత తాను ఎడతెగకుండ యుబికివచ్చు చున్నప్పటికిని, సూక్ష్మేంద్రియములు సక్రమముగా వ్యవహరింప లేక పోవుటవలన, మానవులు సాధారణముగ, ఏ వస్తు విషయాదులను సంపూర్ణముగ, నిస్స్వార్థముగ నిరంతరము ప్రేమింపలేకున్నారు.

మెరక ప్రదేశములనుండి పల్లపు ప్రదేశములలోనికి నీరు ఊరు చుండు రీతిగనే, మానవులలో ప్రేమ సహజముగ బయలుదేరి ప్రవ హించుచుండును. ఊటనీరు పెరిగి పెరిగి ఒకానొక మట్టమునకు వచ్చిన తరువాత, విశ్వనిర్మాణములో ఊట యూరెడి శక్తి నిత్యమైనదైనప్పటి కిని యిక యూరుట ఆగిపోవును. ఆ యూట నీటిలోనుండి యెంతనీరు తోడివేసిన అంతనీరు మరల యూరును. ఆ నీటిలోనుండి యెడతెగని ప్రవాహమును విడిచిపెట్టినయెడల, ఎడతెగకుండ నీరూరుచునే యుండును. ఆ నీరు సమస్త ప్రయోజనములకును పనికి వచ్చును.

సమస్త జీవులలోను ప్రేమకు స్థానము హృదయము. అది ప్రేమ పూర్ణము. పోషణ పదార్థములనుండి సేకరించు శక్తులలోని ప్రేమను గ్రహించునది హృదయమే. ప్రేమ అన్ని జీవులలోనను ఉండి, అన్ని జీవుల నుండియు, నితరజీవు లన్నిటిలోనికిని ప్రవహించు స్వభా వము కలిగియున్నది. మానవులలో ప్రేమ అవధుల కతీతమయినది. అందువలనను, మానవులకు సమస్త జీవులతోడను, వస్తువులతోడను ఏదియో యొక విధమయిన సంబంధముండుట వలనను, సమస్త వస్తు విషయాదులు మానవులతో గల సంబంధముపై నాధారపడి యుండుట వలనను, సమస్త వస్తు విషయాదులలోనను ప్రేమ యున్నది. అందు

వలన, ఈ ప్రేమ మానవులనుండి యితర మానవులలోనికి ప్రవహించుట మాత్రమేగాక ప్రత్యక్షముగనో, పరోక్షముగనో మానవులతో సంబంధముగల సమస్త వస్తు విషయాదులలోనికి ప్రవహించును.

సృజనశక్తిలోని ప్రేమ సృజనేంద్రియములద్వారా వస్తు విషయాదులలోనికి ప్రసరించును.

ప్రేమ ప్రసరించెడి సృజనేంద్రియములు అభివృద్ధిని గూర్చిన జ్ఞానమును కలిగి యుండకపోవుట వలనను, సౌఖ్య, క్షేమముల యందలి ఆకాంక్షతో సృజన విధానములయందు నిమగ్నమై యుండుటవలనను, సౌఖ్య క్షేమముల యందలి ఆకాంక్షలో తృప్తిని పొందలేక, వస్తు విషయాదులయందు ఒక చోటినుండి మరియొక చోటునకు ఆ ప్రేమ మారుచుండును. సృజనేంద్రియములు తమతో సంబంధముగల వస్తు విషయాదులలో వేనిని కూడ సంపూర్ణముగ, గాఢముగ, నిరంతరముగ ప్రేమించలేవు. వాని నడిపించు అహములకు వాని కార్యకలాపముల యందు సంతోషము కలుగును. తమ అహములకును సృజనేంద్రియములకును స్వభావములలో కల ఐక్యతను గ్రహింపలేక, మానవులు తమ సహజ వివేకప్రబోధముల ననుసరించి ఆ అహములకు లోబడియున్న సృజనేంద్రియ వ్యవహారములను సరిదిద్ద ప్రయత్నించి విఫలు లగుచుందురు. అందువలన మానవ హృదయములందు ప్రేమ విజృంభణ ఆగిపోయి హృదయాభ్యుదయమునకు ఆటంకము కలుగును.

ఇది మానవ జీవితములోని ఒక క్లిష్టస్థితి. మానవులైన తమకేది యుచితమో, ఏది అనుచితమో తమ సహజ వివేకము స్ఫురింపజేయుచుండును. కాని, వారా ప్రబోధములను అనుసరింపలేకున్నారు.

ఇక్కడ వారి సృజనేంద్రియములు గుణ రూపకముగను, పరిమాణ రూపకముగను సంపూర్ణత్వము కలిగి మిక్కిలి చైతన్యవంతములై వ్యవహరించు చున్నవి. అభ్యుదయ మార్గమున వ్యవహరించుటకు కావలసిన లక్షణములను, సామర్థ్యమును కలిగి యున్నవి. కాని వారి కార్య కలాపములన్నియు వారి పూర్వ మానవేతర వాసనలతో కూడి యున్న స్వభావము వలన మానవేతరుల కుచితమైన దృక్పథము వలననే ప్రబోధింపబడుచున్నవి. వానిలో మానవత్వమే యుండదు. ఏ కొలది నైన యున్నచో అవి సృజనశక్తిలోని గుణరూపక సంపూర్ణత్వము వలన కలిగి యుండవచ్చును.

సృజనేంద్రియములచే వినిర్గతమైన ప్రేమ ఏ యే వస్తు విషయాదికములపై ప్రసరించినను ఆ యా యింద్రియముల ప్రయోజనము నిమిత్తము. స్వలాభము కొరకు ప్రసరించును. ఏ యే వస్తు విషయాదులపై ఇట్టి స్వార్థప్రేమ ప్రసరించునో ఆ యా వస్తు విషయాదులకు ప్రయోజనభంగము తప్పదు. విశ్వమందలి సమస్త వస్తు విషయాదులును సర్వ మానవకోటికి చెందియున్నవి. అందువలన ప్రయోజన భంగమును పొందిన వస్తువిషయాదులతో సంబంధము కలిగిన మానవులు, ఎవరి స్వార్థ ప్రేమ ప్రసరించుటవలన అట్టి నష్టము కలిగినదో, ఆ వ్యక్తులపై తిరుగుబాటు చేయుదురు. ఈ రీతిగా స్వార్థము, సవ్యము కానిది యగు ప్రేమపై తిరుగుబాటువలన అనగా ఆ ప్రేమను ప్రసరింప చేసిన మానవులపై కలిగిన తిరుగుబాటు, ఒత్తిడి మూలమున అట్టి వ్యక్తులు తమ స్వార్థప్రేమను, ఆ వస్తు విషయాదులనుండి ఉపసంహరించుకొందురు. కాని ప్రేమశక్తి నిత్య చైతన్యవంత మగుటవలన ఒక చోటనుండి ఉపసంహరింపబడిన వెంటనే యితర వస్తు విషయాదులపై ప్రసరించును. అక్కడనుండికూడ మరల ఉపసంహరింప బడవలసిన పరిస్థితులేర్పడును. అప్పుడు మరియొక చోటునకు ప్రసరించును. ఇట్లొక

చోటునుండి మరియొక చోటునకు ప్రసరించుచునే యుండును. స్వార్థ ప్రేమయొక్క యీ చంచల స్థితియందు తిరుగుబాటు జరిగినప్పుడెల్ల సృజనేంద్రియములు, అహాములు, వ్యక్తులు కూడ ప్రేమ ప్రసరించెడి వస్తు విషయాదులను మార్చుచున్నప్పటికిని, విడిచిపెట్టబడిన వస్తు విషయాదులయందు, ఆ వ్యక్తుల కపేక్ష లేకపోలేదు. వానినే యంటుకొని ప్రాకులాడును. ఇదియే మమకారము.ఈ మమకారము వలన మానవులు తమచే విడిచిపెట్టబడిన వస్తు విషయాదులయందు కూడ బద్ధులగుచున్నారు. ఆ యా వస్తు విషయాదులతో వారు వ్యవహరింపకుండినను, వానియందు తమచే విసర్జింపబడిన వాంఛను మాత్రము పోగొట్టుకొనలేరు. ఇది ఉచితము కాని ప్రేమ లక్షణము. ఇది ఒక అంతులేని అసంతృప్తికర విధానము. సౌఖ్య, క్షేమములయందు వస్తు విషయాదులతోడి వ్యవహారములందు కలుగు నీ యసంతృప్తికర విధానము సూక్ష్మేంద్రియములందు చాలినంత సూక్ష్మశక్తి కలిగి అవి సక్రమముగ వ్యవహరించు నంతవరకు సాగుచునే యుండును.

మానవుల అనుచిత (selfish) ప్రేమ యీ రీతిగ ఒక చోటునుండి మరియొక చోటునకు ప్రసరించు చంచల స్వభావము కలిగినదగుటచే అట్టి ప్రేమ ప్రసరించిన వివిధ వస్తు విషయాదుల యందును, మానవులు వ్యామోహ బద్ధులగుచున్నారు. ఈ వ్యామోహము మూలమున సౌఖ్య, క్షేమములను సంపాదించెడి విధానమునందు వారు ప్రేమ రహితులయి, శక్తిహీనులు, తృప్తిలేని వారగుచున్నారు. వారి ఆవేదన తీవ్రమైనది. చంచల స్వభావముకూడ తీవ్రమైనదే! వ్యామోహము గాఢమైనది. అసంతృప్తియు గాఢమైనదే! ఇట్టి స్థితియందు సౌఖ్య, క్షేమములను సంపాదించుటయందు సంతృప్తినిపొందుటకు ప్రేమయొక్క చంచల స్వభావమును అరికట్టి హృదయమునందలి ప్రేమను అవిచ్ఛిన్నముగా ప్రవహింపజేయుటకు గుణరూపక (qualitative), పరిమాణ

రూపక (quantitative) సంపూర్ణత్వము కలిగి, సక్రమముగ వ్యవహరించు సూక్ష్మేంద్రియములను మానవులు తప్పక కలిగి యుండవలెను.

కొందరు వ్యక్తుల సూక్ష్మేంద్రియములు అభ్యుదయమనసేమో అవియెట్లు కలుగునో మున్నగు విషయములను గూర్చిన జ్ఞానమును కలిగియుండును. వారి సూక్ష్మేంద్రియములద్వారా ప్రసరించు ప్రేమ అచంచల స్వభావము కలది. వారు సహజ వివేక ప్రబోధములను గుర్తింతురు. వస్తు విషయానేకములను స్వలాభముకొరకు గాక ప్రేమింపబడిన వస్తు విషయాదుల ప్రయోజనముకొరకే ప్రేమింతురు. తమ అహములు తమకు వశవర్తులై యున్నవను జ్ఞానమును కలిగి యుందురు. ఇట్లు వారు అహముపై తమ వ్యక్తిత్వమును నిరూపించుకొందురు. వారి హృదయములలో ప్రేమ ఉద్భవించుట, అభివృద్ధి పొందుట నిత్యము సాగుచుండును. వారినుండి నిరంతరము ప్రేమ ప్రవహించుచుండును. చంచల స్వభావముండదు. పర్యవసానముగా వస్తు విషయాదులయెడ వ్యామోహము కలుగకుండుటయేగాక, అంతవరకును గల వ్యామోహ బంధములు కూడ సడలిపోవును.

ఇట్టి పరిస్థితులయందు, మానవులకు వస్తు విషయాదులయందు కలుగు ప్రేమ, స్వలాభము కొరకై గాక ఆ యా వస్తు విషయాదుల ప్రయోజనముకొరకై యుండును. వస్తు విషయాదులయెడ వ్యామోహమునకు మారుగ వారు బాధ్యతను వహింతురు. వారి సూక్ష్మేంద్రియములు ఆ యా వస్తు విషయాదుల యొక్క సూక్ష్మస్థితులను అవలోకించి, అనుభవించి నెల్లడించును. వారు తమకుగల సరియైన జ్ఞానముయొక్క సహాయముతో తమకు వశవర్తులైయున్న అహముల ద్వారా తమకుగల సామర్థ్యమును తమ ఉచితమైన, నిస్వార్థమైన ప్రేమను దృఢముగా, నిరంతరముగా వస్తు విషయాదుల అభ్యుదయము కొరకు వినియోగింతురు.

ఇట్టి స్థితిని పొందుటకు పూర్వము, వస్తు విషయాదుల యెడ మానవులకు గల ప్రేమ, పైన చెప్పినట్లు స్వలాభముతో కూడి యున్నదియే. ఇది మానవేతరము. దీనికి మానవ నిర్మాణముతో సామరస్యము లేదు. ఆధ్యాత్మిక సిద్ధాంతమునకు విరుద్ధము. దీనిని స్వార్థ ప్రేమ యందురు. ఇది అనుచితమైనది. ఇది సృజనేంద్రియములవలన ప్రసరింపబడినది. దీనికి సహజ వివేకముయొక్క సహాయము కొలదిగ మాత్రమే యున్నది. అందువలన నిది క్షణికమైనది. ఒక వస్తువునుండి మరియొక వస్తువుపైకి ప్రసరించుచుండును. ఈ ప్రేమ ప్రసారము బాహ్య ముఖము. అహము వలన ప్రబోధితమైనది. అందువలన మానవులు తమ వ్యవహారములలో క్షణక్షణము ఆశాభంగముల నెదుర్కొనవలసి వచ్చును. ఈ ఆశాభంగము వలన చంచలత్వము కలుగును. చంచల స్వభావముగల ఇంద్రియముల ప్రసారము ఒకచోటు నుండి మరియొక చోటునకు మారిపోయి ఆ వ్యక్తులను మాత్రము ఆ యా వస్తు విషయాదుల సంబంధముతోనే విడచి వానియందు వ్యామోహ బద్ధులను జేయుచున్నది.

సశరీరస్థితి యందో లేక అశరీర స్థితియందో మానవ వ్యక్తులు ఎడ తెగకుండ నున్నారు. అందుమూలమున వారలకు పలురకములకు చెందిన అనేక వస్తు విషయాదులయందు వ్యామోహములు పెరుగుచున్నవి. వారు తమ సౌఖ్య క్షేమముల కొరకు వస్తు విషయాదులతో సంబంధము కలిగించు కొనుచున్నారు. కాని వానియందు వ్యామోహ బద్ధులగుట వలన ఆ ప్రయోజనము సిద్ధించుట లేదు. క్రొత్త వ్యామోహములు పాత వ్యామోహములను అణచిపెట్టును. అణచిపెట్టబడిన వ్యామోహములు ఆ వ్యక్తులలో అప్పుడప్పుడు మరల రేకెత్తుచుండును. ఆ యా వ్యక్తుల శ్రద్ధాసక్తులే యే వస్తు విషయాదులపై నుండునో, వాని యన్నిటి పయిన ఇట్టి వ్యామోహముల ప్రభావములు

కనిపించుచుండును. ఒకేయొక వస్తువు, ఒకేయొక కాలమందు, అనేక వైపులనుండి, అనేక దృక్పథములతో, పరస్పర విరుద్ధములయిన యుద్దేశ్యములతో వేరువేరు వ్యక్తులచే, వేరువేరు తీవ్రతలతో ప్రేమింపబడు చున్నది. మానవులతో సహా సమస్త వస్తు విషయాదులు పరిస్థితియు నింతే!

ఒక విశాలమందిరమునందు, ఒకరొకరికి మధ్య తగినంతదూరము లలో అచరములు, మానవేతరములు. మానవులతో సహా అనేక వస్తు విషయాదు లున్నవనుకొనుడు. ఈ మూడు రకముల జీవులు ప్రత్యేకముగా ప్రత్యేక లక్ష్యము లేకుండ, అన్ని వైపులకు బాణములు ప్రయోగించుచున్నవి. ప్రతి బాణమునకు వెనుక నొక ఆశయమున్నది. ఆ యాశయము ఆ వ్యక్తులయొక్క అహములు, యింద్రియములు, స్వభావములనుండి పుట్టినది. సమస్త సస్యజాతి, జంతుజాతి, మానవులలో నధిక సంఖ్యాకులు బాహ్యముఖముగ గల యింద్రియములు కల వారు. అందువలన వారిచే విడిచిపెట్టబడిన ప్రతిబాణము వెనుకనుగల యుద్దేశ్యము కొట్టబడిన వస్తువిషయాదులవలన లాభమును పొందుటయే! ఆ మందిరమునందు నిత్యముగ, నిరంతరముగ సాగుచున్న యీ కార్యకలాపములు, స్వార్థము, అనుచితమునగు ప్రేమద్వారా అందలి శక్తులపై ఒత్తిడి కలుగజేయును. ఈ రీతిగ ఒత్తిడికి, రాపిడికి లోనైన శక్తి ఆ మందిరమునందలి శాశ్వతములైన కాల ప్రదేశములందలి భౌతిక వస్తు నిర్మాణమును సంక్షుభిత పరచును. ఈ ఒత్తిడి, నలుగుడుల రాపిడియే, శాశ్వతత్వము (eternity) యొక్క అంగముల నడుమ కలిగిన సంఘర్షణ. ఈ సంఘర్షణవలన అసాధారణోష్ణము జనించును. ఈ రీతిగ విశ్వమందలి అనంతమయిన కాలాకాశములలో కార్యకలాపములు జరుగుచుండును.

స్వార్థము, అనుచితము నయిన ప్రేమతో కూడుకొనియున్న కార్యకలాపములవలన బయలుదేరిన అత్యధికోష్ణము మహావిపత్కర పరిస్థితులతో గర్భీభూతమై యుండును. ఈ యత్యధికోష్ణమువలన తీర్వ శక్యముకాని విశ్వతృష్ణ బయలుదేరును. ఈ విశ్వతృష్ణ తీరుటకు, విశ్వ మందలి క్షణికములు శాశ్వతములు నయిన సమస్త జీవ వస్తు జాల ములు ప్రళయ జలములలో మునిగిపోవును. అనగా నీ యనంతా కాశమునందు సర్వశక్తియుతము, సర్వస్థితము, సర్వాంతర్యామియు నగు నీ శాశ్వత వస్తుమూలమునందు అశాశ్వతము, క్షణికమునగు సమస్త వస్తు విషయాదుల ప్రళయపు ముంపు సంభవించును.

ఇట్టి విశ్వ విపత్కరమయిన సంఘటనకు సమస్త జీవజాతులు కారణభూతులయినప్పటికినీ అందులకు బాధ్యత మాత్రము కేవలము మానవులయందే యుండును. సౌఖ్యక్షేమములు అభివృద్ధిపై నాధార పడి యుండునను జ్ఞానము నెరిగిన సహజ వివేకమును కలిగియుండుట యును, వారు బాహ్యాదృక్పథమును మార్చుటకు తగిన యింద్రియ ములు కలిగి యుండుటయే, యిందులకు కారణము. ఇదియే మానవు లకును, మానవేతరులకును గల భేదము. మానవు లీ భేదమును గుర్తించినది మొదలు, వారి చుట్టునుగల సమస్త వస్తువులయొక్క, అవ సరమును ప్రాముఖ్యమును గ్రహించెదరు. ఆ వస్తు విషయాదులు క్షణికములు కావచ్చును. శాశ్వతములు కావచ్చును. ఈ జ్ఞానము వలన వారితో సంబంధముగల సమస్త వస్తుజాలమును వినియోగ పరచుకొని అభ్యుదయగాములయ్యెదరు. ఈ విశ్వ విపత్తు విశ్వావశ్య కత కాదు. అందువలన నివారింపబడదగినది. ఆర్తి దుఃఖములకు తావు లేని, ఉచితమయిన ప్రేమను ప్రయోగించి, శాంతి సౌభాగ్యముల ద్వారా మానవులు అభ్యుదయమును పొందుట విశ్వావశ్యకతచే కోర బడుచున్నది. అనుచితమగు ప్రేమ ప్రయోగమువలన సౌఖ్యక్షేమము

లను పొంది, మానవులు బాహ్యాభివృద్ధిని పొందుట విశ్వావశ్యకత కాదు. అందువలన విశ్వవిపత్తుకూడ విశ్వావశ్యకత గాదు. ఇది విశ్వ సిద్ధాంతములకును విశ్వావశ్యకతకును వ్యతిరేకము. ప్రేమ స్వలాభాపేక్షతో కూడియుండిన దయినచో, అనగా ప్రేమించిన వ్యక్తికే లాభము కలుగజేయున దయినచో, ఆ ప్రేమ ఉచితముకానిది. సౌఖ్య క్షేమముల ద్వారా బాహ్యాభివృద్ధి దాయకమగును. సూక్ష్మేంద్రియములలో తగినంతశక్తి లేకపోవుటవలన వస్తు విషయాదులయందు వ్యామోహము గలవారు బాహ్యాముఖు లగుదురు. ఈ వైరుధ్యము సరికట్టుటకు ఉచితమయిన ప్రేమ ప్రయోగము కావలెను. ఆ ప్రేమ బాధ్యతాయుతమై ప్రేమింపబడిన వస్తు విషయాదులకు క్షేమకరమయి యుండవలెను. ఆ ప్రేమ స్వలాభాపేక్ష రహితమయినచో, బాధ్యతతోగూడి అభ్యుదయమును కలిగించును. బాధ్యత కలిగియుండిన ప్రేమ ప్రేమికులకు, ప్రేమితులకునుగూడ అభ్యుదయమును గూర్చును.

మానవులందరి ప్రేమయొక్క ప్రయోజనము ఒక్కటియే యగుటవలన, అందువలన కలిగిన ఒత్తిడి, నలుగుడువలనకూడ అత్యధికోష్ణము విశ్వదాహము బయలుదేరును. వానిని తీర్చుటకుకూడ ప్రళయపు ముంపు సంభవించును. అగుచో అట్టి ప్రళయము విశ్వావశ్యకత గావున అందుకు కారణమయిన ప్రేమ ఉచితమయినది గావున, ఫలితములు విపత్కరము కాకుండును.

సవ్యమయిన ప్రేమవలన ప్రయోజనములు ఒక మాదిరివియే యగుటవలన, వానిలో వానికి సంఘర్షణ లేకుండ సహకారముతో ప్రయోజనమును సాధించును. ఇదికూడ ఒక విధమయిన సంఘర్షణతో కూడి యున్నదే. కాని యీ సంఘర్షణ ప్రేమ ప్రయోజనముల వైరుధ్యమువలన కలిగినదికాదు. ప్రయోగింపబడిన సవ్యమైన ప్రేమలోని తీవ్రతలలోని భేదములవలన (degree of intensity) కలిగినది. ఇట్టి

సంఘర్షణవలనకూడ ఉష్ణము, తృష్ణ జనించును. కాని యీ యుష్ణము నందును, తృష్ణయందును ఆర్తి దుఃఖము లుండవు. ప్రేమ అభ్యుదయ ముఖ్యముగ నుండుటయే యిందులకు కారణము.

సశరీరములు, అశరీరములు నయిన జీవులు, వస్తు విషయాదు లును, ఉన్నవానిని ఉన్నట్లుగ తీసికొని, ప్రయోజనమును గూర్చిన జ్ఞానము, సర్వాంతర్యామితో సంబంధము, విజ్ఞానము, స్వవిజ్ఞానము నెరిగి వ్యవహరించుటయే మానవుల కుచితమయిన అలవాటు. వ్యామో హితులగు మానవులు, సశరీరులుగనో, అశరీరులుగనో ఎప్పుడయినను, విశ్వమం దధికముగా నున్నచో వారు నిరాశ, కోపములు మూలమున విభ్రాంతిని పొందుదురు. వారి నిశ్చితాభిప్రాయములు విభ్రాంతి పూర్వకము లగును. ఈ విభ్రాంతి పూర్వక మయిన నిశ్చితాభిప్రాయ ములతో బహుసంఖ్యాకులు వ్యవహరించుట సంఘర్షణకు కారణ మగును. ఈ సంఘర్షణ తీవ్రమయిన కొలది అసాధారణ ఉష్ణము, తృష్ణ ప్రారంభమగును. ఈ తృష్ణ యెక్కువయిన కొలది వాని నివారించుటకు ప్రళయపుముంపు ప్రారంభమయి సంపూర్ణ ప్రళయముగ పరిణమించును.

ప్రపంచమునందు మానవుల అభ్యుదయ పథమందు నైదు దశ లున్నవి. ఒక దశకును, మరియొక దశకును మధ్య నెంతయో కాలము పట్టును. (1) వస్తు విషయాదులయందు వ్యామోహములు గల మానవు లధిక సంఖ్యాకులుగా బయలుదేరుట, సంభ్రమము ; (2) బయలుదేరిన సంభ్రమము తీవ్రతరమై సంపూర్ణ సంభ్రమముగా రూపొందుట, (3) సంఘర్షణ బయలుదేరి తీవ్రతరమై అసాధార ణోష్ణముగా మారుట, (4) ఆ యసాధారణోష్ణము తీవ్రతరమగుట, సంపూర్ణోష్ణము ; (5) ముంపు ; కొలది కొలదిగా మునుగుట, సంపూర్ణ ప్రళయమును, ఈ అయిదు దశలు.

దశకు దశకు మధ్యగల కాలము విపత్కర పరిస్థితులతో దుర్భర మైన ఆర్తి దుఃఖములతో కూడి యుండును. సంపూర్ణ ప్రళయముతో కూడిన చివరి దశయందు మాత్రము వ్యక్తి జీవిత ముండదు గావున, దుఃఖము కూడ నుండదు.

బాధ్యతాయుతులయి, ఉచితమయిన ప్రేమ గలిగిన మానవులు, అశరీరముగనో, సశరీరముగనో, అధిక సంఖ్యాకులుగ నున్నప్పుడు, వారు బాధ్యత, ఐక్యత, శాంతి, సౌభాగ్య, అభ్యుదయముల ద్వారా సునిశ్చితములయిన అభిప్రాయములు కలిగి సంభ్రమము లేకుండ వ్యవహరింతురు. వారి కార్యకలాపములయొక్క తీవ్రతవలన కూడ సంఘర్షణ, ఉష్ణము, ముంపు, ప్రళయము కలుగును. కాని యీ సంఘ ర్షణ వైరుధ్యము వలన కలిగినది కాదు. మానవ ప్రయోజన నిర్వ హణలోగల సమైక్యతానుల తీవ్రతలోని తరహాలవలన కలుగును. ఆ మానవుల యింద్రియములు ఉష్ణమును గ్రహించగలిగిన శక్తిని కలిగి యుండుట వలన వారికి శాంతి సౌభాగ్యములేగాని ఆర్తి దుఃఖ ములు లేవు. వారు వశవర్తులయిన అహములను, చైతన్య యుతము లయిన యింద్రియములను కలిగి యుందురు. అందువలన విశ్వమును గూర్చి సునిశ్చితమైన యభిప్రాయము, సక్రమమైన స్వభావము, ఉచిత మైన ప్రేమ, లక్ష్యములయం దైక్యత, బాధ్యత, శాంతి, సౌభాగ్య ములను కలిగియుండి అన్యోన్య సంబంధములను గూర్చిన సంపూర్ణ విజ్ఞానము గలిగియుండి అభ్యుదయ పథగాములగుదురు. సర్వజీవ జాతులతో తమకుగల ఏకత్వము, సర్వాంతర్యామితో గూర్చిన యేక త్వమును గూర్చిన విజ్ఞానము, స్వవిజ్ఞానమును కలిగియుండి, ప్రళయము విశ్వావశ్యకత కనుక, విశ్వ విమోచనముగను, విశ్వ విశ్రాంతిగను భావింతురు. ఈ రీతిగ తప్పుదారిలోనున్న మానవులకు ఆర్తికరము

దుఃఖదాయకమునగు పరిస్థితి, మంచి దారిలో నున్నవారికి శాంతి సౌభాగ్య దాయకమగును.

నవ్య మానవులీ ప్రపంచములో నిరంతరము పుట్టుచునే యుండుటవలన, అందరు మానవులును ఒకే కాలమందు సక్రమ పథములోనికి వచ్చుట అసంభవము. కాని అత్యధిక సంఖ్యాకులు సక్రమ పథములోనికి వచ్చుట మాత్రము సంభవము. ఇది విశ్వ ప్రళయ కారకములగు, విపత్కర పరిస్థితుల నధిగమించి, విశ్వ విశ్రాంతి దాయకములగు పరిస్థితుల నేర్పరచుటకు చాలును. ఇది విశ్వావశ్య కతానుసారమే జరుగుచుండును.

ఒకానొక వస్తువునో సంఘటననో గూర్చిన వార్త ఆ యా వస్తు సంఘటనలను గూర్చిన విషయము. ఆ విషయమే ఆ వస్తు సంఘటన లను గూర్చిన జ్ఞానము. ఆ జ్ఞానములో సుఖ దుఃఖములు సహజాత ములుగా నున్నవి. సహజాతములయిన యీ సుఖ దుఃఖములు మానవుల కావస్తువులతోడను, సంఘటనల తోడను గల సంబంధముపై నాధారపడి యుండును. ఈ వస్తు సంఘట నాదులతోగల సంబంధము సూక్ష్మేంద్రియ చైతన్యముపై నాధారపడి యుండును. సూక్ష్మేం ద్రియ చైతన్యము ఆ యింద్రియములలోగల సూక్ష్మశక్తి సంపూర్ణ తపై నాధారపడి యుండును. మానవులకు విషయాదులతో గల సంబంధము, బాధ్యతాయుతముగ అభ్యుదయకారియు, ఉచితము నయిన ప్రేమ మూలముననో, వ్యామోహము, బాహ్యాభివృద్ధి దాయకమగు ఉచితముకాని ప్రేమమూలములనో యయియుండును. ఒక వస్తువు ఒక వ్యక్తిచేత ప్రేమింపబడిన క్షణము మొదలు, ఆ వస్తువు ఆ వ్యక్తియొక్క ప్రేమకు నిధానమగును. అదేవస్తువు అప్పటికి యితర వ్యక్తుల ప్రేమలకు నిధానమయి యుండవచ్చును. సంబంధించిన వ్యక్తుల

యొక్క ప్రేమ సాంద్రతను బట్టియు, ఆ వస్తువును పొందుటకు వారు చేయు ప్రయత్నముల బట్టియు, ఆ వస్తువు ఆ వ్యక్తికిగాని, వ్యక్తులకు గాని చెందును. కాని యెట్టి పరిస్థితులయందును గూడ ప్రేమించిన వ్యక్తు లందరకును చెందదు. ఒకప్పుడు కొందరి ప్రేమలను నిరాకరించ వచ్చును గూడ. మరల వస్త్వంతర వస్తు ధర్మమునుబట్టి ఆ వస్తువులు కాలక్రమమున రూపములో మార్పులు పొందవచ్చును. తుట్టతుదకు రూపముకూడ లేకుండవచ్చును.

పై రెండు పరిస్థితుల యందును, వస్తువుల యందు స్థితమై యున్న వేర్వేరు వ్యక్తుల ప్రేమశక్తులు ఆ వస్తువునం దుండజాలవు. ఆ ప్రేమశక్తి ఆ వస్తువులనుండి వెడలగొట్టబడును. దానిని విడచి పోవలెను. ఆ వస్తువు ఆ వ్యక్తులకు చెందినదై, వారి ప్రేమలకు వశవర్తియైనచో, యిట్టి స్థితి కలుగదు. ప్రేమింపబడిన వస్తువు రూపాంతర స్థితిని బొందినచో, దాని రూపము మారిపోయినచో, దానియందు స్థితమైయున్న సమస్త వ్యక్తుల ప్రేమలు, ఆ వస్తువునుండి ప్రేమించిన వ్యక్తులలోనికి తిరిగిపోవును.

ప్రేమింపబడిన వారినుండి, ప్రేమించిన వారికడకు ప్రేమశక్తులు తిరోగమించుటవలన, ఆ వ్యక్తులలో ఉష్ణము, కోపము, విచారము బయలుదేరును. తొందరపాటు, కోపము, విచారములవలన ప్రచోదితమై వారి సృజనేంద్రియములు చైతన్యవంతములగును. ఇట్టి తీవ్ర చైతన్యమువలన వ్యక్తుల శరీర నిర్మాణములయందు, అత్యధికోష్ణత బయలుదేరును. శరీరమునకు అలసట బయలుదేరి, చెమటపట్టి, దాహము కలుగును. పరిసర వాతావరణమును కూడ ఉష్ణోద్రిక్తము చేయును. బయటనున్న వాతావరణ పరిస్థితితో సంబంధము లేకుండ, ఇట్టి పరిస్థితి శీతకాలములో కూడ కలుగును. స్థూలేంద్రియములలో

కలుగు అత్యధిక చైతన్యముకూడ సృజనేంద్రియములయందలి చైతన్యము వలెనే, అంతరిఉష్ణమును కలిగించును. ఈ రెండింద్రియములును శరీరము లతో సంబంధముకలవి. అందువలన వాని ప్రభావము మిక్కుటముగా శరీరము పైన కన్పించును. నిరాశ, వ్యామోహములవలన కలిగిన నిర్బంధ తిరోగమనమువలననే యిట్టి యుష్ణోత్పత్తి కలుగుచుండును. ఇట్టి పరిస్థితులయందు వ్యక్తులకును, ఇంద్రియములకును నడుమ అహము లుండును. ఇంద్రియము లీ వ్యక్తి అహములనే జీవులనుకొనును. ఈ పరిస్థితియే, సంపూర్ణ విస్మృతిని కలిగించి, వ్యక్తిని సంపూర్ణముగా సంభ్రమమునకు లోనుజేయును. ఇప్పుడు సహజ వివేకముచే ప్రబోధింప బడినను, వ్యక్తి తన యింద్రియ వ్యవహరణను సరిదిద్దుకొనుట కష్టము.

సక్రమముగను, సామాన్యముగను, వ్యవహరించు సూక్ష్మేంద్రియములు, స్థూల సృజనేంద్రియముల తీవ్ర చైతన్యముకన్న అధికమైన యుష్ణమును జనింపచేయును. ఇదేరీతిని అతిసూక్ష్మ, అత్యధికసూక్ష్మ, మహాసూక్ష్మ ఆధ్యాత్మికేంద్రియములు సక్రమముగా వ్యవహరింప ప్రారంభించినచో ఇంకను అధికతరమగు నుష్ణము జనించును. స్థూలము నుండి ఆధ్యాత్మికమువరకు, శక్తి పరిణామము పొందుట మూలమున వ్యక్తియందు, శరీరమునందు, దశనుండి దశకు, మార్పులు గలిగినపు డెల్ల ఆ యింద్రియముల చైతన్యము ఉష్ణము నింకను అధికము చేయు చుండును. దానితోపాటు వ్యామోహమువలన కలిగిన యుష్ణమును బాధ్యతవలన కలిగిన యుష్ణమును ఈ రెండిటిని విచక్షణచేయు విజ్ఞానము, ఆ యుష్ణమును నిగ్రహించుటకు తగినశక్తి సామర్థ్యములు, ఉష్ణమునకు నితరములకుగల సంబంధమును గూర్చిన జ్ఞానము జనించి, అదే రీతిని వృద్ధిపొందును. అందువలన సూక్ష్మేంద్రియములు సరిగా వ్యవహరించుట ప్రారంభించినది మొదలుగ బయలుదేరెడి యుష్ణముయొక్క

గుణములును, ఫలితములును, స్థూల సృజనేంద్రియ వ్యవహారముల వలన పుట్టిన యుష్ణముయొక్క గుణములు, ఫలితములకన్న సంపూర్ణముగ విభిన్నమై యుండును. ఈ యుష్ణము అసంతృప్తివలన పుట్టినది కాదు. తొందరపాటు, కోపము, విచారమువలన కలిగినదికాదు. బాధ్యత సంతోషము, సంతృప్తుల వలన కలిగినది. మానవులకు, భూత భవిష్యద్వర్తమానములందలి మానవ మానవేతరాది సమస్త జీవులకుగల యేకత్వాను భూతివలన యుత్పన్నమయినది.

అందువలన అభ్యుదయమునందుట, ప్రతి వ్యక్తికిని ప్రాతిపదికమైన, అత్యంత ప్రముఖమయిన ఆవశ్యకత. ఇంద్రియములలో గుణరూపక, పరిమాణరూపక సంపూర్ణత్వములు కలిగిన సూక్ష్మశక్తిని పొంది సక్రమ సూక్ష్మేంద్రియ వ్యవహారము ప్రారంభింపవలెను. వ్యక్తియొక్క ఉచితమయిన ప్రేమకు ఆకరమయిన వస్తువులను గూర్చిన జ్ఞానమును, ఆ వస్తువులయొక్క అభ్యుదయమునందాకాంక్ష కలిగి యుండవలెను. ఉచితానుచితము లయిన ప్రేమలు, వాని యుక్తాయుక్తముల విచక్షణ చేయు జ్ఞాన ముండవలెను. ఇతరత్ర అప్రతిహతమైన స్థూల సృజనేంద్రియ శక్తులను సూక్ష్మశక్తులద్వారా నరికట్టుటకు తగినశక్తి యుండవలెను. పరిమాణ రూపక సంపూర్ణతగల సూక్ష్మశక్తి, యుక్తాయుక్త జ్ఞానము, బాధ్యత, వ్యామోహము, అభ్యుదయము, అభివృద్ధి వీనికిగల తారతమ్య జ్ఞానము కలిగినచో చాలను.

శరీరములో జనించిన సృజనశక్తిని ఆ శరీరము యొక్క ప్రయోజనమునకై, అందే చాల కాలము నిలువజేసి, ఆ వ్యక్తి యభ్యున్నతికై వినియోగపరచవలెను. మానవోచితముగ వ్యవహరించుట వలన యీ పరిణామము కలుగును. అట్లు చేయుటవలన ఆ సృజనశక్తి వృద్ధి

పొంది, మార్పు కూడ పొంది, సూక్ష్మశక్తి యగును. ఈ పరిణతి పొందిన తరువాత ఆ వ్యక్తి యింద్రియములకు సృజనవిధానముల యందిచ్ఛయుండిన నుండవచ్చును. ఉండకను పోవచ్చును. ఇచ్ఛయుండినచో, సూక్ష్మశక్తి నిర్మాణమునకు భంగము రాకుండగనే సృజన విధానములయందు. సృజనశక్తిని సాధారణముగ వినియోగింపవచ్చును. కాని, సృజన విధానముల యుద్దేశ్యము నం దాసక్తిలేనివారు తమ సృజనశక్తిని కొంచెము గూడ వెచ్చింపకుండ, మానవశరీర నిర్మాణములను గూర్చిన విచారము కొంచెము కూడ లేకుండగనే, సత్వరాభ్యుదయ సిద్ధికై యత్నింతురు. మానవేతర జీవుల ప్రయోజన సంసిద్ధి వలన మానవ శరీరములను ధరించి నవ్యమానవులుగ నవతరించుట నిత్యము జరుగుచుండునని వారికి తెలియును.

పై రీతిగ పరిణామము పొందిన వ్యక్తి, స్థూల సూక్ష్మ ఆధ్యాత్మికావస్థల యందుగల సమస్త విషయములనుగూర్చి "ఇవి యేమిటి ? ఎందుకు? అను విషయములను విచక్షణ జేసికొని వానిని, వాని యెల వాట్లు, కర్తవ్యములను గూర్చి సరియైన సిద్ధాంతమునకు వచ్చి వానితో సక్రమముగా వ్యవహరించెడి జాగ్రతను పొందును. అప్పుడా వ్యక్తి, ఆ వస్తువులలోని సారసంగ్రహమును గ్రహించి, తన అభ్యున్నతికి, ఇతరుల యభ్యున్నతికికూడ వినియోగించుశక్తి కలిగియుండును.

మనస్సు, అహముతో కూడుటవలన ఏర్పడిన జీవునికి మారుగ తమ శరీరములనే తమ్ముగా భావించుకొనుట ప్రపంచమునందు అత్యధిక సంఖ్యాకులగు మానవులచే చేయబడిన, చేయబడుచున్న ప్రప్రథమ మయిన తప్పు. ఇదితప్పగుటవలన, వారి శరీరములయందు వ్యామోహముగ పరిణమించును. ఈ తప్పు వలన తమ శరీరములపై వ్యామోహము, వాని యందు వాని పోషణకు కావలసిన వస్తువిషయాముల యందు వ్యామోహము ప్రబలమగును. దీని వలన మానవులకు మరల

మరల నిరాశ కలుగుచున్నది. కోపము, తొందరపాటు, సంభ్రమము బయలు దేరుచున్నవి.

కొంతమంది మానవులలో గల "నేనే సర్వాంతర్యామి" ననెడి భావము ఇంకొక ప్రమాదకరమైన తప్పు. ఈ భావము వలన నింత వరకెట్టి సత్ఫలితములును కలుగలేదు. ఇకముందు కలిగి తన్మూలమున మానవ కర్తవ్య సంసిద్ధి మానవోచితముగ కలుగునను యాశయులేదు.

"నేను" "నీవు" అను పదములలోని పరమార్థమును గ్రహించుట సంభ్రమమును పోగొట్టుకొని సత్యసాక్షాత్కారాను భూతిని పొందుట అత్యంతము అసామాన్యమైన విషయము.

"నేను" "నీవు" అను పదములు ఆధ్యాత్మిక భావములో సర్వాంతర్యామికి చెందును. సూక్ష్మభావములో జీవులకు చెల్లును. జీవి యనగా విశ్వఅహముతో కూడిన మనస్సు. స్థూలార్థములో "నేను "నీవు" అను పదములు జీవుల శరీరములకు చెల్లును. 'వ్యక్తి' అను పదము సశరీరులకును, అశరీరులకునుగూడ వర్తించును. భావములు మానవులయొక్క సహజాత స్వభావములనుబట్టి యేర్పడును. అత్యధిక సంఖ్యాకులగు మానవులు, మానవేతర స్వభావముతో వ్యవహరించు చుండుట వలన వారు స్థూలార్థముతోనే భావించి వ్యవహరించెదరు. శరీరములే తామను కొనెడి వారికి "నేనే సర్వాంతర్యామి" ననెడి సిద్ధాంతము సహకరింపదు. మిగిలిన అల్పసంఖ్యాకులు సక్రమవ్యవహారము గల సూక్ష్మేంద్రియములు కలిగి మానవోచిత స్వభావములు, భావములు కలిగి వ్యవహరించు చున్నప్పటికినీ తమను తాము విశ్వ అహముతో గూడిన మనస్సులుగనే భావించుకొనగలరు. కాని సర్వాంతర్యామిగ భావించుకొనలేరు. ఆధ్యాత్మిక భావముతో వ్యవహరించు నేకొలదిమంది వ్యక్తులకో "నేను" అను పదము సర్వార్థ

కము. ఈ విశ్వమందు "నీవు" "వారు" అనునవి వారికి లేవు. "నీవు" అను పదము వారెప్పు డుచ్చరించి నప్పటికిని, అది కూడ సర్వార్థకమే. వారిని గూర్చియే వారు "నీవు" అందురు. వారికి "నీవు" అను పదము నకు "నేను" అను పదమునకు భేదము లేదు. వారు, వ్యక్తి జీవులుగా గల వారి యునికిని, వారికి మూలమును సర్వాంతర్యామినుండి యుత్పాదనమై నట్టి విశ్వజీవికిని గల యేకత్వమును భావించి సాక్షాత్కారాను భూతిని పొందెదరు.

వారు "నేనే సర్వాంతర్యామి" నని చెప్పెడు మాటకు (వారి యునికికి మూలము విశ్వజీవి యగుట వలన) విశ్వ అహముతో కూడిన విశ్వమనస్సని యర్థము. నేను విశ్వ జీవిని; వ్యక్తీకృత విశ్వఅహముతో కూడిన వ్యక్తి మనస్సును కాదు, అని యర్థము. దానికి ప్రత్యక్షముగ "నేను సర్వాంతర్యామి" నని యర్థము కాని పరోక్షముగ నదియే యర్థము. ఏలనన, "విశ్వఅహముతో కూడిన మనస్సును, ఆ విశ్వమనస్సు సర్వాంతర్యామియొక్క సాక్షాత్కారము. నేను నాయునికికి మూలము, ఆధారము నయిన విశ్వజీవితో నేకత్వానుభూతి పొందుట వలనను, నా యొక్క మూలము, ఆధారము అయిన విశ్వజీవి సర్వాంతర్యామి నుండి యావిర్భవించుట వలనను, నేను పరోక్షముగ సర్వాంతర్యామినై ప్రత్యక్షముగ విశ్వజీవి యుంచున్నానని భావము.

"నేను నా యొక్క మూలము ఆధారములతో నేకత్వమును పొందుట వలన, విశ్వజీవినైన నేను, విశ్వజీవిగా సర్వాంతర్యామినుండి యవతరించి, సర్వాంతర్యామిలో నున్నాను. నేను అవశ్యముగ సర్వాంతర్యామిని కావలెను. నేనే సర్వాంతర్యామి ననుట, విశ్వజీవిగా నా యనుభూతి వలనగాని సర్వాంతర్యామిగా నా యనుభూతి వలన గాదు. నేను నాకు మూలము, ఆధారమునైన విశ్వజీవితో నేకత్వమును పొంది,

అందు సంలీనమైన తరువాత నాకు వ్యక్తిత్వమే లేదు. నేను విశ్వీకృతమై నాకు మూలము నాధారమునైన విశ్వజీవిగా సాక్షాత్కరించిన సర్వాంతర్యామిలో నున్నాను" అని యర్థము. ఇదియే మానవానీకము యొక్క సర్వాంతర్యామిత్వము. అట్టి సందర్భములో "నేనే సర్వాంతర్యామి" నను భావము విశ్వవ్యాప్తముగ నవలంబనీయము కాదు.

సక్రమముగ వ్యవహరింపని సూక్ష్మేంద్రియములు కల వ్యక్తులీ భావము ననుసరించి "నేనే సర్వాంతర్యామి" ననుకొన్నచో వారి యూహలకు మూలము శరీరములే తామనుకొనెడి భావమై యుండును. శరీరములే తామనుకొనెడి భావము, తాము సర్వాంతర్యామి యనెడి భావము, పరస్పర విరుద్ధములు. ఇట్టి భావములు శరీరములే మానవులనియు, శరీరముల మృత్యువుతో జీవులు నశించుననను భావము కలిగించును. గుణరూపక సంపూర్ణత లేని సృజనశక్తి యీ యూహకు (imagination) కారణ మగును. గుణ రూపక సంపూర్ణత లేకపోయిన నెటికిని, పరిమాణరూపక సంపూర్ణత యుండుటవలన ఆ సృజనశక్తి సూక్ష్మ శక్తిగా మారును. ఇట్టి స్థితియందలి సూక్ష్మశక్తి వ్యవహారణ గల వ్యక్తుల ప్రేమ మిక్కిలి స్వార్థయుతమై, స్వలాభమును కోరునదియై యుండును. అట్టివారు చైతన్యముతో కూడిన సూక్ష్మేంద్రియములను కలిగియుండుట వలన వస్తు విషయాదుల యందలి సూక్ష్మ పరిస్థితులను గ్రహించి వానినిగూర్చి తర్కించుటకును, వివరించుటకును సమర్థులుగ నుందురు. వస్తు విషయాదులతో వారి వ్యవహారము సవ్యము కానిదియు, స్వార్థముతో కూడినదియు నైన ప్రేమవలన ప్రబోధితమై స్వప్రయోజనము నిమిత్తము, అహమువలన సూచింపబడిన మార్గముల యందుండును. కాని వారి సూక్ష్మేంద్రియములు సమర్థములై యుండుటవలన వారి ప్రేమ, అమానుషము, స్వార్థపరము, అపసవ్యము నయినప్పటికిని వారి యుద్దేశ్యములను సమర్థముగ నిర్వ

హింప గలుగుదురు. "నేను సర్వాంతర్యామి" నను భావము నందలి క్లిష్టత మూలమున, ఈ భావము ప్రేమపై నగ్రస్థానమును పొందినట్లు కనబడును.-ఇప్పటికినీ కొందరు మానవులీ భావమునకు ప్రాధాన్యము నిచ్చుచునే యున్నారు. పూర్వపు టాధ్యాత్మిక వ్యక్తుల ప్రవచనముల యాధారముపై, ఈ భావమును గ్రహించిన వ్యక్తులు, ప్రపంచము నం దధిక సామర్థ్యమును పొంది అనేక కాలములందనేక భాగములలో మానవులకు అతి యుపద్రవకారకులుగా పరిణమించిరి.

ఇట్టి మానవులను ప్రపంచము "రాక్షసులని" అప్పుడే పిలచినది. కర్తవ్యములను గ్రహించి, అట్టి కర్తవ్య సాధనకొరకు సామర్థ్యమును పొంది అందులకు అవసరమయిన గుణరూపకము సంపూర్ణతగల సూక్ష్మశక్తిని పొందకుండ వ్యవహరించుట ప్రపంచమునందలి సమస్త జీవుల యభ్యుదయమునకు భంగకరము.

అందువలన,

మానవులు అనుభవజ్ఞు లయ్యెదరుగాక !

మానవులు బాధ్యతాయుతు లయ్యెదరుగాక !

మానవులు సంతృప్తిని పొందెదరుగాక !

మానవప్రేమ మానవోచిత మగుగాక !



## తొమ్మిదవ అధ్యాయము

# మానవ పతనము

విశ్వజీవి వ్యక్తీకృతమగుట ప్రారంభించిన కాలము ఈ సందేశము నందు ప్రారంభ కాలము అనబడినది. విశ్వజీవి వ్యక్తీకృత మగుట ప్రారంభించినది మొదలు అటుపిమ్మట చాల కాలమువరకు విశ్వ అహముతో కూడిన వ్యక్తీకృత మనస్సులైన వ్యక్తిజీవులు ఆదిమస్థితియందే యుండిరి. "ఆదిమ" అనెడి పదము విశ్వజీవి స్థితికి వర్తించును. ఆదిమ స్థితియందలి మానవులు మానవుల కుచితమైన అభ్యాసములతో నుండిరి. వారి శరీరములు తమకు కావలసిన పోషణ పదార్థములను ఆ యా వ్యక్తుల శ్రద్ధ ప్రయత్నములతో నిమిత్తము లేకుండ, వాని యంతట అవి సరాసరి పంచభూతములనుండి లీనమొనర్చుకొనెడివి.

తరువాత వస్త్వంతర, వస్తు ధర్మ నిర్వహణ ఫలితముగా (action of matter within matter) మూల పదార్థము, ఆధ్యాత్మికము నుండి స్థూలమువరకును గల మానవేంద్రియములు పరిణామము నొందెను. అవి వాని ఆదిమస్థితిని పోగొట్టుకొనెను. వారి శరీరములు కూడ అప్రయత్నముగ ఆహారపదార్థముల నాకళింపు చేసికొను శక్తిని, ఆ యా శరీరములలోని వ్యక్తుల శ్రద్ధాశక్తులతో ప్రసక్తి లేకుండగ పోషణ పదార్థములను గ్రహించెడి శక్తిని గోల్పోయెను. ఈ విధముగ భూతములనుండి పోషణపదార్థములను మానవ శరీరములు గ్రహించెడి పద్ధతి విశ్వ నిర్మాణ సిద్ధాంతము ననుసరించియు మానవ వ్యక్తుల

యొక్కయు వారి శరీరములయొక్కయు నిర్మాణముల ననుసరించి యున్నది.

విశ్వ నిర్మాణమునందలి యంగములు మానవ వ్యక్తుల యొక్కయు, వారి శరీరముల యొక్కయు అంగముల స్థితులు వేరయి నప్పటికిని ఒక్కటే. విశ్వనిర్మాణము, మానవ వ్యక్తులయొక్కయు, వారి శరీరముల యొక్కయు నిర్మాణము ఒకేరీతినై యున్నవి. అందు వలన విశ్వనిర్మాణమునకు, నిర్మాణాంగములకును మానవ వ్యక్తుల యొక్కయు, వారిశరీరములయొక్కయు నిర్మాణమునకును, నిర్మాణాంగ ములకును, సుస్పష్టము, నిరంతరమునైన సమైక్యత గలదు.

ఈ సమైక్యత విశ్వజీవియొక్కయు, మానవ వ్యక్తుల యొక్క విశ్వజీవిని గూర్చిన విజ్ఞానముపైననూ నాధారపడియున్నది. విశ్వజీవిని గూర్చిన విజ్ఞానము, మానవులను గూర్చిన విజ్ఞానము, ఆ విజ్ఞానమును గూర్చిన స్వవిజ్ఞానముపై నాధారపడి యుండును. విశ్వజీవిని గూర్చి నట్టియూ, మానవులను గూర్చినట్టియూ స్వవిజ్ఞానమే వాని కాధారము.

సమస్త జీవులయందుగల విజ్ఞానము, స్వవిజ్ఞానము విశ్వమం దున్నవి. ఈ విశ్వమందలి అనగా విశ్వ జీవియందు, మానవులయందు గల విజ్ఞానము, స్వవిజ్ఞానము నిరంతర సమైక్యత గల్గి ఒక్కటిగనే యున్నవి. ఈ సమైక్యతను గూర్చిన విజ్ఞానము విశ్వజీవియొక్కయు మానవులయొక్కయు నిర్మాణములు, నిర్మాణాంగముల యేకత్వమును గూర్చిన విజ్ఞానము, విశ్వమందలి స్వవిజ్ఞానముపై నాధారపడి యున్నవి. ఇవియే స్థూలమునుండి ఆధ్యాత్మికము వరకుగల శక్తుల వ్యవహారణ కాధారమగుచున్నవి. విశ్వమందలి, విశ్వజీవియందలి, వ్యక్తి జీవుల యందలి, వస్తు విషయాదుల యందలి ఈ శక్తులు ఆయా జాతుల యందు సమైక్యమై, ఏకమై యున్నవి. విశ్వమందు, విశ్వజీవియందు

వస్తువిషయాదులయందు ప్రేమ, జ్ఞాన, సామర్థ్య శక్తుల వ్యవహార ణకు ఈ శక్తులాధారము. విశ్వమందలి, విశ్వజీవియందలి. మానవవ్యక్తుల యందలి ప్రేమ, జ్ఞాన, సామర్థ్య శక్తులు నిరంతర సమైక్యత, ఏక త్వము కల్గియున్నవి.

విశ్వజీవియందలి, వ్యక్తుల శరీరముల యందలి, వస్తువిషయాదుల యందలి స్థూలశక్తి నిరంతర సమైక్యత, ఏకత్వము కలిగియున్నవి. అందువలన పోషణ పదార్థములను, ఆకాశమునుండి, పంచభూతముల నుండి, శరీరపోషణకు కావలసినంత సరాసరిగ గ్రహించు శక్తి మానవ వ్యక్తుల శరీరములకు, ఇంద్రియములకు కలిగియుండుట వలన వ్యక్తుల శ్రద్ధాసక్తులతో నిమిత్తము లేకుండ శరీరములు ఆదికాలములో తమంత తాము పోషింపబడు చుండెడివి.

మానవేతర జీవులవలె గాక మానవులకు స్వవిజ్ఞాన మున్నది. ప్రేమ, జ్ఞాన, సామర్థ్యశక్తుల యొక్క నిర్మాణమును గూర్చి, తదంగ ములను గూర్చి, విజ్ఞానముతో వాని యేకత్వమును గూర్చి, విజ్ఞాన ములో విశ్వము, విశ్వజీవి, వ్యక్తి జీవి, వస్తువిషయాదులలో సంపూర్ణ మయిన వ్యవహారమును గూర్చిన జ్ఞానమున్నది. అందువలన, ఆదికాల మందు మానవ శరీరములు తమంత తాము వ్యక్తుల శ్రద్ధాసక్తులతో నిమిత్తము లేకుండ పోషింపబడెడివి.

మానవుల యందలి యీ ఆదికాలపు స్థితి, మానవుల విజ్ఞా నము, స్వవిజ్ఞాన శక్తులు, ఇంద్రియములపై నాధారపడి యుండెను. వీనిలో ఏ మాత్రము లోటుకల్గినను మానవులు తమ ఆదిమస్థితిలో వ్యవహరించుట కసమర్థు లగుదురు, ఈ యసమర్థత వలన యింద్రి యములు సక్రమముగ వ్యవహరింపకపోవుట మూలమున ఆదిస్థితికి నష్టము కలిగి శరీరముల స్వయంపోషకస్థితి పోయెను.

మానవుల ఆదిమస్థితిలో కలిగిన నష్టమువలన శరీరముల స్వయం పోషక స్థితిపోవుట వలన శరీరములకు కావలసిన పోషణ పదార్థములను లీనము చేసికొనుటకు వ్యక్తుల శ్రద్ధాసక్తు లవసరమయ్యెను. ఇది మానవ పతనమందలి ప్రథమావస్థ. మొదటి దశ.

విశ్వ మనస్సు, విశ్వఅహాముల కలయికవలన విశ్వజీవి యేర్ప డును. విశ్వజీవి వ్యక్తీకృత మయ్యెడి విధానములో అనగా విశ్వజీవి వ్యక్తి జీవులుగా సాక్షాత్కార మయ్యెడి విధానములో వ్యక్తి మనస్సు లేర్పడునపుడు విశ్వఅహామున్నది. వ్యక్తీకృతమైన విశ్వ మనస్సులు విశ్వఅహాముతో కలిసి వ్యక్తిజీవు లగుచున్నవి. వ్యక్తి అహాము లేర్పడిన తరువాత అవి తమ వ్యక్తిత్వమును పోగొట్టుకొన కుండ వ్యక్తీకృత విశ్వఅహాముతో కలియును. ఈ నైక్యత మూల మున ఆయా జీవుల వ్యక్తి అహాము, విశ్వఅహాములకు భేదము లేదు. ఈ మిశ్రమము స్పష్టమైనది. ఆయా వ్యక్తు లెప్పుడు కోరినచో అప్పుడు విడదీయబడ గలవు. ఆదికాలమున మానవ శరీరములలో స్వయంపోషక శక్తి నశించుట, మానవ వ్యక్తుల ఆదిమస్థితి నశించుట, వ్యక్తి అహాములు ప్రారంభమగుట, అవి విశ్వఅహాముల తోడను, వాని మూలముగా వ్యక్తులతో నేకమగుట మూలమున మానవశరీర ములకు కావలసిన పోషణపదార్థములను పరిసర ప్రదేశములనుండి లీనము చేసికొనుటకు ఆ వ్యక్తులు కోరుకొనవలసిన యావశ్యకత కలిగినది.

ఈ కాలములో వ్యక్తిఅహాముల యొక్కయు వ్యక్తిమనస్సుల యొక్కయు మిశ్రమమువలన, కోరికవలన శరీరపోషణకు కావలసిన పదా ర్థములను విలీనమొనర్చుకొనెడి శక్తిపోయి, యింకనూ పతనము సంభ వించెను. ఈ మూడవస్థియందు మానవులు యింద్రియములను కేంద్రీ

కరించి పంచభూతముల నుండి ఆహారపదార్థములను గ్రహింపవలసి వచ్చెను. నాలుగవ స్థితియందీ యింద్రియ కేంద్రీకరణము ఎక్కువ కాలము చేయుటయే గాక, ఒక్కొక్క భూతమునుండి వేరువేరుగా గ్రహించి అందలి పోషణ పదార్థములతో శరీరపోషణ గావింపబడెడిది. ఈ శక్తియు పోవుటతో న్యావస్థి యంతమయ్యెను. ఇంతవరకునూ కొంచెము కూడ శరీర పరిశ్రమ యవసరము లేకుండ పోషణపదార్థము లను గ్రహించుట శరీరమునందలి సమస్త రంధ్రముల నుండియు జరిగెడెది. నోరు, ఆసనము, సృజనాంగములనుండి మాత్రమే కాదు.

అయిదవ దశప్రారంభము నుండియు వ్యక్తుల యొక్క శ్రద్ధాసక్తులే కాకుండా పండ్లను, దుంపలను త్రవ్వుట కోయుట మొదలగు శరీరపరిశ్రమ కూడ కావలసివచ్చెను. అట్టి పదార్థములను శరీరము లోనికి తీసికొని వానిలోని పోషణపదార్థములను గ్రహించి మిగిలిన పిప్పిని విసర్జించుట అవసరమయ్యెను.

మొదటి మూడు దశలలోను పోషణ పదార్థములను మాత్రమే శరీరములు గ్రహించుచుండుట వలన సారములేని పిప్పిని విసర్జించు ప్రసక్తియే లేదు. సారములులేని పదార్థములు లేవు. నాల్గవ దశయందే యే ద్వారములనుండి పంచభూతములు లోనికి గ్రహింపబడినవో ఆ యా ద్వారముల నుండియే అనావశ్యక పదార్థముల విసర్జనయు జరిగెడిది. కాని ప్రత్యేకముగ నోరు, ఆసనము, సృజనాంగములనుండియే కాదు. అయిదవ దశయందు నోటిద్వారా మాత్రమే ఆహారము తినుట ప్రారంభమగుటతో, నోరు, ఆసనము, సృజనాంగముల ద్వారా, అనావశ్యక పదార్థముల విసర్జనయు ప్రారంభమైనది.

ఆరవ దశయందు, ఐదవదశయందలి పదార్థములనే వండుకొని తినుట ప్రారంభమైనది. తరువాత తమ శరీరములకు అప్పటి కప్పుడు

కావలసిన పదార్థములనేకాక అధికముగా సంపాదించి, నిలువచేసి కొనుట ప్రారంభమయ్యెను. అందువలన, అనేకమంది మానవులకు కావలసిన పోషణపదార్థములు లభింపకపోవుటయు తటస్థించెను. ఇదియే సప్తమ పతనావస్థ. ఇదియే ప్రస్తుతస్థితి.

ఒక దశనుండి మరియొక దశకు ఆహారసంపాదన గ్రహణశక్తుల లోని పతనముతో పాటు మానవుల యితర స్వభావ లక్షణము లలోను. వారి శరీరముల వ్యవహారములలోను పతనము కల్గినది. ఒక దశకునూ, మరియొక దశకునూ నడుమ నెంతయో కాలము గడచినది. ప్రస్తుతపు సప్తమ పతనావస్థ ప్రారంభ కాలమును ప్రస్తుత కాలపు మానవు లాటవికస్థితి యని అందురు. ఈ ఆటవిక యుగమునకు ప్రారంభకాలమునందు మానవులు నిరంతరము తమ శరీరములకు సౌఖ్యమును, సంతోషమునూ గూర్చుచుండెడివారు. అందు వలన సామర్థ్య ప్రాబల్యము కలిగియుండెడివారు. తరువాత నీ అల వాటు అధికముగా సంపాదింపబడి కూడబెట్టబడిన గృహవస్తు విష యాదులను సంరక్షించుకొనుటగా మారిపోయినది. ఇట్టి దుస్థితియందు ఒకరి తరువాత మరియొకరుగా కొందరు నిత్యప్రసిద్ధులైన, విశ్వాభరణ ములనదగు విశ్వనిర్మాణాధికారులు విశ్వసిద్ధాంతకర్తలు నగు మాన వులు, విశ్వావశ్యకత ననుసరించి మానవపతనము నరికట్టి, మానవుల యలవాట్లను మరల మంచి స్థితిలోనికి గొనిపోవుటకై యవతరించిరి. వారిలో కొందరు పూర్ణసామర్థ్యము కలవారు. కొద్దిమంది మాత్రము పూర్ణప్రేమ సామర్థ్యములను రెండిటిని కలవారు. మరికొద్దిమంది పూర్ణప్రేమ జ్ఞానముల రెండింటిని కలిగియుండిరి. ప్రేమ, జ్ఞాన, సామర్థ్యములను మూడింటిని సంపూర్ణముగా కలిగిన మూర్తి ఒక్క పర్యాయము మాత్రమే యవతరించెను. విశ్వావశ్యకత ననుసరించిన

యీ విశ్వ నిర్మాణాధికారుల యవతరణ యను సిద్ధాంత మింకను సాగుచునే యున్నది. ఇంకను రాబోవు కాలములో గూడ సాగగలదు. స్వైక్యత, శాంతి, సుఖజీవనముల ద్వారా అభ్యుదయమును పొందగోరు మానవులు మానవత్వ ప్రయోజనమును మానవుల కుచితమైన రీతిని సాధించి, వారి ఆదిమ స్థితిని, వారి సహజ స్థితిని మరల పొందుటయే విశ్వ నిర్మాణాధికారుల యవతరణకు గల పరమార్థము. మానవులచే నట్లు ప్రవర్తింప జేయుటయే వారి యవతరణమునకు గల అవసరము.

ఈదుట చేత కాకపోవుటవలన నీటిలో మునిగిపోవుచున్న వారికి, ఈత చేతనైన వారు గట్టున నిలువబడి కేకలు వేయుచు పాఠములు చెప్పిన చాలదు. వారు నీటిలోనికి దుమికి, మునిగి, మునిగినవారిని జేరి, పైకి లేవనెత్తి, సహాయపడి తాము యీది, వారిచేత యీదించి గట్టునకు జేర్చవలెను. మునిగిన వారిని కాపాడెడు విధానమునందు, కాపాడు వారు కూడ కొంతవరకు, కాపాడబడెడు వారివలెనే ప్రవర్తించవలయును. కొంతవరకు, బాహ్యముగా తమవలెనే వ్యవహరించిన, వ్యవహరించుచున్న సంరక్షకులను వారి ప్రవర్తనల యందలి ప్రయోజనమును గుర్తింపలేక, వారి బోధనలను అవగాహన చేసికొనలేక మానవులు అట్టి బోధనలను అపార్థము చేసికొని తప్పుగా వ్యాప్తి జేసి, సిద్ధాంతములను తప్పుగా ననుసరించి యెప్పటివలెనే తప్పు దారినే పోవుచున్నారు. నేటి కాలమందు ప్రపంచమందలి అన్ని భాగములలోను ఈ పద్ధతియే సాగుచున్నది. పూర్వమునుండి యిప్పటివరకును ఈ రీతిగనే జరిగినది.

ఆ యా ప్రాంతములయందలి వ్యక్తుల యవగాహనాశక్తి ననుసరించి, వారుండిన పరిస్థితులు, వాతావరణమును అనుసరించి అప్పటి

మానవుల పతనావస్థ యందలి స్థితిని గమనించి, రక్షకులు విశ్వ సిద్ధాంతమును ప్రబోధించిరి. మానవులతో సహా సమస్త వస్తు విషయములతో వ్యవహరించుట యందు వారు ప్రబోధించిన సిద్ధాంతములను, తమ ప్రవర్తన, స్వభావము, అలవాట్లలో ప్రదర్శించిరి. విశ్వ లక్షణము (universal aspects) లైన ప్రేమ, జ్ఞాన, సామర్థ్యముల క్రమమైన యభివృద్ధిపై వారు కేంద్రీకరించిరి. ఈ మూడింటిలోను ఏ ఒకటి, రెండో ప్రాబల్యము కలిగి మిగిలినవానికన్న అధికముగ నభివృద్ధి పొందుటను అరికట్టి మానవకర్తవ్యమును మానవుల కుచితమైన రీతిని సాధించి, మానవులందరును అభ్యుదయమును పొందునట్లు వారు చేయ ప్రయత్నించిరి.

ఆధ్యాత్మిక ప్రబోధకులైన యీ రక్షకుల శరీరములు సాధారణ పరిస్థితులలోననో, అసాధారణ పరిస్థితులలోననో అస్తమించిన తరువాత వారు శరీరములతో నున్నప్పుడు సంచరించిన వేరువేరు ప్రాంతములందు వారి పేరిట మానవ సంఘము లేర్పడెను. ఈ సంఘములు విశ్వ సిద్ధాంతమును, మానవుల సక్రమ ప్రవర్తనకు అనువైన ధర్మములను. తమకో తమకే కాకుండా మిగిలిన ప్రపంచమున కంతకూ వ్యాప్తి జేయ దొడగినవి. విశ్వము నెడల సక్రమ ప్రవర్తన సిద్ధాంతములను. విశ్వనిర్మాణ సిద్ధాంతములను. విశ్వమందలి సమస్తముయొక్క నిర్మాణ సిద్ధాంతములను తాము అపార్థము చేసికొనిన రీతినే యితరులకు బోధించి అందరను తప్పుత్రోవలో పెట్టినవి. అపార్థము చేసికొనబడినట్టియు అపార్థమును కలిగించునట్టి యీ సిద్ధాంతములే యీ మానవాళికమునందు ఒక వ్యక్తినుండి మరియొక వ్యక్తికి వ్యాపించినవి. కాలక్రమమున వివిధ ప్రాంతములలో, వివిధ కాలములలో ఆ యీ సంఘములచే గ్రంథరూప మొనరింపబడినవి. ఆ గ్రంథములలో విశ్వ సిద్ధాంతమునందు వారు అవగాహన చేసికొనిన తప్పు పద్ధతుల

లోని నామమాత్రమైనట్టియు, లెక్కింపదగనివియు నగు స్వల్ప భేదము లపైననే నొక్కి వక్కాణించిరి. విశ్వసిద్ధాంతము(universal principle) ను వారిలోని విభేదముల కనువుగ రూపొందించి దానికి మతము అని పేరుపెట్టిరి. అవి మతధర్మములనిరి. ఇదియొక విశ్వవిపత్తు. ఈ రీతిగ విశ్వసిద్ధాంతములోని అతి సామాన్యమైన విషయములలోని విభిన్నత్వము పెద్దదిగా జేయబడిన రక్షకుల పేరిట గ్రంథరూపములలో బయలుదేరి విశ్వసిద్ధాంతములో సహజముగా గల సామరస్యమును మరపించి విభేదములనే యెగపరచుచున్నవి.

ఈ తప్పులను సరిదిద్దుకొనెడి హక్కును, అవకాశములను మానవు లెప్పుడును పోగొట్టుకొనరు. మానవుల యునికివలన ప్రయోజనము విశ్వావశ్యకతా సంసిద్ధియగుటయే యిందుకు కారణము. తప్పుదారిలో నున్న మానవులు, ముఖ్యముగా వారి యధినేతలు, నాయకులును నిప్పటికైననూ యుక్తాయుక్త విచారణ, విచక్షణ కలిగి యుండవలెను. గత కాలములో జరిగిపోయినట్టియూ, వర్తమానకాలములో జరుగుచున్నట్టియు, పరిస్థితులను సరిగా తెలిసికొనుటకు కావలసిన చైతన్యవంతములైన సూక్ష్మేంద్రియములను వారు పొందవలెను. వారు ప్రస్తుతమువలెనే సంచరించుట సాగించిన యెడల వారి సంతతి వారి కేమి జరుగనున్నదో, ఇట్టి సక్రమమైన యవగాహనవలన వారు కొంతవరకైననూ తెలిసికొన గలుగుదురు.

ఆ విశ్వ సిద్ధాంతాధినేతలు విశ్వజీవియొక్క ప్రత్యేక వ్యక్తీకృత స్వరూపములు. వారు విశ్వజీవియొక్క ప్రత్యేక సాక్షాత్కారములు. విశ్వజీవితోడను, విశ్వమందలి సమస్తముతోడను తమ యేకత్వమును గూర్చిన విజ్ఞానమునందు వారు స్థిరానుభూతి గలవారు. వారు వేరువేరు కాలములందు వేరువేరు ప్రాంతములలో నవతరించి

నప్పటికినీ వారి కార్యకలాపము లన్నియు అన్యోన్య సహాకారకములు, సంపూరకములునై యున్నవి.

ఆరవ పతనావస్థ ప్రారంభ కాలమునందు మానవుల యలవాట్లు సామర్థ్య ప్రాబల్యముపై నాధారపడి యున్నప్పుడు, అప్పటి మానవులు వారి యలవాటు లనాగరికములనిగాని, వారు అనాగరికు లనిగాని భావించి యుండలేదు. వారి యలవాటులు మంచివేయనియు వారు నాగరిక మానవులనియు భావించిరి. కాని వారి సంతతివారు, సప్తమ పతనావస్థ ప్రారంభకాలపువారు, వారి పూర్వు లనాగరికు లనియు, వారి యలవాట్లు అనాగరికము లనియు భావించిరి. కాని వారునూ అవే యలవాట్లతో నుండిరి. అయినప్పటికినీ వారు తమ యలవాట్లు నాగరికము లనియు, తాము నాగరికులమనియు అనుకొను చున్నారు. ఇదియొక పరిష్కృత అనాగరికస్థితి. వారు పరిష్కృత అనాగరికులు. విశ్వ సిద్ధాంత ప్రబోధకులును ఆధ్యాత్మిక ప్రాబల్యముతో కూడిన యలవాట్లను కలిగినట్టియు రక్షకులీ సప్తమ పతనావస్థ యందలి మానవులకే ప్రప్రథమముగ ప్రసన్నమైనది. వారి సంతతి వారైన నేటి మానవులు వారిని అనాగరికులుగను ఆదిమ ఆటవిక జాతులకన్న కొంచెము నాగరికులుగను భావింతురు. ప్రేమకన్న జ్ఞాన, సామర్థ్యముల యొక్క ప్రాబల్యమునే కలిగిన తామే పరిపూర్ణ నాగరికులని యనుకొందురు. నేటి మానవుల సంతతియైన భావి మానవులు ప్రస్తుత మానవులను క్రమ నిర్మిత (organised) మైన అనాగరికు లందురు. మంచి కాలపువారిలో తప్పనిసరిగా జ్ఞాన సామర్థ్యములకన్న ప్రేమ ప్రాబల్యముగ నుండును. సప్తమ పతనావస్థ ప్రారంభకాలము నుండి యిప్పటివరకూ, అనాగరికులు, పరిష్కృత అనాగరికులు, క్రమ నిర్మిత (organised) అనాగరికులను నీ మూడు తరహాలలోను ఒక దానినుండి మరియొక దానిలోనికి మార్పులు జరిగినప్పుడెల్ల దౌర్జన్య

ప్రయోగము వలననే జరిగినవి. తరహాలు మారినప్పుడెల్ల ప్రయత్నముల వెనుకగల ప్రయోజనముల భిన్నత్వమువలన దౌర్జన్యపు టుపాయులే మెరుగుపరచబడిన సాయుధ సంఘర్షణతో సాగినవి. మానవుల జ్ఞానములో స్వవిజ్ఞానము లేకపోవుట, జ్ఞానసామర్థ్యముకన్న ప్రేమ అతీతమైనదను విజ్ఞానము ప్రజలలో లేకపోవుటయే ఇందులకు కారణము.

ప్రస్తుత యుగమునందు కూడ మానవ సమస్యలను పరిష్కరించు విధానములు పరిష్కృత అనాగరిక యుగమునందు వలెనే సాగుచున్నవి. ఆ కాలములో కేవలము సామర్థ్య ప్రయోగమువలన సాయుధ సంఘర్షణతో జరిగినవో నేడు జ్ఞాన ప్రాబల్యముకల సామర్థ్య ప్రయోగమువలన జరుగుచున్నవి. అనాగరిక యుగమునందు మానవ స్వభావములు జాతిద్వేషముతో ప్రబలమై యుండెడివి. పరిష్కృత యుగమునందు జాతి, మత విద్వేషములు ప్రాబల్యము వహించినవి. ప్రస్తుతపు యుగమునందు జాతి, మత విద్వేషములేగాక శరీరముల రంగుగూడ విద్వేష కారణ మగుచున్నది.

మానవులలోని ఈ యలవాట్లను పురికొల్పునది విద్వేషము. విద్వేషము విభాగములపైనను, విభిన్నతలపైనను ఆధారపడియుండును. ఇట్టి విభాగముల పైనను భిన్నత్వములపైనను ఆధారపడిన మానవ సమస్యా పరిష్కారమార్గ మేదైయైనను అసాధ్యమే యగును. అట్టి విధానము విశ్వవ్యాప్తము కానేరదు. అందువలన, మొట్టమొదటి సమస్యలను పరిష్కరించుటకు మూలమైన సూత్రములలో మార్పులు కలిగినగాని సమైక్యత, శాంతి సంపదల ద్వారా అభివృద్ధిని బాహ్యముఖమునుండి, ఊర్ధ్వముఖముగా మార్చుట యసాధ్యము. జాతి, మతము, రంగులవలన కలిగిన భిన్నత్వముల మూలమున కలిగిన విద్వేషములతో, అసంఖ్యాకులైన జనులను నాశనము చేయుట, ఆ వినాశన

కృత్యములందు సంతోషమును పొందుటకు కారణము శరీరములతో సహా వస్తువిషయాదులయందు, యింద్రియములకు గల సంబంధము. ఇందులకు వారి ప్రేమకన్న, వారి జ్ఞానసామర్థ్యములు బలీయ మగు టయే కారణము.

ప్రజానాయకు లనేకులీ వినాశన కార్యక్రమమున కంగీకరింపరు. వారి సహజ వివేకమున కది రుచింపదు. మానవులు తమ జాతిపై క్రూరత్వము వహింపలేరు. స్వజాతీయుల వినాశనమునందు వినోదమును పొందెడి మానవేతర జీవులలో ఆయభ్యాసముపోయిన పిమ్మటనే ఉన్న తేంద్రియములనుపొంది మానవులగుచున్నారు, అందువలన స్వజాతీయులయెడ క్రూరత్వమువహించుట మానవత్వమున కనుకూల లక్షణము కాదు. కాని జరుగుచున్న యీ వినాశనము నరికట్టుటకు వారు అసమర్థులగుటయే గాక కనీసము అట్టి కార్యక్రమమందు తాము సంబంధము కల్పించుకొనకుండ యుండలేకున్నారు. ఏలనన తమతో అవినాభావ సంబంధమునొందిన వ్యక్తి అహముతే తమ యింద్రియములను సంచాలనము చేయుచున్నవి. మానవుని సహజస్థితి పోవుటయే యిందుకు కారణము.

అందువలన,

మానవులు తామే తమ అహములను సంచాలనము (direct) చేయుదురు గాక !

మానవప్రేమ వారి జ్ఞాన, సామర్థ్యములకన్న ప్రబలమగుగాక ! మానవులు తమ సహజస్థితిని పొందెదరు గాక !



# పదవ అధ్యాయము

# వేదము

వేదము స్వస్మృతి దాయకము. మార్గదర్శకము. మానవుల సహజ స్థితిలో ఒక దశనుండి మరియొక దశకు పతనము జరుగుటతో పాటు, ఒండొరుల మధ్య భావములను వ్యాపింప జేసికొను శక్తి క్షీణించినది. ఆదికాలమందు ఒకరొకరి మధ్య భావములను ప్రసరింప జేసికొనవలసిన అవసరమే యుండెడిది కాదు. కొంతకాలమైన తరువాత అట్టి అవసరము కలిగినది. తమ ఉద్దేశ్యముల నితరులకు తెలియజేయ వలయునను కోరిక కలిగినంత మాత్రమున అట్టి కోరిక సాధింపబడెడిది. మరికొంత కాలమైన తరువాత ఏకాగ్రత గల ధ్యానము వలన అట్టి ప్రయోజనము సాధింపబడెడిది. నాల్గవ దశయందు భావనవలన సాధింపబడెడిది. ఐదవ దశయందు ఆలోచన వలననూ, ఆరవ దశయందు సౌంజ్ఞల వలననూ సాధింపబడెడిది. ప్రస్తుతము, సప్తమావస్థయందు సౌంజ్ఞ, భాషణ, వ్రాతమూలకముగ సాధింపబడుచున్నది. ఆదినుండి నేటివరకు గల యీ సర్వావస్థలయందును నితరులతో పాటు ఆధ్యాత్మిక మహావ్యక్తులుగూడ వుండియుండిరి. వారు యితరమానవులతో పాటు జీవించుచు, వారివలెనే సంచరించుచు అన్ని సందర్భములలోనూ బాహ్యదృష్టికి వారివలెనే ప్రవర్తించు చుండిరి. కొందరు సాధారణ విధానమున నశించెడు శరీరములను కలిగియుండిరి. మరికొందరు అసాధారణమైన జీవనపరిణామములు కలిగియుండిరి. ఇంకను కొందరకు తాము కోరుకొనినగాని వారి శరీరములకు మరణము లేదు.

వారిలో కొందరు తమ సహజ స్థితిలోనే యున్నారు. ఈ విశ్వమందు తమకు ఆదికాలములో గల సహజ శక్తులతో వ్యవహరించుచున్నారు. వారికి వ్యక్తి అహములు లేవు. అవి విశ్వాహములతో అవినాభావముగ కలిసిపోయినవి. ఏ విశ్వజీవి సాక్షాత్కారము వలన తాము నవతరించిరో, ఏ విశ్వజీవి తమ రూపములలో విశదీకృతమైనదో, ఆ విశ్వజీవితో ఏకత్వాను భూతియందు స్థిరులైయుండిరి. అందువలన విశ్వజీవి కార్యకలాపములతో సామరస్యము కలిగియుండిరి. వారు తమ యునికి వలననే తమ పరమాశయమైన విశ్వసామరస్యమును నిలుపుచుండిరి. తమ వాంఛల మూలముననే వ్యవహరించెడి మరికొందరు వీరికన్న కొంచెమధిక సంఖ్యాకముగనే గలరు. వారునూ విశ్వజీవితో ఏకత్వానుభూతియందు స్థిరులైనవారే. బాధ్యతాయుతముగ వ్యవహరించి తమ కర్తవ్యమును సాధించుటకొరకు విశ్వజీవితో సామరస్యము కలిగియుందురు. విశ్వమందలి భౌతిక సామరస్యమును కాపాడుట, వివిధ భూతములను యథాస్థితి నుందుంచుటయే వారి కర్తవ్యము. ఈ మూడవ తరగతివారు రెండవ తరగతికన్న అనేక సంఖ్యాకులు. వారు విశ్వజీవితో యేకత్వాను భూతియందు స్థిరులైనవారుకారు. వారి యహములు పరిణతిని పొందినవే. అవి స్వతంత్రముగ. విశ్వాహముతో సామరస్యముగ నుండును. వారు ఏకాగ్రత మూలముగ వ్యవహరింతురు. పతనమందుచున్న భౌతికపరమాణువులలో పునరుజ్జీవనము కలిగించుటయే వారికర్తవ్యము. విశ్వసామరస్యమును సంరక్షించువారు, భౌతిక సామరస్యమును రక్షించువారు, ఏకాగ్రత మూలమున వ్యవహరించువారు అను నీ మూడు తరగతుల వ్యక్తులలోను ఎట్టి మార్పులు గాని పతనముగాని కలుగవు, కలుగనేరవు. ఈ మహావిశ్వము నందలి పరిస్థితులతోగాని, వివిధవస్తువులయొక్క లక్షణములతోగాని నిమిత్తము లేకుండా ఈ మూడు తరగతుల మహావ్యక్తులే ఈ మహావిశ్వభారమును

వహించుచున్నారు.

ఈ మూడు తరగతుల ఆధ్యాత్మిక మహావ్యక్తులే గాక మరల వేరు వేరు విధానములలో వ్యవహరించెడి యితర ఆధ్యాత్మిక మహావ్యక్తులును గలరు. ఈ విధానములలో నొకటి భావనామూలము. వారి అహములు పరివర్తనపొంది అభ్యుదయ ముఖముగ విశ్వజీవితో సామరస్యము కలిగియుండును. విచక్షణామూలమున వ్యవహరించు మరి కొందరున్నారు. వారు పరివర్తనపొందిరి. అభ్యుదయముఖులే, కాని విశ్వజీవితో సామరస్యమును పొందలేదు. ధ్యానము, సౌంజ్ఞలు, శబ్దములు (భాష) ద్వారా వ్యవహరించు మరికొందరున్నారు. వారి పరిణత స్థితియందు స్థిరత్వమును పొందలేదు. అప్పుడప్పుడు బాహ్యముఖ స్వభావముతో నుందురు. అలవాటువల్ల బాహ్యముఖ స్వభావమును, ఊర్ధ్వముఖముగ మార్చుదురు. మానవులకు తమ సహజస్థితిని జ్ఞప్తికి తెచ్చుట, వారి ఆశయములకు అనుకూలముగ వారిని నడిపించుట, తమ వ్యవహారము వలన సక్రమ మార్గమును ప్రబోధించుట మానవులు అభ్యుదయమును పొందునట్లు చేయుట వారి పరమాశయములు. ఈ విధముగ మానవులలో యేడు రకములున్నారు. మూడు విధముల ఆధ్యాత్మిక మహావ్యక్తులు, మూడు విధముల ఆధ్యాత్మిక వ్యక్తులు, సామాన్య మానవులు.

ఈ యేడు విధముల మానవులలోనూ తమ యునికి మాత్రము చేతనే కర్తవ్య సంసిద్ధిని సాధించుచున్నవారు, ఆధ్యాత్మేంద్రియముల ద్వారా వ్యవహరించు చున్నారు. రెండవ విధమువారు మహాసూక్ష్మేంద్రియములద్వారా వ్యవహరించుచున్నారు. మూడవ విధము వారు అత్యధిక సూక్ష్మేంద్రియములద్వారా వ్యవహరించు చున్నారు. నాలుగు, అయిదు విధములవారు సూక్ష్మేంద్రియముల ద్వారా

వ్యవహరించు చున్నారు. ఆరవ విధమువారు స్థూల సృజనేంద్రియముల ద్వారా వ్యవహరించు చున్నారు. సప్తమ శ్రేణివారు కూడ స్థూల సృజనేంద్రియములతోనే వ్యవహరించు చున్నప్పటికినీ స్థూలేంద్రియ ప్రాబల్యము కలిగియుండిరి.

భావన, విచక్షణా విధానములలో వ్యవహరించెడి ఆధ్యాత్మిక వ్యక్తులు ఏడవ విధమునందలి మానవుల పతనావస్థను పరికించి, వారి దుస్థితి నివారించుటకును, అభ్యుదయమును కలుగజేయుటకును తమకు అనుభవములో నున్నట్టియును, సుస్థిరములైన విశ్వసిద్ధాంతమును అప్పటి మానవులకు అనువగురీతిని రూపొందించిరి. అప్పటి మానవుల దుస్థితియే వారి విచక్షణా విషయము. మానవ విమోచనమే వారి పరమాశయము. సిద్ధాంతము చేయుటతోడనే విచక్షణ పరిసమాప్తి నొందినది. ఆ సిద్ధాంతమే మౌనము, సౌంజ్ఞ, అను రూపముల నొందినది. అప్పటినుండి విశ్వమందలి సమస్త మానవుల దుస్థితిని పోగొట్టెడు ఆ సిద్ధాంతము, విశ్వ మానవ విమోచన కారియగు ఆ సిద్ధాంతము భావన, విచక్షణ, మౌనము, సౌంజ్ఞలద్వారా, వ్యవహరించు చుండెను. తరువాత కొంత కాలమునకు మానవుల అవలోకనశక్తి యింకను క్షీణించినది. ఇట్లు క్షీణించిన అవలోకనశక్తి కల మానవులకు కూడ నుపయోగపడునట్లు విమోచన సిద్ధాంతము మౌనము, సౌంజ్ఞల నుండి శబ్దము, భాషా రూపములలోనికి మార్చబడినది. ఇట్లు చాల కాలము జరిగెను. ఇంకను పతనము సంభవించినది. మానవుల అవగాహనశక్తి, జ్ఞప్తి యింకను క్షీణించెను. ఇట్టి స్థితి కనువగునట్లు, యీ యవసరమునకు సరిపడునట్లు, ఆ శబ్దములకు రూపములు కలుగ జేయబడినవి. అనగా అక్షరరూపముగ లిఖింపబడినవి.

పతితులైన మానవులకు విమోచనమును కలిగించెడు విషయ మును గూర్చిన ఆధ్యాత్మిక వ్యక్తుల భావములు విచక్షణా రూపము నొందినవి. విచక్షణ సిద్ధాంతమై, హూనము సౌంజ్ఞలలో స్థిరీకరింపబడి నది. హూనము శబ్దరూపమును పొందినది. వేర్వేరు కాలములలో వెలు వడిన శబ్దములను ఆ యా కాలపు మానవులు క్రోడీకరించిరి.

క్రోడీకరింపబడిన ఈ శబ్దములను వేర్వేరు కాలములకు చెందిన ఆధ్యాత్మిక వ్యక్తులు ఆ శబ్దములయొక్క భావము, విషయము, అవస రము, ప్రయోజనము, సామాన్య మానవుల కవగాహన యగునట్లు కూర్చిరి. సక్రమముగ కూర్చబడిన యీ శబ్దములద్వారా విశ్వసిద్ధాం తముయొక్క వ్యాప్తి, చాల కాలమునుండి జరుగుచున్నది. ఈ శబ్ద సంచయమునే వేదమనియు, వేదాంతమనియు పిలచిరి, పిలుచుచున్నారు.

ఇంకనూ పతనము సంభవించినది. ఈ శబ్ద సంచయము ద్వారా ప్రబోధింప బడుచున్న విశ్వసిద్ధాంతములను జ్ఞాపకముంచుకొనెడి శక్తి కూడ మానవులలో క్షీణించినది. అప్పుడు ఆ కాలపు ఆధ్యాత్మిక వ్యక్తులు ఆ శబ్దములకు గుర్తుల నేర్పరచిరి. అటుతరువాత ఆ శబ్దము లను భావ ప్రయోజనమునకు అనువైనట్లుగ కూర్చి లిఖితరూపము నొందించిరి. ఈ ప్రబోధమునకు ప్రధానమైన ఆశయము మానవులకు తమ సహజస్థితిని గుర్తుకు తెచ్చుట, వారా సహజస్థితిని పొందగోరు నట్లు చేయుటయే! భాషణ, వ్రాత మూలముననే, భావవ్యాప్తి ప్రధా నముగ జరుగుచున్నప్పటికినీ, హూనము, సౌంజ్ఞలద్వారా కూడ అరు దుగానైనను జరుగుచున్నది. ఈ శబ్దముల కూర్పునే భాష యందురు. ఈ భాషయే సంస్కృత మనబడుచున్నది. ఇదియే ఆదిభాష. ఈ ప్రథమ భాషయందు వ్రాయుట, భాషించుట మూలముననే వేదము చాల

కాలము వ్యాప్తినొందినది. తరువాత నీ లిఖితరూపము నొందిన వేద ముల యందలి భావముల నవగాహన చేసికొను శక్తికూడ మానవు లలో క్షీణించినవి. అప్పుడు వేరు వేరు శబ్దాక్షర రూపములలో, ఆది భాష నుండియే వేరు వేరు భాషలు రూపొందింపబడినవి. ఇట్లు రూపొందింపబడిన వివిధ భాషలద్వారా భిన్న, భిన్న పరిస్థితులలో, భిన్నభిన్న తరహాలలో ఆధ్యాత్మిక సిద్ధాంతము ప్రపంచమందలి మానవు లలో వ్యాప్తి చేయబడినది.

ఒకప్పుడు శబ్దముల కూర్పుగా మాత్రమే యుండియున్న వేద వేదాంతములు మానవులకు తమ సహజస్థితిని స్ఫురింపజేయుటకును, వారు అట్టి స్థితిని పొందుటలో సహాయపడుటకును లిఖితరూపము నొందినవి. విశ్వసిద్ధాంతముద్వారా, విశ్వనిర్మాణ సిద్ధాంతములతోడను, వ్యక్తినిర్మాణ సిద్ధాంతములతోడను, సామరస్యముకలిగి, శక్తి పరిణామ విధానములద్వారా, అన్యోన్యము బాధ్యతాయుతులుగ జేయుట కొరకై వేద, వేదాంతములు లిఖితరూపము నొందినవి.

అందువలన, ఏ శరీరములలో బయలుదేరిన సృజనశక్తిని, ఆ శరీరములను శక్తివంతము గావించి, ఆయాశరీరములలోనే లీనము కానిచ్చి, వేద వేదాంతములను, సక్రమముగ నవగాహనచేసికొని, అవి యేమిటో, యెందుకొఱకో తెలిసికొని, విశ్వమందలి సమస్త జీవులతోడను, వస్తువిషయాదులతోడను, సక్రమముగ వ్యవహరింప జేయుట మానవుల ప్రధానబాధ్యత. మానవేతరజీవుల పురోగమనము కూడ మానవ కర్తవ్యసంసిద్ధి వలననే సాధింపబడ గలదు. కావున మానవులు మానవుల కుచితమగురీతిని మానవకర్తవ్యమును సాధించు

టయే విశ్వకర్తవ్యమును సాధించుటయగును. కనుక మానవకర్తవ్య సంసిద్ధియే విశ్వకర్తవ్యసంసిద్ధి.

అందువలన,

వేదము, ఆధ్యాత్మిక సిద్ధాంతములు, మానవులచే ఆసిద్ధాంతాను గతమైన కర్తవ్యసాధనకు సహాయకారి యగుగాక !

ఆ సిద్ధాంతములలో గల యుద్దేశ్యములు మానవులచే కర్తవ్యములు సాధింపబడుటకు సహాయకారు లగుగాక !



# పదునొకండవ అధ్యాయము

# వైవాహిక సంస్థ

ఈ విశ్వమందు పురుషశరీరముతో నవతరించిన ఆదివ్యక్తి ఉన్ముఖత ననుసరించి స్త్రీ శరీరముతో మరియొక వ్యక్తి యవతరించెను. వ్యక్తి యొక్కయు, ఆ వ్యక్తి శరీరము యొక్కయు నిర్మాణమును గూర్చిన పరిజ్ఞానమును పొందుటయే ఈ ఉన్ముఖత. విశ్వజీవియొక్క వ్యక్తీకరణాలో, వ్యక్తీకృతమైన విశ్వమనస్సుతో పాటు విశ్వఅహముండుటవలన కలిగిన ఫలితమే యీ ఉన్ముఖత. ఆదివ్యక్తిలో గల యీ ఉన్ముఖతకు మూలమైన ఉద్దేశ్యము సశరీరస్థితి కతీతమై, అశరీస్థితిని పొంది, సశరీర స్థితినుండి తప్పించుకొని, సశరీరస్థితుల కతీతమై, అశరీరమై, విశ్వస్థితిని మరల పొంది, తన సహజ స్థితిలో విశ్వజీవిగా నుండుటయే. ప్రధమ వ్యక్తిలో గల సశరీరస్థితి నధిగమించవలెననెడు ఈ యాకాంక్ష విశ్వమందలి సమస్త మానవులలోనను 'యుండెడిది; ఉన్నది. ప్రళయాంతమువరకు భావికాలపు మానవులందరిలోను కూడ తప్పక యుండును.

మానవులు తమ ఆదిస్థితిని గోల్పోవుటతో బాటు తమకు గల అప్రయత్నముగా, స్వాభావికముగా శరీరపోషణ జరిగెడి శక్తిని గూడ పోగొట్టుకొనిరి. అందువలన విశ్వముతోను, విశ్వజీవితోను కూడ సామరస్యము పోయినది. విశ్వజీవితో సమైక్యత, జీవియొక్క విశ్వస్థితుల ననుసరించిన మానవవ్యవహారము కూడ పరిణతిపొందెనది. మానవ వ్యక్తులయొక్కయు, వారి శరీరముల యొక్కయు భౌతికనిర్మాణము

నందు సామ్యహీనత యేర్పడినది. తత్ఫలితముగ, మానవ వ్యక్తులు వారి శరీరములు కూడ సామరస్యమును గోల్పోయి సమరసహీనముగ వ్యవహరింప దొడగినవి.

ఈ స్థితియందు మానవత్వ సహజస్థితి ననుసరించి, అభ్యుదయ మును పొంది మానవులుగా నవతరింప గోరెడు మానవేతర జీవుల కొరకు మానవశరీరములను నిర్మాణము చేయుటకు భౌతికమైన అవ కాశములు అసాధ్యమైపోయినవి.

ఆదిస్థితియందు మానవేతరజీవులు మానవులైనపుడు మానవుల వలన, మానవుల కొరకు శరీరనిర్మాణము అప్రయత్నముగ జరిగిపోయె డిది. ఆదిస్థితియందు మానవుల విజ్ఞానము. స్వవిజ్ఞానము సహజస్థితి (Original condition) యందుండుటయే యిందుకు కారణము, ఆది స్థితినుండి, భ్రష్టతప్రారంభమైనది మొదలు వ్యక్తి అహములేర్పడి అవి తమ వ్యక్తిత్వమును పోగొట్టుకొనకుండ విశ్వఅహముతో నైక్యమొందు టవలన వ్యక్తుల విజ్ఞానము. స్వవిజ్ఞానము సహజస్థితినుండి దుష్పరి ణామము పొందినవి. అందువలన శరీరమునకు కావలసిన పోషణపదార్థ ములను గ్రహించుట యందువలెనే మానవ శరీశములను ధరింప గోరెడి మానవేతర జీవుల కొరకు మానవ శరీరములను నిర్మాణము చేయుటకు ఆ వ్యక్తులు ప్రత్యేకముగ వాంఛింపవలసి వచ్చినది.

మానవేతర జీవులు, మానవేతర జీవుల కొరకు మానవేతరశరీ రములను నిర్మాణము చేయుట ఆదికాలము నుండియు ప్రస్తుతపుస్థితి యందువలెనే శరీరపరిశ్రమ వలననే జరుగుచున్నది. విశ్వమందు వ్యాప్త మగుచున్న శక్తులను, తమ సౌఖ్యక్షేమ సంపాదనా విధానములందు ఆకర్షించుకొని తమ యొక్కయు, తమ శరీరముల యొక్కయు భౌతిక నిర్మాణము ననుసరించి అల్పేంద్రియులు, ఉత్తమేంద్రియులునైన

మానవేతర జీవులు ఉన్నతశక్తినిపొంది మానవశరీరములను ధరించు వరకును ఈ విధానము సాగుచుండును.

సౌఖ్యక్షేమములు అభివృద్ధిపై నాధారపడియున్నవను విజ్ఞానమునుకలిగి, ఆ విజ్ఞానమైన సహజవివేకము వ్యవహరించుటకు అనువైన మానవశరీరధారులైన వ్యక్తులుండు చుండుటవలననే మానవేతర జీవులలో శక్తిసంచలనము, సమాకర్షణలు అవిచ్ఛిన్నముగా సాగుటకు కావలసిన భౌతికసామ్యత స్థిరముగ నుండుచున్నది.

మానవేతర శరీరధారులైన మానవేతర జీవులు సౌఖ్య, క్షేమములు అభివృద్ధిపై నాధారపడియుండునని గ్రహించిన తరువాత, ఆ మానవేతర శరీరములు నశించిన పిమ్మట అశరీరస్థితి యందున్నప్పుడు, వారి వారి విజ్ఞానముల ననుసరించి వ్యవహరించుటకును, సౌఖ్య, క్షేమములు పొందుటయందు వారి విజ్ఞానముల ననుసరించి అభ్యుదయము నొందుటకు ఉన్ముఖత కలిగియుండినపుడు, విజ్ఞానము, స్వవిజ్ఞానముల సహజస్థితియందుండి వ్యవహరించుచున్న మానవులచే విడిచిపెట్టబడి, వ్యాప్తియైనశక్తులు, ఈ జీవులలోనికి ప్రవేశించి, వారిలోగల శక్తులతో కలసిపోవును. సహజమైన విజ్ఞానము స్వవిజ్ఞానముగల మానవ శక్తులు మానవేతర జీవులచే గ్రహింపబడినంతనే, ఆ మానవేతరజీవులు మానవ వ్యక్తులై సహజ వివేకమును పొందుదురు. అప్పుడవి మానవ శరీరములను ధరించుటకు కావలసిన అర్హతను పొందినవి. అప్పుడా వ్యక్తుల ఉన్ముఖత మూలముననే మానవశరీర నిర్మాణమునకు కావలసిన భౌతికపరిస్థితులేర్పడి, క్రమముగ మానవశరీర నిర్మాణము జరిగెడిది. మానవులు సహజమైన ఆదిస్థితియందున్న కాలములో మానవేతర జీవులచే మానవశరీరధారణ మానవుల ప్రయత్నముతో నిమిత్తము లేకుండ జరిగిపోయెడిది.

తారాచంద్రులలో కాంతి అంతర్గతమై యుండుట, వేరువేరు వస్తువుల కలయికవలన, యితర విధానముల వలననో కాంతిని ఉత్పాదన చేయుటయేగాక, వివిధ వస్తువుల ఉనికియు కూడ సూర్యకాంతియే లేకున్న, అనగా సూర్యుని ఉనికియే లేకున్న అసంభవమనుట తథ్యము. అదేరీతిగ వ్యక్తులయందు అభివృద్ధి కాముకత, వారి అభ్యుదయము, వారి ప్రస్తుతస్థితి, వారి ఉనికియు కూడ విశ్వమందు ఆదినుండియు ఒక స్థితప్రజ్ఞ మానవవ్యక్తి లేకుండిన యెడల అత్యంత అసంభవములు.

అందువలన, ఒకానొక ఆదిమానవుని ప్రోద్బలము లేకుండ విశ్వజీవి. వ్యక్తీకరణమైనది మొదలు క్రమముగ అభ్యుదయమునందు మానవ శరీర నిర్మాణములను చేసికొనుచు విశ్వీకరణమగు వరకు, జీవులు, వ్యక్తులు తమంతతాము పురోగమించగలవను సిద్ధాంతము అనాదరణీయము. మానవులతో సహా సమస్త జీవులు ,ఏ యితరుల యొక్కయు, ముఖ్యముగ మానవునియొక్కయు, అదియు స్థిత ప్రజ్ఞ మానవుని యొక్క ప్రోద్బలము లేకుండగనే తమంత తామే సౌఖ్య, క్షేమ సముపార్జనా విధానమునందు ఉన్ముఖులై యుండిరనుట అసంబద్ధము. ఆది కాలమందు మానవుల ఉనికియే లేదనుట మానవేతర జీవులే తమంత తాము, సౌఖ్య, క్షేమ సముపార్జనా విధానమునందు కొంతకాలము గడిపించిన తరువాత మానవులుగా పరిణమించిరనుట, ఈ రీతిగ విశ్వమందలి మానవ వ్యాప్తి జరిగినదనుట, ఆది మానవులు ప్రజ్ఞావంతులు కారనుటయు, ఇంకను అసమంజసము. అదేరీతిగ ఆదికాలపు ప్రతిభావిహీనుడగు మానవుని మొదలు నేటివరకు సౌఖ్య క్షేమములందు సంపూర్ణత్వము నందుటకు మానవులు పురోగమించు చుండిరనుట, నేటి కాలమందు పూర్వపు కాలము లన్నిటికంటెను మానవులు ఆదర్శ స్థితికి సన్నిహితులుగ నుండి రనుటయూ అత్యంత సత్యదూరము.

తార్కిక మనబడు నీ హేతువాద సిద్ధాంతమునందు వ్యక్తులు అవకాశము (chance) పై నాధారపడి యుందురు. వారి ఉనికి, అభ్యుదయము, వారు మానవులగుట, స్థిత ప్రజ్ఞత్వమును పొందుట అన్నియు అవకాశములపై నాధారపడి యున్నవి. అవి అనిర్దిష్టములు. వానిలో నిర్దిష్టమైన సిద్ధాంతములు లేవు. ఈ విధానమునందు జీవులయొక్క ఉనికి, ఉద్దేశ్యము, మానవత్వము పొందుట, స్థిత ప్రజ్ఞత్వమును నిశ్చయించుటకును, నిర్ణయించుటకును ఎవ్వరును లేరు. ఏమియును లేదు.

"అవకాశము" లనగా కొన్ని ఆకస్మిక సంఘటనల వలనగాని, లేక కొన్ని ఆకస్మిక సంఘటనల వలనగాని, లేక కొన్ని పరిస్థితుల ఏకత్వము వలనగాని కలుగు పరిణామ పరిస్థితులు. ఈ రెండును కూడ సంఘటనలపై నాధారపడి యుండును. ఈ సంఘటనలు మరల కాలము, ప్రదేశము, పరిస్థితులపై నాధారపడి యుండును. అందువలన అవకాశములపై నాధారపడి యుండెడు ఈ వాదమును తీవ్రముగా పరిశీలించిన యెడల తెలునదేమనగా ఈ సిద్ధాంతము ననుసరించిన మానవులను స్థిత ప్రజ్ఞత్వముపైపు పురోగమించుట కసాధ్యమైన యొక స్థితికి జేర్చును. దొరకిన అవకాశములను, పరిస్థితులను వినియోగపరచుకొని పురోగమించెడివారికి, తమ పురోగమనమునకు అనుకూలతనిచ్చెడు పరిస్థితులు, కాలము ప్రాప్తించి వారి పురోగమనము స్తంభించిపోవును. పరిస్థితులు, కాలము, ప్రదేశము వారికి చొరరానివగును. వారు తమ పురోగమనమునకు, వారి ప్రస్తుతస్థితికి కారణభూతములైన, అవకాశములు, పరిస్థితులు, సంఘటనలు వంటి వానికొరకే అన్వేషించుచు నుండిపోయెదరు.

అంతేగాక శారీరక కృషివలన శరీర పోషణ, శరీర నిర్మాణము ప్రారంభమైనప్పటి నుండియే ఈ హేతువాదము ప్రకారము విశ్వ

మందలి మానవజాతి ప్రారంభమైనది. కాని యిని మానవులు తమ సహజ స్థితినుండి పతనమగుట ప్రారంభించినది మొదలు ఆరవదశలోని ప్రారంభకాలము మాత్రమే. ఈ ఆరవదశ మానవజాతి ప్రారంభమైన తరువాత మహా దీర్ఘకాలమైన విస్మృతి కలిగినది. ఈ రెండింటికిని మధ్య కాలము అనగా స్థితప్రజ్ఞ. అది మానవవ్యక్తి యునికి మొదలు శారీరక కృషివలన శరీర నిర్మాణములను గావించెడి మానవ పశ్వమ పతనావస్థ మధ్యకాలము వరకును గల మానవులస్థితి, వారి వ్యవహారములు దేశ కాల పరిస్థితులపై ఆధారపడి అవకాశముల కొలది వ్యవహరించెడు అవకాశ వాదులకు దురూహ్యమైనది. వారి యభివృద్ధి దేశకాల పరి స్థితుల యవధులకు లోనై యుండుటవలన బాహ్యాముఖము. దేశకాల పరిస్థితులను చొచ్చుకొని ముందుకు పోలేము. వాని కతీతముగ భావిం చనులేదు. అందువలన వారి యభివృద్ధి ఊర్ధ్వముఖమగుట, వారు తమ సహజ స్థితివైపు పురోగమించుట అసాధ్యము. వారు తమ అభ్యు దయమును సాధించుటకును సహజ స్థితివైపు పురోగమించుటకును వారి దృష్టిలో అభేద్యములైన దేశకాల పరిస్థితులను భేదించుటకును ఇంతవరకు వారికి గల అశక్తత సమర్థనీయమైనదే. కాని వీరింకను, ఇక ముందుగూడ అసమర్థులుగా నుండుట మాత్రము సమర్థనీయము కాదు. అందువలన నీ మహావిశ్వము, ప్రపంచము, మానవ మానవేతర జీవులు, ఇతర వస్తు సముదాయము వీనికిగల అన్యోన్య సంబంధము, అన్యోన్యమగు బాధ్యత, ఆ బాధ్యతా నిర్వహణము నందలి విధాన ప్రయోజనములను కూలంకషముగ మరల నిప్పుడు పరిశీలనము చేయ వలసిన అగత్య మేర్పడినది.

సహజస్థితి నుండి పతన మింకను సాగిన తరువాత, వాంఛ వలన శరీర నిర్మాణము చేయగల్గు శక్తిపోయి, ఏకాగ్రధ్యాన వలనగాని చేయలేని స్థితి యేర్పడినది. మరల కొంతకాలమైన తరువాత దీర్ఘ

కాలపు ఏకాగ్రధ్యానవలన కాని శరీర నిర్మాణము చేయలేకపోయెడి వారు. తుట్టతుదకు శరీర పోషణావిధానములోవలెనే శరీర కృషి లేనిదే సృష్టి సాగించలేని స్థితి యేర్పడినది. ఈ దీర్ఘ ఏకాగ్రధ్యాస, శారీరక కృషి మానవులయొక్క పతనములో అయిదవ దశయొక్క ప్రారంభ కాలము నాటివి.

శరీర నిర్మాణము, శరీర పోషణాదులందుండు మానవుల సహజ స్థితిలో పతనముతోబాటు వానితో సమానముగ నితర వ్యవహారము లందునూ సహజ స్థితి కోల్పోయిరి. వారి జ్ఞప్తి, భావన, ఊహాదృష్టి, భాషణ, శ్రవణాది శక్తులలో గూడ సహజస్థితి భ్రష్టత కలిగినది.

మానవ వ్యవహారములయందలి ఈ సహజస్థితినుండి పతనము శరీరానుగతమైన వ్యవహారములను మితపరచి, మానవ వ్యక్తులను వారు తమ శరీరములపై నాధారపడి యుండెడిస్థితికి తెచ్చినది. ఒక దశ నుండి మరియొక దశకు పతనమైన కొలది, మితత్వము, అధీనత యెక్కువై, శరీరములే తామని తప్పని సరిగ విశ్వసించెడి దుస్థితిలోనికి దింపినవి. శరీరములే తామనుకొనెడి యీ విశ్వాసము తమస్మృతి, భావన, శోచనాదులను శరీరములకు సంరక్షణ, సౌఖ్య, సేకరణల నిమిత్తమే వినియోగపరచుచున్నది.

మానవ వ్యక్తుల యొక్కయు, వారి శరీరముల యొక్కయు, సహజ వ్యవహారములు క్షీణించుటతో వాంఛ, ఏకాగ్రధ్యాస, సుదీర్ఘ ఏకాగ్రధ్యాస అవసరములైనవి. మానవ శరీర నిర్మాణము పోషణల ఆవశ్యకతలను తీర్చుటకు ఏర్పడిన యిట్టి పద్ధతులలో వైవాహికసంస్థ యొకటి. మానవుల పంచమ పతనావస్థలో ఆధ్యాత్మిక సాంప్రదాయముల ననుసరించి యీ సంస్థ స్థాపించబడినది. విశ్వవ్యాప్తమై సర్వజనామోదితమైన సంస్థలలో నిదియే మొట్టమొదటిది.

సహజ స్థితినుండి పతనము కలిగి, శరీరకృషివలననే శరీర నిర్మాణము ప్రారంభమగుటవలన, అప్పటివరకే శరీరములను ధరించిన నవ్యమానవులు తమ పూర్వపు మానవేతర స్వభావములతోడనే యుండుట వలన వారివారి ఇచ్ఛానుసారము వ్యవహరించుచుండిరి. సహజ వివేక ప్రబోధములను గ్రహింపనేరకుండిరి.

మానవేతరజీవు లీ విషయములలో వివేచనా శూన్యులగుట వలన నవ్యమానవులు తమ పూర్వపు మానవేతరపు టలవాట్లనే కొనసాగించుచుండుటవలనను, శరీర నిర్మాణమును, పోషణ విధానములందు, వానికిని, వీరికిని యెక్కువ భేదము కనిపించుటలేదు. ఇట్టి స్థితియందు నవ్యమానవులలోని వివేచనా శూన్యతను అరికట్టుటకు యీ వైవాహిక సంస్థ నిర్మాణమైనది.

ఈ సంస్థకు మూలమైన యుద్దేశ్యము, అతిప్రాచీనమైన ఆదిమానవుని యుద్దేశ్యమే. కాని అనుసరించుచున్న విధానము మాత్రము ప్రాచీనముకాదు. మధ్యకాలపు నాటిదియుకాదు. ఇటీవలదే. పంచమ పతనావస్థ నాటిది.

ఈ విధానము నిరంతరమైన ఆవశ్యకతగాగాక, తాత్కాలిక అనివార్యతగా చైకొనబడినది. సహజ వివేక ప్రబోధములను గ్రహించి, శరీర నిర్మాణ విషయములందు మానవేతరులవలెగాక, వివేకము కలిగించుటకు చైకొనబడిన పరిహార సాధనము. మానవులు అభ్యుదయ కాములై, మానవోచితముగ వ్యవహరించుచు తమయొక్క సహజ స్థితిని మరల సంపాదించుటకు శక్తివంతులనుగా జేయుటకు మాత్రమే చైకొనబడినది.

ఈ ఉద్దేశ్యము అతి ప్రాచీనమైనదియు, విశ్వమం దంతటను వ్యాపించియుండినదైనప్పటికిని మానవులుగా సరిగా సనగాహన చేసి

కొనక పోవుటవలన ఎప్పటికప్పుడు క్రొత్తదిగనే కనపడుచున్నది. ఈ వైవాహిక సంస్థ క్రొత్తగా నేర్పడిన కాలమందీ సంస్థయొక్క యుద్దేశ్యమును మానవులందరు నెరిగి యుండిరి. మానవులగుటకు అర్హతను పొంది మానవులుగా నవతరింపగోరెడి మానవేతరజీవులకు మానవ శరీరములను నిర్మించుటయే యీ సంస్థ పరమాశయము. తదనుసారముగ ఈ సంస్థకును, విశ్వనిర్మాణ సిద్ధాంతములకును, మానవ నిర్మాణ సిద్ధాంతములకును, ఆధ్యాత్మిక సిద్ధాంతములకును, విశ్వమునందుగల సమస్తముయొక్క అభ్యుదయ సిద్ధాంతములకును గల సామరస్యము నెరిగియుండిరి. ఈ సిద్ధాంతముల ప్రకారము ఉన్నతేంద్రియములను పొందిన ప్రతీ మానవేతర జీవికిని, ఆ యింద్రియములతో వ్యవహరించుటకు అనువైన మానవ శరీరము తప్పక లభ్యము కావలెను, అధికశక్తివంతులగు మానవులచే వినిగ్రతమై వ్యాపించుచున్న ఉన్నత శక్తులతో, మానవేతర జీవులయొక్క శక్తుల సంపర్కము నొందుటవలన, మానవేతర జీవులు ఉన్నతేంద్రియములను పొందుచుండుటవలన, ఉన్నతేంద్రియ సంపాదనయే, మానవేతర జీవుల యభ్యుదయ శిఖరమగుటవలనను, ఆ యభ్యుదయ శిఖరమే మానవులకు ప్రారంభస్థితి యగుటవలన మానవ శరీరములే వాని వ్యవహారణ కనువైనవి. అందువలన, అట్టి జీవులకు మానవ శరీరములను కలుగజేయుట యనెడి అతి ప్రాచీనమైన యుద్దేశ్యము ఈ వైవాహిక సంస్థవలన సాధింపబడుచున్నది.

ఈ సంస్థకు మూలమైన యుద్దేశ్యమును జ్ఞాపకముంచుకొనినంత కాలము మానవులు బాధ్యత కలిగి వ్యవహరించిరి. ఈ సంస్థ సక్రమముగ నిర్వహింపబడినది. ఈ స్మృతిమూలమున వారు ముందుగా సూక్ష్మేంద్రియ చైతన్యమును సంపాదించి తరువాత తమ సృజనేంద్రియముల యున్ముఖతను పరిశీలించి, విచారించి, శరీరనిర్మాణము యెడల

తమ కాకాంక్ష యున్నయెడల వివాహము చేసికొనెడివారు. తమ యింద్రియములు శక్తివంతములనియు, మానవ శరీర నిర్మాణమునందు తమకు నిచ్ఛగలదనియు వారు గుర్తించినప్పుడే వివాహితులై వైవాహిక సంస్థ యుద్దేశ్యములను సాధించుటకు బాధ్యతాయుతముగ వ్యవహరించెడివారు. అటు తరువాత నవ్యమానవ వ్యక్తులకొరకు ఒకటి, రెండు లేదా మూడు శరీర నిర్మాణములైన తరువాత, ఆ యుద్దేశ్యము నుండి విముఖులై యుండెడివారు. ఉన్నతేంద్రియములను పొందిన జీవులు, మానవేతర శరీరములు నశించిన తరువాత, ఆధ్యాత్మిక సిద్ధాంతము ప్రకారము తమంతతామే శరీర నిర్మాణమునకు కావలసిన వివిధ భౌతిక భాగములను సమీకరించుకొని మానవ శరీరములను పొందుచున్నవి. స్థూలశక్తి సృజనశక్తిగను, సృజనశక్తి సూక్ష్మశక్తిగను, అది మరల అతి సూక్ష్మాది శక్తులుగను నిరంతరము పరిణామము నొందుచుండుటవలన నీ సృష్టి ప్రబంధ కార్యకలాపములందు మానవులకు నిచ్ఛ నశించి, వైవాహిక సంస్థయొక్క ప్రయోజనముల నధిగమించెదరు. అతి సూక్ష్మాది శక్తులు, ఊర్ధ్వముఖముగ వ్యవహరించుచున్న అహముల ప్రోద్బలముతో, వ్యక్తుల యాదేశానుసారము వ్యవహరించును.

ఇచ్చటనుండి అతిసూక్ష్మేంద్రియములు వ్యవహరించుట ప్రారంభమగును. ఉన్నతేంద్రియములను పొందని మానవేతర జీవులచే వినిర్గతమగుచున్న శక్తులతోడను, శక్తిపరిణామము లేక సూక్ష్మేంద్రియములు సక్రమముగా వ్యవహరింపనట్టియు శక్తివంతములుగాని శరీరములు గల మానవులచే వినిర్గతమగు శక్తులతోను విశ్వమందు సంపర్కము కలిగించుకొనుటకు అవకాశములను కల్పించుటయందే యీ అతి సూక్ష్మేంద్రియములు అభిరుచిని కలిగియుండును.. మానవేతర జీవులు, శక్తివంతులుగాని మానవులు కూడ అభ్యుదయమును పొందుట

కవకాశములు కలిగించు నిమిత్తమే సమర్థములైన అతిసూక్ష్మేంద్రియ ములు గల వ్యక్తులు తమ శక్తులను వినియోగింతురు. అందువలన మానవేతర జీవులు ఉన్నతేంద్రియములను పొందుటయు, శక్తిపరిణామములేని మానవులు శక్తి పరిణామమును పొందుటయు సంభవించుచున్నది. ఈ రీతిగ తమంత తాము తమ సహజస్థితిని పొంది మానవ కర్తవ్యమును సాధించుటయే గాక యితరులు గూడ తమ తమ కర్తవ్యములను సాధించుటకు తగిన అవకాశములను కలిగించుచున్నారు. అట్టి మహావ్యక్తులచే నీ విధానము నిరంతరము సాగింపబడుచున్నది.

అట్టి సమర్థులైన మానవులు, మానవశరీర నిర్మాతలైన వివాహితులుగ గన్పట్టుచున్నప్పటికి నీ అలవాటువలన అట్టివారు కారు. అంతే కాక సాధారణమైన విధానము వలనకన్న శీఘ్రముగ మానవేతర జీవులు మానవత్వాప్తిని పొందునట్లు చేయుచున్నారు. నవ్యమానవుల అహములను ఊర్ధ్వముఖముగజేసి అట్టివారికి సక్రమమైన అలవాట్లు గల వ్యక్తులతో సాంగత్యమున కవకాశములు కలిగించుచున్నారు. మానవేతర జీవులు కూడ నిట్టివారితో సాంగత్యము కలిగియుండుట వలన, బాహ్యముఖులు, సక్రమముకాని యలవాట్లు గల వారిసాంగత్యమువలనకన్న శీఘ్రతరముగ అభ్యుదయమును పొందుచున్నవి. ఇట్టి యుత్తమ మానవులు విశ్వజీవితో నిరంతర ఏకత్వానుభూతిని పొందుటకు పూర్వము, వారి సహజస్థితిని పొందుటకు ముందు విశ్వావశ్యకత ననుసరించి, ఒకటి, రెండు లేక ఎన్నిపర్యాయములు వారు శరీరములను మార్చుకొన్నప్పటికినీ వారి యింద్రియములకు సృజన విధానమునందు అభిరుచియుండదు. అందువలన వారు వివాహితులు కాలేరు, కారు.

అంతేగాక, తమ యింద్రియములకు సృజనవిధానము లం దభిరుచి లేదని గ్రహించిన వ్యక్తులు, ఈ వైవాహిక సంస్థయందు భాగ

స్యాములు కాదు. అసలు అసంభవము. కొన్ని శరీరములను నిర్మించిన తరువాత సృజనవిధానమునందు, వివాహితస్థితియందు ఇచ్ఛపోయిన వారివలెనే, వీరి సూక్ష్మేంద్రియములు సక్రమముగ వ్యవహరించుట వలన వీరి సూక్ష్మేంద్రియములుగూడ విశ్వమందు నిరంతరము విస్తృతము లగుచున్న శక్త్యాణువులను సమైక్యపరచు అవకాశములు కలిగించుటయందే యిచ్ఛకలిగియుండును. ఒక సశరీరపుకాలము, తదనంతరపు అశరీరపు కాలములలో తమ సహజస్థితిని మానవులు పొందెడి కాలములో, మానవులకు నిట్టి యలవాటు లుండెడివికావు. ఈ రీతిగ మానవులు మానవోచితరీతిని మానవకర్తవ్యమును సాధించుటయును, ఇతరులకు అట్టి అవకాశములను కల్పించుటయును చాలకాలము సాగినది. వివాహసంస్థ కూడ ఎంతో కాలము సముచితముగ నిర్వహింపబడి కర్తవ్యసంసిద్ధికి సహకారియైనది.

కొంతకాలమైన తరువాత మున్ముందు తమ శరీరములను శక్తివంతములుగ జేసికొనుటకై తమ సృజనశక్తిని వినియోగించుకొనెడి యలవాటును మానవులు మరచిపోయిరి. దానితోపాటు మానవేతర జీవులకొరకు మానవ శరీరములను నిర్మాణము చేయుటయే వైవాహిక సంస్థయొక్క కర్తవ్యమనియు, అందుకొరకే ఆ సంస్థ నిర్మింపబడినదనియు కూడ మరచిపోయిరి. అందుకు ఫలితముగ, వారి సృజనేంద్రియములు, సృజన కర్తవ్యమును విస్మరించి సృజన విధానమునందే నిమగ్నమైపోయినవి. ఇట్టి స్థితియందు, సృజన కర్తవ్యమును విస్మరించి, విధానమునందే నిమగ్నమై యుండుటవలన, ఒక సశరీరకాలము తదనంతరపు టశరీరస్థితులలో తమ సహజస్థితిని పొందుట మానవులకు అసాధ్యమైపోయినది. అటుపిమ్మట సహజస్థితిని పొందుటకు, ఒకటికన్న యెక్కువ పర్యాయములు మానవ శరీరముల యందవతరించు టావశ్యకమైనది. తుట్టతుదకు, ప్రస్తుతకాలమందీ యవకాశము గూడ

పోయినది. ఇప్పటి మానవులలో సృజనశక్తి అత్యల్పమైపోయినది. సూక్ష్మశక్తిగా పరిణామము నొందుటకు కావలసిన పరిమాణము లేక పోవుటయే గాక, ఆరోగ్యవంతములగు శరీరములను నిర్మించుటకు గూడ శక్తిహీనమైపోవుట వలన, సృజన విధానమునందు గూడ వ్యక్తులకు అసంతృప్తి కలుగుచున్నది. అందువలన నీ సృజన విధానము నందలి అతితృష్ణ, అవివేకపు వ్యవహారము వలనను, అసంఖ్యాకము లగు పర్యాయములు శరీరములను దాల్చినగాని బాధ్యతను గ్రహించిన వివాహితు లగుటకును, మానవ కర్తవ్యమును మానవోచితరీతిని సాధించి తమ సహజ స్థితిని పొందుటకును అవకాశములు కలుగకున్నవి. ఈ రీతిగ మానవులు వైవాహిక సంస్థయందలి బాధ్యతలను విస్మరించి అందు బంధితులైనారు.

ఇక్కడనే విశ్వ విభ్రాంతి, వైరుధ్యము యేర్పడినది. ఉన్నతేంద్రియములను పొందిన మానవేతర జీవులు మానవ శరీరములను పొందుటకు తహతహలాడు చుండును. తమ సహజస్థితిని పొందక పోవుటవలన మానవులుకూడ తమ శరీరములు నశించిన తరువాత మరల మరల మానవ శరీరములకై ప్రాకులాడు చుందురు. ఈ పెనగులాటలో మానవ వ్యక్తులు తామెవరకే మానవత్వానుభూతిని కలిగి యుండుటవలన, అధికశక్తివంతులై, మానవేతర జీవులు యభ్యుదయమున కష్టపడుచున్నారు. మానవేతర జీవులకు పొందదగు మానవ శరీరములను తామే మరల మరల పొందుచుండుటవలన మానవేతర జీవులకు తగు నవకాశములు తగ్గిపోవుచున్నవి. ఈ పెనగులాటయందు మానవేతర జీవులు నిగ్రహింపలేక పోయినప్పటికిని, తహతహ పడుచునే యున్నవి. వాని యావేదన సమంజసము, సమర్థనీయమునునై యున్నది. అందువలన నెంతకాల మాలస్యమైనప్పటికినీ మానవ శరీరములను పొందుటకవి హక్కుగలిగి యుండుటవలన అట్టి స్థితిని పొంది,

నవ్య మానవులుగ నవతరించు చుండును. కాని మానవులు మాత్రము విశ్వజీవితో తాదాత్మ్యము పొంది తమ సహజ స్థితిని పొందుటకు హక్కు గలిగి యున్నప్పటికినీ, తదాశయసిద్ధి కనువైన యింద్రియ ములు కలిగి యున్నప్పటికినీ, వారి యభివృద్ధి కనువుగాని శరీర ములతో మరల అవతరించు చున్నారు. అంతే గాక, విశ్వ సిద్ధాం తము ప్రకారము నవ్య మానవులకు మాత్రమే యనువైన శరీర ములు, అదివరకే మానవత్వాను భూతికల వారికి యోగ్యమైనవి కాక పోవుట వలన వారి యభ్యుదయముతో పాటు పురోగమించుటకు అను కూలము కాని శరీరములతో నవతరించుటవలన అట్టి మానవులు తమ్ము తా నువరోధించుకొను చున్నారు.

ప్రస్తుతము పూర్వోపార్జిత మానవ త్వానుభవములు కలిగి యున్నప్పటికినీ మానవేతరములనుండి ఉత్పన్నములైన నవ్య మానవులు మాత్రమే పొందదగు శరీరములతో నవతరించి మానవులు సామాన్య ముగ వ్యవహరించు చున్నారు. నవ్య మానవులచే పొందదగు యనుభ వములనీ యక్రమ మానవులదివరకే పొందియున్నారు. కాని మానవు లుగ మానవకర్తవ్యమును సాధింపలేక పోవుటచే వారికి మరల మరల శరీర ధారణావశ్యకత కలుగుచున్నది. మానవేతర జీవులకు అట్లుగాక, తమ కర్తవ్య సంసిద్ధివలన మానవులుగ నవతరించ వలసిన యావశ్యకత కలుగుచున్నది. అందు మూలమున పరిస్థితులలో విభ్రాంతి వైరుధ్యము ఏర్పడుచున్నవి. మానవులే, తమతో సంపర్కము మూలముగ మాన వేతర జీవులు మానవులగుటకు సహకరించుచున్నారు. మరల ఆ మాన వులే తమ వ్యవహారముల యందలి విపర్యయ విధానముల వలన అభ్యు దయము పొందిన మానవేతర జీవులు మానవ శరీరములను పొందుటకు అవరోధములను కలిగించు చున్నారు.

ఈ విధముగ, ప్రస్తుత కాలమందు, సక్రమవ్యవహారము గల సూక్ష్మేంద్రియములు కలిగియున్నప్పటికినీ, శక్తివంతములు కాని శరీరములు కల మానవులు కొందరును, మానవత్వానుభవము కలిగియున్నప్పటికినీ సక్రమవ్యవహారము గల సూక్ష్మేంద్రియములు లేనివారు కొందరును గలరు. ఈ రెండు తెగలలోనూ, మొదటివారికి ఈసశరీర స్థితియందే ఆశయసంసిద్ధిని పొందుటకు అవకాశము కలదు. రెండవ తెగవారు, ఈ సశరీరస్థితి, తదనంతరపు టశరీరపు కాలములో ఆశయ సంసిద్ధిని పొందగలరు. మొదటి తెగవారు తమ శరీరములు శక్తివంత ములగుటకు సంపూర్ణావకాశములనిచ్చి, అభ్యుదయ పథమునందు తమ తమ సృజనేంద్రియములకు గల స్థానమెట్టిదియో తెలిసికొని, వానికి సృజనక్రియాకలాపముల యందిచ్ఛయున్నదో లేదో గమనించి బాధ్యతాయుతులగు వివాహితులగుటయో, కాకుండుటయో నిర్ణ యించుకొనవలెను. ఇంద్రియములకు ఇచ్ఛ, ఉన్ముఖతయున్నచో వారు వైవాహికసంస్థ యుద్దేశ్యమును గుర్తించుకొని, బాధ్యతాయుత వివాహితులయి, ఒకటి, రెండు లేదా మూడు శరీరములకు సృజన కారకులయి, దానితోపాటుగ తమ శరీరములను శక్తివంతములు గావించుకొందురు. ఈ విధానములో, వారు అభ్యాసమువలన, సంస్థకు దూరముగ నుండగలుగుదురు. ఇక్కడనుండి వారు బాహ్యమునకు వైవాహిక సంస్థయందు సభ్యులుగనున్నప్పటికిని, వారి కృషియంతయు మానవ వినిర్గత శక్తులకును, మానవేతర వినిర్గత శక్తులకును, సంయోగము కలుగజేయుట యందేయుండును.

రెండవ తెగ మానవులు సూక్ష్మేంద్రియములు సక్రమముగ వ్యవహరింపకపోయి నప్పటికిని, వారు మానవత్వానుభవములను కలిగి యుందురు. ఈ యనుభవములవలన వారికి వైవాహిక సంస్థ యుద్దేశ్యము స్ఫురణకువచ్చి, దానితో బాటు వారి సూక్ష్మేంద్రియములకు

కావలసినంత గుణయుతము, పరిమాణయుతమునగు సూక్ష్మశక్తి యేర్పడి, సక్రమవ్యవహారము కలుగును. సక్రమముగ వ్యవహరించు సూక్ష్మేంద్రియములు కలవారును తమ సూక్ష్మేంద్రియములు సక్రమముగ వ్యవహరింపక పోయినప్పటికినీ తాము కలిగియుండిన మానవత్వానుభవములను కర్తవ్యసంసిద్ధికై వినియోగించువారును, తగినయవకాశములను కలుగజేసినయెడల నవ్యమానవులు కూడ, రెండు సశరీరపు కాలములలోనను, రెండు అశరీరపు కాలములలోను కర్తవ్యసంసిద్ధిని పొందగలరు. ఈ సంస్థయొక్క సర్వవ్యాపకత్వము వలన, సంస్థ నిర్వహణము యథావిధిగ జరిగించుటకు, వివిధప్రదేశములందు ఆధ్యాత్మిక విజ్ఞానానుసారముగ రాజకీయసంస్థ లేర్పాటయ్యెను.

వైవాహికసంస్థ ప్రారంభమయినది మొదలు చాలకాలము వరకు, అది తన కర్తవ్యమును చాలవరకు సాధించుచునే వచ్చెను. కాలక్రమమున మానవులు కర్తవ్యమును మరచిపోయి సంస్థను మాత్రమే జ్ఞాపకముంచుకొనిరి. ఈ విధముగ ఆధ్యాత్మిక విజ్ఞానమూలమైన తన ప్రాతిపదికనుండి దూరమయి పోవుటవలన, నీ సంస్థ క్షీణింపనొడగెను. మానవులీ సంస్థయందు వ్యామోహబద్ధులు కాదొడంగిరి. తృప్తినే యెరుగని యింద్రియోన్ముఖతను తృప్తిపొందించుటయందు నిమగ్నులయిరి. మానవ శరీరములను నిర్మించెడి విధానమునందు మునిగిపోయిరి. ఇట్టి పరిస్థితులయందే మతసంస్థలు నిర్మింప బడినవి. వివిధమత సంస్థలు వివిధ సంప్రదాయముల నేర్పరచి, కేవలము ఐహికములగుట వలన, తమ వ్యాప్తికిని, ప్రాబల్యమునకును సంఖ్యాబలముపై నాధారపడియుండెను. ప్రతి సంస్థయు తనలోగల సంఖ్యలపైనను, బలముపైనను ఆధారపడియుండెను. అందువలన వైవాహికసంస్థ కర్తవ్యములను విస్మరించి, దాని విశ్వత్వమును, ఆధ్యాత్మిక విజ్ఞానమును మరచి తమ ప్రబోధము వలన, బాధ్యతారహితముగ మానవశరీరోత్పాదనము

చేయువారలను ప్రోత్సహించెను. ఇది వారి సంప్రదాయములో జేర్చ బడెను. తుదకు వైవాహికసంస్థ ఆధ్యాత్మికమూలమునుండి వేరు పరచబడి మతమూలకము గావింపబడెను. ఈ రీతిగ దానిని మూలము, కర్తవ్యములనుండి వేరుపరచి వికలాంగ మొనర్చిరి.

తమతోకూడ యితర వస్తువులు, విషయములు, జీవులయెడల తమ శరీరముల మరణమునుండి జననము వరకును, మరల జననము నుండి మరణమువరకును, నీతి ధర్మములపై నాధారపడిన అలవాట్లు, ఆచారములతో కూడిన మానవుల యలవాట్లు, ప్రవర్తన, వైఖరులను, సంప్రదాయము (culture) అందురు. మానవులయొక్క నీతి, ధర్మ ములు విశ్వమందలి వస్తు విషయాది వ్యవహారముల యెడల, వాని యన్నిటికిని మూలముయెడల, వానిలో వానికిగల పరస్పర సంబధము యెడలను, వారి భావన సిద్ధాంతములపై ఆధారపడియుండును. వస్తు విషయాది వ్యవహారముల వలన ప్రయోజనము, ఆ ప్రయోజన సంసి ద్ధికై వినియోగించు సిద్ధాంతములు, వానియందు దృఢ విశ్వాసము, ఆ యలవాట్లు, ప్రవర్తన, వైఖరి, సంప్రదాయము, విశ్వాసము భావ నల యొక్క సౌష్ఠవముపై నాధారపడి యుండును.

మానవజాతి కంతకును ఒకే యొక సంప్రదాయము కలదు. అది ఆధ్యాత్మిక సంప్రదాయము. అది విశ్వామోఘకరము. మతము రాజ కీయము సంప్రదాయాంతర్గతములు కావు. సంప్రదాయము మత రాజకీయములలో అంతర్గతముగ నున్నది. రాజకీయములో అది యెక్కు వగ నున్నది. మతములో తక్కువగ నున్నది. మానవులను సంప్రదాయ సిద్ధులుగ జేయుటకు మతము, రాజకీయము గూడ నవసరమే. విశ్వ మందలి వస్తు విషయాది వ్యవహారములను గూర్చియు, వాని మూల మును గూర్చియు, ప్రపంచమును గూర్చియు కర్తవ్యము, ఆ కర్తవ్య

మును సాధించెడి సిద్ధాంతములను గూర్చియు, వాని విశ్వవ్యాపకత్వ మును గూర్చియు, వీని యన్నిటికిని సమరసమైన నీతి ధర్మములయందు విశ్వాసమును గూర్చియు, అలవాట్లు, వైఖరి, ప్రవర్తన సక్రమమగు టకు సహాయపడును. ఈ యలవాట్లు, ప్రవర్తన వైఖరి మానవ ఆధ్యా త్మికతయందు మూలమును కలిగియున్నయెడల అది మానవ సంప్ర దాయము (Human culture) అగును. అదియే ఆధ్యాత్మిక సంప్ర దాయము.

విశ్వత్వమునుగూర్చిన భావన, అందు విశ్వాసము పోయిన తరువాత, రాజకీయములవలన, అట్టి అధికార విజృంభణవలన ఆధ్యా త్మిక విజ్ఞానము పొందవచ్చు ననుభావము, అందు విశ్వాసము మానవ జాతికి కలుగుట వలన, కాలక్రమమున వారిచే పెంపొందింపబడిన రాజకీయ విధానములే రాజకీయ సంప్రదాయ (Political culture) మనబడుచున్నవి. అందు అనాధ్యాత్మికత్వము (విశ్వవ్యాపకత్వహీనత, లేక మితత్వము) కలదు. అందువలన రాజకీయ సంప్రదాయము ననుసరించువారి వైఖరి, ప్రవర్తన, అలవాట్లలోకూడ నీ మితత్వ మున్నది.

ఆధ్యాత్మిక, రాజకీయ, సంప్రదాయములలోని ఆధ్యాత్మికత్వ మింకను తగ్గిపోలెదు మతసంస్థలు ప్రారంభమై, మతసూత్రములు లిఖిత పూర్వకములైన తరువాత, మత సూత్రముల ననుసరించువారలద్వారా తరువాత మతసంప్రదాయ (Religious culture) మని పిలువబడు చున్న ఒక ధర్మమేర్పడినది. రాజకీయ సంప్రదాయముకంటె ఆధ్యా త్మికత్వము దీనిలో తక్కువగనున్నది. కాని మతము ననుసరించువారు మతముద్వారా ఆధ్యాత్మికత్వమును సాధింపగలమని ఆశపడెదరు.

ఈ విధముగ ప్రపంచమునందు మూడు విధములయిన, సుస్పష్టములయిన సంప్రదాయము లేర్పడినవి. అవియే ఆధ్యాత్మిక, రాజకీయ మత సంప్రదాయములు (Spiritual, political and religious).

నీతి, ధర్మములనుబట్టి, మానవులకు వస్తువిషయాదులతోడను జీవులతోడను గల సంబంధ వ్యవహారములలో, అలవాట్లలో ప్రవర్తనలలో గూడ, మత రాజకీయ సంప్రదాయములవలన, భావన, విశ్వాసములలో నేర్పడిన అనాధ్యాత్మికత్వము మూలమున మిథత్వము ప్రాప్తించును.

అందువలన, అనగా నిట్లు ప్రాప్తించిన మిథత్వమువలన మత రాజకీయ సంప్రదాయములు రెండునుగూడ మానవులకు ఆధ్యాత్మిక సంప్రదాయములను కలుగజేయుటకు అసమర్థములయినవి. తత్కారణముగ మత రాజకీయ సంప్రదాయముల ననుసరించినంతకాలము మానవులు బాహ్యాముఖులుగ నుండుట తప్పదు.

ఆధ్యాత్మిక సంప్రదాయము ప్రకారము, వైవాహిక సంస్థకు, ఒకేయొక నిర్దిష్ట, విద్యుక్త ధర్మమున్నది. అది మానవులు తమ సహజ స్థితిని పొందుటకు సహకారియగుటయే! మత సంప్రదాయము ప్రకారము ఈ సంస్థకు రెండు యుద్దేశ్యములున్నవి. మొదటిది ప్రకటితమై పటిష్ఠము కానిది. రెండవది అప్రకటితమయ్యును పటిష్ఠమైనది. ప్రకటితమైన యుద్దేశ్యము, పటిష్ఠము కాకపోయినప్పటికిని మూలములోని యుద్దేశ్యము వంటిదే. అప్రకటితమైన యుద్దేశ్యము సంఖ్యాబలమును పెంపొందించుట. ఇది చాల పటిష్ఠమయినది. ప్రతి మతము గూడ తన యనుయాయులు సహజస్థితిని సాధించుటకు, వివాహితులయి, సంతానోత్పత్తి చేయవలెనని శాసించును. ఈ యనుభవమును పొందనివారు, పితరులు కానివారు, సహజత్వసిద్ధికి అనర్హులగుదురను ఈ శాసనము

ప్రబలమైనది. మరల నీ సంప్రదాయము ప్రకారమే, వివాహితులగుటకు నిచ్ఛగించనివారు, ఈ సంస్థకు దూరముగ నుండవచ్చును. వారు సహజత్వసిద్ధిని పొందగలరు. కాని వైవాహిక సంస్థావిధానముల యందలి సిద్ధాంతములలో ప్రవేశపెట్టబడిన మార్పులవలన ఈ నిర్దేశము సారహీనమయి పోయినది. ఇట్లు ప్రవేశపెట్టబడిన మార్పులలో ప్రముఖ మయినది వ్యక్తులకు స్వాతంత్ర్యము లేకుండ చేయుటయే! తాము బాధ్యతాయుతముగ వైవాహిక జీవనము చేయనగునో కాదో, తమ యింద్రియములు వైవాహిక జీవితము నం దున్ముఖత కలిగియున్నవో లేదో గ్రహించుటకు కావలసిన కాలమును వ్యక్తులకు లేకుండ చేయబడినది.

ఆధ్యాత్మిక సంప్రదాయములో ఒక సశరీరకాలము, తద నంతరపు టశరీరకాలములో మానవులు ఆశయ సంసిద్ధిని పొందగలరను దృఢ విశ్వాసము ననుసరించి, వైవాహికసంస్థ, ఆ సంస్థ సిద్ధాంతము లతో మానవులకు గల సంబంధమేర్పడినది. అందలి వివాహిత మాన వులు బాధ్యతాయుతులు. వారు మానవేతర జీవులకు పితరులగు చున్నారు. నిర్దిష్ట కాలములో, అనగా ఒక శరీరము, అది గతించిన తరు వాత గల అశరీరపు కాలములలో, వారు సహజత్వ సంసిద్ధిని పొందు దురు. వారికి సామాన్యముగ పునరవతరణావశ్యకత లేదు.

వైవాహిక సంస్థయందలి ఈ నిర్దేశములు ఆధ్యాత్మిక సంప్ర దాయములవలె కనిపించినను అవి మత సంప్రదాయములే. మత సంప్ర దాయ పటిష్ఠతను కలిగియున్నవి. మత సంప్రదాయములు ప్రారంభ మయినది మొదలు వ్యక్తులు అనామకులయిపోయిరి. ఎవరు, ఎప్పుడు దంపతులు కావలెనో, ఆ వ్యక్తులతో సంప్రదించకుండనే యితరులు నిర్ణయించుచున్నారు. దంపతులు కాబోయెడివారు, తమ యింద్రియ ములు పెంపొంది, వాని యున్ముఖతను గమనించుటకు కావలసిన

కాలమును వినియోగించు కొనుటకు స్వతంత్రులుకారు. బాధ్యతాయుత వివాహితులగుట మాట యటుండనిచ్చి, కనీసము వ్యామోహితు లగుటకైనను కావలసిన శక్తి వారిలో కలదా లేదాయని విచారించుటకు కూడ స్వాతంత్ర్యము కలిగియుండుట. ఆయా మత సంప్రదాయములకు విరుద్ధమయినది. ఈ రీతిగ మతములు ఈ విశ్వాసంస్థ యొక్క కాళ్ళను త్రెగగొట్టి ఆధ్యాత్మిక మూలమునుండి వేరు చేసి విభిన్నత్వము. విద్వేషములలోగూడ యున్న అనాధ్యాత్మిక మత సంప్రదాయములలో ప్రతిష్ఠించినది.

మత సంస్థ ప్రారంభకాలము నాటినుండి తమ విశ్వాసములను సార్థకపరచుకొనుటలో మానవుల యలవాటులలో శక్తి క్షీణించినప్పటికినీ, వైవాహిక సంస్థ ప్రారంభకాలము నాటివలె సుస్థిర విశ్వాసములు మాత్రముండెడివి. మతసంస్థ లేర్పడిన తరువాత వైవాహిక సంస్థతో గల సంబంధములలో మంచి యలవాట్లు పూర్తిగ పోవుటతోబాటు, ఒక సశరీరపు కాలములోను, తదనంతరపు టశరీర కాలములోనను సహజస్థితిని పొందనగునను విశ్వాసములోకూడ పూర్తి మార్పులు సంభవించినవి. అప్పటినుండి, విశ్వాసములో మార్పులు కలిగినందున తమకును వైవాహిక సంస్థకును గల సంబంధమును గూర్చి. క్రొత్త భావములను పెంచుకొని, తమ బాధ్యతను, సంస్థ యుద్దేశ్యమును విస్మరించి, వ్యామోహితులగుట ప్రారంభించిరి. ఇందువలన మతములోని అనుయాయుల సంఖ్యను పెంచి, తద్వారా మతముయొక్క బలమును పెంపొందించుకొనుట యనెడి ఆశయము సాధింపబడినది.

ఎన్నియో పర్యాయములు మానవ శరీరములను దాల్చినగాని, మానవులు తమ సహజత్వమును సాధింపలేరని కొన్ని మతములు చెప్పుచున్నవి. కొన్ని మతములు మరల మరల మానవ శరీరములు దాల్చ నవసరము లేదనియు, ప్రస్తుత శరీరము అంతరించుటతో నాశయ

సంసిద్ధి కలుగునని చెప్పుచున్నవి. ఈ రెండు ప్రబోధములలో గూడ మాతవేతర జీవుల స్థితిని, గతిని గురించి యేమియునులేదు. మొదటిది ఆధ్యాత్మికత్వము వైపు చూపునుగాని దానిని అందుకొననీయకుండ అవరోధించును. రెండవది: తానే ఆధ్యాత్మికత్వమువలె కనబడి తన యనుయాయులకు అభ్యుదయము లేకుండ సర్వనాశనము చేయును.

మానవులు ఆధ్యాత్మిక వర్తనులు కాకుండ, వారి యలవాట్లు, ప్రవర్తన, వైఖరి, వ్యవహారములలో నాధ్యాత్మిక సిద్ధాంతములను అనుసరించకుండ, మతముచే కల్పింపబడిన యవరోధములచే, మానవులకు తమ వైవాహిక జీవితార్థతను గూర్చి యాలోచించుటకు అవకాశములు లేకుండ చేసినవి. తమ యింద్రియములు వైవాహిక జీవితమునకు అనుకూలమగునో కాదో, బాధ్యతాయుతముగ కాకపోయినను వ్యామోహితులుగ నైన నుండుటకు సమర్థమగునో కాదో పరిశీలించి, గమనించి తెలిసికొను హక్కు లేకుండ జేసినవి. మానవులు తమ యింద్రియముల సామర్థ్యము, అనుకూలత, ఉన్ముఖతలతో నిమిత్తము లేకుండ, నితరుల నిశ్చయము ప్రకారము, వివాహితులగుచున్నారు. వైవాహిక సంస్థ యెట్లు, ఎందులకు, ఏ యుద్దేశ్యముల నిమిత్తము బయలుదేరినదో, అందు తమ ధర్మము లేవియో వారికి తెలియవు.

శరీరము ఆహారమును గ్రహించుట నిత్యమును, నిరంతరముగ సాగుచుండుట వలన స్థూలశక్తి (blood) కూడ నిత్యము నిరంతరముగ సంచితమగుచున్నది. పురుష శరీరములకు సుమారు పదిహేనునుండి పదునెనిమిది సంవత్సరములు, స్త్రీ శరీరములకు సుమారు పదమూడు నుండి పదిహేను సంవత్సరముల వయస్సు వచ్చునరికి స్థూలశక్తి సృజన శక్తిగా మారుట ప్రారంభించును. ఈ వయస్సు వచ్చునప్పటికే తమ పరిసరములయందలి జంతువుల ప్రవర్తనను చూచి, ఆ ప్రవర్తన

ననుసరించుటకు ఉన్ముఖత పెంపొందుట వలన, సంతానోత్పాదన ప్రారంభించుచున్నారు. మానవ జీవితములయందు వారి శరీరముల యీ వయస్సే, వాని భావిని నిర్ణయించు చున్నది. అభ్యుదయమో, అభివృద్ధియో యిప్పుడే తేలును. అనివార్యము లయిన పరిస్థితులు, పరిసరములు, సాంగత్యములు బాహ్యాముఖముగ లాగును. కొంతకాలముయిన తరువాత ఆ దంపతులలోని యొకరికి వైవాహిక జీవితమునకు తన సృజనేంద్రియముల విముఖత తోచవచ్చును. రెండవవారికి వైవాహిక జీవితము నందున్ముఖత కొనసాగుచుండ వచ్చును. వైవాహిక జీవితమును కొనసాగించుటలో గలుగు నీ విముఖత, సుముఖతలు వారి వారి అభ్యుదయముల ననుసరించి కలుగుచుండును. కాని యిక్కడ మత సంప్రదాయము లడ్డువచ్చి, విముఖులైనవారు తమ విముఖత్వమును పోగొట్టుకొని సుముఖత్వమును పెంపొందించుకొని జీవించవలెనని యాదేశించును. ఈ విముఖత్వము ఇంద్రియములు సక్రమముగ పెంపొందుటకు తగినంత కాలవ్యవధి తీసికొనక పోవుటవలన అప్పటి వరకు సత్వహీనములుగ నున్న సూక్ష్మేంద్రియములు సక్రమముగ వ్యవహరించుట వలన కావచ్చును. లేదా సూక్ష్మేంద్రియములలో నప్పుడే శక్తి పరిణామము వలన సూక్ష్మశక్తి యుత్పన్నమయి యుండవచ్చును. ఎందువలన నయినను నీ విముఖత అనివార్యమయినదే. ఏమయినప్పటికిని యీ విముఖత్వము ఆధ్యాత్మిక క్రమము ననుసరించి యుండును. అయినప్పటికిని వైవాహిక సంబంధముల విచ్ఛేదనమునకు మత ధర్మ మంగీకరింపదు. ఒకప్పుడు దంపతు లిరువురకును నిట్టి విముఖత్వము కలుగవచ్చును. అయినను వివాహ విచ్ఛేదన మాత్ర మసంభవము. ఈ రీతిగ ఒకప్పుడు, విశ్వ విస్తృతమైన మానవ సమస్యలను పరిష్కరించుటకు నేర్పడిన యీ వైవాహిక సంస్థ, ప్రాంతీయములైన మత ప్రయోజనములను అనగా జన సంఖ్యను పెంచుకొనుటను సాధించుటకు మాత్రము వినియోగింపబడు చున్నవి.

మానవేతర జీవులకు మానవ శరీరములను కలిగించి అభ్యుదయమును సాధించుట యను వైవాహిక సంస్థ యుద్దేశ్యమును విస్మరించి, సూక్ష్మశక్తి హీనులై బాధ్యతా రహితులై, స్థూలేంద్రియ దౌర్బల్యము వలన వ్యామోహితులై మానవులు వ్యవహరించుట వలన, మరల మరల మానవ శరీరములతో నవతరింప వలసిన యావశ్యకత గలుగుచున్నది. అందువలన అభ్యుదయ పథమున పురోగమించుచున్న మానవేతర జీవులకును, వారి యభ్యుదయమునకు భంజకము లగుచున్న స్వార్థపరులగు మానవులకును కలుగుచున్న సంఘర్షణను నివారింపజేయుటకు ఆధ్యాత్మిక మూలముపై క్షీణదశలో నున్న వైవాహిక సంస్థ నుద్ధరించుటకే రాజకీయ మేర్పడినది. అందుకొరకై ప్రపంచము నందలి రాజకీయ విభాగము లేర్పడినవి. అటుపిమ్మట మతములు బయలుదేరువరకు వ్యవహారము సక్రమముగనే సాగినది. మత ప్రాబల్యము కలిగిన పిమ్మటకూడ, మత రాజకీయ సమాఖ్య యేర్పడి రాజకీయమునకు బానిసత్వము కలిగినప్పటి వరకును సక్రమముగనే వ్యవహారము సాగినది.

నేటి కాలమునందీ యన్యోన్య బానిసత్వమువలన, నీ యిరువుర బానిసల యుద్దేశ్యము ఒక్కటియే యగుటవలన, సాధనావిధానములు, ఆశ్రితమానవుల యాదరణయు నొక్కటే యగుటవలన, వైవాహికసంస్థ యుద్దేశ్యము నందుకంటె సృజన విధానమునందు ప్రీతి యధికమగుట వలన, మరల మరల మానవ శరీరములతో నవతరించవలసిన యగత్యమేర్పడుచున్నది. ఈ తీరని కోరికలు తీర్చుకొనుటకు, పొందనటువంటి తృప్తిని పొందుటకు, శరీరముల పుట్టుకతో వచ్చుట, చావుతో పోవుట, మరల వచ్చుట జరుగుచునేయున్నవి. ఈ అనివార్యమైన ఆవశ్యకతను నివారించుకొనవలెనన్న వైవాహిక సంస్థయొక్క ప్రయోజనమును మరల జ్ఞప్తికి తెచ్చుకొని, సూక్ష్మేంద్రియములను సూక్ష్మశక్తివంత

ములుగా జేసికొని, సక్రమముగా వ్యవహరించుచు, మానవులందరును ఆధ్యాత్మిక వ్యక్తులు కావలెను.

నేటి కాలము మతరాజకీయములకును, ఆధ్యాత్మికత్వమునకును జరుగుచున్న సంఘర్షణయొక్క శిఖరావస్థ. ఇప్పుడు శక్తిపరిణామము నొందనట్టియు, సూక్ష్మశక్తి తగినంతగ నేర్పడని మానవుల యొక్క శక్త్యుత్సాహము లన్నిటిని సమీకరించుకొనవలసిన యవసరము కలదు. శక్తి పరివర్తన పొందినవారిలో అధికసంఖ్యాకులు అపరిశుద్ధులుకారు. రాజకీయమునకు అవరోధకారులుకారు. కొలదిమంది మాత్రమే విశ్వాత్మమూలమునుండి వ్యవహరించుచున్నారు. ఈ సమీకరణవలన వారి శక్త్యుత్సాహములలోని మత పంకిలముపోయి, విభజనలు, విద్వేషములకు అతీతులయి వ్యవహరింప గల్గుదురు. అటువిమ్మట పరిశుద్ధమైన రాజకీయ జీవనులగుదురు. రాజకీయమునకు మూలము ఆధ్యాత్మిక మగుటవలన; అందలి సభ్యుల స్మృతి, ఆలోచనలు సుస్పష్టములై రాజకీయముయొక్క, దానిమూలముగ మానవులయొక్కయు విశ్వాత్మ భావము నాధారముగ చేసికొని వస్తువిషయాదులతో వ్యవహరింతురు.

అందువలన,

మానవులు వైవాహిక సంస్థయందు బాధ్యతాయుతు లగుదురు గాక!

వైవాహికసంస్థ యుద్దేశ్యము సక్రమముగ నిర్వహింపబడుగాక!

మతము, రాజకీయము, మానవానీకముల యందలి ఆధ్యాత్మికత్వము ఏకీభవించుగాక!



# పంద్రెండవ అధ్యాయము

# అన్యోన్య సహకారము

అసహకారమునకు వ్యతిరేకమయినది సహకారము. మానవుల యందలి విభాగములు, విద్వేషములయొక్క ప్రతిఫలమే అసహకారము. మానవులయందు మానవేతర లక్షణములు కొనసాగుచుండుట వలన విభాగములు విద్వేషము లేర్పడుచున్నవి. సామాన్య వివేకము యొక్క ప్రబోధమును గమనింపక పోవుటచేతను గుణరూపక పరివర్తన, పరిమాణరూపక పరివర్తన పొందుటకు కావలసిన సూక్ష్మశక్తి. వారి యింద్రియములలో లేకపోవుటవలనను వారిలో మానవేతర లక్షణములు కొనసాగుచున్నవి. అందువలన, విభజింపబడిన మానవుల యందు సమైక్యతను సమకూర్చుటకు సహకారమొక సాధనము. సహకారము ద్వారా సమైక్యతను సాధించుటకొరకు సహకారసంస్థ లేర్పడినవి. ఈ సహకారము ఏకపాక్షికమే. అది విభజితమైన ఐక్యతయే. అది సర్వతోముఖ సహకారముగను, సమైక్యతగను రూపొందవలెను. విభజిత మానవులయందు సహకారము స్థాపించిన తరువాత, దాని నైక్యమానవ సహకారముగ మార్చవలెను. విభజిత మానవ సహకార సంస్థ, ఐక్యమానవ సహకార సంస్థ కావలెను. ఈ సందేశమునందు చెప్పబడిన "అన్యోన్య సహకారము" ఐక్యమానవ సహకారమును గూర్చియే చెప్పును.

సౌఖ్యక్షేమముల నుత్పత్తిగావించి, సేకరించి, మానవులకొరకై వినియోగపరచుటయే సహకారము యొక్క యుద్దేశ్యము. ఈ సంస్థల

నిర్వహణ యందు మానవులు వినియోగ పరచు శక్తియే తదాశయ సంసిద్ధి కొరకు వారు చేయు కృషి, తాము జేయు కృషియందు మానవుల సమర్థత వారికిగల సూక్ష్మశక్తిపై నాధారపడి యుండును. కాని మానవులలో అధిక సంఖ్యాకులు సక్రమ మయిన యింద్రియ వ్యవహారము లేనివారు. సహజ వివేక ప్రబోధమును గమనించ లేకున్నారు. సౌఖ్య క్షేమములు పురోవృద్ధిపై నాధారపడి యుండునని తెలిసి యుండియు అభివృద్ధి యన నేమో, అది యెట్లు కలుగునో తెలియని తమ పూర్వపు మానవేతర స్థితియందే యున్నారు. అందు వలన సహకారము యొక్క యుద్దేశ్యములను సాధించుటకు తమంత తామే శ్రమించగల స్థితిలో నున్నప్పటికిని తమ పరిశ్రమలతో సహకార కర్తవ్యమును సాధింపలేకున్నారు. వారి పూర్వ స్వభావము లిందులకు విరుద్ధము లగుటయే కారణము.

మానవులచే తమతమ పరిశ్రమలలో వినియోగింపబడిన శక్తి యందలి ప్రేమ, స్వార్థ పరమగుటచే, తమ అభివృద్ధినే కోరునది యగుటచే, అంతమందు తమ వాటాకు వచ్చు లాభముతో వారు తృప్తి పడలేరు. ఈ యసంతృప్తివలన వారి ప్రయత్న మెల్లప్పుడును తమకు దొరికిన దానికంటె ఎక్కువ సంపాదించుటయందే నిమగ్నమయి యుండును. ఈ స్వభావము శక్తివంతమైన దగుటచే, కాలక్రమమున నీ సంస్థనే విచ్ఛిన్నము చేయగలదు.

ఈ సంస్థ విచ్ఛిన్నము గాకుండ నిలుపుటకు, ఈ సహకారులపై అధికారు లుండవలెను. కాని అధికారులకు లోనయి, విభజిత మానవులచే సాధింపబడిన సహకారములో విభజన బీజము లుండుట వలన సంస్థనే విభజించి, విచ్ఛిన్నము చేయు అవకాశము గలదు. ఇదియే విభజిత మానవులలో సహకారము వలన నేర్పడిన సమైక్యత యొక్క స్థితి.

సంస్థలు సురక్షితముగ నుండవలెనన్న సహకారులలో గల స్వభావములు మారవలెను. వారి స్వభావములు మార్చవలె నన్న ఆ సహకారము సమైక్యమానవ సహకారమై యుండవలెను. మానవు లలో గల తమ పూర్వోపార్జిత మానవేతర లక్షణములను, తమ ప్రస్తుత శరీరముల కుచితమైన మానవలక్షణములుగా మార్చవలెను. ఈ పరివర్తన పొందుటకు వారి సూక్ష్మేంద్రియములు సక్రమముగ వ్యవహరించుచుండవలెను. వారి సూక్ష్మేంద్రియములు సక్రమముగ వ్యవహరించుటకు వారిలో గుణరూపక, పరిమాణరూపక పరివర్తన ములు గల సూక్ష్మశక్తి తగినంతయుండవలెను. పోషణపదార్థముల నుండి యేర్పడిన స్థూలశక్తి, యే శరీరములో సృజనశక్తిగా మారునో, దానిని అచ్చటనే తగినంతకాలము నిలువజేసినయెడల, సక్రమముగ వ్యవహరించు స్థితి కలుగును.

స్థూలేంద్రియములు, సృజనేంద్రియములు మాత్రమే వ్యవహ రించుచు, సూక్ష్మేంద్రియములు వ్యవహరింపకయున్న మానవులు, తమ పూర్వపు మానవేతర స్వభావమునే కలిగియుందురు. వారిలో విభజన స్వభావము కొనసాగుచునే యుండును. వారు సహజ వివేక ప్రబోధమును గమనించలేరు. వారిలో తగినంత సూక్ష్మశక్తి పెంపొందువరకు తమ అహముల యొక్క ప్రాబల్యమును మార్చి వ్యవహరింపలేరు.

ఇట్టి స్థితియందిట్టి సహకారులపై అధికారప్రయోగము ఇంకను దుష్ఫలితముల నిచ్చును. అంతేగాక, సమాజము యొక్క క్షేమము కొరకై విభజన స్వభావము వలన కలుగు కష్టములను, అడ్డంకులను నెదుర్కొనుటకు, ఆ యధికారి యెట్టి సలహాలను, ఆదేశములనిచ్చునో ఆ సలహాలనే, ఆ యాదేశములనే వారి సహజ వివేకము కూడ

నిచ్చుచునే యున్నది. ఆ వ్యక్తులు కూడ ఐక్యతను పెంపొందించుటనే కోరుచుందురు. కాని వారు దానిని కొనసాగింపలేరు. కొనసాగించుటయు లేదు. ఐక్యతా విభజనల యొక్క మంచిచెడ్డలనుగూర్చి, వాని వలన కలుగు లాభనష్టములనుగూర్చియు, అధికారినుండి తాము పొందెడి సలహాలు, ఆదేశములయొక్క సహాయముతో, తాము సహజముగ, తమ స్వభావముల ననుసరించి జరిపెడి కార్యకలాపముల లోని మంచిచెడ్డలను కప్పిపుచ్చుటకు తగిన పద్ధతులను తెలిసికొనుటకు ప్రయత్నించెదరు. సహకార పద్ధతుల ప్రకారము తమ కృషివలన తమకు కలగెడు లాభములకంటె అధికముగ నెట్టులైనను సంపాదించి అధికారిని మోసగింతురు. తత్ఫలితముగ స్వవినాశకర మార్గములో పనిచేయుచున్న యిట్టి సంస్థ అనగా విభజన స్వభావము కలిగిన స్వార్థపరులతో కూడిన సంస్థ చూచుట కారోగ్యవంతముగ కనపడుచు లోపభూయిష్టమై వ్యవహరించుచుండును.

అందువలన ఐక్యమానవ సహకారసంస్థ కావలెను. సహకారము యొక్క ప్రయోజనమే సమైక్యతాసాధన మయినపుడు. ఐక్య మానవులకు మరల సహకారము యొక్క యావశ్యకతగలదా యను నంశము విచారణీయము. విభజిత మానవులలో, సహకారము ద్వారా సమైక్యతసాధన యసంభవమయినపుడు, వారిలో మాత్రము సహకార సంస్థ స్థాపనవలన ప్రయోజనమేమి ? ఇదికూడ మరల విచారించ వలసిన విషయమే !

మొదటిది, ఐక్యమానవ సహకారము అవసరమే. రెండవది, విభజిత మానవసహకారము, అసమర్థమయినప్పటికిని, కర్తవ్యమును సాధించుటకొరకు అవసరమయినదే. ఐక్యతవలని లాభము, అనైక్యత వలని నష్టములను ప్రబోధించి సహకారులలో నైక్యతను సాధించుటకు

పీలుపడును. వారిలో మానవ, మానవేతరత్వ విచక్షణ కలిగింపవలెను. వారు తమ సహజ వివేక ప్రబోధములను గమనించునట్లు చేయవలెను. కాని, యీ పనిచేయుట, అనగా వ్యక్తులు తమ సహజ వివేక ప్రబోధములను గమనించునట్లుచేయుట, సహకారాధికారులకు శక్తికి మించిన విషయము. ఇది ప్రేమవలన మాత్రమే సాధింపబడగలదు. ప్రేమయే వారికి సహజ వివేక ప్రబోధములను గమనించు శక్తిని కలుగజేయును. అధికార ప్రయోగము ప్రబలమైనచో వారిలో అంతకు పూర్వము గల వైఖరి దృఢతరమై, సామాజిక కృషివలన లభించిన ఫలితములను ఇతరులకంటె తామెక్కువ పొందవలెననియే ప్రయత్నింతురు. అధికార ప్రయోగము వలన సహకారులలో తమ దోషములను కప్పిపుచ్చుకొనెడి యుపాయములు పెరుగుచున్నవి. అధికార ప్రాబల్యము వలన అణచిపెట్టెడు స్వభావమెక్కువగు చున్నది. అణగద్రొక్కబడిన వానియందు విస్తృతమయ్యెడు శక్తి సహజముగ నుండుటవలన, ఆ దోషములెక్కువై, విజృంభించి మరల మరల వచ్చుచుండును. వానిని అణచిపెట్టుటకు మరల నధికార ప్రాబల్యము కావలెను. ఈ రీతిగ, ఒకటి తరువాత మరియొకటిగ నీ రెండును పరిపాటియై పోవును.

ప్రేమ ప్రాబల్యములో నిట్టి లోపము లుండవు. అది సరాసరిగ, సహజ వివేకముతో వ్యవహరించును. అనువైనరీతిని సహజ వివేకమును ప్రబోధించి, బలపరచి, వ్యక్తులు స్థూల సృజనేంద్రియ ప్రాబల్యమున కతీతులై, పూర్వ ప్రకృతి నతిగమించి వ్యవహరించునట్లు చేయును. ఇచట సహకారులు బయట యెవ్వరికిని వ్యతిరేకులుగారు. తమలోనున్న తప్పు స్వభావమునకే వ్యతిరేకులై, తమ స్థూల సృజనశక్తుల పాబల్యము నెదుర్కొన యత్నింతురు. ఈ స్థితి సహకారు

లలో ముందుగా ఐక్యతా సాధనకు దారితీసి, అటుపిమ్మట సహకార కృషికి తోడ్పడును. ఆ కృషియొక్క ఫలితముగ వారికి ప్రాప్తించిన దాని తోడనే వారు తృప్తిపడుదురు. ఈ విధముగ సహకార కృషి ప్రారంభమగుటకు పూర్వమే ప్రేమమూలముగ విభజిత సహకార సంస్థలందు ఐక్యతను సాధింపవచ్చును. ఇదియే సహకారము (Co-operation) ద్వారా సాధింప వలసిన అన్యోన్య సహకారము (Mutual Co-operation).

మానవేతర స్వభావము నధిగమించి మానవ వైఖరి, ప్రవర్తన, అలవాట్లను కలిగియున్న మానవులే, యింకను పూర్వ వైఖరికి అతీతులు కాలేని వారికి సహాయ పడగలరు. వారి హృదయము సరియైనది. వారి ప్రేమ నిస్వార్థమైనది. వారు తమతో సంబంధము కలిగియున్న వస్తు విషయాదుల యొక్క అభివృద్ధికొరకు ప్రేమను ప్రదర్శింతురు. అందువలన వారు తమ ప్రేమతో నితరులపై ప్రాబల్యము వహింతురు. అందువలన అన్యోన్య సహకార స్థాపనకు, నిస్వార్థ ప్రేమనే స్వభావముగా గలవారి ప్రాబల్యము మిక్కిలి యవసరము.

నిస్వార్థప్రేమ సర్వసంయుతము. అన్నిటిని కూడి యుండిన దగుటచే, అన్నిటిని కూడుకొని యుండును. అది యెవ్వరిని విడతీయదు. అన్యోన్య సహకారసంస్థ యందలి సహకారుల నడుమ తారతమ్యముల నెంచదు. సామాజిక కృషిని ప్రారంభించుటకు పూర్వమే ప్రేమ పూర్వకమైన సమైక్యతను సాధించుట వారి లక్షణము. తమ పరమాశయమునుండి యెవ్వరిని వేరుచేయరు. అందరను కలుపుకొనుట వలన, సాముదాయిక కృషి ఫలితమును ఇతరులకు లభించు దానికంటె తా మెక్కువగ పొందవలెననెడి వ్యామోహము దూరమగును. అట్టి వ్యామోహమునకు బలమును కలిగించు స్థూల సృజనేంద్రియములు బలహీనములగుట వలన సామాన్య వివేకము బలవత్తరమై, ఉత్సాహ

వంతమగును. అట్టి సామాన్య వివేకముగల వారికి సూక్ష్మేంద్రియములు సక్రమముగ వ్యవహరింపక పోయినను, వారు తమకు లాభదాయకముగ వ్యవహరించుటయే గాక, వారి కృషివలన కలిగినఫలాను భూతి నితరులుకూడ పొందునట్లు చేయుదురు.

సత్యమయిన ప్రేమ ప్రాబల్యము వలన, లాభ ప్రదాతలును, లాభమును పొందిన వారును నైన వ్యక్తులు, కాలక్రమమున స్థూల సృజనేంద్రియ సహజ ప్రాబల్యమునకు అతీతులగుదురు. వారి యున్ముఖత తీవ్రమయి, తమ సృజనశక్తిని తమలో తగినంతకాలము నిలువ జేయుటవలన సూక్ష్మేంద్రియములు సక్రమముగ వ్యవహరించి వారి పూర్వపు మానవేతర వైఖరులను, అభిరుచులను, మానవోచితముగ మార్చివేయును.

ఐక్యతవలన ప్రోత్సహింపబడి, నిస్వార్థ ప్రేమ ప్రాబల్యమునకు లోనైన సూక్ష్మశక్తి తప్పక గుణ సమృద్ధిని కలిగియుండును. సూక్ష్మశక్తియందలి యీ గుణ సమృద్ధి, పరిమాణ సమృద్ధితో కలిసి, వస్తు విషయాదులయొక్క సూక్ష్మానుభూతిని పొంది, వానిని గూర్చిన సమస్త విషయములను అవగాహన చేసికొని వానియెడల సక్రమముగ వ్యవహరించుటకు అవకాశము కలిగించును.

అన్యోన్య సహకార సంస్థ స్థాపితమైనపుడు దానివలన ప్రయోజనము మానవులకేగాక, మానవేతరులకు కూడ కలుగును. మానవేతర జీవులకును తమకునుగల సంబంధము గుర్తెరిగిన తోడనే, వానికిని తమకును గల ఏకత్వమును గ్రహించి నంతనే వారికి గూడ తమ కృషి ఫలితముల నందజేయ గోరెదరు. ఈ రీతిగ మానవేతర జీవులకు కూడ మానవ కృషి ఫలితములందును.

మానవ మానవేతర జీవులకుగల యేకత్వము, వారికిగల సంబంధమును వ్యక్తులు గ్రహించినంతనే వారిలోగల అన్యోన్య పరాధీనత, అన్యోన్య బాధ్యతలను గూడ గుర్తించెదరు. పరస్పరాధీనత, పరస్పర బాధ్యతలుగల వారందరును, అన్యోన్య సహకారము ద్వారా పరాధీనుల నందరను స్వతంత్రులను జేసి అందరును సర్వస్వతంత్రమైన సర్వాంతర్యామికి మాత్రమే అధీనులై యుండవలెను.

సర్వ స్వతంత్రమైన సర్వాంతర్యామి పైననే మానవులందరు నాధారపడి యుండినయెడల 'తమవి' అని యనుకొనవలసిన వస్తు సంచయ మేమియు వారికుండదు. ఏ వస్తువు యెడలను తమది యను భావమును పెంచుకొనరు. ప్రపంచము నందలి సమస్త వస్తువిషయాదులును సాముదాయక కృషివలన నుత్పన్నమై, సేకరింపబడి, సరఫరా చేయబడుచున్నవని వారు భావింతురు. అదేరీతిగ, ఈ ప్రపంచము నందలి సమస్త విషయాదులును, సమస్త మానవులకును చెందెనవని మానవానీక మంతయును భావించును.

అప్పుడట్టి మానవానీకము సర్వాంతర్యామి మాత్రమే తమకు చెందిన దనుకొందురు. సర్వాంతర్యామిని తమ స్వంతముగ భావింతురు. సర్వాంతర్యామిపై తామాధారపడి యుంటిమనుకొందురు. తమకు చెందినవానిని, తామాధారపడి యున్నవానిని, ఒకేరీతిగ భావింతురు. తమతో సంబంధముగల సమస్త వస్తు విషయాదులను తమతోబాటు పరాధీనులుగనో, స్వంతదారులుగనో భావింతురు. సర్వాంతర్యామి యెడల తమకుగల హక్కును, ఆధీనతను భావించి, వస్తు విషయాదులలోని సూక్ష్మతను అవలోకించి, అనుభవించి, విశద పరచి, తమ దృష్టి, అనుభవముల ననుసరించి తమ ప్రవర్తన వైఖరులను మార్చుకొని, తమ వ్యవహారాదులయందు నిస్వార్థప్రేమను ప్రద

ర్శించుచు, విశ్వసౌఖ్య ప్రదాతలుగను, ఆ సౌఖ్యము ననుభవించు వారు గను కూడ వ్యవహరింతురు.

ఇట్టి మానవోచిత ప్రవర్తన వలన వారు శాంతి అభ్యుదయ ముల ద్వారా పురోగమింతురు. ఇతర మానవులలోనను, మానవేతరు లలోనను ప్రేమ జ్ఞాన సామర్థ్యములలో గుణ పరిమాణ సమృద్ధులు కలుగునట్లు, సమస్త వస్తు విషయాదుల యొక్క సూక్ష్మస్థితులను వారు గమనించి, అన్యోన్య అభ్యుదయ సాఫల్యము కలుగునట్లు పురోగ మింప జేయుటకు వారు తగినశక్తి కలిగియుందురు.

అన్యోన్య సహకారసంస్థ ప్రపంచము నందలి అతిప్రాచీన సంస్థ లలో నొకటి. మొట్టమొదట స్థాపింపబడినది వైవాహికసంస్థ. అది నిర్మాణ మయిన చాల కాలము తరువాత మానవ సమాజముచే స్థాపింపబడిన రెండవ సంస్థయే అన్యోన్యసహకారము. ఈ సంస్థ చాల కాలము సక్రమముగనే వ్యవహరించినది. కాలక్రమమున క్షీణించుట యారంభమైనది. అప్పుడు రాజకీయము ప్రారంభమయ్యెను, రాజకీయ సంస్థ ప్రాబల్యమువలన రాజకీయము యొక్క అధికారముక్రింద నీ సహకారము సక్రమముగనే పనిచేసెను. ఇట్టి స్థితి మతము స్థాపింపబడు నంతవరకు జరిగెను. మతము స్థాపింపడిన తరువాత తప్పుడు పద్ధతు లలో వ్యవహరించుచు, ఉపమతములు బయలుదేరువరకు సహకారము సాగుచునే యుండెను. ఉపమతము లేర్పడిన తరువాత సహకారము లోని యన్యోన్యత్వము కాలక్రమమున పూర్తిగపోయి, ఏకపాక్షిక సహకారము మిగిలెను.

అనేక అధినేతల పరిపాలనక్రింద, బహుదీర్ఘకాలము తప్పుగా వ్యవహరించుచు, రాజకీయప్రాబల్యము హెచ్చుగుటవలన నీ సంస్థక్రమ ముగ క్షీణించెను. అన్యోన్య సహకారమును పునరుద్ధరించి క్షీణత నరి

కట్టుటకు అధికారులు అసమర్థులైపోవుటవలన, కాలక్రమమున కొందరు రాజకీయాధినేతలు స్వార్థపరులై అసురులు, రాక్షసులునై పోయిరి.

మానవులలో అన్యోన్య సహకారము క్షీణించినది మొదలు, ఏకపక్షసహకారము ప్రబలమగునంతవరకు, అధికారులలో ప్రేమ క్షీణించి, మూలము మారిపోవుటవలన, వారు సహకారుల కార్య కలాపములలో సక్రమముగ పాల్గొనలేకపోయిరి. వారి కృషికి అప జయమే సాధారణ లక్షణమయి పోయినది. రాజరికముచేత అధికారుల ద్వారా వినిగ్రతమైనశక్తి తనకృషియందు అపజయమునుపొంది నిరా శతోకూడి తాను పుట్టినచోటునకు అనగా రాజరికము నొద్దకు తిరోగ మించి చేరుకొన్నది. అందువలన రాజరికములో విభ్రాంతి, వ్యామోహము ప్రబలదొడగినవి. కొందరు నిరంకుశులైరి. నిరంకు శత్వము రాజరికము యొక్క సామాన్య లక్షణమయ్యెను. వారు తమకు అప్పగింపఁబడిన బాధ్యతలను నిర్వహించుటయందు తమ ప్రేమను సక్రమముగ వినియోగింపఁజాలరైరి. వారి యధికార నిర్వహణమునందు గలిగిన నిరాశయొక్క ఫలితముగా తమ పూర్వ స్వభావముల కతీతులు కాలేకపోయిరి. సహకారుల సౌఖ్య క్షేమ ముల కంటె తమ సౌఖ్య క్షేమములకే ప్రాధాన్యము నీయ దొడంగిరి. అందువలన వారికి గలిగిన నిరాశ, వ్యామోహము విభ్రాంతి పూర్వవైఖరులకు, వారికిగల బలాధిక్యతతోడై, ప్రపంచము నందలి సమస్త వస్తువిషయాముల యందును వారికి వ్యామోహము కలి గించుటవలన యితరులెవ్వరికిని లేకుండ తామే సమస్తమును పొందవలె నను ఆకాంక్ష పెరిగినది. రాజరికము యొక్క యీ ప్రయత్నము, విశ్వావశ్యకతతో, విశ్వసిద్ధాంతముతో సామరస్యములేని దగుటచే, విశ్వనిర్మాణ తత్త్వముతోడను, మానవనిర్మాణతత్త్వముతోడను, సామ రస్యహీనమగుట వలన అసాధ్యమయినది. రాజరికము వారలిట్టి

దుష్కృత్యములకు పూనుకొనినపుడు వారిని అసురులు, రాక్షసులు అని యనెడివారు.

ఈ ప్రపంచమునందలి సమస్త వస్తువులను ఒకేయొక వ్యక్తియే పొందుట సాధ్యమే యయినచో, అప్పుడు యీ వస్తువులద్వారా సౌఖ్య క్షేమములయందు సంపూర్ణ సంతృప్తిని పొందుటగూడ సాధ్యమే యగును. అప్పుడా వ్యక్తియొక్క సౌఖ్య క్షేమములు సురక్షితముగా నుండవలెనన్న, ఆ వస్తు సముదాయము లన్నియును, వస్త్వాంతర వస్తు ధర్మమునకు లోబడి యుండకూడదు. అనగా ఆ వస్తువుల లోని మూల పదార్థమునకు కాల ప్రభావమున క్షీణించెడి ధర్మ ముండ కూడదు. లేనియెడల నీ ధర్మము ననుసరించి, వస్తువులు క్షీణించి, రూప వైకల్యమును పొంది, పూర్తిగా నశించినచో వానియందు వ్యామోహము కలిగియున్న ఆ వ్యక్తికి నిరాశ, విభ్రాంతి తప్పవు. ఇదియే మానవుని సిగ్గుమాలిన తనమునకు శిఖరావస్థ.

అన్యోన్య సహకార సంస్థ నశించి పోయినప్పటికిని, వ్యక్తులలో అన్యోన్య సహకార వైఖరి మాత్రము కొనసాగుచున్నది. ఈ వైఖరి మానవేతర జీవులలో ముఖ్యముగ అల్పేంద్రియ జీవులలో మిక్కుటము గ కన్పట్టుచున్నది. అనేక చీమలు కలసి ఏ ధాన్యపు గింజనో, మరియే వస్తువునో తామనుకొనిన ప్రకారము అనుకొనిన చోటునకు తీసికొని పోవుటకు నిశ్చయించుకొని, అన్యోన్య సహకారముతో పాటు పడి, తమకంటె ఎన్నియోరెట్లు బరువైన ఆ వస్తువును తీసికొని పోవుటలో అద్భుత విజయమును సాధించును.

ఇదెట్లు జరుగును? తమకు కావలసిన ఆవశ్యక వస్తు విషయాదుల యుత్పాదన, కరణ, సేసరఫరాలు, ఐక్యత అన్యోన్య సహకారు

లపై నాధారపడి యున్నవిగనుక జరుగును! మానవులలోవలె అనైక్యతా ప్రధానము కాదు.

చీమలయొక్క యీ కృషి ప్రేమ ప్రాబల్యము కలది. తమకు కావలసిన వస్తువులను సంపాదించుకొనుట యందలి ప్రేమ, ఆ వస్తువులను సంపాదించెడి విధానము నందలి ప్రేమయొక్క ప్రాబల్యములో కూడి యున్నది. ఇక్కడ వస్తువులను సంపాదించుట యందలి ప్రేమ, విషయ నిర్ణయము నందుగల ప్రేమ ప్రముఖ విషయములు. ఆ నిర్ణయములు వాని యన్నిటికిని స్మృతిదాయకముగ నుండి ఆ నిర్ణయమును నెరవేర్చగల సాధనా విధానమును గుర్తునకు తెచ్చును. ఆ నిశ్చయమే వారికి స్మృతిదాయక మగుటవలన అదియే వారికి స్మృతి, ధర్మము, నిర్వాహకము కూడ.

ఒక చీమ మరియొక చీమకు ఈ నిశ్చయము నందిచ్చును. రెండవ చీమ ఆ నిశ్చయములో భాగస్వామియై కూడ దానిని నిర్వహించును. చీమలు వానియందవియే నిర్ణయము చేసినవి. వాని నిర్ణయమును అవియే జ్ఞప్తికి తెచ్చుకొనుచున్నవి. ఆ చీమలే పనికి పూనుకొనుచున్నవి. ఆ చీమలే ఫలప్రదాతలు. ఆ ఫలమునకు వారసులు కూడ ఆ చీమలే, నిశ్చయకర్తలు, నిర్వాహకులు, ఫలప్రదాతలు అన్నియు ఆ చీమలే. ఇతరము లేవియు కావు.

మానవ సహకార సంస్థలలో కూడ సహకారులు, నిశ్చయము, స్మృతి కలవు. సహకారులే ఫలప్రదాతలు, ఆ ఫలమునకు వారసులు కూడ. కాని ఆ నిశ్చయమును నిర్వహించుటకు బాధ్యులైన అధికారులు సహకారులు కారు. ఫలప్రదాతలును కారు. ఆ ఫలమునకు వారసులును కారు. ఆ యధికారులు సహకారులయొక్క నిశ్చయమునకు నిర్వాహకులు మాత్రమే. ఒకప్పుడు సహకారులయొక్క

సాముదాయిక కృషి సఫలము కాకున్నచో, సహకారులయొక్క సౌఖ్య క్షేమములకు కావలసిన వస్తు విషయాదులు లభింపక పోయినచో, సౌఖ్య క్షేమములు లేక కష్టపడునది సహకారులు మాత్రమే. దాని వలన అధికారుల కెట్టి నష్టమును లేదు. వారి సౌఖ్య క్షేమములీ సాముదాయిక కృషితో గాని, వస్తూత్పత్తితోగాని సంబంధము లేకుండగనే సురక్షిత మొనర్పబడినవి. అవి సురక్షితము లగుట వలననే వారధికారులైనారు. సురక్షితములు కాని సౌఖ్య క్షేమములు గల సహకారులకు సౌఖ్య క్షేమములను పెంపొందించుటకు చేయు కృషిని వీరు నిర్వహించెదరు.

చీమల కృషికి, మానవుల కృషికిగల తారతమ్యము పరిశీలింపదగినదియే. చీమల కృషి అన్యోన్య సహకారము. మానవుల కృషి సహకారము. చీమల కృషి ప్రేమ ప్రాబల్యము కలది. మానవుల కృషి అధికార ప్రాబల్యము కలది. చీమల కృషి ఫలప్రదము కానిచో అన్ని చీమలతో సహా అధికారములోనున్న చీమగూడ ఆ కష్టనష్టములను భరించవలసియున్నది. అందు వలన నిర్వాహకులయిన చీమలు అధికారులు కావు. ఆ చీమకు మిగిలిన చీమలయెడ బాధ్యతయేగాని అధికారము లేదు. దానికి నిర్ణయమునందు బాధ్యత గలిగి యుండుటచే, కృషియందు భాగస్వామి యగుటచే, ఆ కృషిలో పాల్గొనిన సమస్త యితర చీమలవలె ఫలప్రదాత, వారసు నగుటచే మిక్కిలి బాధ్యత కలిగియున్నది. అందువలన అన్యోన్య సహకార సంస్థలలో, నిర్ణయమును నిర్వహించుటలో, ఆ నిర్ణయమునకు కారకులైన వారందరకును, తమ కృషియొక్క సఫలత, విఫలతలపై సౌఖ్య క్షేమము లాధారపడి యున్న వారికందరకును బాధ్యత గలదు. మానవులలో నిర్వహణాధికారికి నిర్ణయముతోగాని, కృషితోగాని, ఫల ప్రదాన

ముతోగాని, తదను భూక్రాంతితోగాని, వారి సామాజిక కృషియొక్క విజయముతోగాని, వైఫల్యముతోగాని సంబంధము లేదు.

అందువలన,

మానవులయొక్క సహకారము ప్రేమ మూలకమగుగాక !

మానవులయొక్క సహకారము అన్యోన్య మగుగాక !

మానవులు సమస్త జీవులకు ఫలప్రదాత లగుగాక !

మానవులు తమయొక్క కృషి ఫలితములకు తామొకూడ వారసు లగుదురుగాక !



## పదమూడవ అధ్యాయము

# ఆధ్యాత్మిక బ్రువులారా! జాగ్రత్త!

ఆధ్యాత్మిక సిద్ధాంతములు వాగ్రూపమున వెలువడుటకు పూర్వము అనగా వేదము గ్రంథరూపములో బయలు దేరుటకు పూర్వము ఆధ్యాత్మిక సిద్ధాంతముల వ్యాప్తి పఠనము, సౌంజ్ఞల మూలముగనే జరుగుచుండెడిది. అట్టి స్థితికి పూర్వమే వైవాహికసంస్థ నిర్మాణమయినది. ఈ సంస్థ నిర్మాణమయిన తరువాతనే అన్యోన్య సహకారసంస్థ నిర్మాణమయినది. తరువాత కాలక్రమమున యీ అన్యోన్య సహకార సంస్థ అధికారయుత సహకారమయి అటు పిమ్మట కొంతకాలమయిన తరువాత రాజకీయముగ రూపొందినది. వైవాహిక రాజకీయ సంస్థలు రెండునూ ఆధ్యాత్మిక మూలముపై స్థాపింపబడినవి. రెండింటికిని వేరు వేరు ప్రత్యేక సాంప్రదాయ గలవు. సాంప్రదాయసూత్ర ఈ నిర్మాణములును గలవు. ఈ నిర్మాణములు వివాహితులకు నిస్వార్థప్రేమ, బాధ్యలతో కూడిన సహాయప్రోద్బలములనిచ్చును. అందుమూలమున వారు బాధ్యతాయుతులైన వివాహితులయి మానవకర్తవ్యమును సముచితముగ మానవులయొక్కయు, మానవేతరుల యొక్కయూ, అభ్యుదయమున కనుకూలముగ నిర్వహింప గలుగుదురు. తమ శరీర పోషణకు, రక్షణకు నవసరమయిన యేర్పాటులను చూచుకొనుటయే గాక, వైవాహికసంస్థ కతీతులయిన వారలకు గూడ నట్టి సదుపాయములను సమకూర్చి వారు తమ కర్తవ్యములను నిర్వర్తించుటకు తోడు

పడెదరు. వైవాహికసంస్థ కతీతులయినవారు మానవులనుండి వినిర్గత మైన శక్తులను మానవేతరులనుండి వినిర్గతమైన శక్తులను సంయోగ పరచి మానవేతర జీవులు ఉత్తమేంద్రియములనుపొంది మానవులగు టకు విశ్వమందు అనుకూల పరిస్థితుల నేర్పరచెదరు. ఈ రీతిగ ఇట్టి వ్యక్తుల శరీరములకు కావలసిన వస్తువిషయాములనుగూడ సమకూర్చు టయేగాక, అట్లు సమకూర్పబడిన వస్తువిషయాములకు రక్షణకూడ యేర్పడెడిది.

చాల కాలము వరకు ఈ సంస్థలు రెండునూ కడుసమర్థముగనే వ్యవహరించినవి. తరువాత, ఆ సంస్థల నడుమ సంబంధములు క్షీణించి నవి; సామరస్యము లేకుండ ప్రవర్తింపదొడగినవి. ఇట్టి స్థితిలోనే ఒకరి తరువాత మరియొకరు, ఒకప్పు డొకే పర్యాయ మనేకులు, వివిధ ప్రాంతములందును విశ్వాభరణము లనదగు ఆధ్యాత్మిక మహావ్యక్తులు బయలుదేరి ప్రజాకర్షణను పొందదొడగిరి. వారిలో కొందరు ఆధ్యా త్మికేంద్రియ చైతన్యము కలిగియుండిరి. మరికొందరు మహాసూక్ష్మ అత్యధికసూక్ష్మ, అతిసూక్ష్మ యింద్రియముల చైతన్యమును కలిగి యుండిరి. వారిలో బహుకొద్దిమంది మాత్రమే ప్రేమ, సంపూర్ణత్వ మును కలిగియుండిరి. మరికొందరు జ్ఞానాధిక్యత, మరికొందరు సామర్థ్యా ధిక్యత గలిగియుండిరి. మరికొందరు రెండింటి ఆధిక్యతను గలిగియుండిరి. వారిలో నొక్కరు మాత్రమే ప్రేమజ్ఞాన సామర్థ్యముల మూడింటి సంపూర్ణత్వముతో నవతరించిరి.

ఆయా ఆధ్యాత్మిక వ్యక్తుల ప్రాబల్యము హెచ్చుగానుండిన కాలములో ప్రేమ, జ్ఞాన, సామర్థ్యములలో నేదియో యొకటి తగ్గు దలలో నుండుచువచ్చెను. వేర్వేరు ప్రాంతములయందు, ఆయా ప్రదే శముల యందలి ఆధ్యాత్మిక వ్యక్తుల ప్రాబల్యమును బట్టి, ఒకచోట

తగ్గిన శక్తులు మరొకచోట హెచ్చుచుండెడివి. ఆ మహా వ్యక్తులు వారి భావనలయందు, విచక్షణలయందు సిద్ధాంతములయందు, భాషణ రూపములో ప్రకటించుటయందు తమలో ప్రబలముగానున్నట్టియు ఆయా ప్రాంతములలో తగ్గుదలలోనున్నట్టియు భావముల యుత్కృష్టతకే ప్రాధాన్యము నిచ్చుచుండెడివారు. ఇతరభావము లప్రధానములని గాని, తాము ప్రధానముగా నెంచిన భావములకు యితర భావములు లోబడియుండుననిగాని వారెన్నడునూ ప్రకటింపలేదు. తక్కువగా నున్నవానిని యెక్కువచేసి, వైవాహికసంస్థ యుద్దేశ్యములను బలపరచి విశ్వాభ్యుదయమున కవసరమయిన ఉభయసంస్థల సమరస వ్యవహార మునకు వారట్లుచేసిరి.

ఆ మహావ్యక్తులకు చుట్టునుగల మానవులు వారి ప్రబోధముల యందలి మాటలను మాత్రమే గ్రహించిరి గాని, వాని యుద్దేశ్యము లను గ్రహింపలేకుండిరి. ఆ మహావ్యక్తుల ప్రబోధములలోని భావము లను గ్రహింపలేకుండిరి. కొందరు మహావ్యక్తులు మౌనులైయుండుట వలననేమి, అతి అరుదుగ వారు పలికిన పలుకులను ప్రజలు సక్రమ ముగా నవగాహన చేసికొనలేకపోవుట వలననేమి, ప్రజలు వారిని సరిగ అవగాహన చేసికొనలేకపోయిరి. అట్టి మహావ్యక్తులచే అరుదుగా పలుక బడెడి విషయములు అప్రధానము, అనవసరము అని ఆ ప్రజలనుకొనిరి. అన్ని ప్రాంతములలోనను యిట్లే జరిగెను. ఆధ్యాత్మిక వ్యక్తు లను సరిగా నవగాహనచేసికొనక పోవుటవలన వివిధప్రాంతములలోని మానవులలో కలవరపాటు కలిగెను. ఈ కలవరపాటువలన ఆ వ్యక్తుల లోని విశ్వాత్మభావమునందు, వారు ప్రబోధించిన సమస్త విషయముల లోని విశ్వాత్మభావమునందు అనిష్టత ప్రబలదొడగెను. ఈ అని ష్టత వలన వైవాహిక రాజకీయ సంస్థలలోను ఈ యుభయసంస్థల నడుమను, ఆ మహావ్యక్తులు సశరీరస్థితియందుండగనే అసామరస్యము

పెరిగిపోయెను. ఆ వ్యక్తుల యనుయాయులలో వివిధప్రాంతములలోను చీలికలును. వర్గములును నేర్పడెను. ప్రతివర్గమువారును తమ సంఖ్యా బలమును పెంచనొడగెను. ఈ రీతిని వర్గములు వ్యాప్తిచెందుచుండగా ఆ మహావ్యక్తు లొకరి తరువాత నొకరుగ సహజమైన పరిస్థితుల వల ననో. అసహజమైన పరిస్థితుల వలననో- దేహాంత స్థితిని పొందిరి. మానవానీకముతో వారికి ప్రత్యక్ష సాంగత్య మంతరించెను.

అటు పిమ్మట, ప్రతి వర్గమును అధికమైన సంఖ్యా బలమును పొందుటతో, ఆ వర్గములు ఉపవర్గములుగా చీల దొడగెను. వేరువేరు కాలములలో, వేరువేరు ప్రాంతములలో అధికమైన సంఖ్యా బలము కల వర్గములు ప్రధాన వర్గములుగ గణింప బడెడివి. తరువాత నీ వర్గములే మతములు గను, ఉప వర్గములే శాఖలు లేక ఉప మతములుగను వ్యవహరింప బడినవి. ఉప మతము లింకనూ యేర్పడుచునే యున్నవి. మతములను సంస్కరించి పునరుద్ధరించ వలెనని చేసిన ప్రయత్నముల వలనను, ఉపమతములు అసలు మతములుగ మారిపోవలె ననిడి ప్రయత్నముల వలనను, ఇంకనూ క్రొత్త యుపమతము లేర్పడు చున్నవి. పైన జెప్పబడిన యీ విధానము లన్నియు ఆధ్యాత్మిక మహా వ్యక్తుల పేరిటనే జరుగుచున్నవి. ఆ మహా వ్యక్తులు ప్రబోధించిన ఆధ్యాత్మికత్వము మాటు వడిపోయి నప్పటికినీ విద్వేషము, విభజనలపై నాధార పడియున్న యుప మతముల స్థాపన మాత్రము ఆ మహా వ్యక్తుల పేరిటనే జరుగుచున్నది. వైవాహిక, రాజకీయ సంస్థలలోను, వాని మధ్యను బయలుదేరిన యీ కల్లోల పరిస్థితి చాల కాలము సాగినది. సమాజమునకు మతమునకు జరుగుచుండెడి యీ సంఘర్షణలలో రాజకీయము భాగస్వామి కాక దూరముగ నుండుచు వచ్చెను. మత విషయములలో కలుగజేసి కొనుటకు జంకుచుండెను. ఆధ్యాత్మిక మహా వ్యక్తుల

పేరిట కార్య కలాపములు జరుగు చుండుట వలన మతమునే ఆధ్యాత్మి కత్వ మనుకొను అంప కలుగజేసి కొనుటకు వెనుదీయు చుండెను.

అటు తరువాత, మతముల లోని సంఖ్యా బలము హెచ్చిన కొలదిని, ఇంకను హెచ్చింప వలె ననెడి యాకాంక్ష ప్రబలమై తుట్టతుదకది హింసా రూపమును కూడ దాల్చెను. ఒకే యొక మతము మాత్రము మత ప్రచారమునకు హింసను సాధనముగా గుర్తింప లేదు. అట్టి మత హింసలు విరివిగా వ్యాపించి యితర మతముల వారిని హింసింప దొడగెను. అట్టి మతహింసలు దుర్భర మయినపుడు భయ గ్రస్థ మయిన రాజకీయము అప్పటినుండి శ్రద్ధ వహింప దొడగెను. ఏ మత ము తోడను ఎట్టి సంబంధమును లేనట్టియు, ఆధ్యాత్మిక స్ఫురణ కలిగి, విశ్వాత్మ భావమునం దాధారము కలిగియున్నట్టి రాజకీయముతో సన్నిహితు లయినవారు కూడ దుర్భరమయిన మత హింసలను సహింప లేక, గత్యంతరము లేక మతముల పైపు మొగ్గుచుండిరి. రాజకీయ సంస్థ క్షీణించి నప్పటికినీ, అవి తమ విశ్వాత్మ భావమును మరచిపోలేదు. మానవ సమాజము యెడ తమకుగల బాధ్యత, శరీరములను వస్తు విష యాదులను రక్షింపవలసిన భారమును మరువలేదు. కాని ఆ స్థితియందు, మతము లనుసరించిన హింసావిధానము వలననయిననేమి, రాజకీయము యొక్క భయగ్రస్థ స్థితివలన నయిననేమి ప్రజల యొక్క రక్షణ పోష ణాదులు మతముల యధీనము లయ్యెను.

ఇట్టి స్థితియందు, తనకు సహజముగా గల విశ్వాత్మభావ స్ఫూర్తి వలనను, సమాజముయెడల తనకు గల బాధ్యత మూలమునను మతము జరిపెడి హింసాకాండను రాజకీయము హింసా మూలకముగనే ఎదుర్కొన ప్రారంభించెను. రాజకీయము వలన సాగింపబడిన ఈ హింసా కార్య క్రమమునుండి, హింసనే యెరుగని ఆ యేకైక మతముకూడ తప్పించు

కొనలేక పోయెను. ఈ స్థితియందు మతములకు, ఉపమతములకు నడుమ సంఘర్షణ సన్నగిల్లినది. అవి రెండును యేకమై రాజకీయమునకు వ్యతిరేకముగ నిలచినవి. నిజమునకు ఈ సంఘర్షణ ఆధ్యాత్మికత్వమునకును రాజకీయములకును నడుమ సంఘర్షణయే! ఆధ్యాత్మికత్వము యొక్క స్మృతి మూలముననే, రాజకీయము మానవకోటి యెడల తనకు గల బాధ్యత నిర్వహింప బూనినది. రాజకీయ సంప్రదాయము నందు ఈ స్మృతియే అప్పటికి మిగిలిన ఆధ్యాత్మిక లేశము. ఈ సంఘర్షణలయొక్క ఫలితముగ మతముల యందలి సంఖ్యాబలముల పెరుగుదల యాగిపోయి విశ్వాత్మభావమునకు సంపూర్ణ విజయము కలిగెను.

విశ్వాత్మభావముతో కలిగిన యీ సంఘర్షణలో అపజయము కలుగుటతోడనే మతానుయాయులలో సంచలనము కలిగి, మతములచే కల్పింపబడిన అవధులకును మితత్వమునకును, అతీతులగుటకు వారు ప్రయత్నించిరి. విశ్వాత్మభావమునకు కలిగిన యీ విజయము, రాజకీయ విజయమగుటవలన, అన్ని ప్రాంతములలోను రాజకీయనాయకులలో అనేకత్వమేర్పడెను. దానితో రాజకీయ సంప్రదాయములలో గల విశ్వాత్మభావలేశము అంతరించెను. అప్పటినుండియు రాజకీయ సంప్రదాయ మొక విధానముగామారి నాయకత్వము మారినపుడెల్లను మారెడి స్థితిలోనికి వచ్చినది.

ఇట్టి స్థితియందు, వేరువేరు కాలములలో వేరువేరు ప్రాంతములలో, మతము రాజకీయము రాజీపడి ఆధ్యాత్మికత్వముపై కుట్ర సాగించెను. ఈ కుట్రల ననుసరించి తాత్కాలికముగ ఏకత్వము నొందిన ఉపమతముల సహాయముతో, జనసంఖ్య అల్పముగానున్న పరిసరప్రాంతములపై దాడిచేసి రాజకీయముయొక్క రక్షణా, మతము యొక్క స్థిరత్వములేని ప్రాంతములందు రాజకీయముయొక్క మద్దతుతో మతము తన హింసను సాగింపదొడగెను.

ఏదియో యొక మతమునకు అదివరకే లొంగిన ప్రాంతములకు గూడ నిట్టి దండయాత్రలు తప్పలేదు. ఒక మతమునకు చెందినవారు మరియొక మతమునకు చెందినవారిని హింసింపదొడగిరి. ఈ విశ్వ విఘాతియైన మతము రాజకీయముయొక్క ప్రోద్బలముతో విభజన విద్వేషములతో కూడియున్న హింసాప్రచారమును సాధనముగా చేసికొని మహాశక్తివంతమయ్యెను. ఇట్టి స్థితియందు ఒకటిన్నర శతాబ్దములకు పూర్వము ప్రపంచమునందలి మానవులందరకును ఒక విధమయిన వివేకోదయ మయినది.

ఈ వివేకోదయము యొక్క ఫలితముగ, మతము రాజకీయముల యొక్క సమాఖ్యవలన కలిగింపబడిన అవధులను, మితులను అధిగమించి, విభజన, విద్వేషముల కతీతులయి, ఆధ్యాత్మిక జీవనులగుటకు ప్రజలు ఆశింపదొడగిరి. ఈ ఆశయముయొక్క చిహ్నములను గుర్తించిన తరువాత, గత శతాబ్దపు మధ్యకాలము నుండియు, మత రాజకీయ సమాఖ్య యొక్క విధానములలో మార్పులు ప్రారంభమయ్యెను. విధానమునందు గలిగిన ఈ మార్పుల వలన మతము యొక్క సహకారముతో రాజకీయము పురోగమింప దొడగినది. నేటి కాలము ఆ సమాఖ్యలకు విజయశిఖరము.

కుట్రదారు లుభయులును ఒకే మూలముపై నాధారపడి యుండి నప్పటికినీ, తనకు ప్రజల యెడల గల బాధ్యతను గూర్చిన స్మృతిని రాజకీయము గోల్పోవుట వలనను, దానితో పాటు తన ఆధ్యాత్మికత్వమును గూడ మరచిపోవుటవలనను, అవి రెండును అవినాభావముగ కలసిపోయి, మానవులయందు, మానవ సమాజమునందు విశ్వాత్మభావము (ఆధ్యాత్మికత్వము) ను నశింపజేయుటకు పూను కొన్నవి. తమ ప్రాబల్యము క్రిందగల ప్రదేశమును విస్తృతపరచి

తమ సంఖ్యాబలమును హెచ్చుచేయుటయే వాని పరమాశయము. అభ్యుదయము నొందుటకు మానవులకు గల హక్కులను, స్వాతంత్ర్యమును మితపరచదొడగెను. మానవులకు కల ఆధ్యాత్మికాశయములను సంకుచిత పరచదొడగెను. శరీరపోషణకు కావలసిన వస్తువిషయాదులను సంపాదించుట కూడబెట్టుటయందు, వారిని బద్ధులుగజేయు పరిస్థితులను కల్పించుచుండెకు. ఇట్టి విచ్ఛిన్నకరమయిన పరిస్థితుల వలన వారి సృజనశక్తి, వారి శరీరములచేతనే గ్రహింపబడి పరిణామము పొందెడి యవకాశములు దూరము చేయబడుచున్నవి. అందువలన శరీరములు గతించిన తరువాత, మరల మరల మానవశరీరములను దాల్చెడి యవసరము తప్పనిసరియగుచున్నది. వారు విభజన, విద్వేషములనే మూలముగా జేసికొని ఆ మూలముపైనుండియే వ్యవహరించుచున్నారు. ఇదియంతయును హింసామూలకమైన ప్రచారము వలననే సాధించుచున్నారు. ఇదియంతయు సర్వాంతర్యామి పేరిటనే, ఆధ్యాత్మిక మహావ్యక్తుల పేరిటనే, వారు కావించిన ప్రబోధములను అవసరముల కనువగునట్లుమార్చి, హద్దులను, మితులను పెంచి, తమకు దగ్గర పూర్వులచే ప్రవేశపెట్టబడిన విభజన, విద్వేషముల నాధారము చేసికొని విశ్వాత్మభావమునకు దూరమయి కొనసాగుచున్నది.

గత శతాబ్దాంతమునకు కొలది దశాబ్దులకు పూర్వము, మానవ సమాజములోని ఆధ్యాత్మిక విజ్ఞానము కూడ వికాసము నొందినది. అదియే మానవుల యొక్కయు, మానవేతర జీవుల యొక్కయు నేకత్వము. ఈ రెండింటి యొక్కయు అచర జీవులతోడి యేకత్వము, వారి సమస్యల యేకత్వమును గూర్చిన జ్ఞానము. అదియే వారి బాధ్యతల యొక్క యేకత్వము, ఆ బాధ్యతలను నిర్వహించెడి సిద్ధాంతముల యేకత్వమును గూర్చిన జ్ఞానము. అదియే మానవ కర్తవ్యము, ఆ కర్తవ్యమును సాధించుటను గూర్చిన జ్ఞానము. పరిస్థితుల యొక్క

మార్పు వలన, పోయిన హక్కులను మరల సంపాదించుట వలన, మరల మరల మానవ శరీర ధారణావశ్యకత గొంచినచో సృజనశక్తి నిలువ జేయబడి, సూక్ష్మశక్తిగా పరిణామము పొందు నవకాశము కలుగును. అందువలన పునర్జన్మ యొక్క అవసరము నధిగమించి, మానవ పరమాశయ సంసిద్ధిని పొందుట సాధ్యమగును. ఈ విజ్ఞానము అతి శీఘ్రముగా వ్యాప్తి జెందు చున్నది. అందుకు ఫలితముగ నేడు మతములయొక్క సంకుచితములైన యవధుల నధిగమించిన మానవు లెందరో నేటి సమాజములందు అన్ని మతములలోను గలరు. వీరే వివిధ ప్రాంతములలో వివిధ మతములకు జెందిన ఆధ్యాత్మిక వాదులు.

మానవుల యందు ఆధ్యాత్మిక పద్ధతులు బయలుదేరి నప్పటి నుండియు, ప్రేమ జ్ఞాన సామర్థ్యముల యభివృద్ధి కొరకు, వానిని సక్రమముగ వినియోగించుటకొరకు, వానిని పొందుటకు సమస్త మానవులకు అవకాశములు కలుగజేయుటకు వివిధ ప్రాంతములయందు ఆ పద్ధతులు ఆవేదనా రూపమున విజృంభించుచునే యున్నవి. తాము ఆధ్యాత్మిక భావములు గలవారలై, యితరులలో ఆధ్యాత్మికత్వమును పెంపొందించెడి యీ కార్యక్రమములో, మత రాజకీయముల యొక్క కుట్ర మూలకమయిన హింస నెదుర్కొనవలసి వచ్చుచునే యున్నది. ప్రతిస్థితియందును ఈ యాందోళన యణచిపెట్టబడి, ప్రజలలో గల సమైక్యత భగ్నపరచబడినది. దమననీతి, ఐక్యతను భంగపరచుటకు చేసిన ప్రయత్నములు సంఖ్యాబలమును, సమైక్యతను పెంపొందించినవి. మత రాజకీయ కుట్ర లన్నియు నేకమై మానవ సమాజము నందలి ఆధ్యాత్మిక విజ్ఞానముపై దాడిచేయు దుష్ట సమయము ప్రస్తుతము దాపురించినది.

ఆధ్యాత్మిక సిద్ధాంతములు వేదరూపమున లిఖితమయిన తరువాత, అదే రూపమున వాటివ్యాప్తి జరుగుచువచ్చెను. అవి విశ్వా

మోదము పొందినవి. చాల కాలము వరకు అవి మానవులకు తమ పరమాశయమును స్మృతికి తెచ్చుచు గమ్యప్రాప్తిని పొందుటకు సహాయపడుచుండెడివి. అప్పుడు ఆయా ప్రాంతములయందు రాజకీయ సంస్థలు క్షీణదశ యందున్నవి. వైవాహికసంస్థ యందు, హెచ్చుగు చున్న జనసంఖ్యకు కావలసిన పోషణ, రక్షణ, సౌకర్యములను రాజ కీయము సమకూర్ప లేకపోవుటయే అవి క్షీణించుటకు కారణమయ్యెను. తత్ఫలితముగ అనాధ్యాత్మిక పరిపాలనా క్రమము ప్రారంభమయి, ఒకరి కయి నిర్దేశింపబడిన వస్తువిషయాములను మరియొకరు గ్రహించుట ప్రారంభమయ్యెను.

కాలక్రమమున, ఈ చెడుఅలవాటు బాగుగ నడిపింపబడి సాగ జొచ్చెను. అటు పిమ్మట కార్యగతి, వేగము హెచ్చించి, పీడిత జనా నీకమును ఇంకను పీడింపదొడగెను. వీనినింకను ఇటువంటి తప్పులను రాజకీయ సంస్థలు నివారింపలేకుండెను.

ఇట్టి స్థితియందు, ఆధ్యాత్మిక సిద్ధాంతములు లిఖితపూర్వక ముగ వ్యాప్తి నొందుటను చూచి, సిద్ధాంతములను లిఖితపూర్వకముగ వ్యాపింపజేయుట యందలి ప్రయోజనమును రాజకీయము గ్రహించెను. తమ సంప్రదాయమును, రాజకీయ సంప్రదాయమును, రాజకీయపు హక్కులను, విధులను, బాధ్యతలను, వానిని నిర్వహించెడి సిద్ధాంత ములను కూడ, ప్రజాసహకారముతో లిఖితరూపమున వ్యాప్తి నొందింప వలసిన యవసరమును గుర్తించిరి. ఇతర ప్రాంతములకు వ్యాసపోయి, అక్కడ వ్యాప్తిజెంది, పెంపొందిన మానవులకు ఆదిమ వేదము లభింపకపోవుటచే, పరిష్కృత రూపములు ప్రారంభ మయ్యెను. తప్పుచేసెడి మానవులను సరిదిద్దుటకును వ్యాప్తిని పొందుచున్న మానవులలో వ్యాప్తిచేయుటకును ఈ పరిష్కృత రూప

ములు సహాయపడెను. ఈ యుద్దేశ్యము ననుసరించి, రాజకీయవేత్తలు తమ పద్ధతులను లిఖితపరచిరి; ఇచ్చటనే సంస్కృతముగాక యితర భాషలు ప్రారంభమయ్యెను. ఈ రాజకీయ సంప్రదాయము వ్యాపించుటతో బాటు జనాభా పెరుగుదలతో, అనేకములగు ఆవాసము లేర్పడెను. అందు నిమిత్తము పరిపాలనావ్యవస్థలు ఏర్పాటు కావలసిన యవసర మేర్పడెను.

రాజకీయ వ్యవహారములను సక్రమముగ నిర్వహించుట కొరకు, రాజకీయ సంప్రదాయముల ననుసరించి ప్రపంచమునందు రాజకీయ విభాగము లేర్పడెను. అన్ని ప్రభుత్వములును, ఒక విశ్వవ్యాప్తమగు సంస్థయందు కేంద్రీకృత మయ్యెను. కాలక్రమమున కొన్ని ప్రభుత్వ సంస్థలు కేంద్రమునుండి స్వతంత్రము లయ్యెను. తమ స్వాతంత్ర్యమును ప్రకటించి కేంద్రమునకు భిన్నమయిన సంప్రదాయముల నాధారముగ జేసికొని వ్యవహరింప దొడగెను. వేరువేరు సంప్రదాయములు కలిగిన అనేక రాజకీయ సంస్థల కిదియే ప్రారంభము. అదివరకే పరిపాలనా సౌకర్యములకై విభజింప బడిన ప్రపంచము ఇప్పుడు రాజకీయముగ కూడ విభజింప బడినది. ఈ విభజనలో, ఆయా ప్రాంతములలోని మానవులతో సహా సమస్తము చేర్పబడినవి. మొట్టమొదటి పర్యాయము విభజింపబడిన తరువాత, ఇంకను విభజింప బడవలెనను వైఖరి పెరిగెను. మానవ సమాజమునందు అనాధ్యాత్మిక పరిస్థితులు ప్రబలముగ నుండుటవలన, మానవులలో గల తప్పుడు అలవాట్లవలన, సమాజము ఇంకను క్షీణావస్థలోనికి పతనము కాజొచ్చెను. వారి దృష్టి యంతయు అప్పటికి కావలసిన యవసరముల యందు, రక్షణయందు కేంద్రీకరింపబడు చుండెను. వారి స్థూల సృజన శక్తులే ప్రయత్నములు వినియోగింప బడుచుండెను. వారు సూక్ష్మశక్తిని పొందుట కవకాశము లేకుండెను. అందు వలన తమ శరీరములు గతించిన తరువాత మరల

మరల మానవ శరీరములు ధరింపవలసి వచ్చుచుండెను. ఆ కారణము వలన, మానవేతర జీవులు సాధారణ పరిస్థితులలో మానవు లయ్యెడి విధానమున కంతరాయము కలుగుచుండెను.

ఇది విశ్వ నిర్మాణముల సూత్రమునకే భంగకారి యగు సూచనలను కలిగియున్న తీవ్రమగు పరిస్థితి. ఈ విపత్కర పరిస్థితులలో వివిధ కాలములందు, వేర్వేరు పరిస్థితులలో ఏ కొంచెమో ఆధ్యాత్మిక చైతన్యము గలిగిన వ్యక్తులు ఆధ్యాత్మిక మహా వ్యక్తుల యునికిని గుర్తించ గలిగిరి. ఆధ్యాత్మిక సిద్ధాంతములు ప్రకారము తమ గతిని సూచింపమని వారిని కోరిరి. ఆ మహావ్యక్తులు ప్రజలకు ఆధ్యాత్మిక సిద్ధాంతములను స్ఫురణకు తెచ్చి, పూజనము, సంజ్ఞలు, భాష, గ్రంధములు రూపమున ప్రబోధము గావింపదొడగిరి.

భిన్నాభిన్నమయిన రాజకీయ సంస్థలను వాని సంప్రదాయములను అనుసరించి, అప్పటి పరిస్థితుల కనువగునట్లు సంఘర్షణలను నివారించుటకు, పూర్వపు మహావ్యక్తులచే వ్యాఖ్యాన మొనర్పబడిన సిద్ధాంతములనే పరిష్కరించి ప్రబోధింపదొడగిరి. ఈ రీతిగ వివిధ భాషలలో ఆధ్యాత్మిక సిద్ధాంతములు లిఖితమయ్యెను. వివిధ భాషలలో జరిగిన యీ పరిష్కరణలలో ఆ నాడు గల అవధులు మితములు, అనాధ్యాత్మికత్వములు తప్పనిసరియయ్యెను. లిఖితపూర్వక ప్రచారమునందు, పరిష్కరణలయందు ఈ అవధులు అనివార్యములయ్యెను. తమను గూర్చి, ప్రపంచమునుగూర్చి, వారికి గల సంబంధము, బాధ్యతలను గూర్చి వారి యుద్దేశ్యము, ఆ యుద్దేశ్యమును నిర్వహించుట కనుసరించెడి విధానములగూర్చియు, ప్రజలయొక్క వైఖరి విశ్వాసములు సంకుచితములై, అవధిగతములై మితమై, అనాధ్యాత్మికమై పోయినవి. ఇందులకు కారణము రాజకీయ విభిన్నత, ఆయా

సంప్రదాయముల ప్రాబల్యమే. అదియునుగాక, ఆధ్యాత్మిక వ్యక్తులు రాజకీయముతో సంఘర్షణను పోగొట్టి, మానవుల యొక్క చెడ్డ అలవాట్లను మంచివానిగా మార్చి, సిద్ధాంతములను మరల సంస్కరించునపుడు వైరుధ్యమును పోగొట్ట దలచిరి. పరిష్కరింపబడిన విశ్వసిద్ధాంతములే మతసిద్ధాంతములు. అవియే ప్రపంచమునందలి మత గ్రంథములుగా ప్రశస్తి నొందినవి. అప్పటినుండియు ప్రజలు వానినే లిఖితమైన ఆధ్యాత్మిక సిద్ధాంతములకు, అనగా వేదమునకు బదులుగా ప్రయోగించుచున్నారు.

అందువలననే, యీ మత గ్రంథములలో విభజింపబడనట్టి విశ్వమును విభజించినట్లును, సమైక్యమైనటువంటి మానవులలో చీలికలును కనపడుచున్నవి. విశ్వమంతకును, ఏకైకమైనటువంటి విశ్వమానవ కర్తవ్యము నందభిప్రాయ భేదములు, మానవకర్తవ్యమును మానవుల కుచితమైనరీతిని సాధించుట యను శాశ్వత సిద్ధాంతములో విభిన్నత్వ సూచనలు కనబడుచున్నవి. అంతేగాక, సర్వాంతర్యామి మున్నగు పదములు కూడ రాజకీయములతోపాటు విభాగములైనట్లు మా శాఖ దేవుడు, మా జాతి దేవుడు, అను పదములేర్పడినవి.

మత గ్రంథములలోని యీ విభాగములు భేదములు మతములలో ఐక్యతను సాధించుటకును, మతములకును రాజకీయసంస్థలకును నడుమను సామరస్యమును నెలకొల్పుటకును నేర్పడినవి. ఈ ఆశయమును సాధించిన తరువాత ఈ మత గ్రంథ కర్తలు తమ తమ మతములలోని మానవులకు తమ సహజస్థితిని, ఆధ్యాత్మిక మూలమైన మానవత్వమును స్ఫురణకు తెచ్చి, మత గ్రంథములలోని విభిన్నత, విభేదములకు వెనుకగల ఐక్యతా సూత్రములయొక్క ఆశయములను సాధించుటను గూర్చి ప్రబోధించిరి. వారి స్మృతి ప్రబోధములలో

విభజనలు, విభిన్నత్వము, అవధులు, మితులు లేవు. స్మృతిప్రవచనము లన్నియును, విశ్వవ్యాపకములే. విశ్వమందలి సమస్త మానవుల యొక్క సమైక్యతను ప్రబోధించునవియే. విశ్వమందలి సమస్త వస్తు సముదాయముతో మానవునియొక్క యేకత్వమును సూచించునవియే. మానవుని కర్తవ్యము నందలి యేకత్వము, ఆ కర్తవ్యమును సాధించెడి విధానము నందలి యేకత్వమును బోధించునవియే. ఈ యైక్యతలన్నింటి యొక్కయు, విశ్వజీవితో సర్వాంతర్యామితో సమైక్యతను చాటు నవియే.

ఈ కాలమందు వారికి రాజకీయముతో సంఘర్షణ ప్రారంభ మయ్యెను. రాజకీయము తన సంప్రదాయములలో విశ్వత్వభావ మును కోల్పోవుటచేత వాని సమరసపూర్వకమైన వ్యవహారము కుంటువడిపోయినది. ఏ రూపములోను విశ్వత్వభావముతో రాజ కీయము ఏకీభవింపదు. విభజన, విభేద మూలకమయిన మతముల ద్వారా స్మృతిగావింప గోరెడిది. ఇది తన అప్పటి స్వభావమునకు, సాంప్రదాయమునకు అనువయిన లక్షణమే. మానవులకు స్మృతి దాయకమగు ఆధ్యాత్మికత్వమును అది విస్మరించినది. ఆధ్యాత్మికత్వ మును దాని యాశయమును గుర్తించుటకు అది అసమర్థమయ్యెను. మత గ్రంథములలో గల అనాధ్యాత్మిక విషయములలో ప్రజలకు స్మృతికలిగించవలెననెడి ఆ గ్రంథకర్తల యుద్దేశ్యము సఫలము చేయు నవి మతములు కావు. మతములలో గల ఆధ్యాత్మికత్వ లేశము మాత్రమే.

రాజకీయము ఆధ్యాత్మికత్వమును కాదని, మతమును కోరినది. నదులను పొంగించి సముద్రమును కడిగి పారవేయవలెనని పాటుపడినది. కాని ఆధ్యాత్మికత్వము చలింపలేదు. మతముల తెరహాలలోనికి దిగ

లేదు. ఇట్టి స్థితియందు ఆధ్యాత్మిక వ్యక్తులకు ప్రముఖ అనుయాయు లైన మతకర్తలు ఒకరి తరువాత మరియొకరు సహజముగనో, అసహజముగనో దేహములను చాలించుటతో ప్రజలతో ప్రత్యక్ష సంపర్కము పోయినది.

ఆధ్యాత్మికత్వముయొక్క స్థానమును మతము ఆక్రమించినది మొదలు, మతమే ప్రజలకు స్ఫూర్తిదాయకమయినది. కాని మతగ్రంథములు అనాధ్యాత్మికము లగుటవలన అవధులకు, మితులకు, విభజన, విభేదములకు లోనగుటవలన, ఆ కాలపు పరిస్థితులకు లోనయి యుండినవి. మత గ్రంథములలో ప్రవేశ పెట్టబడిన, పరిష్కరింపబడిన, ఆధ్యాత్మిక సిద్ధాంతములద్వారా, అభ్యుదయ మార్గమున, శక్తి పరిణామముద్వారా, విశ్వజీవితోడను, సర్వాంతర్యామితోడను, విశ్వమానవ సమైక్యతద్వారా, అనాధ్యాత్మికత్వమును ఆధ్యాత్మికత్వముగ మార్చుటయే మతగ్రంథముల యుద్దేశము.

ఆధ్యాత్మిక సిద్ధాంతములు మతగ్రంథ రూపములోనికి వచ్చుసరికి అవి మత, రాజకీయ, ఆధ్యాత్మికత్వముల మిశ్రమము లయ్యెను. మత రాజకీయములలో కర్తవ్యమునందు, ఆ కర్తవ్యమును సాధించెడి విధానమునందు ఏకత్వము లేదు. వానికిని ఆధ్యాత్మికత్వమునకును నడుమ ఏకత్వలేశముకూడ లేదు.

ఆధ్యాత్మిక వ్యక్తులు దేహములు చాలించిన తరువాతకూడ. ఆధ్యాత్మిక, మత, రాజకీయ మిశ్రమములను స్థాపించిన వారి యనంతరముకూడ మతములకుగల అవధులను, మితులను, విభజన విభేదముల నధిగమించి విశ్వత్వభావమును పొందవలెననెడి యావేదన ప్రజలలో అంతము కాలేదు. చాల కాలమయిన తరువాత తమతోగల ఆధ్యాత్మిక వ్యక్తులను వారు గుర్తింప దొడగిరి. అప్పటినుండి తమ పూర్వుల

వలెనే వారును, ఆశయ సంసిద్ధి కొరకై, రాజకీయముతో సంఘర్షణ పడకుండ మతములయొక్క అవధులు కతీతులగుటకు ప్రజలను ప్రబోధింప దొడగిరి. దీనికొరకై మత వ్యవహార విధానములను లిఖించి దానిని మత సంప్రదాయమనిరి. ఇదియొక నూతన యత్నముగా భావింపబడినది. ఈ నూతన యత్నముయొక్క ప్రధమాశయము రాజకీయముతో సంఘర్షణము తప్పించుకొనుటయే.

ఇచ్చట రెండు సంఘర్షణాంశము లున్నవి. మొదటిది జన సంఖ్య. రెండవది ఆ జనసంఖ్యకు కావలసిన ప్రదేశము. రాజకీయము నకు సత్వర జనసంఖ్య విస్తరణ కావలెను. ఇందుకై ప్రజలయొక్క స్థూల సృజన శక్తులు సంపూర్ణముగ వస్తు విషయాదుల సేకరణ యందు, సంరక్షణయందు వినియోగపడునట్లు చేయుచున్నది. అందు వలన ప్రజలు వ్యక్తులయందు, వస్తు విషయాదులయందు వ్యామోహితులు కాదొడగిరి. తత్ఫలితముగ సూక్ష్మశక్తి సంపన్నులు కాలేక పోయిరి. వస్తు విషయాదుల యందుగల వ్యామోహముచే సృజన ప్రయోజనమునకు మూలమైన ఆధ్యాత్మికత్వమును మరచిపోయి, సృజన విధానమునందు మాత్రమే ప్రీతికలిగి యుండుటచే, ప్రజలు మరల మరల మానవ శరీరములలో అవతరింపవలసి వచ్చెను. ఈ రీతిగ రాజకీయ ప్రధమాశయమయిన జనసంఖ్యాభివృద్ధి సిద్ధించెను.

ఆధ్యాత్మికత్వమునకు కూడ జనసంఖ్యాభివృద్ధి కావలెను. కాని ఆ విధానము వేరు. కూడబెట్టబడిన సృజనశక్తిని, ఆ యా శరీరములలో లీనమగువరకు నిలువ జేసినచో సూక్ష్మశక్తిగా పరిణామము నొందును. అట్టి మానవులు తమ యింద్రియ వాంఛలను గమనించి వివాహితులగుటయో కాకుండుటయో నిర్ణయించుకొందురు. వారి ప్రవృత్తి వివాహమున కనుకూలమయినచో వైవాహికోద్దేశ్యమును, తమ

యుద్దేశ్యమును గుర్తించి, మానవేతర జీవులుగ అభ్యుదయమును సాధించి, ఉన్న తేంద్రియములనుపొంది మానవ శరీరములను పొందగోరు మానవేతర జీవుల నిమిత్తము మాత్రము మానవ శరీర నిర్మాణమును గావింతురు. బాధ్యతాయుతముగ తమ ప్రయోజనమును సాధించిన తరువాత వివాహిత జీవితమునకు దూరముగా నుందురు. ఇప్పటినుండి వారి ఆశయము వేరు. మానవులచే వినిర్గతమైన శక్తిప్రసారములు, మానవేతరులచే వినిర్గతమైన శక్తి ప్రసారములతో కలసి, మానవేత రాభ్యుదయమునకు అనువయిన వాతావరణమును, తాము విశ్వమరిదు నిర్మించుటయే వారి ఆశయము. మానవోచితమగు రీతిని కర్తవ్య సంసి ద్ధిని పొందుటవలన ఆధ్యాత్మికత్వము కోరిన జనసంఖ్యాభివృద్ధి సాగు చున్నది. ఇదియే విశ్వ కర్తవ్య సంసిద్ధి.

ఇది రాజకీయమునకును ఆధ్యాత్మికత్వమునకు నడుమగల, సమ రససరచుటకు సాధ్యముగాని సంఘర్షణాంశము. రాజకీయము కోరిన జనాభివృద్ధి అదివరకే మానవులుగా జీవించినవారి పునరవతరణ వలన జరుగుచున్నది. ఆధ్యాత్మికత్వము కోరెడి జనాభివృద్ధి, మానవేతర జీవులలో నుండి అభ్యుదయమార్గమున వచ్చెడి నవ్యమానవుల వలన జరుగుచున్నది. మొదటి దాని యుద్దేశ్యము విభజన మూలక మగుట వలన విశ్వావశ్యకతకు విరుద్ధము. విశ్వ నిర్మాణముతో సామరస్య ముండదు. రెండవదాని యుద్దేశ్యము విశ్వ సిద్ధాంతానుసారమే యగుట వలన విశ్వ నిర్మాణముతో సామరస్యము కలిగియున్నది.

రెండవ సంఘర్షణాంశము పెరిగెడు జనసంఖ్యకు కావలసిన ప్రదేశమును గూర్చినది. ముకుళించు కొనుటకు శక్తిలేని పెద్దవస్తు వేదియును చిన్న వస్తువులలో నిమడలేదు. చిన్న వస్తువులు అట్టి పెద్ద వాని నిముడ్చుకొనుటకు తగినంత పెద్దవగుటకు అసమర్థములు. స్థూల

సూక్ష్మ ఆధ్యాత్మిక స్థితులలో దేనియందును కూడ, రాజకీయపు ఆవశ్యకతల ననుసరించి, మానవ సమైక్యతా విచ్ఛిన్నతకును, మానవ విభజనకును, ఆధ్యాత్మికత్వము అంగీకరింపలేదు. ప్రదేశ విస్తరణ మును గూర్చి రాజకీయముతో సంఘర్షణను నివారింపను లేదు. అందు వలన రాజకీయమునకు ఆధ్యాత్మికత్వమునకును నడుమ జనసంఖ్య ప్రదేశములను గూర్చిన సంఘర్షణ సాగుచునే యుండును.

ఈ సంఘర్షణలను నివారించుటకు మతము చేసిన ప్రయత్న ములు కూడ సంపూర్ణముగ విఫలమయ్యెను. అటు పిమ్మట మతము తన మూలమును మార్చుకొని మరల ప్రయత్నించెను. ఈ ప్రయత్నము వలన మత రాజకీయముల కనువగునట్లు ఆధ్యాత్మికత్వము వికల స్వరూపమును పొందెను. తత్ఫలితముగ మతము, రాజకీయముల యందలి విభజనలు, విభేదములు, అవధులు, మితములే, గాక మానవ సమైక్యత, ఆధ్యాత్మిక సిద్ధాంతములు, వాని యుద్దేశ్యములలో గూడ అవధులు, మితములు అంగీకరింపబడి మతగ్రంథ రూపమున ప్రదర్శిత మైనది.

ఆ కాలమునందు జీవించియున్న ఆధ్యాత్మిక వ్యక్తులీ మతరాజ కీయముల మిశ్రమముపై తిరుగుబాటుచేసిరి. ముందు మతగ్రంథములను సంస్కరించి, తరువాత మానవులను సంస్కరించుటకు పాటుపడిరి. ఈ స్థితియందు, మత రాజకీయములు అవినాభావముగ మిశ్రితమయి ఆధ్యాత్మికత్వముపయి కుట్రసాగించెను. ఈ సంఘర్షణలో ఆధ్యాత్మిక వ్యక్తులు తమ పూర్వులవలెనే సహజముగనో అసహజముగనో దేహ ములను చాలించిరి. ఈ సంఘర్షణ ఫలితముగ ఉపమతములు స్థాపింప బడుటయేగాక, ప్రతిప్రాంతమందును రాజకీయములో బహునాయకత్వ మేర్పడెను. విభజన, విభేదములు, అవధులు, మితులతో కూడిన మత

రాజకీయముల యొక్క బాహ్యాభివృద్ధికిని, ఐక్యత, శాంతి, సంపదల ద్వారా అభ్యుదయమునకును సంఘర్షణ తీవ్రతరమయ్యెను.

ఇట్టి పరిస్థితులు చాలాకాలము సాగెను. అంతకాలమును తీవ్రతరమగుచునే యుండెను. ఈ సంఘర్షణ మానవులకు దుఃఖదాయకమయ్యెను. ఇట్టి దుఃఖకరమగు పరిస్థితులయందు, మానవులయందు వివేకోదయము కలిగి ఐక్యత, శాంతి, సంపదలతో కూడిన సర్వ మానవాభ్యుదయమునకై తమలోని కొందరి వ్యక్తుల ద్వారా సంఘర్షణ ప్రారంభింపబడెను. కాని, మత రాజకీయ మిశ్రమము బలవంతమైన దగుటచే నీ నూతన వివేకమును హింస, ఒత్తిడి ప్రచారముల మూలమున అణచివైచెను. అణచిపెట్టబడినపుడెల్ల, ప్రతిప్రాంతమునందును మానవులలోని విశ్వాత్మభావము అభివృద్ధికరమగు రూపము నొందుచుండెను.

హింస, ఒత్తిడి, ప్రచారమును ఎక్కువైన ప్రదేశములలో విశ్వాత్మభావము రూపము నొందుట కూడ త్వరితగతి నొందుచుండెను. ఒత్తిడి యెక్కువయినకొలది, విశ్వాత్మభావ ప్రకటన అధికమగుచుండెను. ఆధ్యాత్మికతా సూచకమగు మాటలయొక్క అనుమానము తగిలినను, మతరాజకీయ మిశ్రమమునకు కోపకారకమై, సహింపరాని దగుచుండెను.

సామాన్యముగ, మానవులకు చలియొక్క అనుభవము లేనిదే వేడియొక్క మంచితనము, ఉపయోగము తెలియవు. చీకటి లేనిదే వెలుతురు యొక్కయు, దుఃఖము లేనిదే సంతోషము యొక్కయు, కల్లోలములేనిదే శాంతియొక్కయు, అనైక్యత లేనిదే ఐక్యతయొక్కయు, దారిద్ర్యము లేనిదే సంపదయొక్కయు, బాహ్యాభివృద్ధి లేనిదే యభ్యుదయము యొక్క యుపయోగమును గుర్తింపలేరు. అందువలన విభ

జన, విద్వేషము, అవధులతో కూడియున్న మతరాజకీయ సమాఖ్య యొక్క వ్యవహారము, అందువలన కలిగెడి దుఃఖము బహుశః వాని వ్యతిరేకానుభవములను పొందుటకు ముందు జరుగవలెను కాబోలు. కొంత కాలము సాగిన పిమ్మట యీ సమాఖ్య ద్వారానే మానవుల లోని ఆధ్యాత్మికత్వ విజృంభణము కావచ్చును.

శాంతియుతము, నిరంతరము, అనశ్వరము శాశ్వతమునగు నీ యాధ్యాత్మికత్వముపై కుట్రదారుల ప్రాబల్యమునకు ప్రస్తుతకాలము ప్రబలమైయున్నది.

విశ్వమందలి ఆధ్యాత్మిక ఉన్ముఖతగల మానవులారా! మీ శాంతి, నిశ్చలత్వములకు విభ్రాంతి కల్లోలములు లేకుండుగాక! ఇతర ప్రజలలోగల అనాధ్యాత్మిక వైఖరి, విధానములే మీలోగల ఆధ్యాత్మికత్వ విజృంభణ కవకాశము లిచ్చినవను కారణముచే, కుట్రదారుల యొక్క ఒత్తిడికి లొంగి మీ స్వభావములను మారనీయకుడు. ఇప్పుడు గాని, ఇకమీదటగాని మీ అభ్యుదయమును సాధించుటకు, కుట్రదారులను అనాధ్యాత్మికులనుగా జేసిన వైఖరులను మాత్రము అవలంబింపకుడు. మీకుగల సక్రమ విచక్షణవలన, ఆనెనుండి నేటివరకు, ఇప్పుడు కూడ కుట్రదారుల వైఖరి మీ యభ్యుదయమునకు ఎట్లు నిరుపయోగమో, భంగకరమో మీరే గ్రహింపగలరు. వారి వైఖరి, విధానములు మీకు ప్రలోభమును కల్పించి, మీ యభ్యుదయ సాధనా విధానములో నిప్పుడుగాని, యికమీదటగాని, కుట్రదారుల ననుసరించుటకు కోరిక కలుగజేయవచ్చును. అట్లు అనుసరించినచో, ఇప్పుడే యనాధ్యాత్మిక కుట్రదారులను మీ రెదుర్కొనుచుంటిరో, వారికి మీరు వారసులై మున్ముందు మిమ్ము మీరే యెదుర్కొనవలసి వచ్చును.

ఆధ్యాత్మిక శబ్దములు అక్షరరూపము నొందిన తరువాత చాల కాలమునకు, వేదము లిఖిత పూర్వకమయిన తరువాత యెంతో కాలమునకు, ఆధ్యాత్మికత్వమను పేరుతో వానికి బదులుగా మతగ్రంథములవతరించినవి.

మతగ్రంథ కర్తలు శరీరములు చాలించిన పిమ్మట, వారి యనుయాయులు కొందరు మతగ్రంథములలోని విభజన, విద్వేషములు, అవధులు, మితులను లిఖితములైన ఆధ్యాత్మిక సిద్ధాంతములకు, వేద వేదాంతములకు కూడ కల్పించిరి. వేదములలో నక్కడక్కడ కనపడు విభక్త మానవత్వమును సూచించునవియే యీ ప్రక్షిప్తములు. వారు మతగ్రంథములనుగూడ సవరించిరి. సవరణకు ముందు, మతగ్రంథ పరమాశయము రాజకీయముతో గల సంఘర్షణ విషయములను పరిహరించి, మానవుల నందరను సరిదిద్ది, ఆధ్యాత్మికులుగజేసి, వారికి సహజ స్థితి స్ఫురణను కలుగజేయుటయే! కాని ఆధ్యాత్మిక గ్రంథముల యాశయము మొట్టమొదటి నుండియు ఆధ్యాత్మిక ప్రబోధముగావించి, సహజస్థితి స్ఫురణను కలుగజేయుట!

మత రాజకీయ నాయకుల కుట్రలు విఫలము లగుటచే, ఉపమతములు, క్రొత్తమతములు పెరిగి, యింకను పెరుగుచు, సంఘర్షణాపూర్వక విషయములింకను నెక్కువగుచున్నవి. ఇప్పుడు ఆధ్యాత్మిక వ్యక్తులు బాధ్యతాయుత మానవులు, వారి నాయకులు ఈ కుట్ర నంత మొందించి, మానవ సమైక్యత, శాంతి, అభ్యుదయములను సాధింపవలసి యున్నది.

కుట్రదారుల ప్రయత్నములు విభజన, విభేదములు, అవధులు, మితములపై నాధారపడి యున్నవి. హింస, ఒత్తిడి, అబద్ధప్రచారములు వారి సిద్ధాంతములు. వారు చెప్పుకొనెడి ఆశయములు విశ్వ

సమైక్యత, శాంతి, సంపద, మానవాభ్యుదయములు. ఏ ప్రత్యేక ఆశయమునైనను సాధింపవలెననిన, ఆ ఆశయము మూలము, దానిని నిర్వహించెడి సిద్ధాంతములను, కలిపెడు సంబంధముండవలెను. ఈ మూడింటిని, మూలమును, సిద్ధాంతమును, ఆశయమును కలిపెడి సంబంధమును, కాలక్రమమున వానిమధ్య సామరస్యమును కలిగించును. ఈ మూడింటి మధ్యను అన్యోన్య సంబంధములేని ఆశయము పెద్దది కాని, చిన్నదికాని, క్షణికముగాని, శాశ్వతమయినదిగాని యీ విశ్వమందు లేదు. ఈ మూడును కలసినగాని యే ఆశయమును సాధింపబడదు. ఒక ఆశయము, దాని సాధనకై వినియోగింపబడెడి సిద్ధాంతములు, ఆ సిద్ధాంతముల కాధారములైన మూలములు, సారూప్యములై యుండవలెను. ఈ సారూప్యతయే, ఆశయసంసిద్ధియందు సామరస్యముగ పరిణమించును. ఈ సామరస్యము లేనిదే నెన్నడును ఏ ఆశయమును సాధింపబడి యుండలేదు. మతరాజకీయ సమాఖ్యచే ప్రజలయందు విశ్వత్వభావ స్థాపనకై చేయబడిన ప్రయత్నములలో సామరస్య సంబంధములేదు; సారూప్యతయులేదు. అందువలన సామరస్య సాధనయు లేదు. ఆశయ సంసిద్ధియులేదు. కాని, వారి మూలములకును అనుసరించెడి సిద్ధాంతములకును కొంత సంబంధమున్నది. అందువలన ఆ నాయకులు ఆశించినదానికి భిన్నమయిన ఫలము సాధింపబడ వచ్చును. వారి ప్రస్తుత ఆశయమునకు, మూలమునకు, అనుసరించిన సిద్ధాంతములకు అదృశ్యసంబంధ మేర్పడుచున్నది.

ఈ విధానము ఏక్షణమునందైనను, వారు, ఆ నాయకు లాశించిన దానికి భిన్నమైనట్టియు, అనుసరించిన సిద్ధాంతములతోడను, వాని మూలములతోడను, అదృశ్య సంబంధము గలిగిన ప్రయోజనముతో సామరస్యము పొందవచ్చును. ఆ సామరస్య ఫలితముగ విభజన, విభేదములు, అవధులు అనెడి మూలమింకను విస్తృతమై, హింస, ఒత్తిడి,

అబద్ధప్రచారములు అను సాధనములింకను బహుళములై అనైక్యత, కల్లోలము, దారిద్ర్యము, మానవ బాహ్యాభివృద్ధి సరిణమింపవచ్చును. అగుచో తన మూలము, సిద్ధాంతములు, ప్రయోజనముతో సామరస్యముగల ఆధ్యాత్మికత్వము మాత్రము సమస్త మానవ మానవేతరులలో సమైక్యత, శాంతి, సంపద, అభ్యుదయములను సమకూర్చగలదు.

విశ్వమందలి దుఃఖము నంతను ఒకే యొక శిరముపై మోపలేము. విశ్వవిభజన, మానవవిభిన్నతను యూహింపలేని ఆధ్యాత్మిక మహావ్యక్తులు తప్ప మత రాజకీయనాయకులతో సహా సమస్త నాయకులును ఈ దుఃఖమునకు బాధ్యులగుచునే యున్నారు. ఈ రీతిగ ఆధ్యాత్మిక దృక్పథముతో చూచిన సమస్త మానవులును ఈ నిందకు బాధ్యులే ! కాని, సూక్ష్మ స్థూల దృక్పథములనుండి పరిశీలించినచో ఈ దుస్థితికి మత రాజకీయ నాయకులే బాధ్యులు. ఆధ్యాత్మిక మహావ్యక్తు లెవ్వరైనను విభక్తప్రపంచము, విభజిత మానవులను గూర్చి చెప్పినచో దానికి కారణము ముందు మానవులను సరిచేద్ది. పిమ్మట వారిని విశ్వమానవ కర్తవ్యమును నిర్వహించుటకు ఉన్ముఖులుగ జేయదలచుటయే. తమ ప్రయత్నములలోని కొరతను వారు పూర్తిగ నెరిగియే ప్రారంభించిరి. ప్రపంచమున, అప్పుడు వారికి, అన్యసాధనమేదియు కనిపించలేదు. వారి ఆశయము సఫలము కాకపోయినప్పటికిని, వారి ప్రయత్నము వలననే వారి పూర్వులకును, వారి అనుయాయులకును ఆధ్యాత్మిక సంబంధము నిలువబడియున్నది. వారి ప్రయత్నము వలననే ఆధ్యాత్మికత, అనాధ్యాత్మికతల నడుమ సంఘర్షణ సాగుచున్నది. వారు గతమునకును, భావికిని నడుమ సంబంధమును నిలిపియున్నారు. విభక్త ప్రపంచమును, విభజిత మానవులనుగూర్చి చెప్పని వారి పూర్వీకులకును, వారికిని జయమగుగాక. బహుశః, వారి ప్రయత్నమే నేటికిని కొనసాగుచున్నదేమో !

మత రాజకీయ నాయకులు నిందార్హులే కావచ్చును. నిందించుట చాల కాలము జరిగినది. ఇంకనూ నిందించుట వలన మానవుల దీన స్థితిని నివారించుటయను కర్తవ్యము సిద్ధింపదు, ఆధ్యాత్మిక సిద్ధాంతములను లిఖితమొనర్చుటలో గల క్లిష్టత పోవుట మూలముననను, వారిలో శక్తి పరిణామము లేకపోవుట మూలముచను, వారి సంప్రదాయములలోను, వారి గ్రంథములలోనను గల ఆధ్యాత్మికత్వమును మత రాజకీయ నాయకులు గ్రహింపలేరు.

అందువలన, సశరీరులై యున్న ఆధ్యాత్మిక నాయకులే యిప్పుడు విశ్వకర్తవ్యమును సాధించుచున్నారు. మానవసమాజము నందలి చైతన్యవంతులు, ప్రేమ హృదయులునగు బాధ్యతాయుత వ్యక్తుల సహాయముతో నీ ఆధ్యాత్మిక మహావ్యక్తులే మానవకర్తవ్యమును మానవోచితమగు రీతిని సాధించుట యనెడి విశ్వకర్తవ్య సిద్ధిని పొందెదరు గాక !

అందువలన,

రాజకీయములోని విశ్వత్వభావమును రాజకీయ నాయకులు గ్రహింతురు గాక !

మతములోని విశ్వత్వభావమును మతాధిపతులు గ్రహింతురు గాక !

మానవుల ద్వారా విశ్వమంతటను విశ్వత్వభావము విజృంభించు గాక !



# పదునాల్గవ అధ్యాయము

# సాంఘిక సారధులకు హెచ్చరిక



ఆదిసంస్థయైన వైవాహికసంస్థ స్థాపనా విధానమునందున్నప్పుడు, నాటి మానవులలో అనేకులు వారి సూక్ష్మేంద్రియములు వ్యవహరించుచుండుటవలనను, వారి అతి సూక్ష్మేంద్రియములు వ్యవహరింపక పోయినను మేల్కొని యున్నందునను, వైవాహిక జీవితమునందు వారి సృజనేంద్రియములకు ప్రీతి లేకపోవుటవలనను, చాలమంది మానవులు వివాహితులు కాకుండిరి. మానవులవలనను, మానవేతరుల వలనను, వినిర్గతమయిన శక్తుల కలయికను సాధ్యపరచుటయందే వారు ప్రీతి గలిగి యుండిరి. ఈ ప్రయత్నముయొక్క ఆశయము మానవేతరులకు మానవత్వప్రాప్తిని కలిగించుటయే !

అర్హత పొందిన మానవేతరుల కొరకు మానవ శరీర నిర్మాణము చేయుటయను ఆశయమునందు ప్రీతిగల కొందరు మానవులు కొంతకాలమువరకు మాత్రమే వివాహితులుగ నుండుచుండిరి. సృజన ఆశయమునందు కాక, సృజన విధానమునందు మాత్రమే ప్రీతిగల మరి కొందరు వివాహితులుగనే యుండిపోవుచుండిరి.

సక్రమ వ్యవహారముగల అతిసూక్ష్మ, అత్యధికసూక్ష్మ, మహా సూక్ష్మ ఆధ్యాత్మికాది యింద్రియములు కలిగి ఉన్నత, ఉన్నతతర, ఉన్నతతమ, అత్యుత్తమ బాధ్యతలు గలిగి, విశ్వము, విశ్వమునందలి

వస్తు విషయాదులతో సంబంధముగల విశ్వనిర్మాణ తత్వమును కొన సాగించుటయే ఆశయముగా గల మహావ్యక్తులు విశ్వకర్తవ్యమును సాధించుచున్నారు. పై తరగతికి చెందని మానవులు మిగిలిన మూడు తరగతులతో కలిసి, ఏకమై అన్యోన్య సహకారము కలిగి సామరస్యముతో వ్యవహరించుచుండిరి. అందువలన మానవ కర్తవ్యము మానవోచితరీతిని నిర్వహింపబడుటయేగాక, విశ్వకర్తవ్యము, విశ్వనిర్మాణ తత్వోచితముగ నిర్వహింప బడుచుండెను. ఈ విధముగ మానవ సమాజ నిర్మాణ మయినది.

ఇది రాజకీయమునకు పూర్వపు టవస్థ. అప్పుడు సమాజపు వ్యవహారమంతయు వైవాహికసంస్థ మూలముననే సాగుచుండెను. చాలకాలము వరకు ఈ సమాజము సక్రమముగనే వ్యవహరించెను. కాలక్రమమున క్షీణించుట ప్రారంభమయ్యెను. వివాహితులలో తమ వ్యవహార నిర్వహణమునందు అసామరస్యము ప్రారంభమయ్యెను. శక్తి పరిణామము పొందిన వ్యక్తులు పరిణామమును ముందుకు కొనసాగనీయలేదు. అందుచేత వారు వివాహితస్థితి కతీతులు కాలేకపోయిరి. అస్థూలైన మానవేతర జీవులకొరకు, ఒకటి రెండు మానవ శరీరములను నిర్మించిన తరువాత, వైవాహిక ఉపయోగమునుండియు, బాధ్యతల నుండియు దూరముగా నిలువలేకపోయిరి. పరిణామము పొందిన సూక్ష్మశక్తి లేకపోవుటవలన వారి సూక్ష్మేంద్రియములు చైతన్యవంతములు కాలేదు. మానవులచేతను, మానవేతరులచేతను, వినిర్గతమగు శక్తులను సమ్మేళన పరచుట కవకాశములు కలిగించెడి ఉన్నత బాధ్యతలను వహించునట్టియు, అట్టి అవసరములను సాధించెడి స్థితి వరకు వారు పురోగమింపలేదు; వా రింకను వైవాహిక స్థితియందే యుండుటవలన, మానవేతర జీవులకొరకు మానవ శరీరములను నిర్మించుట యనెడి వైవాహికసంస్థ కర్తవ్యమునే మరచిపోయిరి. ఈ మరుపు

వలన వారి సృజనేంద్రియములకు మానవశరీరములను నిర్మాణము చేయుటయందలి ఉద్దేశ్యమునందుకన్న నిర్మాణ విధానమునందే ప్రీతి యెక్కువయినది. వారు బాధ్యతాయుతులగు సభ్యులు కాలేకపోయిరి. సంస్థయందు వారికి గల బాధ్యత వ్యామోహముగ మారినది. ఈ వ్యామోహము మూలమున వారు, తమ శరీరములు నశించువరకు శరీర నిర్మాణ విధానమునందు ప్రీతి గల్గియే యుండిరి. ఈ అధికప్రీతి వలన తీరని అసంతృప్తి కలిగినది. ఆ యసంతృప్తి మూలమున తామే మరల మరల మానవ శరీరములు దాల్చవలసివచ్చినది. ఈ విధముగ అవతారిత మానవుని పునరవతరణ, శరీరస్థ మానవునికి ఆ శరీరము గతించిన పిమ్మట మరల శరీరధారణము అనివార్యములు, ఆవశ్యకములయ్యెను.

ఇంతకు ముందు ఒకమారు శరీరములు ధరించిన మానవులు, మరల మానవ శరీరముల ధరించుట జరిగినచో అది విశ్వావశ్యకత ననుసరించి ప్రేమ, జ్ఞాన, సామర్థ్యములలోన నే యొకటి, రెండింటి ప్రాబల్యముతో నెప్పుడైనను సంభవించెడిది. విశ్వలక్షణములైన ప్రేమ, జ్ఞాన, సామర్థ్యముల నెలకొల్పుటయే యీ విశ్వావశ్యకత. ఈ మూడింటిలో నే యొకటియో, రెండో తక్కువగుటవలన అనిశ్చలము, అశాంతియుతమునగు పరిస్థితు లేర్పడును. అంతియేకాక ఆయా ప్రాంతపు మానవులలో వాని వ్యతిరేక లక్షణములు పెంపొందును. ఈ పరిస్థితులే భౌతిక సామరస్యమును భగ్నపరచుచున్నవి. ఒక ప్రాంతము నందు బయలుదేరిన యీ భౌతిక అసామరస్యతకు విశ్వమందంతయు విస్తృత మయ్యెడి శక్తి కలదు. ఇవియే జరిగినచో భౌతిక వ్యవహారమునకు మూలమయిన విశ్వనిర్మాణ తత్వమునందలి సామరస్యమునకే భంగము కలుగును. ఈ రీతిగ ప్రత్యేక ప్రదేశములయందు, ఆ

ప్రాంతపు మానవులయందు భౌతిక సామరస్య పునర్నిర్మాణము కొరకు శరీరధారుల పునశ్శరీర ధారణ విశ్వావశ్యక మగుచున్నది.

అశరీర స్థితిలో నున్నపుడు విశ్వజీవితో తాదాత్మ్యానుభూతిని పొందనివారు మరల శరీరములను ధరింతురు. అట్టివారా యా ప్రాంతములం దేర్పడిన అనిశ్చల పరిస్థితులను, అక్కడ ప్రబలముగా నున్న వ్యతిరేక భావముల నెదుర్కొన్నశక్తి, బాధ్యతలతోగూడిన ప్రేమ, జ్ఞాన, సామర్థ్యములను కలిగియుందురు. వారు తమ కర్తవ్యమును సక్రమముగ నిర్వహించిన తరువాత, వారి శరీరములు గతించిన తరువాత, విశ్వావశ్యకతను అనుసరించి వారు శరీరధారణ చేసిన నాటి స్థితినుండి పురోగమింప ప్రారంభించెదరు. బాధ్యతి నిర్వహింపబడి, సామరస్యము నెలకొల్పబడిన తరువాత వారు మరల శరీరధారణ చేయ వలసిన యగత్యములేదు.

వైవాహిక స్థితియందు తీరని అసంతృప్తి వ్యామోహముల వలన, శక్తి పరిణామముయొక్క పురోగమనమును నిలబెట్టుకొనలేని బాధ్యతాయుత మానవులు, తమ శరీరములు గతించిన తరువాత మరల శరీరములను ధరించుట అనివార్యమయ్యెను. అంతవరకును విశ్వావశ్యకత ననుసరించి మానవేతర జీవులకొరకు జరుగుచున్న మానవశరీర నిర్మాణము ఇప్పుడు మానవావశ్యకత ననుసరించి మానవుల పునరవతరణకే జరుగుట అవసరమయ్యెను. ఇట్టి యావశ్యకత సంభవించువరకును, వైవాహిక స్థితియందు ఒకటి రెండు శరీరోత్పాదనలు గావించిన తరువాత ఆ విధానమునకు దూరస్థులై, విసర్గత శక్తులను, విశ్వమందు సమ్మేళన పరచుటకు అనువగు పరిస్థితుల నేర్పరచుటకే అట్టివారి ప్రయత్నములు సాగుచుండెడివి. కాని యీ యవసర మేర్పడిన తరువాత వారి ప్రయత్నము కేవలము వ్యామోహమునుండి

బయటపడి బాధ్యతాయుతులగుటకు మాత్రమే! ఎన్ని పర్యాయములు మానవత్వానుభవములను పొంది యున్నప్పటికినీ నవ్యమానవులుగనే యుండిపోయిరి. సూక్ష్మేంద్రియములు సక్రమముగ వ్యవహరింపక పోవుట మూలముననే వారికి సృజన విధానమునందు ప్రీతి కలుగుచుండును.

ఆస్తిపాస్తులను, శరీరములను రక్షించుకొనుటవంటి విషయములయందు వారికిని యితర నవ్యమానవులకును ఎంతేని తారతమ్యముండవచ్చును. కాని వైవాహిక జీవితమునందు ఎంతమాత్రము భేదములేదు. ఒకప్పుడు ప్రథమగణ్యులలో తలమానికములయిన వ్యక్తులిప్పుడు ద్వితీయగణ్యులలో తలమానికము లగుచున్నారు. వారితర వ్యామోహిత మానవులకు, వారి జీవనమునకును, రక్షణకును కావలసిన వస్తువిషయాదుల నీయకుండిరి. అప్పుడు, అట్టి మానవులకు పోషణ రక్షణలను సమకూర్చి సంరక్షించుటకై రాజకీయసంస్థ నెలకొల్పబడినది. వైవాహిక సంస్థయందలి బాధ్యతాయుత వ్యక్తులకు, వ్యామోహిత వ్యక్తులకు సామరస్య మేర్పరచవలసి యున్నది. బాధ్యతాయుత వ్యక్తులు తిరోగమించి, పతితులై, వ్యామోహబద్ధు లగుటవలన కలిగిన దుష్ఫలితము లసంఖ్యాకములు. అవాంఛనీయములు. వ్యామోహిత మానవులు ఎక్కడ ఎట్లుండిరో అక్కడనే అట్లే యుండగోరి, ఆ ప్రలోభమునకు లొంగిపోయిరి. వ్యామోహము నధిగమించి బాధ్యతాయుతులు కాలేకపోయిరి. వారు మరల మరల శరీర ధారణ చేయుచుండిరి. కాలక్రమమున మానవత్వార్హతను పొందిన మానవేతర జీవులు, తమ మానవేతర శరీరములు నశించిన తరువాత అశరీర స్థితియందు మానవ శరీరముల కొరకై నిరీక్షించుచున్నవి. ఇట్టి స్థితియందు మానవ జీవులకు మానవేతర జీవులకు నడుమ సంఘర్షణ

ప్రారంభమయినది. మానవులు తమ పురోగమనమునందు విఫలులై, మానవానుభూతితో మరల మరల మానవ శరీరములను కోరుచున్నారు. మానవేతరజీవులు తమ కాలక్రమమగు పురోగమన ఫలితముగ మానవు లగుటకు తహతహ పడుచున్నవి. మానవుల యీ ప్రయత్నము అన్యాయము, అసమర్ధనీయము. మానవేతరుల ప్రయత్నము న్యాయ సమ్మతము. బహుధా వాంఛనీయము.

ఒక ప్రదేశముయొక్క పరిస్థితులను, ఆనుపానులను తెలిసికొనిన వారు, తా మందు ప్రవేశించుట అన్యాయమే యయినప్పటికీ సులభ ముగ ప్రవేశింపగలరు. కాని ఆ ప్రదేశమును గూర్చిన పూర్వాను భవములు లేనివారికి అందు ప్రవేశించు టెంత సమర్థనీయ మైనప్పటికినీ దుస్తరము. అదేరీతిగ, మానవత్వానుభూతి గలవారికి మరల మానవ శరీరధారణ సులభము. మానవేతర జీవులకు, పూర్వ మానవత్వాను భవము లేకపోవుటవలన కష్టము. అందువలన రాబోయెడి మానవాళి కన్న, అనగా పురోగమనము వలన మానవత్వమును సాధించి మానవులుగా నవతరించనున్న మానవేతరులకంటె నేటి మానవులలో నిది వరకే మానవులుగా నవతరించినవారు అనుకూలమైన స్థితియం దున్నారు.

ఈ సంఘర్షణ ఫలితముగ, భావి మానవుల అభ్యుదయము, అనగా అర్హతను పొందిన మానవేతరులు మానవరూపమున అవతరించుట మందగించి, కుంటువడి పోయినది. అర్హత పొందెడి వారి సంఖ్య కంటె అవతరణావకాశము కలిగెడివారి సంఖ్య చాల తగ్గిపోయెను. ఇందుకు ఫలితముగ సమస్త మానవేతరుల అభ్యుదయము కుంటువడి పోయినది. అల్పేంద్రియ మానవేతరులు ఉత్తమేంద్రియు లగుటయు కుంటువడినది. సస్యజీవులు అల్పేంద్రియజీవు లగుటయును కుంటువడినది.

ఈ రీతిగ పై నుండి క్రిందవరకును అన్నితరహాలలోను మానవులనుండి సస్యజాతులవరకును సంబంధ సామ్యము, సామరస్యముపోయి విశ్వ కల్లోల పరిస్థితు లేర్పడినవి.

కాని యీ కల్లోలము వైవాహికస్థితి కతీతులయిన మహావ్యక్తులలో కలుగలేదు. వారి అతిసూక్ష్మ, అత్యధికసూక్ష్మ, మహాసూక్ష్మ ఆధ్యాత్మికేంద్రియములు, ఉన్నత, ఉన్నతతర, ఉన్నతతమ, అత్యుత్తమ బాధ్యతలు, ప్రయోజనములు కలిగియుండుటచే వారి వ్యవహారాదులు అసామరస్యత కల్లోలముల కతీతములైనవి. కాని యీ పరిస్థితి ప్రజలయందలి ఆధ్యాత్మికత్వమును సంరక్షింప లేకుండెను. ప్రజల ద్వారా ఆధ్యాత్మికత్వమును రూపొందించ లేకుండెను. చాలకాలమైన తరువాత యీ స్థితివలన, అభ్యుదయ మార్గములో, ఉత్తమ ప్రయోజనము, బాధ్యతలను సాధించుటకు శక్తి పరిణామము లేకపోవుట వలనను, ఇంద్రియములు సక్రమముగ నిర్వహింపక పోవుటవలనను కష్టమయి పోయినది.

ఇట్టి పరిస్థితులలో కల్లోలము, అసామరస్యతలను అరికట్టుటకు వైవాహిక సంస్థయందు, సమాజమునందు సామరస్య వ్యవహారము నెలకొల్పుటకును, సమాజమునందలి ప్రముఖ వ్యక్తులు కొన్ని వర్గములుగా నేర్పడి వారిలోని ఆధ్యాత్మిక మహావ్యక్తులను గుర్తించిరి. ఈ వర్గములే కొంతకాలమైన తరువాత మతవర్గము లయ్యెను. ఈ వర్గములందలి ఆధ్యాత్మిక మహావ్యక్తులు మానవుల సహజస్థితిని స్ఫురణకు తెచ్చుచు, పురోగమించ చేయదొడగిరి. వారి విధానములు ఆధ్యాత్మిక గ్రంథములపై ఆధారపడియున్నది. విశ్వమందలి వివిధ విషయాదులు, వానికిగల అన్యోన్యసంబంధము, కర్తవ్యము, విశ్వాత్మమును గూర్చి లిఖింపబడినవియే యీ గ్రంథములు. కాని ఆధ్యాత్మిక గ్రంథ

ములలో అప్పటి కప్పుడే విభజిత మానవులు, విభజిత ప్రపంచము, అనేడు రాజకీయపుటవధులు ప్రవేశపెట్టబడినవి. అందువలన మత వర్గమునకు చెందిన ఆధ్యాత్మిక వ్యక్తుల ప్రబోధములలోకూడ ఈ యవధులు తప్పనిసరిగ ప్రవేశించినవి.

మత వర్గము లేర్పడినది మొదలు ఆ నాయకులచే చేయబడిన ప్రబోధములన్నియు ఆ వర్గముల వారిచే లిఖిత మొనర్పబడినవి. ఇవియే మతగ్రంథము లనబడినవి. కల్లోలము, అసామరస్యములను వెంటనే అరికట్టి, సామరస్యములను స్థాపించి, సహజత్వమును ప్రబోధించుట నాయకుల పరమాశయమగుట వలన ఆ మత వర్గములవారు ఒకప్పుడు ఆ నాయకుల అనుమతితోడను, మరియొకప్పుడు నాయకులు సశరీరులై యున్నను, లేకున్నను వారితో నిమిత్తము లేకుండ తమ స్వంత బాధ్యతపైన రాజకీయ సంప్రదాయము ననుసరించి కొన్ని ధర్మములను లిఖిత మొనరించి వానిని మతగ్రంథములకు జోడించిరి. అటు తరువాత విశ్వమందంతట నిట్టి వర్గము లేర్పడి అందలి ఆధ్యాత్మిక మహావ్యక్తులు గుర్తింపబడి ఆ వర్గములే వేరు వేరు మతములుగా రూపొందినవి.

మతముయొక్క బాధ్యత వైవాహికసంస్థ యందలి సభ్యులకు, వారి వ్యవహారములకు సామరస్యము చేకూర్చుటయే! రాజకీయము యొక్క బాధ్యత, రక్షణ, పోషణలను సమకూర్చుటయే! కాని మతము రాజకీయము కూడ తమ బాధ్యతా నిర్వహణయందు విఫలములయ్యెను. తమలో తాము ఒకరినొకరు నిందించుకొన దొడగిరి. తమను తాము చక్కబెట్టుకొన ప్రారంభించినవి. అందుకు ఫలితముగా ప్రతి ప్రాంతమునందును రాజకీయములో బహు నాయకత్వమును, ప్రతి మతమునందును ఉపమతముల పెరుగుదలయు ప్రారంభమయ్యెను. ఇట్టి స్థితియందు ఆ రెండును అత్యధిక ఐక్యత, సామరస్యము కొరకు కృషి

చేసెను. కాని ఆ యా సంస్థలలోగల ప్రజలనడుమ సామరస్యమును కలిగించుటను మరచెను. మత రాజకీయముల నైక్యతనవి సాధింప గలిగినవి. కాని వానిలోని విశ్వాత్మభావము నశించెను. వారి గ్రంథ ములు విశ్వాత్మభావము నెంతగ ప్రబోధించినప్పటికినీ, వారి చేష్టలలో మాత్రమది శూన్యమయ్యెను. వారి గ్రంథములలోని విశ్వాత్మభావము మాటవరుస విషయమయ్యెను. ఆధ్యాత్మికత్వమును ప్రబోధించెడివి అవి భజిత విశ్వము, మానవ సమైక్యత, ఏకైక మానవ కర్తవ్యము, ఆ కర్తవ్యమును సాధించెడి సిద్ధాంతముల సమైక్యత, కాని రాజకీయము నకు కావలసినది తన ప్రాబల్యమును ఇంకనూ ఎక్కువ ప్రదేశమునందు వ్యాప్తిచేయుట. మతమునకు కావలసినవి తన యనుయాయుల సంఖ్యలో పెరుగుదల. మతము, రాజకీయము జయమును సాధింపవలె నన్న ఆధ్యాత్మికత్వము నెదుర్కొనవలెను. అవి యట్లే చేయ నెంచెను. చేయదొడగెను. ఇట్టి స్థితియందు మతములకు, ఉపమతములకు సంఘ ర్షణ ప్రారంభమయ్యెను. అంతకుముందే రాజకీయ సంస్థల నడుమ సంఘర్షణ ప్రారంభమయ్యెను. తుట్టతుదకు వివిధమతములు రాజ కీయము యొక్క సహాయము అత్యంతావశ్యకమని గుర్తించినవి. ఇట్లే రాజకీయముగూడ మతముయొక్క అవసరమును గుర్తించినది.

ఇచ్చట, మతరాజకీయములు రెండును కలిసి, కుట్రచేసి, ఆధ్యాత్మికత్వమునకు భిన్నముగ వ్యవహరింప దొడగినవి. ఇట్టి స్థితి యందు, తమ బాధ్యతా నిర్వహణమునందు మతము, రాజకీయము కూడ విఫలత్వము నొందుటను గమనించి, కొందరు రాజకీయ ప్రము ఖులు, కొందరు మత ప్రముఖులు కలిసి ఒక క్రొత్త సిద్ధాంతమును ప్రారంభించిరి. అదియే "సోషలిజం" అనెడి సమాజాభ్యుదయ సిద్ధాం తము. ఈ సిద్ధాంతముద్వారా సామాజికవాదులు, ఆధ్యాత్మిక సిద్ధాం తముతో సామరస్యమును పొంది అభ్యుదయ పథమున సామాజిక

పురోగమనమును సాధింపగోరిరి. అట్టి పురోగమనము సాధ్యమని వారు విశ్వసించి, ఆశించి, సాధించుచున్నారు. వారు మత రాజకీయముల రెండింటితోడను సంబంధము కలిగియున్నారు. వారి సిద్ధాంతములలో మత రాజకీయముల రెండింటిలో కంటె ఎక్కువ ఆధ్యాత్మికత్వమున్నది. ప్రస్తుతకాలమందీ సిద్ధాంతములే ప్రపంచమునందు ప్రాబల్యము కలిగియున్నవి.

ఇటీవలనే బయలుదేరిన దనుకొనెడి యీ సామాజికాభ్యుదయ సిద్ధాంతము మానవ సమాజముచే నేర్పరుపబడిన అతి సనాతన సిద్ధాంతము.

మానవులకు, పోషణ పదార్థములును రక్షణ అత్యంతావశ్యకమని విశ్వసించుటచేత వానిని సమకూర్చెడి బాధ్యత రాజకీయమునదగుటచేతను సామాజికవాదులు ఆ యా ప్రాంతములలోని రాజకీయ విధానములతో సామరస్యము కలిగి వ్యవహరించెడివారు. కాని రాజకీయము తనకు మూలమైన విశ్వాత్మభావమును గోల్పోయెను. తన నాయకుల యభిమతానుసారముగ విధానములను మార్చుచుండెను. మత సంస్థలేర్పడిన తరువాత చాలకాలమునకు సామాజిక వాదులు కూడ తమకు మూలమైన ఆధ్యాత్మికత్వమును విస్మరించుటయేగాక, తమకు మాతృకమైన ఆధ్యాత్మిక స్ఫురణను కూడ గోల్పోయిరి. అందువలన వారెంతయో కాలము రాజకీయముతో సామరస్యము కలిగి వ్యవహరింపలేదు. అట్టి సామరస్యముగల కొద్ది కాలములోనైనను రక్షణ, పోషణాదులకు పరాధీనులగుట వలన కోరిన స్వల్ప ఫలితములను కూడ పొందలేకపోయిరి. పరాధీనత పోవలెనన్న రాజకీయపు బాధ్యతలను వారు వహింపవలెను. రాజకీయముతో సమాఖ్యతో నున్నంతకాలమిది వలను పడదు. సమాఖ్య విచ్ఛిన్నమయినచో, వారి

వ్యవహారణయే అసాధ్యమగును. ఇవియే సనాతన మానవ సమాజప్ర ప్రస్తుత పరిస్థితులు.

మానవ సమాజ క్షేమమును పెంపొందించుటయే సామాజిక వాదుల పరమాశయము. మానవ జీవనమునకు కావలసిన పోషణ, రక్షణ, క్షేమములను సమకూర్చుటయే వారి యాశయము. ఇది వారికి మూలమైన ఆధ్యాత్మికత్వము యొక్క యాదేశము. ఈ పరమాశయ సాధన కొరకు రాజకీయముతో కలిసి వారనేక విధానముల ననుసరించిరి. అట్టి విధానములలో ప్రముఖమయిన వానిలో మానవ సంఖ్య తగ్గించుట యొకటి. వ్యక్తుల వలన తమంత తమకు నిర్మాణము చేసికొనబడుచున్న శరీరములు మాతృగర్భమున రూపము దాల్చుటకు అవకాశము లేకుండ చేయుచున్నారు.

మానవసంఖ్యా పరిమాణమును తగ్గించెడి యవసరమునకు మూలము ఆధ్యాత్మికతయే! ఆధ్యాత్మికత్వము కూడ జనసంఖ్య తగ్గియుండవలెననియే కోరును. జనసంఖ్యాధిక్యతనుగూర్చిన విషయములను సమాజము సంపూర్ణముగ గ్రహింపలేదు. వారనుసరించుచున్న విధానములకు ఆధ్యాత్మికాధారములు లేవు. ఇప్పటి గతిని మానవోత్పత్తి సాగుచునే యుండెనయెడల పోషణ, రక్షణలను సమకూర్చుటశక్యము, అసంభవము అని వారు భావించుచున్నారు. జనసంఖ్య యొక్క పరిమాణమును గూర్చి స్థూలముగ విచక్షణచేసి, వారికిప్పుడును ఇక మీదటను కావలసిన పోషణపదార్థములను లెక్కించి, అట్టి అభిప్రాయమును పొంది, జనసంఖ్యను తగ్గించుట అత్యంతావశ్యకమని వారు భావించిరి. ఇందు నిమిత్తము వారనుసరించుచున్న మరియొక విధానము విద్యద్వారా ప్రచారము. సూక్ష్మముగ విచారించినచో ఆధ్యాత్మిక సత్యములను విచక్షణా పూర్వకముగా పరిశీలించినచో ఈ

యుద్దేశ్యము పరియైనది కాదని తోచును. మానవశరీరముల యందలి వ్యామోహము. కోరికవలన, ఒకమారు మానవులై పుట్టినవారు కూడ మరల మరల మానవరూపమున నవతరించెడి యవసరము కలుగుచున్నది. అట్టి అవశ్యకత నరికట్టుట ఆధ్యాత్మికతా మూలనే. అట్లు చేయుట వలన అనవసరమయినట్టియు, నివారింపదగినట్టియు పునరవతరణాలు తగ్గి అంతవరకు జనసంఖ్యకూడ తగ్గును.

ఆధ్యాత్మిక సత్యము ననుసరించి మానవేతరులు ఉన్నతేంద్రియ ములనుపొంది అర్హతను సంపాదించిన వెంటనే యేవిధమయిన అడ్డంకులు ఆలశ్యము లేకుండగనే నవ్యమానవులగుట కవకాశము లున్నవి. ఆధ్యాత్మిక సత్యము ప్రకారము, బాధ్యతాయుతులైనను, వ్యామోహితులైనను వివాహితులందరకును, పునరవతారితులయినను, నవ్యులైనను అందరు మానవులకు అభ్యుదయమార్గమున పురోగమించుట కవకాశము లున్నవి. పునరవతారితులయిన మానవులు, తమ సూక్ష్మేంద్రియ ములు సక్రమముగా వ్యవహరించుటవలన వైవాహికసంస్థ యొక్క కర్తవ్యమును గుర్తించి, సూక్ష్మశక్తి పరిణామము వలన అతిసూక్ష్మ శక్తులనుపొంది శరీరోత్పాదనా విధానమునందుకన్న శరీరోత్పాద నోద్దేశమునందే ప్రీతిగలిగియుండి, వైవాహిక జీవితమున కతీతులయి ఉత్తమ కర్తవ్యములను బాధ్యతలను నిర్వహించుట కర్హులగుదురు. నవ్యమానవులు కూడ బాధ్యతాయుత మానవులతోడి సంపర్క సంసర్గముల వలన, అభ్యుదయ పూర్వకమగుశక్తి పరిణామము పొంది, తాము కూడ బాధ్యతాయుతులై వైవాహికసంస్థా కర్తవ్యమును గుర్తించెదరు. తరువాత, అట్టి వారు బాధ్యతాయుత ప్రవర్తన మూలమున వైవాహిక జీవితమున కతీతులయి, ఉత్తమమైన బాధ్యతలతోడను, ఆశయములతోడను సమాజమునందు వ్యవహరింతురు. ఈ రీతిగ విశ్వజీవి సాక్షాత్కారము లయిన సత్యజీవులు మొదలు, పరమోత్తమ

ఆశయము, బాధ్యతలు గల మానవుల వరకు అందరును అభ్యుదయ పథముననుసరించిన వారయి, సహజస్థితిని పొంది, విశ్వజీవితో నేకత్వానుభూతి పొందుదురు. ఇదియే విశ్వప్రయోజనము, ఇదియే విశ్వావశ్యకత. ఈ విశ్వమానవ కర్తవ్యమును సాధించుటకొరకే సామాజిక సంస్థలు, వైవాహికసంస్థలు నిర్మాణములయినవి. ఈ ప్రయోజనమునే ఆధ్యాత్మికత్వము రాజకీయమత సంస్థలనుండి యాశించుచున్నది. ప్రస్తుతము మతరాజకీయములకంటె వైవాహిక సంస్థతో సామాజిక సంస్థయే సన్నిహిత సంబంధము కలిగియున్నది. అందువలన ప్రస్తుత కాలమందు, ఈ ఆధ్యాత్మిక పరమాశయమునకు, ఆ యాశయ సాధనకు సామాజకులు, సామాజిక నాయకులు సన్నిహితులయి యున్నారు.

ఈ మానవ కర్తవ్యమును మానవోచితముగను, విశ్వకర్తవ్యమును విశ్వత్వభావోచితముగను సాధించుటకు, సామాజికుల యొక్క ప్రయత్నములలోను, విధానములలోను నేమార్పులుగాకుండ సమాజమే పటిష్ఠము కావలసిన యావశ్యకత గలదు. మతములతోడను రాజకీయములతోడను కలయిక వలన వైకల్యము పొందిన సమాజము అది యింకను అచట వ్రేళ్లుపారియుండక పోవుటచేతను, ఇక ముందు కూడ వేరునాటుకొను టశక్యమగుటవలనను ఆ ప్రదేశము దాని కననుకూలమయి యుండుట వలనను దానిని వ్రేళ్లతోసహా పెరికివైచి ఆధ్యాత్మిక క్షేత్రమునందు మరల నాటినచో అట్టి ప్రదేశము దాని కనుకూలమయి యుండుట వలన అది అచ్చట బాగుగ నాటుకొనును. సామాజిక మూలమునే మరల స్థాపనచేయవలెను.

సారవంతమగు నేలయందు వేరు నాటుకొనినచో, సమాజము యొక్క మూలమునకు, కర్తవ్యమునకు, సిద్ధాంతములకును నడుమ సామరస్యము ప్రయత్నము లేకుండగనే సుస్థిరముగ నేర్పడును. ఈ

సామరస్య సంబంధము లేర్పడుటకు ఆశయములను భావముల ననుసరించి, విధానములు తప్పక మారును.

ఆధ్యాత్మిక సిద్ధాంత ప్రకారము, జన్మనిరోధన ప్రయత్నముల వలన, జనసంఖ్యను తగ్గించెడి యత్నముల వలన మృత్యునిరోధనావశ్యకత కలుగును. మరణించునది వ్యక్తుల శరీరములే కాని, వ్యక్తులు కారు. వ్యక్తులు సంతృప్తిపొంది, పునరవతరణ యందలి వాంఛల కతీతులగువరకును, ఎవరెట్టి ప్రయత్నములను చేసినను, వ్యక్తుల పునరవతరణనరికట్టలేరు. నవ్యమానవుల యందుగల అసంతృప్తి సమర్థనీయము. అది విశ్వావశ్యకతగావున విశ్వామోదితము. కాని పునరవతారిత మానవుల యందలి అసంతృప్తి సమర్థనీయము కాదు. విశ్వామోదితమును కాదు. అందువలన వారి శరీరముల మృత్యువును నిరోధించి శరీరము లంతమగుటకు పూర్వమే, బాధ్యతాయుత జీవనులయి శక్తిపరిణామమును, సంతృప్తిని పొందునట్లుచేయవలెను. అప్పుడు అట్టి వ్యక్తులు స్థూలసృజనేంద్రియములకు అహములకు అతీతులగుదురు. తృప్తితో గూడిన నిర్గమనము వలన, తమ అశరీరస్థితియందు తమ పరమాశయములను సాధించుట కొరకు అభ్యుదయమార్గమున పురోగమింతురు. ఈ రీతిగ మరల మరల శరీరములను దాల్చుట తప్పని స్థితికి అతీతులగుదురు. అందువలన మానవులు తప్పనిసరిగ మరల మరల యవతరించునట్లు చేయుచున్న పరిస్థితులను మార్చకుండ కొనసాగినచో, ప్రస్తుత సమాజ మనుసరించుచున్న జన్మనిరోధక విధానముల వలన తప్పక దుష్ఫలితములు కలుగ గలవు.

మానవ వ్యక్తిత్వమును పొందిన మానవేతరులు మానవ శరీరములను దాల్చుటకు ఆలస్యము కలుగుటయేగాక, తీవ్రమగు ప్రతిబంధకములు కూడ కలిగి, మానవేతరులు మానవ శరీరములను దాల్చ

టయే యసంభవమగును. ఇట్టి స్థితియందు, మానవత్వార్హతను పొందిన మానవేతరులకంటె, అదివరకే మానవానుభవములను కలిగియున్న వ్యక్తులకు మానవశరీరములు సులభముగ ప్రాప్తించును. పునరవతారిత మానవులు తమకు అదివరకే గల మానవజీవితానుభవముల వలన, అధికమగు ప్రయోజనమును పొందుచున్నారు. అంతేగాక, మరల భూమిపై మానవ శరీరధారణ మొనరించిన పిదప గూడ తమకు అదివరకే గల మానవత్వానుభవముల వలన, శరీరపోషణ, రక్షణలకు అవసరములయిన వస్తువిషయాదులను కావలసినన్ని సంపాదించుకొను టయే గాక, అనుభవము లేనివారికి వస్తువిషయాదులు లభించకుండ చేయుచున్నారు. ఈ రీతిగ నేటివిశ్వమందు మరల అవతరింపవలసిన అవసరము లేనట్టియు అవతరించుటకు హక్కు లేనట్టియు, అయినప్పటి కిని శరీరధారులయిన మానవులసంఖ్యాకులుగనున్నారు. అట్టి మానవు లకు పునరవతరణావశ్యకతను పోగొట్టి, పరిస్థితులనుమార్చి పునరవ తరణను నిరోధించవలెను. ఈ విధానము వలన అర్హతను పొందిన మానవేతరులకు మానవశరీరములు లభ్యమగును. నేటి కల్లోలములకు అన్ని రంగములందును బహునాయకత్వమే ముఖ్యకారణము. హక్కు లేట్టియు, అనావశ్యకులయినట్టియు, ఈ పునరవతారిత మానవులయునికి అందులకు తోడ్పడుచున్నది.

అంతేకాక, అట్టి పునరవతారిత మానవులు విశ్వసింపదగిన నాయకులును కారు. విశ్వాసము కలిగిన అనుయాయులును కాలేరు. వారెల్లప్పుడును నాయకత్వమును పొందవలెననెడి ఆకాంక్షతో నుందురు. వారిలో చాలమంది సక్రమముగ వ్యవహరింపవలెననియే కోరుదురు కాని వారి సూక్ష్మేంద్రియములు శక్తిహీనములై సక్రమ ముగ పనిచేయకుండుట వలన వారనుకొనినట్లు, కోరినట్లు చేయలేకు న్నారు. వారిలో చురుకుగా పనిచేయుచున్న సృజనేంద్రియములు వారి

నట్లు వ్యవహరింపనీయవు. వారు సశరీరులై భూమిపైనుండెడి స్థితిని దాటిరి. కాని పునరవతరణావశ్యకత నధిగమించెడి స్థితిని పొందలేదు. అందువలన వారు తాము ప్రస్తుతమున్న స్థితినుండి పైకిపోలేరు. ఇతరులను, నవ్యమానవులను ముందుకు రానీయరు.

అందువలన, అట్టి మానవులను పునరవతరణావశ్యకత కతీతులుగ చేయవలెను. వారి శరీరములు అంతమగు లోపున వారికి వస్తు విషయాదులందు సంతృప్తి కలుగునట్లు చేయవలెను. సృజనశక్తి పరిణామము పొందువరకు దానిని నిలువజేసి, తదనంతరము వివేకోదయము ననుసరించి వ్యవహరించునట్లు వారిని శాసింపవలెను. వారికిని, వారి శరీరములకును కావలసిన రక్షణ పోషణాదులను సమకూర్చి, భావనల ద్వారా, మాటలద్వారా, చేష్టలద్వారా, విశ్వకర్తవ్యమును సాధించుట కనువయిన పరిస్థితులను వారికి కలుగజేయవలెను. ఈ పద్ధతుల ననుసరించిన యెడల వారిలో చాలమందికి, ఈ శరీరపుకాలము, తదనంతరపు టశరీరపుకాలము తరువాత మరల అవతరింపవలసిన అవసరము లేకుండపోవును. అట్టి వారిలో మిగిలిన కొలదిమందికి వారి ప్రస్తుత శరీరములు గతించిన తరువాత మరియొక్క అవతరణతో మాత్రమే అట్టి ఆవశ్యకతపోవును.

సామాజిక వాదులిప్పుడు రక్షణ పోషణాది విషయములను రాజకీయ వాదులకు విడిచిపెట్టు టెంతయైనను అవసరము. ఆ ప్రయోజనమును వారు నిర్వహింపగలరు. ప్రస్తుత పరిస్థితితో పోల్చి చూచినచో మానవకర్తవ్య సంసిద్ధికి రక్షణ పోషణాదులు అత్యంతావశ్యకము లయినప్పటికిని, అవి చాల చిన్న విషయములు. వాని ఆధిక్యతాభావము వలననే సామాజికవాదులు మత రాజకీయములతో చేతులు కలుపుచున్నారు. ఈ సమాఖ్య మూలమున, వారికి మూలమయిన

విశ్వత్వ దృష్టి మందమగుచున్నది. శరీరములకు పోషణ, రక్షణల యావశ్యకత నిరంతరము నుండెడిదే! దీనికొరకు ప్రయత్నములు ప్రారంభించినచో, వారియొక్క సమస్త శక్తి యిందుకొరకే వినియోగ మగును. ఇది నిరంతరము సాగుచుండున దగుటచే; ఈ ప్రయత్నము నుండి యెన్నడును వారు విరమించలేరు. వారి శక్తిశ్రద్ధలను ఇతర విషయములకు వినియోగించుటకు వారికి అవకాశముండదు.

ఓ సామాజిక నాయకులారా! మీ ప్రబోధమును పరిశీలించుడు. మీ రెవరిని పోషించుచున్నారు? శరీరములను – ఎవరిని రక్షించు చున్నారు? శరీరములను! ప్రస్తుతమున్న శరీరములను ఎంతకాలము వరకు పోషించి రక్షింపవలెను? అవన్నియు గతించువరకును! అవన్నియు గతించిన తరువాత మీయొక్క పోషణ రక్షణలు కావలసిన శరీరము లింకనూ ఉండునా? ఉండును. అవి యెక్కడనుండి వచ్చు చున్నవి? విశ్వమునుండి. అవి స్వతంత్రముగ తమంతతామే వచ్చు చున్నవా? లేదు. అవి స్వతంత్రులు కావు కనుక స్వతంత్రముగా వచ్చుటలేదు. అవి యెవరిపై నాధారపడి యున్నవి? వ్యక్తులపై! ఆ శరీరములను ఎవరు నిర్మించుచున్నారు? వ్యక్తులు! శరీరముయొక్క మృత్యువుతోపాటు జననముతో వచ్చున దేమిటి? శరీరముయొక్క చావుతో పోయి, పుట్టుకతో వచ్చునవి వ్యక్తులు. మానవ వ్యక్తు లెందుకొరకు శరీరములను నిర్మించుకొని భూమిపైకి వచ్చుచున్నారు. మానవ వ్యక్తులలో మూడు రకములున్నారు. విశ్వావశ్యకత ననుస రించి మాతృ గర్భమునందు మానవ శరీరమును నిర్మించుకొని భూమి పైకి వచ్చువారు మొదటిరకము. అదివరకే మానవ జీవితానుభవము లను పొందె, అందు తృప్తినిగాంచలేక మరల మానవ శరీరములతో నవతరించు వారు రెండవ రకము. కాలక్రమమున అజ్ఞాతను మానవ వ్యక్తిత్వమును పొంది యవతరించువారు (నవ్య మానవులు) మూడవ

రకము. మీ సేవ యీ మూడు రకములలో నెవరికి కావలెను? రెండు మూడు రకములకు — రెండవ తరగతికి కావలసిన సేవయేది? తాము ప్రస్తుత శరీరములను చాలించు లోపల ప్రపంచమందు సంపూర్ణతృప్తిని పొందుటకు కావలసిన సౌకర్యములు అవసరము. ప్రపంచమందు సంపూర్ణ తృప్తిని కలిగించు సదుపాయములేవి? ఆధ్యాత్మిక మూలకమగు సత్యములను గూర్చియు, అట్టి మానవులు ప్రస్తుతస్థితిని గూర్చియు, విశ్వమును గూర్చియు, విశ్వమునందలి వస్తు విషయాదులకును ప్రజలకునుగల సంబంధము బాధ్యత, కర్తవ్యములను గూర్చియు, ఆ కర్తవ్య సంసిద్ధికి అనువగు సాధనలను గూర్చియు, సక్రమమయిన అవగాహన కావలెను. ఈ సక్రమ అవగాహనకు ముఖ్యముగా మనకు కావలసిన వేమి? అవి యెందుకు కావలయును? అందుకు కావలసినది శక్తి పరిణామము. పునరవతరణావశ్యకత కతీతులగుటకు ఇది కావలయును. ఈ సక్రమావగాహనకు, శక్తి పరిణామమునకు ఏమి చేయవలెను? ఈ రెండింటిని సాధించుటకు ఆధ్యాత్మికత్వమును గూర్చిన ప్రబోధమును తీవ్రముగ చేయవలెను. వారి శరీరములకు కావలసిన రక్షణ విషయమేమి? ఆ విషయమందు వారు అశసమర్థులు. తమకు గల శక్తి నంతను ఆ విషయమునకే వినియోగించకుండ అడ్డుపడి కొంత శక్తిని వారియొక్క విశ్వాత్మ భావమును గ్రహించుటకు వినియోగించునట్లు చేయవలెను.

మూడవ తరగతికి చెందిన వ్యక్తులకు ఎట్టి సేవ చేయవలెను?

శరీరములకు కావలసిన రక్షణ పోషణాదులను సమకూర్చుకొనెడి విషయములో తప్ప మిగిలిన అన్ని విషయములలోను పైవారికి వలెనే వీరికిని సేవ కావలెను. వారి ప్రస్తుతపు అవతరణలకు పూర్వము మానవత్వానుభవము లేకపోవుట వలన పోషణ పదార్థములను సేక

రించుకొనుటలోను, రక్షణలను సమకూర్చుకొనుటలోను కూడ వారికి పూర్వానుభవములు లేవు. అందువలన వారి సామాన్య అవసరము లకు కావలసిన రక్షణ పోషణాదులను సమకూర్చుకొనుటకు వారికిగల శక్తిని వినియోగపరచుకొనుటకు వారికి తగిన ప్రోత్సాహము నీయ వలయును. రెండవ తరగతివారిచే రక్షణ పోషణాదులు అధికముగా సంపాదింపబడి నిలువచేయుబడకుండుటయూ, మూడవ తరగతివారు తమకు కావలసిన రక్షణ పోషణాదులను సంపాదించు కొనుటకు తగిన యుత్సాహము కలవారినిగా జేయుటయును, నీ రెండింటిని ప్రజా సహకారముతో రాజకీయము సాధింపగలదు. అన్ని విధములయిన శరీరములయొక్క నిర్మాణము వ్యక్తులచే చేయబడు చున్నట్లుగనే, ఆ యా వ్యక్తులు భూమిపై శరీరములతో నున్నంతకాలము ఆ శరీ రములకు కావలసిన పోషణ పదార్థములు కూడ ఆ వ్యక్తులచేతనే నిర్మింప బడుచున్నవి. కాని ఆ పోషణ పదార్థములను సమకూర్చుకొని వినియోగపరచుకొనుటలోనే కల్లోలము, విభ్రాంతి, అశాంతి యేర్పడు చున్నవి. రెండవ తరగతి మానవులచే వస్తు విషయాదుల అతి సంచ యమును మాన్పించినయెడల, అవి నవ్యమానవులకు లభించును. అందు వలన కల్లోలము, విభ్రాంతి, అశాంతియు నుండవు. అందువలన నిప్పటి మానవులకు కావలసి వచ్చునట్టియు ఆహారపదార్థములను గూర్చిన విభ్రాంతి ఆధార రహితము. ఈ రీతిగ సామాజికవాదులు సామాజిక సిద్ధాంతములను, ఆ సిద్ధాంతములయొక్క మూలమును, తమ బాధ్యత లను, ఆ బాధ్యతలను నిర్వహించుటకు వినియోగించెడి విధానములను గూర్చిన తమ యభిప్రాయములను మార్చుకొనవలెను.

ఇంతవరకును, సామాజిక వాదుల శ్రద్ధ, శక్తులు, భూమిపై జననము పొందినది మొదలు మానవ శరీరములకు కావలసిన క్షేమ మును సమకూర్చుటయందే వినియోగింపబడుచున్నవి. కాని యిప్పుడు

వారి శ్రద్ధాశక్తులు మానవులు మాతృ గర్భమునందున్న కాలము లోనికి కూడ వ్యాపించుచున్నవి. ఇవి ప్రస్తుతము వినియోగింపబడు చున్న సిద్ధాంతములకంటె ఉన్నతమైనది. సక్రమమైనది.

ప్రస్తుత కాలమందు మానవులకు సామాజికుల సేవ నాలుగు స్థితులలో కావలెను. మాతృగర్భమునందున్న భ్రూణ స్థితియందు, శైశవస్థితియందు, యౌవనమునందు, నిండు వయస్సునందు కావలెను. శరీరములకు నిండు వయస్సు ప్రాప్తించిన పిమ్మట సామాజికుల శ్రద్ధ, సేవ ఆగిపోవును. కాని వారు నిండు వయస్సునకు, శరీర మరణానంత రము మరల భ్రూణస్థితికి వచ్చువరకు గల అతి ముఖ్యమైన కాలమును విస్మరించుచుండిరి.

మానవ శరీరములలో అధికభాగము వృద్ధాప్యము కలిగిన తరువాత గతించిపోవును. శరీరములు గతించిన తరువాత అసంతృప్త వ్యక్తులు మరల మానవశరీరములతో నవతరించెడి వరకు పట్టెడి కాలము ఆ యా వ్యక్తుల యభ్యుదయమునుబట్టి మారుచుండును. విశ్వ నిర్మాణతత్త్వము, మానవ నిర్మాణ తత్త్వము ఈ రెండిటికిని గల పరస్పర సంబంధములు, బాధ్యతలు కర్తవ్యములు, ఆ కర్త వ్యములను సక్రమముగ సాధించెడి విధానములను గూర్చిన ఆధ్యా త్మిక పద్ధతుల అనుభవములను కలిగియుండుటను, ఉండకపోవుటను బట్టి యీ కాలము మారుచుండును. సామాన్యముగ సశరీరపు కాలము కన్న అశరీరపు కాలము ఎక్కువగ నుండును. శరీరములు గతించుటకు పూర్వము శక్తిపరిణామము నొంది వ్యక్తులయొక్క పురోగమనమునకు సశరీరకాలముకంటె అశరీరకాలమే యెక్కువ అనుకూలముగ నుండును. ఒక్క మారుగ సంపూర్ణ సంతృప్తిని పొంది, పునరవతరణా వశ్యకత నధిగమించగలరు. శక్తి పరిణామమును పొందకుండ దానిని గూర్చిన

పరిజ్ఞానమును మాత్రమే కలిగినవారు మరల శరీరమును పొందుటకు పూర్వమే శక్తి పరిణామమును, సంతృప్తిని సాధించుటకు తీవ్రమగు ఆకాంక్ష పూరితులగుదురు. వారు మరల అవతరించు సరికె, సామాజిక వాదుల శ్రద్ధ, శక్తులు, వారికి సహాయపడుటకు సిద్ధముగా నుండును. శక్తి పరిణామము కొరకు, సంతృప్తి కొరకు వారిలోగల తీవ్రమగు ఆకాంక్షకు సామాజిక వాదుల సహాయము తోడగుట వలన, ఆ శరీరముతోనున్న కాలములోనను, తదనంతరపుటశరీరపు కాలములోనను వారు పురోగమించి పునరవతరణావశ్యకత నధిగమింప గలరు. ఈ రీతిగ రెండు సశరీరపు కాలములు, రెండు అశరీరపుకాలము లలో, ఈ స్వయంకృతాపరాధ మయిన పునరవతరణావశ్యకత నుండి సామాజిక వాదుల సహాయముతో ప్రస్తుతమున్న మానవులందరును తప్పించుకొనవచ్చును. అప్పుడు పునరవతారిత మానవులకు సేవ చేయ వలసిన యవసరము సామాజిక వాదులకు శాశ్వతముగ తప్పిపోవును. నవ్యమానవుల యవతరణ నిరంతరము సాగుచుండుటవలన సామాజిక వాదులు పూర్తిగ వారి సేవలో నిమగ్నులగుట కవకాశము కలుగును. ఇట్టి పరిస్థితులవలన, అణుగునుండి పైవరకు వ్యక్తులు సక్రమ సాయూజ్యములలో నెట్టి యడ్డంకులు, ప్రతిబంధకములు లేకుండ పురోగమింప గలుగుదురు.

ఆధ్యాత్మి కాధారములను బట్టి చూచినచో, ఈ సిద్ధాంతముల ననుసరించి సక్రమము, సంబంధ సామ్యము గల పురోగమనమును సాధించినచో, ఈ ప్రపంచమునందు ఒక్క వేయి సంవత్సరములలో నేవిధమయిన కల్లోలము, విభ్రమము, అశాంతి లేకుండపోవును. అప్పటి నుండి మానవులందరును విశ్వమునుగూర్చియు, అందలి వస్తు విషయములను గూర్చియు, వానికిగల పరస్పర సంబంధము, కర్తవ్యము, ఆ కర్తవ్యమును సాధించెడి సిద్ధాంతములను గూర్చియు సక్రమమయిన

యవగాహన కలిగియుందురు. అందువలన వారికి సామాజిక వాదుల సేవల యగత్యముండదు. అప్పుడు ప్రతి వస్తువు విషయము అభ్యుదయ దాయకములగు ఐక్యత, శాంతి, సంపదలపై అనగా విశ్వాత్మ భావ ముపై నాధారపడి యుండును. అప్పుడెవ్వరికిని విభజన, విద్వేషము, మితులు, అవధులు, అనైక్యత, కల్లోలము, అశాంతి, దుఃఖము బాహ్యాభివృద్ధులలో ప్రీతి యుండదు. మతము యొక్క కృత్రిమ సేవయు అవసర ముండదు. అప్పటికి ప్రబలమగు రాజకీయ సంస్థ యేర్పడును. ఆ నాయకులు తమ విగతస్మృతులను మరల పొందుదురు. తమకు మూలము, ఆధారము, బాధ్యతలు, ప్రయోజనములు, రాజ కీయ సిద్ధాంతములను గూర్చిన స్మృతులను స్ఫురణకు తెచ్చు కొందురు. ఆ స్ఫురణలు ఆధ్యాత్మికము లగుటవలన సమాజముతో సామరస్యము కలిగి, విశ్వ కర్తవ్య సంసిద్ధికి తోడ్పడును. శైశవము నుండి నిండువయస్సువరకు శరీరములకు సమకూర్చిన సదుపాయ ములు వ్యక్తుల కిచ్చినవిద్య, శక్తి పరిణామము పొందకుండగనే ఆ శరీర ములు నడివయస్సులో గతించిన యెడల, మరుగువడి యుండక తప్పదు. ఆ శరీరములే నడివయస్సును దాటి వృద్ధాప్యమును పొంది శక్తి పరిణామమును పొందక పూర్వమే గతించినచో ఆ వ్యక్తుల స్థితి మరియు దుర్భరము. ఏలనన నడివయస్సు వరకును పొందిన విద్య, సౌఖ్యానుభూతులు పూర్తిగ విస్మరింపబడును. శక్తి పరిణామమును పొందని వృద్ధశరీరములుగల వ్యక్తులు సామాన్యముగ విభ్రాంతి, అసూయ, భయ, విద్వేషములు తమ ఆప్తులయెడ గూడ కలిగి యుందురు. వారి స్థూల సృజనేంద్రియములలో శక్తి తగ్గిపోవుట వలన, ఎట్టి విషయములను గూర్చియు, కనీసము స్థూలమగు విషయము లను గూర్చియైనను సరిగా జ్ఞాపకముంచుకొనలేరు. తమ శరీర దౌర్బ ల్యమును గూర్చియు, తమకు అంతవరకును ప్రీతికరము లయిన స్థూల

సృజనేంద్రియ వాంఛలను తీర్చుకొనుటయందలి తమ యశక్తతను గూర్చియు నిరంతరము విచారించుచుందురు. వారిలో బయలుదేరిన యీ భయ విభ్రాంతులు, ద్వేషము, అసూయలు వారి శరీరములలో నేదియో యొక విధమగు రుగ్నతను ప్రవేశపెట్టును. ఈ రుగ్నత, శరీరములకు చావు దగ్గరకు వచ్చినదను భావమును కలుగజేయును. ఆ భావము ఆ దేజన్మలో అనుభూతములయిన అదేరకపు భావనలను స్ఫురణకు తెచ్చును. సాధారణముగ వృద్ధ శరీరములుగల మానవ వ్యక్తులకు తమ ఆప్తులలో ఏ యొకరిద్దరి శరీరముల నైనను దహనమో, ఖననమో చేసి యుండిన అనుభవము లుండి యుండవచ్చును. వారి శరీరముల దౌర్బల్యస్థితియందు అట్టి యనుభవములు స్ఫురణకు వచ్చి వానియందు నిమగ్నులగుదురు. అప్పుడు వారు తమ శరీరము లంతమయ్యెడి క్షణములను గుర్తింప గలుగుదురు. తరువాత తమ శరీరములకు జరుగబోయెడి సంస్కారమునుగూర్చి ఊహింప గల్గుదురు. ఈ యూహ, తమ శరీరముల నింక నుపయోగింప లేమను స్ఫురణ వారి విభ్రాంతి నెక్కువచేసి, వారికి గల స్మృతినిగూడ పోగొట్టును. అట్టి స్థితి పిచ్చికంటె అధమమయినది. పిచ్చిలో వక్రమయిన దయినప్పటికిని స్మృతి లేశముండును. అచ్చట అదియు నుండదు.

సాధారణముగ, కొన్ని వారముల పర్యంతమో, నెలల పర్యంతమో, యాత్రకు పోవువారు తమ యిండ్లకు, పెట్టెలకు తాళములు బిగించి నమ్మకస్థులయిన రక్షకులను నియమించి, తాళములను భద్రపరచుకొని, యిరుగు పొరుగు వారలను ఇంటిని కాపాడుచుండమని కోరి, యింటికి తిరిగి వచ్చి మరల కాపురముండెదమను దృఢమగు విశ్వాసముతో బయలు దేరుదురు. వెడలునపుడు, సందు మరలువరకును, ఇంటివైపు వెనుతిరిగి చూచుచునేయుందురు. తిరిగి ఆ యింటిలో తాము కాపుర ముండుట తథ్యమని యెరిగి యుండినప్పటికిని, యిట్టి

ప్రవర్తన మానవులకు స్వభావమైపోయినది. శక్తిపరిణామము పొంద కుండ శరీరములకు వృద్ధాప్యము సంభవించినచో, వ్యామోహము కలిగిన ఆ వ్యక్తులకు, తమశరీరమునకు మరణము ఆసన్నమయినదని తెలిసినపుడుండెడి ఆ వేదన నూహించుట కీ యుదాహరణము సహాయపడును.

ఇట్టి స్థితియందు శరీరములను విడిచిపెట్టిన తరువాత కూడ, తమ శరీరములకు కలుగబోయెడి దుస్థితిని గూర్చిన దైన్యభావముల తోడనే యుందురు. అంతియే కాక, తమ స్థూల సృజనేంద్రియములకు ప్రీతిని కలిగించిన కార్యకలాపములలో సంతృప్తిని బడయుటకు ఆ వేదన పడుదురు. ఆ యావేదనా ఫలితముగ పునరవతరణ అనివార్యమగు చున్నది. తమ బాధ్యతలను, కర్తవ్యములను గూర్చి భావించుటకు వారసమర్థులు. అందువలన శక్తిపరిణామము నొందని వ్యక్తులు తమ యశరీరస్థితి వలన కొంచెము కూడ ప్రయోజనమును పొందజాలరు.

సక్రమముగ వ్యవహరించి మిక్కిలి ఉపయోగకరమగు నీ యశరీర స్థితిని అభ్యుదయ పథమునందు వినియోగించుకొనుట సమస్త మానవులకు విధియు, బాధ్యతయునై యున్నది.

అందువలన భౌతికమగు విషయములపై నాధారపడియున్న సామాజిక వాదుల యభిప్రాయములను సమూలముగ పెరికివైచి, ఆధ్యాత్మిక మూలమునందు తిరిగి నెలకొల్ప వలయును. అట్లు చేసిన యెడల వారి బాధ్యతలు, కర్తవ్యములు, ఆ కర్తవ్యములను సాధించెడి సిద్ధాంతములు తమంత తామే మూలముతో సామరస్యమును పొందును. ఇంతవరకు భ్రూణస్థితి, శైశవము, యౌవనము, నడివయస్సు అను నాలుగు స్థితులలో సేవలచేయుచున్న సామాజికులిప్పుడు వృద్ధాప్యస్థితిని గూడ కలుపుకొనవలెను. అశరీరస్థితియందు

పొందగల స్థితులను పొందుటకు అనుకూలమగు సేవకూడ వృద్ధ శరీరములు గల మానవ వ్యక్తులకు సామాజికులు చేయవలెను. అందు వలన జనసంఖ్యను తగ్గించవలెననినచో నవ్యమానవులు, వ్యామోహిత మానవులు, బాధ్యతాయుత మానవులు, ఈ మూడు రకములకు అతీతులైన నాల్గవరకము మానవులకు నడుమ సామరస్యము సమంజస సామ్యము మరల నెలకొల్పబడినచో, తత్ఫలితముగ, అర్హతపొంది నవ్యమానవు లగు మానవేతరులయొక్కయు, నవ్యస్థితినుండి బాధ్యతా యుతస్థితిని పొందెడి మానవుల యొక్కయు, బాధ్యతాయుత స్థితినుండి పునరవతరణాతీత స్థితిని పొందెడి మహావ్యక్తుల యొక్కయు అభ్యు దయము సమంజస సామ్యముగ నుండును.

సామాజిక వాదులైన స్థితులలో సేవచేయుడురు. మానవ సమాజమును గూర్చి ప్రస్తుతముగల భావములను సరిచేస్తుట, ఆ భావ ములను కల్లోలముతో కూడియుండిన మూలమునుండి తీసివేసి, ఆధ్యా త్మిక మూలమునందు మరల స్థాపించుట, మానవ కర్తవ్యమును సాధించుటకై ఆధ్యాత్మిక మూలముతో సామరస్యము గల సిద్ధాంతము లను వినియోగించుట మానవులకు, ముఖ్యముగ వృద్ధశరీరములు గల వారికి తమజన్మ, కర్తవ్యము, ఆ కర్తవ్యమును సాధించుటను గూర్చిన విద్యను గఱపుట, వారి శరీరములకు కావలసిన రక్షణ పోషణాదులను సమకూర్చి, వారి శరీరములు గతించులోపల వారి వ్యామోహము బాధ్యతగను, వారి యసంతృప్తిని తృప్తిగను మారునట్లు చేయవలెను. శరీరములను విడుచులోపున బాధ్యత, సంతృప్తులు సాధింపబడకపోయి నచో శరీరములను విడిచిపెట్టెడు సమయములందున్న ఆకాంక్ష, అసంతృప్తులయందే నిమగ్నులై అశరీరస్థితియందుకూడ నట్లేయుందురు. బాధ్యతను సాధించవలెననెడి యాకాంక్ష యున్నచో అశరీరకాల మంత మయ్యెడిలోపులో, బాధ్యత సంతృప్తులను సాధించి పునరవ

తరణావశ్యకత కతీతులగుదురు. అట్టి బాధ్యతా సంతృప్తులను సాధించలేనివారు తీవ్రతరమయిన ఆకాంక్షతో పునరవతరణ చేయక తప్పదు. అట్టి వారు భ్రూణస్థితినుండియుకూడ సామాజికవాదుల సేవా సదుపాయములనుపొంది ఆ శరీరము లంతమగు లోపుననో, లేక తదనంతరపు టశరీరస్థితియందో ఆశయ సంసిద్ధిని పొందుదురు. అందు వలన సామాజికవాదులు శరీర నిర్మాణావరోధనకు బదులుగ మృత్యు నిరోధము నవలంబించవలెను.

అందువలన,

సమాజము, తననుగూర్చియు, తన కర్తవ్యము, ఆ కర్తవ్యమును సాధించెడి సిద్ధాంతములను గూర్చియు, వానిలో వానికి గల సంబంధమును గూర్చియు, తన యభిప్రాయములను మార్చుకొనుగాక !

మానవులు తమ ప్రస్తుత శరీరములు గతించిన యనంతరమందు అశరీర స్థితియొక్క సంపూర్ణోపయోగమును పొందెదరు గాక !

విశ్వాత్మభావము విజృంభించి, మానవ సమాజము ద్వారా వికసించు గాక !



# పదునైదవ అధ్యాయము

## రాజకీయ నాయకులకు హితవు

వైవాహిక సంస్థయందలి ప్రజలకు సాధారణావసరములను సమకూర్చి, సరఫరా చేయు బాధ్యతను అన్యోన్య సహకార సంస్థ నిర్వహింపలేక, అధికారమునందు ప్రీతిని గలిగి యుండుటచే ఆ సంస్థ సంపూర్ణమగు అధికారములను కలిగి యుండునటుల మరల స్థాపింపబడినది. సంస్థయందలి లోటులను సరిదిద్ది అభ్యుదయమును కలుగజేయుటకు ఆధ్యాత్మిక మహావ్యక్తుల యాదేశానుసారముగ అట్లు చేయబడెను. ఇట్లు సమస్తాధికారములతో మరల స్థాపింపబడిన యీ అన్యోన్య సహకార సంస్థయే రాజకీయ మనబడెను. వ్యక్తులకు రక్షణ పోషణాదులను సమకూర్చుటయే రాజకీయముయొక్క బాధ్యత. ప్రజలు తమ శక్తి శ్రద్ధలనన్నిటిని రక్షణ పోషణాదులకొరకే వ్యర్థపుచ్చకుండ సృజనశక్తిని సంచయ మొనర్చి, శరీరములను శక్తివంత మొనర్చి, సృజనశక్తిని సూక్ష్మశక్తిగా మార్చి, సూక్ష్మేంద్రియములు సక్రమముగా వ్యవహరించి అభ్యుదయ మార్గమున పురోగమింప జేయుటకు రాజకీయము సహాయపడును.

చాల కాలమువరకు రాజకీయ సంస్థ సక్రమముగనే వ్యవహరించెను. జనసంఖ్య క్రమక్రమముగ హెచ్చుగుటవలన, పరిపాలనా సౌకర్యముల నిమిత్తము వేరువేరు ప్రాంతములకు వేరువేరు పరిపాలనా సంస్థలను నెలకొల్పవలసిన యగత్యమును నాయకులు గ్రహించిరి.

వేరువేరు పరిపాలనా సంస్థలు నెలకొల్పబడినప్పటికిని రాజకీయము సక్రమముగ వ్యవహరింప లేకపోయెను. అప్పుడు రాజకీయ నాయకులు అప్పటికి గుర్తింపబడిన ఆధ్యాత్మిక మహావ్యక్తుల సాహచర్యములో నుండి వైవాహికసంస్థ యుద్దేశ్యమున కతీతులయిన వారితో సంప్రదించి మరియొక సంస్థను నిర్మించిరి. మానవ శరీర నిర్మాణ విధానము నందు ప్రీతిలేనివారు, వివాహిత స్థితి కతీతులుగనే యుండి, నవ్య మానవులకు, వ్యామోహిత మానవులకు, బాధ్యతాయుత మానవులకు సాయుజ్య సామరస్యములు కలుగజేయుటయే ఆ సంస్థ యుద్దేశ్యము. అదియే "మతము".

వైవాహిక సంస్థద్వారా సమాజమునందలి ప్రజలందరకును రక్షణ పోషణాదులను సమకూర్చెడి బాధ్యత రాజకీయము తనపైననే యుంచుకొన్నది. రాజకీయ పరిపాలనా సంస్థలు నెలకొల్పబడిన వేరు వేరు ప్రాంతములలో ఆ సంస్థలు సక్రమముగ వ్యవహరించు నిమిత్తము మతాధిపతుల ఆధిపత్యము క్రింద మతసంస్థలుకూడ నెలకొల్పబడినవి. కాని, మతము రాజకీయము అట్లు సక్రమముగ సామరస్యముతో కొలదికాలము మాత్రమే వ్యవహరించినవి. ఈ లోపున వేరువేరుగ నున్న పరిపాలనా సంస్థలు తమ స్వాతంత్ర్యమును ప్రకటింప ప్రారంభించినవి. అందువలన వానికిని, మూలసంస్థకును గల సమైక్యత విచ్ఛిన్నమయిపోయి, అన్నిసంస్థలుకూడ తమకు మూలమయిన ఆధ్యాత్మికత్వమునకు దూరము కాజొచ్చినవి. అప్పటినుండి మతము, రాజకీయము రెండునుగూడ విభజనలు, విభేదములు, మితములు, అవధులపై నాధారపడి వ్యవహరింప దొడగినవి. ఇట్టి వ్యవహారము చాలకాలము సాగెను. ఈ రెండు సంస్థలుకూడ తమ బాధ్యతలను నిర్వహించుటయందు, తమ ఆశయములను సాధించుటయందు విఫలములయ్యెను.

తమ బాధ్యతలు, ఆశయములు ఆధ్యాత్మికము లైనప్పటికినీ, తమ వ్యవహారము మాత్రము అనాధ్యాత్మికము, విభేద భూయిష్టము, అవధిగతము నైనపుడు విఫలముగాక మరేమగును ? ఆ కాలమునందే బహుళములైన రాజకీయ సంస్థలు, సంప్రదాయములు (political culture), మతసంస్థలు, సంప్రదాయములు (Religious culture) ను యేర్పడినవి. మతము రాజకీయములయొక్క వ్యాప్తివలన వివిధ ప్రాంతములలోని మానవావాసములలోనను, విభ్రాంతి కల్లోలములు విస్తృతమయ్యెను. ఈ రెండు సంస్థలును సర్వ స్వతంత్రములుగ వ్యవహరించుచున్నట్లు కనిపించినను, నిజమున నవి ఒక దానిపై నొకటి ఆధారపడి యున్నవి. అవి సాధారణముగ సమైక్యతతో నున్నప్పటికినీ, వానియందు అనైక్యతకూడ గలదు. అనైక్యత ఎంత యున్నప్పటికిని, వాని ఆశయములు సిద్ధాంతములు సామూహ్యమైనవే. రాజకీయము తన పరిపాలన క్రిందగల ప్రదేశమును విస్తృత మొనరించుకొనగోరును. మతము తన యనుయాయుల సంఖ్యను హెచ్చుచేసికొనగోరును. రాజకీయము కోరెడి ప్రదేశవ్యాప్తిలో ఆ ప్రదేశమునందలి ప్రజలున్నారు. మతము కోరెడి జనసంఖ్యాధికతలో, ఆ జనులు నివసించెడి ప్రదేశమున్నది. ఈ విధముగ నీ రెండు సంస్థలును తమలోని ఆధ్యాత్మికత్వమునకు వ్యతిరేకముగ వ్యవహరింప నారంభించినవి. ప్రదేశమును (universe) విభజించినవి. ఆ ప్రదేశమునందలి మానవులను విభజించినవి. మానవ సమైక్యతను విచ్ఛిన్న మొనర్చినవి. ఇది యంతయును విశ్వమును, విశ్వమందలి సమస్తమును రాజకీయముగ విభజించుటవలన జరిగెను. ఈ రీతిగ చాలకాలము వ్యవహరించి, రాజకీయము తన బాధ్యతలను నిర్వహించుటలోనను, తన ఆశయములను సాధించుటలోనను విఫలమయ్యెను. ఇంతవరకును ఈ సంస్థల కార్యకలాపములు ఉమ్మడిగను, విడిగనుకూడ ఆధ్యాత్మిక వ్యతిరేకములై యుండెను.

ఇప్పుడు తమలోగల ఆధ్యాత్మపరులకే వ్యతిరేకము లయ్యెను. బాధ్యతా నిర్వహణమునకు, కర్తవ్యసాధనకు రాజకీయము చేసెడి ప్రయత్నములకు మతము ఒక గుదిబండ యయ్యెను. మతము చేసెడి ప్రయత్నములకు రాజకీయము ప్రతిబంధక మయ్యెను. రెండిటికిని అధిక జనసంఖ్య కావలెను. ప్రదేశము జనసంఖ్య విడదీయరాని వగుటచేత రెండింటికిని అధికముగ ప్రదేశముకూడ కావలసివచ్చెను. ఇట్టి స్థితి యందు రెండును సమైక్యతయొక్క యావశ్యకతను గుర్తించి సమాఖ్య యయి, అవినాభావముగ, గుర్తించుటకు వీలులేనట్లుగా కలిసిపోయెను. ఇట్లు సమాఖ్య యేర్పడిన తరువాత, తన సహజస్థితిని మూలమును గూర్చి అప్పుడప్పుడు కలిగెడు స్ఫురణలనుకూడ రాజకీయము గోల్పోయెను. ఈ సమాఖ్యకు పూర్వమే మతమున కిట్టి విస్మృతి కలిగెను. సమాఖ్య యేర్పడినప్పటికినీ, రెండిటికిని మూలము, ఆశయము లొక్కటే యయినప్పటికినీ, ఆశయములను సాధించుటకు వినియోగింప వలసిన సిద్ధాంతముల విషయములో మతరాజకీయముల రెంటిటి నడుమ సంఘర్షణ నిరంతరము సాగుచుండెను. ఈ సంఘర్షణలయొక్క ఫలితముగ మతము రాజకీయముపై నాయకత్వము వహింపవలసి వచ్చెను. తనయొక్క మూలము, ఆశయములను గూర్చిన స్ఫురణ లను, తన యందలి విశ్వాసమును రాజకీయము గోల్పోవుటవలన సమాజమునందు, ప్రపంచమునందు విపరీతమగు మార్పు సంభవించి నది. ఈ మార్పువలన తన ప్రవర్తనవలన కలిగెడు అనివార్య పరిణామములను రాజకీయము గ్రహింపలేకపోయెను. ఈ అన్యోన్య బానిస లయిన మతరాజకీయములకును తమలోగల ఆధ్యాత్మికత్వమునకును సంఘర్షణ చాలకాలము తీవ్రముగ సాగినది. తత్ఫలితముగ అవి ప్రజ లకు అత్యవసరము లయిన రక్షణ పోషణాదులను సమకూర్చలేక పోయెను.

ఈ మతరాజకీయముల సమాఖ్య రక్షణ పోషణాదులను సఫ కూర్చుటయందు పదేపదే విఫలమగుటవలన మానవులలో దైన్యము కలిగినవి. అందువలన మరల ఆధ్యాత్మికత్వము విజృంభించుటకు, ఆ మత రాజకీయ సమాఖ్యలోని ప్రజల వలననే విజృంభించుటకును తగిన పరి స్థితు లేర్పడినవి. ఈ సమాఖ్యల యధీనములో నున్న వివిధ ప్రాంతము లలోనను మతరాజకీయములు రెండిటిని విశ్వీకృతము చేయుటకు సమైక్యమైనట్టియు భయరహితమైనట్టియు ప్రయత్నము రూపొందెను. ఈ ఆధ్యాత్మికత్వ విజృంభణ మనుక్షణము అధికమయి సమాఖ్య నాయకులలో విభ్రాంతి, కల్లోలము బయలుదేరి చిత్త చాంచల్య రూపము వహించెను. ప్రస్తుత స్థితియందీ చాంచల్యము మత రాజ కీయ నాయకులలో పెంపొందుచున్నది. ఈ నాయకులు జనసంఖ్య పెరుగుట. ఆ జనసంఖ్యకు కావలసిన రక్షణ పోషణాదులను సమకూర్చి సంచిత మొనర్చుటయందే వివిధ ప్రాంతీయ మానవులయొక్క శక్తి శ్రద్ధ ఉత్సాహములు నిమగ్నమగునట్టి పరిస్థితులను కలుగజేసిరి. తత్ఫలి తముగ రక్షణ పోషణాదుల విషయమైన బాధ్యత రాజకీయమునకు విడువక తామే వహించెడి స్వభావము ప్రజలలో పెంపొందినది. జన సంఖ్య అధికమైన కొలది యీ మరలవాటుకూడ తీవ్రతరమయ్యెను.

రాజకీయ మెప్పుడు తన బాధ్యతలను నిర్వహింపగోరెనను, మతము గూడ తానే ఆ బాధ్యతలను నిర్వహింపగోరుచు వచ్చెను. ఈ రెండును సమాఖ్యలోనుండి అన్యోన్యము బానిసలై యుండుట వలన మతమునకు రాజకీయము లొంగిపోవలసి వచ్చెను. రాజకీయము విస్మరించుటచేతను, తానాధారపడియున్న అనాధ్యాత్మికత్వము బాహ్యా భివృద్ధి దాయకము మాత్రమే యగుటవలనను రాజకీయము లొంగి పోవుట సంభవించెను. అందువలన రాజకీయములో పరాధీనభావము పెంపొంది ప్రతి ప్రముఖ విషయమునందును మతముపై నాధారపడు

చుండెను. ఇట్టి స్థితి పరిపాటయిపోయి, తనలో పెరుగుచున్న అనాధ్యాత్మికత్వమును గుర్తించెడి స్థితికూడ రాజకీయములో లేకుండ పోయెను. చివరకు ఈ సమాఖ్యయందలి అన్యోన్య హానిసత్వము ఆ సమాఖ్య మనుగడకుకూడ అవసర మయ్యెను. తాము పోగొట్టుకొనిన మూలమును గూర్చిన స్మృతులను తిరిగి తెచ్చుకొనుట అసంభవమయ్యెను. ఈ అవిశ్వాత్మక సమాఖ్యచే నడిపింపబడి అభిశాపోన్ముఖములైన సూచనలతో కన్పట్టుచున్న ప్రస్తుత మానవులు అనతి కాలములో అభిశాపము నెదుర్కొన వలసి వచ్చును. ఇది ప్రస్తుత మానవుల పరిస్థితి.

ఈ సమాఖ్య యుత్పన్నమయిన తరువాతనే. దాని ఫలితముగనే ప్రతి ప్రాంతమునందును ఉపమతములు, శాఖలు బయలుదేరినవి. ఈ సమాఖ్య సాగుచుండినంత కాలము క్రొత్త మతములు, క్రొత్త శాఖలు పెరుగుచునే యుండును. ఈ యుప మతముల స్థాపనయందుత్సుకత వివిధ ప్రాంతములందును సాగుచునే యున్నది. ఈ యుపమతముల యొక్కయు, శాఖల యొక్కయు స్థాపన సాగినంతకాలము మానవుల పురోవృద్ధి బాహ్యాముఖముగనే యుండును. ఈ మత రాజకీయ సమాఖ్య విచ్ఛిన్నమై, ఆ సంస్థలు స్వతంత్రముగ వ్యవహరించినచో రెండును నశించును. ఆధ్యాత్మికముతోడి సంఘర్షణ యందు నిలువ లేక మతము రాజకీయము నాశ్రయించుట వలన మతవాదు లందరును రాజకీయమునకు బానిసలైరి. రాజకీయము మతముకంటె ముందుగనే పుట్టినదైనప్పటికిని, చాల కాలము సమాఖ్యపై నాధారపడి యుండుట వలన, తా నాధ్యాత్మిక మూలముపై నాధారపడిన దైనప్పటికినీ తన స్వాతంత్ర్యముపై తన మూలముపై విశ్వాసము గోల్పోయినది. తన మూలముపై విశ్వాసము గోల్పోవుటవలన, చాలకాలము తన యునికికి, రక్షణకు సమాఖ్యపై నాధారపడి యుండుటవలన, ఈ

ప్రాచీన సంస్థయైన రాజకీయము మతమునకు వినా నిలద్రొక్కుకొనలేదు. ఈ సమాఖ్యవలన, మతావరోధముల వలనను, ఆధ్యాత్మికత్వమునుండి కావలసిన ప్రేమ, జ్ఞాన, సామర్థ్యములను పొంది మానవులలో నాధ్యాత్మిక జీవనము పెంపొందింప జేయుటకు రాజకీయ మశక్త మగుచున్నది. ఇక్కడ రాజకీయము మతమునకు బానిసయైనది. మత, రాజకీయముల సమాఖ్య ఫలితముగ నేర్పడిన దుష్ఫలితమే యీ యన్యోన్య బానిసత్వము.

ఈ రెంటిటిలోను, రాజకీయము జన్మతః స్వాతంత్ర్యము కలది. మతస్థాపనయైన తరువాత కూడ అది చాలకాలము వరకు స్వతంత్రముగనే యున్నది. మతమునకు, ఆధ్యాత్మికత్వమునకు సంఘర్షణ జరుగుచున్న కాలములోకూడ అది స్వతంత్రముగనే యున్నది. మతము విఫలత్వము నొందిన తరువాత, మతములో సమాఖ్య యేర్పడిన తరువాతనే, రాజకీయము తన స్వతంత్రమును పోగొట్టుకొని మతమునకు బానిసయైనది. దానితోబాటు, విశ్వ కర్తవ్య సాధనకొరకు తనకు మూలమైన ఆధ్యాత్మికత్వమునుండి తా నదివరకే పొందియున్న ప్రేమ, జ్ఞాన సామర్థ్య లేశములనుగూడ కోల్పోయినది. మతములు జన్మతః బానిసలు. అప్పటినుండి నేటివరకు బానిసలే. ఆధ్యాత్మికత్వముతో సంఘర్షణ జరుగుచున్న కాలమునందును అవి బానిసలే. మానవులలోని అస్పష్టము లయినట్టివియు, అల్పము లగునట్టివియునగు ఉన్ముఖతలకు అవి బానిసలు. సంఘర్షణలో వైఫల్యము నొంది, సమాఖ్యలో జేరిన పిమ్మట, బానిసత్వములో పుట్టి, బానిసత్వములో పెరిగిన మతములు రాజకీయమునకుకూడ బానిసలైనవి.

రాజకీయము, మతము రెండును బానిసలే యయినప్పటికీని, రాజకీయము స్వతంత్రముతో పుట్టి స్వతంత్రముతో పెరిగిన బానిస.

మత మట్లుగాక బానిసత్వములో పుట్టి బానిసత్వములో పెరిగినది. వేరు వేరు ప్రాంతములందు, వేరువేరు కాలములలో, ఆధ్యాత్మిక మహా వ్యక్తుల తరువాత వారిపేరిట పుట్టి, వారు జనసమూహముల కిచ్చిన సందేశములను విస్మరించి విజృంభీగునవి యీ మతములు. మతములు నీటిలో మునిగిపోనున్న పిచ్చివాని వంటివి. వానికి సహాయము చేయుటకు ఎవరు తమచేయి నందిచ్చినప్పటికిని వానితో పాటు మునిగిపోదురు. అదేరీతిగ ప్రతి ప్రాంతమందును, ప్రసిద్ధులయిన ఆధ్యాత్మిక వ్యక్తులు మతోద్ధరణము చేయబోయి మతములతో బాటు మునిగిపోయిరి. ఈ విధానము ప్రతి ప్రాంతమందును నేడుకూడ సాగుచున్నది. ఇదేరీతిగ మతమునకు సహాయకారియైన రాజకీయముకూడ మునిగిపోవలసినదే. కాని దానికి మూలము ఆధ్యాత్మికత్వమగుటవలన నింకను మునిగిపోలేదు. ఇప్ప డదికూడ మునిగెడు విధానమునందున్నది. ఈ సూచనలు చాలకాలము క్రిందటనే కనపడినవి. అప్పటినుండియు, మొన్నటి మతాధిపతులు నిన్నటి రాజకీయ నాయకులుగను, నిన్నటి రాజకీయ నేతలు నేటి మతాధిపతులుగను మారుచున్నారు.

ఈ మునిగెడు సూచనలు కనిపించినది మొదలు వేరువేరు మతములలో, వేరువేరు ప్రాంతములందు, మతసిద్ధాంతముల ద్వారా ఆధ్యాత్మికత్వమును సాధించుటకు, మత మూలమును విశ్వీకృత మొనరించుటకు కొందరు మహావ్యక్తులచే ప్రయత్నములు చేయబడినవి. ఆధ్యాత్మికత్వమునందు, మతమునందు కూడ రాజకీయము గలదు. రాజకీయముతో కలుగజేసికొనకుండ ఆ సంస్కరణ ప్రయత్నములు ఆధ్యాత్మికత్వము నంటలేదు. మత సంస్కరణల నిమిత్తము వారు రాజకీయముతో కలుగజేసికొనిన వెంటనే వారి చేతనే ఉపమతము లేర్పరుపబడినవి. ఆ మతసంస్కరణకై వా రుపయోగించిన విధానములే ఆ యుపమతములకు ప్రధాన ధర్మసూత్రములైనవి. ఈ రీతిగ

మతోద్ధరణ ప్రయత్నము లన్నియు ఉపమత స్థాపనలో పరిణమించి, మతములకు వికలాంగకారకము లయినవి. అందువలన ఏ ప్రాంతము లందునుగూడ మతములను సంస్కరించుటయందు దికమీాదట కూడ ఆశలు లేవు.

అనాధ్యాత్మికత్వమిట్లు బాధ్యతా రహితముగ విజృంభించు చుండగా, ఆధ్యాత్మికత్వము చూచుచు నూరుకొని యుండలేదు. మతములు స్థాపింపబడుటకు పూర్వమెట్టి ప్రయోజనము రాజకీయము వలన ఆశింపబడినదో యిప్పుడు కూడ ఆధ్యాత్మికత్వము అట్టి ప్రయోజనమునే రాజకీయమునుండి కోరుచున్నది. ఎట్టి బాధ్యతలను నిర్వహించుటకు, ఎట్టి ప్రయోజనములను సాధించుటకు రాజకీయ సంస్థలు నెలకొల్పబడినవో అట్టి బాధ్యతలింకను నిర్వహింప బడియుండలేదు. అట్టి ప్రయోజనము లింకను సాధింపబడియుండలేదు. అట్టి బాధ్యతలను నిర్వహించుటకును, ప్రయోజనములను సాధించుటకును మతములతో గల సంబంధమును శాశ్వతముగ తెగగొట్టుకొని ఆధ్యాత్మిక సంస్కృతులను తిరిగి పొందమని రాజకీయ నాయకులు ఆధ్యాత్మిక మహావ్యక్తులచే కోరబడుచున్నారు. వారు తమ ఆదిస్థితి నుండి తమను పరిశీలించుకొనినచో తమయొక్క సహజస్థితి, సమాజము, ప్రపంచము, వారి బాధ్యతలకు, కర్తవ్యములకు గల సంబంధము, వానిని సాధించెడి సిద్ధాంతములను గ్రహింప గల్గుదురు. వారిలో చాలమంది శక్తి పరిణామమును పొంది సక్రమముగ వ్యవహరించెడి సూక్ష్మేంద్రియములను కలిగి యుండిరి. మానవ వ్యవహారములను గూర్చియు, ప్రపంచమును గూర్చియు, ఆధ్యాత్మిక దృక్పథముతో భావించి, ఆలోచించి, మాటలాడు చుండుటను బట్టి వారికిగల ఆధ్యాత్మిక మూలమైన రాజకీయ భావములు గోచరించును. కాని మత సంసర్గము వలన అట్టి భావముతో సమరసమైన వైఖరిని అవలంబింపలేకున్నారు. వారి భావము

లకు, విశ్వాసములకు సామరస్య మేర్పడినగాని ప్రపంచము నెడల ప్రజల యెడల వారి వైఖరి, ప్రవర్తన సక్రమము కానేరవు. వారనేక పర్యాయములు సక్రమముగ ప్రవర్తించుటకు ప్రయత్నించి నప్పటికిని, తమ మిత్రము, యజమాని, బానిసయైన మతముచే వారి ప్రయత్నము లన్నియు నణగద్రొక్కబడినవి. వారుకూడ అనేక పర్యాయములు ఆధ్యాత్మిక మహావ్యక్తుల సక్రమ ప్రవర్తనను అణగద్రొక్కిరి. ఇవి తమంత తామే చేయలేదు. మతముయొక్క కుట్రతోడను, సహాయము వలనను చేయగలిగిరి. మత రాజకీయములు రెండును సమాఖ్య యయిన తరువాత వారి ఆగ్రహోత్సాహముల కాధ్యాత్మికత్వము గురియయ్యెను. ఇప్పుడు పరిస్థితులు చాల కల్లోలకరమై, ఒకవైపు అవిపర్యాయ విశ్వాసము, అవిపర్యాయ వైఖరి లాగుచుండ, రెండవవైపు సమాఖ్యకు సహజమైన విపర్యాయ వైఖరి మూలమున కలిగిన అవధులు, మితములు లాగుచుండ రాజకీయ నాయకులకు కన్నులు తిరుగుచున్నవి. కనుక నిట్టి మతరాజకీయ సమాఖ్య విచ్ఛిన్నమగుట సత్వరమావశ్యకము.

రాజకీయమునకు ఆధ్యాత్మికత్వము మూలమగుట వలన, ప్రేమ జ్ఞాన సామర్థ్యములు దానియందు అంతర్గతములై యుండుట వలనను సమాఖ్యలో చేరకపూర్వము స్వతంత్రముగ వ్యవహరించినట్లే, మతములతో నిమిత్తము లేకుండ రాజకీయము వ్యవహరింపగలదు. కాని సమాఖ్య విచ్ఛిన్నమగుట యందలి కష్టము వలనను, ప్రపంచము నందు మతములయొక్క యునికి వలనను, రాజకీయము స్వతంత్రముగ వ్యవహరింపలేకున్నది. రాజకీయములో విశ్వాత్మభావము సహజముగ నున్నది. విశ్వమందలి త్రివిధజీవుల అభ్యుదయము కొరకును, మానవుల కర్తవ్య సంసిద్ధి కొరకును, రాజకీయము విశ్వీకృతమగుట యవసరమని స్పష్టమగుచున్నది. అంతేగాక మానవుల కర్తవ్య సంసిద్ధి మానవేతర

జీవులయొక్కయు, సస్యజీవుల యొక్కయు అభ్యుదయముతో సంబంధము కలిగియున్నది. అందువలన నీ మత రాజకీయ సమాఖ్యను భగ్నపరచి రాజకీయమునకు స్వతంత్రముగ వ్యవహరించుట కవకాశము నిచ్చి మతమును మునిగిపోనిచ్చుట బాధ్యతాయుత మానవులందరకును విధియై యున్నది.

ఎన్ని కృతకములైన సెలయేరు లైనప్పటికిని, స్వచ్ఛందము, నిరంతరమున్నైన మహానదిని తుడిచి పారవేయలేవు. కాని ఆ స్వచ్ఛంద, నిర్మల ప్రవాహోదకమును పంకిలము, అపరిశుద్ధము గావించి, పరిశుద్ధ పవిత్రోదకముల ఫలితము ఆ నదిని ఆశ్రయించిన మానవుల కందకుండ చేయగలవు. ఈ నిర్మలమగు నీరే మానవులలోని శక్తి, ఉత్సాహములు. సమర్థములైన యీ మానవశక్తి, ఉత్సాహములు, విశ్వ కర్తవ్యమును సాధించుట కొరకు పనిచేయ గలిగియుండి నప్పటికిని, యీ మతము పంకిలముతో కూడియుండుటవలన విభిన్నత్వము, విద్వేషములతో కూడిన ఆశయములకై పాటుపడుచున్నది. ఇదే రీతిగ మతము లన్నియు కలిసినను రాజకీయమును విధ్వంసము చేయలేవు. కాని ఆ స్వచ్ఛంద నదీ ప్రవాహమును కలకపరచి, దాని నాశ్రయించిన మానవులకు అభ్యుదయ సాధకము కాకుండ మాత్రము చేయ గలిగినవి. కనుక అట్టి సెలయేళ్ళను అక్కడక్కడ లోతుగ త్రవ్వి అందలి మలినమును ఆ నది (రాజకీయము) లో కలియనీయకుండ అక్కడక్కడనే ఆపుచేసినచో, వడపోతయై ఆ పంకిల మచ్చటచ్చటనే ఆగిపోయి, నిర్మలమైన నీరు క్రిందికి దిగి, ఊటగా మరల బయలుదేరి యూటనీరు నదిలో కలియును. కొంతకాల మగుసరికి అస్వచ్ఛమైన సెలయేళ్లు ఆ యూటితోడనే కప్పబడిపోవును. మతము లన్నియు నిశ్శేషవిచ్ఛిన్నములై పోయినచో, విశ్వైక్యభావ మూలమునుండి రాజకీయము వ్యవహరించినచో ఆ స్వచ్ఛంద నిర్మల పవిత్రోదకముల ప్రవా

హము నిరంతరముగ కొనసాగుచునే యుండి మానవశక్తి, ఉత్సాహములు విశ్వకర్తవ్య సంసిద్ధిదాయకము లగును.

రాజకీయ నాయకులారా! క్షణకాలము మిమ్ము మీరు చూచుకొనుడు. మీరు ఆధ్యాత్మికత్వమునకు మతముకంటె దగ్గరివారు. మీరు మతముతో కంటె ఆధ్యాత్మికత్వముతో సన్నిహితత్వ మెక్కువగ నున్నది. మీరు మతము కంటె ప్రాచీనులు. మీరు మతముకంటె అల్పులనియు, మతముయొక్క నౌకరులనియు మతము మీచే నమ్మించినది. నిజమునకు మతమే మీ నౌకరు. మీరు వశవర్తి. ఈ తప్పు నమ్మకము మూలముననే మీరు మతముయొక్క ఆధిక్యత నంగీకరించిరి. ఈ యంగీకారము మూలముననే మీరు మతమునకు లొంగిపోయి దానితో సమాఖ్యలో చేరిరి. మీ బాధ్యతలను సక్రమముగ నిర్వహించుటకును, మీ కర్తవ్యమును సాధించుటకును, ఈ సమాఖ్య మీరు సహాయపడునని మీరు ఆశించిరి. కాని మీ యాశలు ఫలింపలేదు. మీ యాశలు ఫలించెడి సూచనలుకూడ ఏ యుగమునందును, ఎన్నడును కానరాలేదు. అప్పుడు మీ యాశకొక ఆధారముండెడిది. అది చాల సున్నితమైనది. కాని అది మంచి నేలలో వేరు నాటుకొనలేదు. అది ఆధ్యాత్మికత్వముపై నాధారపడినదికాదు. ముందుగా వైవాహిక సంస్థయందలి ప్రజలలోను, వారికిని రాజకీయమునకును నడుమగల అసామరస్యమును పోగొట్టి, ఆ తరువాత బాధ్యత, ఆశయములను సాధించి, శక్తి పరిణామ మార్గమున సమాజమును రాజకీయమును అభ్యుదయ మార్గమున నడిపింపవలెనని ఆధ్యాత్మిక మహావ్యక్తు లుద్దేశించిరి. కాని మతము మొదటిమెట్టునే అంతిమ దశగా భావించెను. రాజకీయము దాని ననుసరించెను. ఈ మహోద్దేశ్యములను సాధించెడి సిద్ధాంతముల ప్రకటిత రూపములే మత గ్రంథములు. మీరు మతముతో సమాఖ్య మైనప్పటినుండి, మీ

యొక్కయు, మతము యొక్కయు కార్యకలాపములు, మతగ్రంథము లచే ప్రబోధింపఁబడిన సామరస్యమనెడి ఆశయమును సాధించుటకొరకే యయియున్నది. ఈ ప్రయత్నమునందు మీరు రెండును విజయమును సాధించలేదు. అట్టి విజయమును సాధింపగలరను సూచనయు గన్పట్టుటలేదు. మత గ్రంథములచే ప్రబోధింపఁబడిన మొదటి మెట్టును సాధించి, సమాజమునకు రాజకీయమునకు నడుమగల అసామరస్యమును పోగొట్టుటకు మీ దీర్ఘ ప్రయత్నమువలననే మీ కర్తవ్య భ్రష్టత కలిగి, ఆ సామరస్య సాధనయే గ్రంథ ప్రబోధితమగు పరమాశయ మనుకొనుచున్నారు. ఈ విశ్వాసమునకు మీరు అలవడిపోయిరి: అందుకు ఫలితముగ మతగ్రంథములయందు ప్రబోధింపఁబడిన భావములకు, ఆశయములకు మూలమైన ఆధ్యాత్మిక మహావ్యక్తులను మీరు విస్మరించిరి. ఈ రీతిగ. నింతవరకు జరిగిన దానినిబట్టి, రాజకీయము మతము స్థాపింపఁబడినది మొదలు, నేటివరకు అవి సాధించిన ఫలితములనుబట్టి చూచిన ఇకమీదటనైనను అవి మేలుచేయ కలవనెడి యాశ వృథా. మీ యాశ ఆధ్యాత్మిక మహావ్యక్తులచే వివరింపఁబడిన స్మృతులలోని బాధ్యత, కర్తవ్యము, సిద్ధాంతములను అనుసరించి యుండకపోయినప్పటికిని, ఆ మహావ్యక్తుల పేరటనే సాగుచున్నది. అందువలన నిట్టి అభిశాపప్రు పరిస్థితులకు బాధ్యత సంపూర్ణముగ మీపైననే లేదు. ఈ పరిస్థితులకు ప్రజానీకముకూడ కొంతవరకు కారణమయి యుండుటవలన వారుకూడ అందుకు బాధ్యత వహింపవలసినదే.

ఎట్టి పరిస్థితులలోను, ఏకాలము నందును, ఏ ప్రదేశము నందును, ఎన్నడును బాధ్యతాయుతముగ వ్యవహరింపని వ్యక్తిని, సంస్థను, తదనంతరము తత్ఫలితముగ కలిగిన దైన్యమునకు బాధ్యులనుట తగదు. అట్టి వ్యక్తులు, సంస్థలు గణనీయులుకారు. వారిని విస్మరింపవలెను. అదియేరీతిగ, పుట్టినది మొదలు నేటివరకు, ఎన్నడును

బాధ్యతాయుతముగ వ్యవహరించి యుండనందున మత సంస్థనుగూడ విస్మరించవలెను. బాధ్యతాయుతముగ వ్యవహరించవలసిన అవసరము లెన్నియో ఏర్పడినప్పటికిని, అది బాధ్యతారహితముగనే వ్యవహరించినది. మతముయొక్క బాధ్యతారహిత ప్రవర్తనకు, మతమునకు మీపైగల ఆధిక్యత, మీ లోకువతనమును గూర్చి మీకుగల మూఢవిశ్వాసము తోడై అసంఖ్యాకములగు మానవ సముదాయముల వినాశమునకు కారణమైనవి. ఇందుకు నిదర్శనములు లిఖితమైనట్టియు, కానట్టియు మానవానుభవ చరిత్రములో నున్నవి. అందువలన నీ మత రాజకీయ సమాఖ్యను మీరు విచ్ఛిన్నము చేయనిచో, మీ సమాఖ్యవలనగాని మతము వలనగాని, ఏదైన మేలు సమకూర్చ వచ్చుననెడి వ్యర్థపుటాశ మీలో పోనంతవరకును, మీరు మతమును విసర్జించనంతవరకు మీకుగల సరియగు స్ఫురణలతోడను, భావముల తోడను సమరసముగ మిమ్ములనది వ్యవహరింపనీయదు. ఆధ్యాత్మికములైన మీ భావములు, ఆలోచనలు, స్ఫురణలకు ననువుగ మిమ్ములను మాటలాడనీయదు. మీరట్టి ప్రయత్నములను చేసిన యెడల నెందరికో చేసినట్టులే మీకుకూడ దేహాంతస్థితిని కలుగజేయును. అందువలన మతము వలన నేదైనను మేలు జరుగుననెడి యాశ మీలోనున్న యెడల దానిని వెంటనే దూరము చేయుడు. మతమును సంపూర్ణముగ విసర్జించుడు. మీలో కొలదిగనైనను కల ఆధ్యాత్మికమయిన మీ విశ్వాసముతో సామరస్యము కలిగి వ్యవహరింపుడు. లేని యెడల ఇకమీదట నిట్టి అభిశాప్యపు పరిస్థితులు కొనసాగుచుండుటకు మీరు మాత్రమే బాధ్యులగుదురు. భావికాలపు విశ్వశాప్యమునకు శిక్షలకు మీరు పాత్రులగుదురు.

ఎందుచేతననగా అనుభవములు రెండు రకములు. ఒకటి హేతువాదనకు లోనైనది. రెండవది దానికి అతీతమైనది. మొదటి దానిలో

మరల రెండు రకములున్నవి. ఒకటి శరీరేంద్రియములు అనగా స్థూల సృజనేంద్రియముల ద్వారా కలుగు అనుభవము. రెండవది వ్యక్తి యింద్రియము లయిన సూక్ష్మాది ఉత్తమేంద్రియముల ద్వారా కలుగునది. స్థూల సృజనేంద్రియముల ద్వారా కలుగు అనుభవములు ఆ యింద్రియములయందే ముద్రితములై యుండును. శరీరములకు చెందినట్టి యీ స్థూల సృజనేంద్రియములను, వ్యక్తులకు చెందిన సూక్ష్మాది యుత్తమేంద్రియములను కలిపెడి సంబంధమే సామాన్య వివేకము (common sense). వస్తు విషయాములను గూర్చియు, మానవులయిన మనమేమి చేయవలెను, ఏమి చేయకూడదు, ఏది చేయదగును, ఏది చేయరాదను వానిని గూర్చియు, వీరు నా తల్లి దండ్రులు, వీరు నా సోదరీ సోదరులు. ఇది చేయవచ్చును, ఇది చేయరాదు, ఇది చేయగలను అది చేయలేను అను విషయములను గూర్చి ప్రబోధించు మానవ విజ్ఞానమే సామాన్య వివేకము. ఈ సామాన్య వివేకము శరీరములకు సంబంధించిన స్థూలాదింద్రియముల నుండి వ్యక్తులకు సంబంధించిన సూక్ష్మాదింద్రియములకు విషయముల నందజేయ లేదు. కాని వ్యక్తుల యింద్రియములనుండి శరీరేంద్రియములకు విషయముల నందజేయును. శరీరములకు సంబంధించిన స్థూల సృజనేంద్రియములు, వానిపై ముద్రితములై యున్న అసంఖ్యాకములైన యనుభవములతో పాటు శరీరములు గతించినపుడు పోవును. ఆ యింద్రియముల యందు ముద్రితములైన యనుభవముల యొక్క ఫలితములను మాత్రము అనగా వానివలన కలిగిన తృప్తి, అసంతృప్తులు, బాధ్యతా వ్యామోహములను సామాన్య వివేకము గ్రహించి వ్యక్తితో వెంట తీసికొని పోవును.

సూక్ష్మేంద్రియముల యొక్క యనుభవములు, సూక్ష్మాది ఉత్తమేంద్రియముల యొక్క యనుభవములు కూడ ఆ యా యింద్రి

యములయందు ముద్రితములగును. ఈ ముద్రితానుభవము లన్నియు కలిసి వ్యక్తుల యహములు (individual ego) అగును. ఈ ముద్రితానుభూతులే తమ్ము గూర్చియు, తమ శరీరములను గూర్చియు విశ్వమును గూర్చియు, సర్వాంతర్యామిని గూర్చియు, వానికిగల పరస్పర సంబంధము, బాధ్యత, కర్తవ్యము, ఆ కర్తవ్య నిర్వాహణ క్రమమును గూర్చిన విషయములకు, విశ్వాసములకు అవగాహనలకు ఆధారము, కారణమునగును. ఈ భావములు సరియయిన వగునా కాదా ? యను విషయము ఆ యా వ్యక్తులలోగల శక్తి పరిణామముపై నాధారపడి యుండును. సక్రమమయిన అవగాహనను పొందుటకు కనీసము కావలసిన పరిస్థితులు సూక్ష్మశక్తి సంచయ మొనర్చుట వలన, సూక్ష్మేంద్రియములు సక్రమముగ వ్యవహరించుట వలనను కలుగును. తమ భావనల కనుకూలముగనో వ్యతిరేకముగనో వస్తు విషయాదులు రూపొందుటను ఒకటికరెండె నెక్కువ పర్యాయములు గమనించి నప్పుడే వ్యక్తులకు తమ భావనలయందు దృఢవిశ్వాసము కలుగును. తమ భావనలయందు తమకు విశ్వాసము కలుగుటకు పట్టెడి కాలము ఆ వ్యక్తులు పెరుగుచుండిన పరిసరములు, వాతావరణము, పరిస్థితులు పైననేగాక, అట్టి పరిశోధనలకు వారికిగల వసతులపై కూడ నాధారపడి యుండును. స్థూల, సూక్ష్మ, ఆధ్యాత్మిక స్థితులు మూడింటి యందునుగల వస్తు విషయాదులతో మానవులు వ్యవహరించెడి విధానములు, వారి యలవాట్లును నీరీతిగ నేర్పడెను.

సరిపడునంత సూక్ష్మశక్తి లేకపోవుటవలనను, శరీరములకు సంబంధించిన స్థూలసృజనేంద్రియముల యందు బయలుదేరిన యసంతృప్తి మూలమున వారి భావనలలో విభ్రాంతి యేర్పడి అనుభవ పూర్వకములు కానట్టి మరియొక రకపు నమ్మకములు కొన్ని వారిలో నేర్పడును. వీనినే మానవులు సాధారణముగ విశ్వాసములుగ (faith)

భ్రమింతురు. విశ్వాసమనెడి పదము, శక్యతా ప్రాముఖ్యతలలో ప్రేమ యను పదమునకు తరువాత మిక్కిలి ప్రధానమయినది. వస్తువిష యాదులందు అనుభవ శూన్యులై చంచల స్వభావము కలిగిన మాన వులయొక్క అనుభవ పూర్వకములుగాని భావబలమునకు "విశ్వాసము" అను పదము వర్తింపనేరదు. ఈ పదమును గూర్చిన అల్పభావన తప్పు ప్రయోగము వలన మానవులకు వర్ణనాతీతములయిన కష్టములు అడ్డం కులు కలుగుచున్నవి. మానవుల అభ్యుదయ కార్యక్రమములో నిరంత రముగు నిదియొక బండఱాయి యగుచున్నది. విశ్వాసమనెడి పదము సర్వసంగ్రహము. ఈ పదముయొక్క ప్రాబల్యము క్రిందకురాని వస్తు విషయాదులీ విశ్వమందెట్టి స్థితియందు నులేవు. వస్తు విషయాదుల యెడ మానవులయొక్క వైఖరి, ప్రవర్తన వ్యవహారములను గూర్చి సక్రమమైన అనుభవపూర్వకమైన భావనలోని దృఢతరమయిన నమ్మ కమును ఆధ్యాత్మిక మహావ్యక్తులు విశ్వాసమనిరి. సక్రమమయిన భావనలయందు, అనుభవమువలన కలిగిన దృఢమయిన నమ్మకమునే విశ్వాసమందురు.. ఆ విశ్వాసముయొక్క దృఢత్వమునకు కొలతలేదు. విశ్వాసమనునది గణనాతీతము.

విశ్వాసమే యనెడు భ్రమను కల్పించెడి అనుభవపూర్వకములు గాని నమ్మకములు సాధారణముగ మానవులను పెడత్రోవను పట్టించి వ్యక్తిక్షేమము, శరీర సౌఖ్యము, వర్గశ్రేయస్సు మొదలగు వానియందు నిమగ్నులుగ జేయును. వ్యక్తులయొక్క, వర్గములయొక్క సౌఖ్య క్షేమములను సముపార్జించుటకు కావలసిన కార్యకలాపములయందు, ఒకప్పుడు మానుష కృత్యములయందుగూడ మానవులకు ప్రీతి సంతో షమును కలుగజేసి, వారటువంటి వ్యవహారముయందే బద్ధులగునట్లు చేయును. మానవులట్లే బద్ధులయి వ్యవహరించుచున్నారు. అట్లు నడచుకొనినచో వారి శరీరములు గతించిన తరువాత ఆ వ్యక్తులకును,

ఆ వర్గములకును మోక్షము కలుగునని వారి యభిప్రాయము. మోక్షమనగా ఒకానొక నిత్య నిరంతర అనిర్వచనీయ సౌఖ్య క్షేమ సమన్విత స్థితియని వారి భావము. ఇదియే మతము.

ఈ యనుభవ పూర్వకముగాని నమ్మకమును సాధించుటకు చేయబడెడి కార్యకలాపములకు, ఆ నమ్మకముయొక్క మూలమునకు ఆశయమునకు సామరస్యము కలదు. ఈ నమ్మకమునకు మూలము విభజన, విభేదము, పరిమితి, అవధులకు లోనైయున్నది. "నేను నా వర్గము మనవలెను. నేను, నా వర్గము సౌఖ్యముగను, క్షేమముగను నుండవలెను. ఉండి తీరవలెను. నేను, నా వర్గము సౌఖ్యముగను, క్షేమముగను నుందుము. నీవును నీ వర్గము మననక్కరలేదు. నీవును, నీ వర్గమును సౌఖ్యముగను, క్షేమముగను నుండనక్కరలేదు. ఉండకూడదు. ఉండదు" అనెడి యాలోచనలకు లోనగుచురు. వారి ఆశయముకూడ విభజితము, విభేద పూరితము, అవధిగతము. మితములకు లోనైనది. వారి యావేదన యెంతవరకును, వారును వారి వర్గము వారును సశరీరులై యున్నపుడు సౌఖ్యక్షేమముల కొరకును, శరీరములు గతించిన తరువాత మోక్ష ప్రాప్తికొరకు మాత్రమే. ఈ యాశయమును సాధించుటకొరకు వా రనుసరించెడి విధానము లమానుషములయినను ఆశ్చర్యములేదు. వారి విధానములు మరియొక రీతిగ నుండలేవు. ఇదియే మతము. ఓ రాజకీయ నాయకులారా! స్వార్థపరత్వము చాల నీచమైనదనియు, స్వార్థ పరత్వమున కతీతులు కావలెననియు మీరు నొక్కి వక్కాణించెదరు. వస్తు విషయాంశులయెడ వైఖరీ వ్యవహారములయందు స్వార్థపరత్వమున కతీతులు కావలెనని మీరు సోదర మానవులను ప్రబోధింతురు. కాని మీరే స్వార్థపరత్వమునకు లొంగిపోయి, మీతో పాటు సోదర మానవులనుకూడ లొంగదీసి, మూర్తీభవించిన స్వార్థపరత్వమయిన ఈ మత నమ్మకములతో చేతులు కలిపి మానవ సమా

జనమునకు ఒడుదుడుకులు కలుగజేయుచున్నారు. మీరేమి చేయవలెనో, ఏమి సాధించవలెనో, ఏమి చేయుచున్నారో, అందువలన కలుగు ఫలితము లేమిటో యింతవరకు మీరు సక్రమముగ నాలోచించలేదు. ఇప్పుడు మీరు సాధింపవలసిన లక్ష్యము మతమునకు పూర్వపు స్థితియందు తమ అనుభవ పూర్వక ప్రబోధములద్వారా ఆధ్యాత్మిక మహావ్యక్తులు మీ వలన నాశించినదియే. అదియే నేటి వరకు మీ వలన నాశింపబడుచున్నది.

కాని మీ రనుసరించుచున్న సిద్ధాంతములు, వ్యవహరించుచున్నరీతి, మీరు నిలువబడియున్న ఆధారమునందు వేరు నాటుకొనుట కనువయినవి కావు. అవి విభజనలు, విభేదములు, పరిమితులు, అవధులకు మూలమైన మతములోననే పాతుకొనగలవు. "నేను-నా వర్గము" వంటి నమ్మకములయందును చపలత్వముతో గూడిన స్వార్థపరత్వములోననే నాటుకొనగలవు. "మనము – మన మందరము" అను ఆధ్యాత్మిక మూలమునందును, అనుభవ పూర్వకమైన అవిపర్యయ సిద్ధాంతములలో, మూర్తీభవించిన నిస్స్వార్థత్వములో అవి వేరు నాటుకొనలేవు.

సమైక్యత, శాంతి, సంపద, సహకారములతో అభ్యుదయమును సాధించుటకు మానవులను పురోగమింప జేయుట మీ బాధ్యతయై యున్నది. అదియే మీ కర్తవ్యము. కాని మీ బాధ్యతలను నిర్వహించుటయందు, కర్తవ్యములను సాధించుటయందు మీ రనుసరించుచున్న విధానములకును, సిద్ధాంతములకును సామరస్యము లేకున్నది. వేరువేరు వ్యక్తుల కొరకును, వర్గముల కొరకును సౌఖ్యక్షేమములను నిరంతరము కొనసాగించు కొనవలె ననెడి యాశను సఫలము గావించుటకు మీ యామోదమును బడసిన సిద్ధాంతములు

మతాధిపతులచేత ప్రబోధింపబడి వేర్వేరు మతములయందు ఆచరణలో నున్న సిద్ధాంతములే.

ఈ సిద్ధాంతములు విభజన, విద్వేషము, అవధులు, మితములపై నాధారపడి యుండుటవలన, మతములతోడను, మతములచే ప్రబోధింపబడిన సిద్ధాంతములతోడను, సామరస్యము కలిగియున్నది. ఈ సిద్ధాంతములు మీ మూలమునకు చాల దూరమైనవి. మీ మూలముతో సమరస విహీనములైనవి. మీ మూలము ఆధ్యాత్మిక మగుటవలన మీ సిద్ధాంతములుగూడ విశ్వవ్యాప్తము, విశ్వామోదితము, సర్వ సమ్మిళితమునయి యుండినచో మీ కర్తవ్య బాధ్యతలు ఆధ్యాత్మిక తత్వానుసారము నిర్వహింప బడగలవు. మత సిద్ధాంతముల ద్వారా మీరు సక్రమముగ వ్యవహరించలేరు. మీ ఆధ్యాత్మికమగు బాధ్యతలను మీరు నిర్వహించలేరు. మీ కర్తవ్యములను సాధించలేరు. వ్యక్తుల, వర్గముల ఆశయములతోడను, స్వార్థపరత్వముతో కూడిన మతసిద్ధాంతము వలన, విశ్వాభ్యుదయము, సర్వమానవ సర్వతో ముఖాభివృద్ధి సాధించుట అసంభవము. మతసిద్ధాంతముల ద్వారా వ్యక్తుల యొక్కయో, వర్గముల యొక్కయో బాహ్యాభివృద్ధి మాత్రమే సాధ్యమగును. కొందరు వ్యక్తుల యొక్కగాని, వర్గముల యొక్కగాని బాహ్యాభివృద్ధి మరికొందరు వ్యక్తులయొక్కయో, వర్గములయొక్కయో అభివృద్ధిని అరికట్టుటయో, ఆటంకపరచుటయో లేక నాశనమొనర్చుటయో చేసినకాని సాధ్యపడదు. విభజన విభేదము, అవధులకు, మితములకులోనైన ఈ బాహ్యాభివృద్ధి యెల్లప్పుడును ఆ యావ్యక్తులు వర్గములనుకూడ నశింపజేయును. మానవులయందు వ్యక్తిగతమయి నట్టియు, వర్గములకు జెందినట్టియు ఆశయములున్నంత వరకు ఇట్లు నాశనము జరుగుచునే యుండును.

ఇతర వర్గములయొక్క అభివృద్ధి నరికట్టి, అడ్డువడి, నశింపజేసి ఏ వర్గములైనను బాహ్యాభివృద్ధిని సాధించినచో, ఆ దెబ్బతినిన వర్గములు ద్విగుణీకృతమయిన కక్షతో తమను దెబ్బతీసిన వర్గముల నాశనమునకై కృషిచేయును. ఏ వర్గమయినను బాహ్యాభివృద్ధి పొందెడి కాలము, వినాశము పొందుచున్న యితర వర్గములకు యాతనామయమగు దీర్ఘకాలమయి యుండును. మతము పుట్టిన కొలది కాలమైన తరువాత ప్రారంభమయి, ఏదియో వర్గమునకు యాతన కలుగుచు, మొత్తము మీద నెక్కడో ఒకచోట యాతనామయ జీవితము నిరంతరము సాగుచునేయుండును. ఇదియే మతము. ఇదియే దాని యునికి వలన కలిగెడి ఫలితము.

నిరంతరము పెరుగుచు, అమితజవముతో ముందునకు ఒక పెద్ద జంతువు సాగుచున్నదనుకొనుడు. దుర్బలమై, అనారోగ్యమై, కుబ్జయుకుంటియు నగు నొక కదలలేని చిన్న జంతువు దాని నంటిపెట్టుకొని యున్నది. రెండింటి గమ్యస్థానములు వేరు. ఆ స్త్రీను శాశ్వతముగా విడిచిపెట్టినగాని ఆ పెద్దజంతువు తన గమ్యస్థానమును చేరలేదు.

ఈ కుబ్జ, పెద్దజంతువు మోకాలి వరకునైన పెరగలేదు. అది యికముందు కూడ పెరగలేదు. పెరగదు. అతి దీర్ఘకాలము కలిసి యుండుట వలన, ఆ సాహచర్య ఫలితముగ ఈ కుబ్జ ఆ పెద్ద జీవి పాదముల నంటుకొని నాటుకొనిపోయినది. తనకు కావలసిన పోషణ పదార్థములను పెద్దజీవినుండి పీల్చుకొనుచు, తాను ఆ పెద్ద జీవిలో నొక భాగమయి పోయినది. అందులకు ఫలితముగ ఒక విధమైన విపరీత పరిస్థితి యేర్పడినది. ఆ పెద్ద జంతువు తనకు సహజమైన స్థితిలో నుండలేకున్నది. తన ప్రస్తుత స్థితి తనకు నచ్చుటలేదు. కాని తన విధానమును మార్చుకొన లేకున్నది. ప్రస్తుత స్థితిని కొనసాగించను లేకున్నది.

తనలోనిశక్తి అవిరామముగ వ్యర్థమగుచున్న స్థితిని గ్రహించి నది. తనతో అవినాభావస్థితియందుండి గుర్తించుటకు వీలులేకుండ నున్న యీ జలగల భారము వలన కృంగుచున్నది. ఈ జలగలే మత ములు. ఆ పెద్ద జంతువే రాజకీయము. ఈ విపరీత స్థితికి ఫలితముగ, అదివరకే సుస్థిరముగ స్థాపింపబడిన రాజకీయ విభాగములకుతోడ్తో అప్రకటిత మయినట్టియు, లిఖితముకానట్టియు, మతవిభాగములను కూడ నంగీకరించినది. ఇప్పుడీ మతము, తన బరువును మోపి రాజకీయ మును కృంగదీసి, అసంభవ మయినప్పటికిని, యీ ప్రపంచమును ఆధ్యాత్మికముగ కూడ విభజింప యత్నించుచున్నది.

మతమనెడి యీ జలగ రాజకీయము యొక్క రక్తసారమును పీల్చివేయుచున్నది. అది రాజకీయములో నొక భాగమేమో యను నట్లు సుస్థిర రూపమును దాల్చి ఆక్రమించుకొని యున్నది. ఈ జలగ రాజకీయ శరీరముయొక్క ఒక అవయవముగనే కనపడుచున్నది. ఓ ప్రపంచ రాజకీయ వేత్తలారా! మీ బాధ్యతకు లోనై, మీ సంర క్షణలోనున్న ప్రాంతముల నొకసారి పర్యావలోకన గావింపుడు. ఆ యా ప్రాంతపు ప్రజల నొక్కసారి చూడుడు. వారికి మీరు సమ కూర్చిన రక్షణ పోషణాదులను చూడుడు. మీరు మీ ప్రాంతము లందలి సమస్త వ్యక్తులకు కావలసిన సాధారణ రక్షణ పోషణాదులను సమకూర్చినట్లు చెప్పగలరా? చెప్పలేరు!

ప్రతి ప్రాంతమునందును, మనుష్యుల కొరకు గాక, జంతువుల కొరకై మీచే సమకూర్చబడిన యాహారమును తిని జీవించుచుండిన మానవులు కూడ నున్నారు. చెట్లయొక్క ఆకులతోడను, బెరడుల తోడను తమ మానములను కాపాడుకొనుచున్న జనులున్నారు. కొండ లోయలలోనను, గుహలలోను చెట్ల తొఱ్ఱలలోనను దూరి ఎండ

వానలనుండి తమ్ము తాము సంరక్షించుకొనుచున్న ప్రజలున్నారు. నేడుకూడ ఇట్టి ప్రజలు ప్రతి దేశమునందును గలరు. అట్టివారు లేని దేశమే లేదు. జాతి విభజన భావములవలన నిట్టి స్థితి కలిగినదని మీరను కొనవచ్చును. కాని నిజమునకిది మతవైఖరులయొక్క ప్రాబల్యము వలన కలిగిన స్థితియే!

ఏ విషయము నయినను నిష్పక్షపాతముగ పరిష్కరించుట యందు అభిప్రాయ భేదములు కలిగినచో, అట్టి వివాదములు మీరు పరిష్కరింపవలసి వచ్చినచో, ఓ రాజకీయ వేత్తలారా! మీరు మీరై ఆలోచింపుడు. మిమ్ము మీరు సూటిగ పరిశీలించుకొనుడు. అట్టి వివాదములో నిరుకుకొనిన వారి మతమునుగూర్చి తెలిసికొనుట యందు మీరుత్సాహము కలిగియున్నారు. వివాద గ్రస్థులలో నొకరు మీ మతమునకు సంబంధించిన వారయియున్నచో, మీరు సర్వ స్వాతంత్రులయినప్పటికిని మీ విచారణ అవధిగత మయిపోవును. విచారణయు, తీర్పుకూడ పక్షపాతముగనే యుండును. రాజకీయమునకు వైకల్యము కల్పించునది మత పక్షపాతమనెడు స్వార్థపరత్వమేకాని జాతి స్వభావము కాదు.

మతముల నిర్మాణమునకు పూర్వము, రాజకీయము నిష్పక్ష పాతముగ, స్వార్థ రహితముగ, అందరు ప్రజలకును అవసరములను బట్టి రక్షణ పోషణాదులను సమకూర్చెడిది. స్వార్థపరత్వము బయలు దేరి, వ్యక్తులు రక్షణ పోషణాదులను అధికముగ కూడ బెట్టుట యనెడు ప్రలోభమునకు గురియగుచున్నప్పుడు, అట్టి స్థితి నరికట్టుటకు, రాజకీయము యొక్క యవసర మేర్పడి. రాజకీయ నిర్మాణమయినది. ప్రజలకు కావలసిన రక్షణ పోషణాదులను సమకూర్చెడి భారము సమాజము రాజకీయముపై నుంచినది.

రాజకీయము తన బాధ్యతను నిర్వహించుట యందపజయము పొందినపుడు, ఆధ్యాత్మిక మహావ్యక్తుల నాయకత్వములో, సమాజము రాజకీయము ఆలోచించి యీ బాధ్యతా నిర్వహణమునందు సహాయకారిగ నుండుటకు మతమును నెలకొల్పిరి. కాని మతము బాధ్యతా నిర్వహణమునందు రాజకీయమునకు సహాయకారి యగుటకు బదులు, మానవులను తమలోగల స్వార్థపరత్వమున కతీతులుగ చేయుటకు మారు, తానే వర్గ స్వార్థపరత్వమును బయలుదేరజేసి, దానికి గురియై, వర్గ స్వార్థపరత్వమునే మూలముగ చేసికొని వ్యవహరింపదొడగెను. అందువలన ప్రస్తుతపు విపరీత పరిస్థితినుండి బయటపడి, రాజకీయము తన బాధ్యతను సక్రమముగ నిర్వహించుటకు, తన కర్తవ్యమును సాధించుటకును తాను తన స్వాతంత్ర్యమును ప్రకటించుకొనుటయే మార్గము. తాను సర్వ స్వతంత్రమై. ఆధ్యాత్మిక మూలమునుండి ప్రజాపక్షమున, ప్రజాసహకారముతో తన మూలమునకు, కర్తవ్యమునకు సమరసమయిన సిద్ధాంతముల ననుసరించి వ్యవహరించవలెను.

మీ శరీరమునందే అవయవమయినను జబ్బుపడి, తనకు సహజముగాగల గ్రహణశక్తిని కోల్పోయి సక్రమముగ పనిచేయలేకుండినపుడు, ఇతర అవయవములకు కూడ ఆ వ్యాధి వ్యాపించి శరీరమే నశించు స్థితి యేర్పడుచున్నట్లు గ్రహించినపుడు, ఆ వ్యాధిని నివారించుటకు చేసిన ప్రయత్నము లన్నియు సంపూర్ణముగ వ్యర్థమైనపుడు, ఇక మిగిలిన మార్గము ఒక్కటియే! ఆ దుష్టాంగమును ఖండించి, ఖండించుటవలన నేర్పడిన పుండును మాన్పుట కొరకు ప్రయత్నించుటయే! శస్త్ర విధానము యాతనామయమే! బాధాపూరితమే! కాని దుష్టాంగమును దూరము చేయుటవలన కలిగిన సంతోషము ముందు శస్త్ర విధానము వలన కలిగిన యాతన అత్యల్పము.

మీకు కలిగెడి యీ సంతోషము జడమైనది కాదు. రాజకీయపు శరీరమునుండి మతమనెడి మస్తాంగమును స్వార్థ పరత్వమున కతీతము గావించినచో కలిగెడి సంతోషము విశ్వమందంతటను వ్యాపించి మానవానీకమున కంతకును సంతోషమును కలుగజేయును. మానవులయందు బలుసులుదేరిన మత అసహనత్వము, ఒక మతము నుండి మరియొక మతమునకు వ్యాపించి విభనన, విభేదము, అవధులు, పరిమితులు వలన ప్రస్తుతము పరివ్యాప్తమై యున్నప్పటికినీ యిక ముందు తన ప్రభావమును కోల్పోవును. మత అసహనత్వము మానవులయందు వర్థిల్లనేరదు. అది నశించి ఆధ్యాత్మిక సహనము వృద్ధి పొందుటకు తావిచ్చును. ఆధ్యాత్మిక సహనము పెంపొందుట కనువగు పరిస్థితులేర్పడును. మీరు మీ యాధ్యాత్మిక మూలమును తిరిగి చేరుకొనవచ్చును. మీ మూలము, ఆశయము ఆధ్యాత్మికమగుట వలన, మీ మూలము ఆశయము ఒక్కటే యగుటవలన అట్టి జ్ఞానముతో మీరు సక్రమముగ వృద్ధి పొందగలరు.

మీ మూలము ఆశయముల యొక్క యేకత్వమును గూర్చిన జ్ఞానము వలన మీకుగల విశ్వ బాధ్యత, మీరు అనుసరింపవలసిన విశ్వవ్యాపక సిద్ధాంతములును మీకు స్ఫురణకు వచ్చును. మూలము, ఆశయములతో సామరస్యము కలిగిన సిద్ధాంతము ననుసరించుట వలన మీ బాధ్యతను మీరు సక్రమముగ నిర్వహించ గల్గుదురు.

సమాజమునందు మత అసహనత్వము పోవుటవలన, ఆధ్యాత్మిక సహనముతో నిండి యుండుటవలన, మీరు మీ మతముపై అధీనతపోయి, ఆధ్యాత్మికాధీను లగుటవలన, మీరు ప్రజలనుండి ఉత్సాహవంతము శక్తివంతమునగు సహకారము లభించును. మీకును ప్రజలకును మధ్య నేర్పడిన యీ ఆధ్యాత్మికమగు అన్యోన్య సహకారము

వలన, మానవులు తమ మూలముతో నేకత్వానుభూతిని పొందు టయేగాక, మానవాభ్యుదయమును, తన్మూలమున సమస్త మానవేతరాభ్యుదయమును బాధ్యత, సమైక్యత శాంతి సంపదల ద్వారా సాధింతురు.

ఎప్పుడు, ఎవరికి, ఎంత అవసరమో అప్పుడు వారికి అంతంత రక్షణ పోషణాదులను మీకు నిష్పాక్షికముగ అందజేయ గల్గుదురు. అందువలన మానవులు తమ శక్త్యుత్సాహములను శ్రద్ధను, అభ్యుదయ పథమునందు వినియోగింప గల్గుదురు. వైవాహిక సంస్థయందలి నవ్య మానవులు, వ్యామోహిత మానవులు అనుభవజ్ఞులై బాధ్యతాయుతు లగుదురు. బాధ్యతాయుతులైనవారు వైవాహిక జీవితమునందలి యున్ముఖత కతీతులై సమాజమునందు వ్యవహరింతురు. మిగిలినవారు శక్తి పరిణామము వలన, ఉన్నతమునుండి, ఉన్నత తరము, ఉన్నత తమము ఆధ్యాత్మికము అగు ఆశయములను సాధించి, అనివార్యముగ మరల అవతరించ వలసిన యావశ్యకతకు (compulsory re-embodiment) అతీతు లగుదురు. ఈ రీతిగ మానవులు, కాలక్రమమున అర్హత పొందిన మానవేతరులకు స్థానము కలుగజేయుదురు. అల్పేంద్రియ మానవేతరజీవులు, ఉత్తమేంద్రియ జీవులగును. అచరములు అల్పేంద్రియములగును. ఈ రీతిగ వివిధ తరగతుల జీవులయందు సారూప్య సంబంధము లేర్పడును.

భూమిపై అవతరణకు ప్రస్తుతము కల అవకాశములు నవ్య మానవుల ( Fresh humamity ) కనుకూలము లగును. మానవులు తమ ప్రస్తుత శరీరము లంతమయిన తరువాత శక్తిపరిణామమును పొంది, వారి అశరీరపు కాలము అంతమయ్యెడి లోపున, మరల మరల మానవ శరీరములతో అవతరింపవలసిన యవసరమునకు(Re-embodi-

ment) అతీతులగుదురు. భూమిపై ఇదివరకే మానవత్వానుభూతి కలిగి మరల భూమిపై యవతరించిన మానవుల యన్యాయాక్రమణ పోయి, పూర్వానుభవములేని నవ్యమానవుల న్యాయమైన ఆక్రమణ ప్రారంభమగును. భూమి అప్పటి వరకును మానవేతరులుగనున్న నవ్య మానవుల యావాసమగును. వ్యామోహము బాధ్యతకు, స్వార్థపరత్వము నిస్వార్థతకు తావిచ్చును.

వివిధ ప్రాంతము లందు ప్రస్తుతము గల అభిశాప్య పరిస్థితులంత మొందును. ప్రపంచము నందుగల అభిశాప్యపు దుశ్చిహ్నములన్నియు నంతర్ధానమగును. అసహనము, విభజనలు, విభేదములు, పరిమితులు, అవధులు ఇక నుండవు. సహనము, సమైక్యత, శాంతిసంపదలు అభ్యుదయ దర్శకమై వ్యాప్తినొందును. రాజకీయము యొక్క, మానవుల యొక్క బాధ్యతలు సక్రమముగ నిర్వహింపబడుట సాధ్యమగును. విశ్వచైతన్యము విశ్రాంతిపూర్వకముగ వ్యవహరించును. ప్రళయ కాలమందు యాతనారహితమై సమస్త ప్రపంచము ప్రశాంతముతో ప్రళయజలములందు లీనమగుట కవకాశములు కలుగును.

అట్లు కాకుండ రాజకీయ శరీరమునుండి మతమను ముఖ్యాంగ మును వేరుచేయుచున్నచో, ఆ యంగమునందుగల వ్యామోహముచే, శస్త్రవిధానము వలన కలుగు యాతనకు భయపడి వెనుదీసినచో, విభజనలు, విభేదములు, అవధులు, పరిమితులు అధికమగును. అసహనత్వము గాఢమగును. అనైక్యత, కల్లోలము, దారిద్రము, బాహ్యాభివృద్ధి యధికమగును. వివిధ ప్రాంతములందు ప్రస్తుతముగల అభిశాప్య పరిస్థితు లితరచోట్లకు కూడ వ్యాపించును. ప్రపంచ మంతయును అభిశాపోన్ముఖముగ నడచుచున్నట్టి దుశ్చిహ్నములు రాజకీయమునందు సుస్పష్టమగును. ఇందుకు ఫలితముగ, ప్రళయకాలమున, సమస్త చరా

చరములతో కూడిన ఈ ప్రపంచము దుర్భర యాతనా పూరితమై ప్రళయ మహోదధిలో మునిగిపోవును.

ప్రస్తుత మేర్పడియున్న అభిశాప్య పరిస్థితుల వలన ఆ దుష్టాంగ మును ఖండించి తీసివేయుట తప్పనిసరిగ జరుగవలసిన యవసర మేర్ప డుట వలన, రాజకీయ మా పనిని సత్వరము గావించుట యవసరము. రాజకీయము వెంటనే శ్రద్ధ వహించి, వెనుకంజ వేయకుండ శీఘ్రము విచ్ఛేదనా కార్యక్రమము నిర్వహింపకున్నచో, కొంచెము ఆలశ్య మయినను, సమాజమే ఆ కార్యభారమును వహించును. బాధ్యతా రహితముగ వ్యవహరించుచున్న రాజకీయమునుండి ఆ బాధ్యతలను తీసివైచి తానే ఆ కార్యక్రమమునకు పూనుకొనును. అప్పుడు మరి యొక రాజకీయ రూపమేర్పడును. కాని యిట్టి పనిని సాధించుటలో నే మతమును పెరకివైచుటకు తాను పాటుపడుచున్నదో ఆ మతము యొక్క సహకారమును ఏ కొలదిగనైనను, తనకు తెలిసియో, తెలి యకయో సమాజము స్వీకరింపవలసి వచ్చును.

సమాజముచే దుష్టాంగ విచ్ఛేదనయు, వినూత్న రాజకీయ పునఃప్రతిష్ఠాపనా విధానము అత్యంత యాతనా పూరితములు. సకాల ములో రాజకీయమే దుష్టాంగ విచ్ఛేదన గావించినచో నింత యాతన యుండదు. రాజకీయముచే సాధింపబడినను, సమాజముచే సాధింపబడి నను, రాజకీయ సామాజిక కల్లోలము మాత్రము తప్పదు. మత విచ్ఛే దన సమాజముచే సాధింపబడినచో కల్లోలము దీర్ఘ కాల ముండును. రాజకీయముచే సాధింపబడినచో అంత దీర్ఘ కాల మవసరము లేదు.

ఆ కల్లోల కాలమునందు, ఖండించి వేరుచేయబడిన ఆ దుష్టాం గము మరల రూపొంది నూతనముగ ప్రతిష్ఠింపబడిన రాజకీయ శరీర ములో మరల పెంపొందుట కవకాశము కలుగును. ఈ దుష్టాంగము

మరల మొలకెత్తుటను రాజకీయము గమనించినప్పటికిని, కల్లోలము అణగిపోవు వరకును ఏమియును చేయజాలదు. కల్లోలము అణగిపోయి, ఆధ్యాత్మిక మూలమునుండి రాజకీయము సక్రమముగ నిర్వహించుటకు అవసరమగు న్యాయసూత్రములు నిర్మాణమగు సరికి ఈ మొలకెత్తిన మతాంగము కూడ రాజకీయ శరీరమునందంటిపెట్టుకొని దాని యంతంతటను వ్యాపించును. మరల రాజకీయమును బానిసగ జేసి తనపై నాధారపడి యుండునట్లు చేయును. మరల విభజనలు, విద్వేషము, పరిమితి, అవధులు, అనైక్యత. కల్లోలము, దారిద్ర్యము. బాహ్యాభివృద్ధి, వ్యక్తి స్వార్థత, వర్గస్వార్థతల మూలమున నిప్పటివలెనే ప్రపంచము నందలి వివిధ ప్రాంతములందును అభిశాప్య పరిస్థితులను కలుగజేసి, యితర ప్రాంతములకు వ్యాప్తిచేసి, విశ్వమంతయును ప్రస్తుతమువలెనే అభిశాప్య లక్షణములతో నుండునట్లు చేయును.

ఈ దుష్టాంగ విచ్ఛేదనము రాజకీయముచే గావింపబడినచో కల్లోలపు కాలము చాల తక్కువగ నుండును. ఆ విధానమునందు గల యాతన గూడ నితర విధానములవలన సాధింపబడినప్పటికంటె తక్కువగ నుండును. ప్రస్తుత రాజకీయసంస్థ, సుదీర్ఘానుభవము కలిగి శక్తివంతమయిన దగుటవలన, మతముయొక్క ప్రాబల్యము వలన కొంత వరకును శక్తిహీనమై కుంటువడినప్పటికిని, మరల బయలుదేరెడి యీ మత దుష్టాంగమును అణచిపెట్టుటకును, సమాజముయొక్క సహకారముతో కల్లోల కాలమున రాజకీయము సక్రమముగ నిర్వహించుటకు కావలసిన న్యాయసూత్రములను నిర్మించుటకును కావలసిన శక్తిని కలిగియే యున్నది. ఈ విధముగ, వర్గస్వార్థము పెంపొంది రాజకీయ వ్యవహారణమునకు అడ్డుపడి రాజకీయమును కళంకితము చేయుట నరికట్టవచ్చును. అందువలన రాజకీయమునకు మరల బానిసత్వమును, అభిశాప్య పరిస్థితుల పునరాగమనమును ఆపుచేయవచ్చును. వర్గ

స్వార్థత మరల వేరు నాటుకొని వర్ధిల్లుటకు అసాధ్యమగు స్థితికలుగును. ఈ విధముగ వర్గస్వార్థము మరల బయలుదేరకుండ శాశ్వతముగ నివారింప వచ్చును.

వ్యక్తిస్వార్థత, వర్గస్వార్థతలకు దోహదమునిచ్చు గ్రంథముల లోని మాటలన్నియు మతమే. విభజిత మానవులు, విభజిత విశ్వమును సూచించెడి ప్రతి పదమును మతమే. వేర్వేరు మానవాశయములను వేర్వేరు సిద్ధాంతములను సూచించెడు పదములు మతమే! మతము స్వార్థపరత్వమునకు తల్లి! బాహ్యాభివృద్ధికి దోహదకర్త! విశ్వాభిశాప్య పథమున సంచాలనకారి. అందువలన గ్రంథములనుండి అట్టి పదములను తీసివేయుట అత్యంతావశ్యకము.

అందువలన,

రాజకీయము మతమునుండి స్వాతంత్ర్యమును పొందుగాక!

సమాజము, రాజకీయము అన్యోన్యము సహకరించుగాక!

సమాజము, రాజకీయము మతమును విస్మరించుగాక!

ఆధ్యాత్మికత్వము సమాజములోనను, రాజకీయములోనను విజృంభించుగాక!



# పదునారవ అధ్యాయము

# సామాన్య మానవులకు ప్రబోధము

"సామాన్య మానవు" లనెడి పదము ఈ సందేశమునందు, నవ్య మానవులకు (Fresh humanity) ను, మానవస్వభావము, వైఖరి ప్రవర్తనలను పొందని పునరవతారిత మానవులకును (re embodied humanity) వర్తించును. ఉన్నతేంద్రియములను పొందని మానవేతర జీవుల యున్ముఖత సౌఖ్యక్షేమములను పొందుటయందే యుండును. కాని సౌఖ్యముగను, క్షేమముగను. నుండుటెట్లో వానికి తెలియదు. మానవేతరజీవులు సౌఖ్యముగను క్షేమముగను నుండుటెట్లో తెలిపెడి యున్నతేంద్రియములను పొందిన తరువాత, వాని శరీరములు గతించు వరకు, వానివి అనువగు శరీరములు కానందున అవి తమ యవగాహన ప్రకారము వర్తింపలేవు. అందువలన, తమకు నూతనముగ కలిగిన యవగాహన ప్రకారము వ్యవహరించుటకు అనువైన శరీరములను పొందుట కొరకట్టి జీవులు ఆతృతతో నుండును. వీరు నవ్యమానవులై యవతరింతురు. అనేవరకే మానవులుగ జీవించి, వారిలో తగినంత సూక్ష్మశక్తి లేకపోవుట వలన, వారి సూక్ష్మేంద్రియములు సక్రమముగ వ్యవహరింపక పోవుటవలన, సౌఖ్య క్షేమములను గూర్చిన విజ్ఞానము నెరుగక పోవుటచేతనే నవ్యమానవులవలె నుండెడివారు రెండవ తెగకు జెందినవారు. మరల యవతరించిన యీ పాత మానవుల (re embodied humanity) యనుభవములు రక్షణ పోషణా

దుల యధిక సంచయమునందు వినియోగపడుచున్నవి. ఈ విషయము నందు వీరు నవ్యమానవులకంటె అధికులయినప్పటికిని, యితర మానవ వ్యవహారము లన్నిటియందును వీరియువురును సమానమే.

పునరవతారితులయిన పాతమానవులలో గల రక్షణ పోషణా దుల అధిక సంచయాశక్తి వినా, ఉభయ తరగతుల మానవులకును, మానవేతరులకును శరీరాకారములలో తప్ప ఇతర భేదమేమియు లేదు. వైవాహిక సంస్థయందలి వ్యామోహితులయిన మానవులు, వ్యామో హమును విడిచి బాధ్యతాయుతముగ ప్రవర్తించి అభ్యుదయమును సాధించుటకు ప్రయత్నించకుండ ఎప్పటియట్లుండి పోవుటయే యిట్టి దుస్థితికి కారణము. ఈ పునరవతారిత మానవులు తామభ్యుదయమును పొందకుండుటయేగాక యితరుల అభ్యుదయమున కాటంకములను కలి గించుచున్నారు. ఈ పాత మానవులు సంఖ్యకు కొద్దిమందియే యయి నప్పటికిని, రక్షణ పోషణాదులను అధికముగ సంచయ మొనర్చుట వలన, అధిక సంఖ్యాకులైన నవ్యమానవులు తమకు మిక్కిలి అవస రములయిన రక్షణ పోషణాదులను పొందలేకున్నారు. పాత మాన వులు రక్షణ పోషణాదులను సంచయ మొనర్చుటయందు వినియో గించెడి శక్తిని, సృజనశక్తిని తమ శరీరములలో లీనమగువరకు నిలువ జేసి, సూక్ష్మశక్తిగా పరిణామము నొంది, సూక్ష్మేంద్రియ వ్యవహా రము వలన బాధ్యతాయుతు లగుటకు వినియోగ పడచవలెను.

అప్పుడు పునరవతారిత మానవులలోని యీ వైఖరి, అప్రయ త్నముగ, సంపర్క విశేషముచే, నవ్య మానవులలో కూడ వ్యాపిం చును. ఇద్దరును వైవాహిక సంస్థయందలి వ్యామోహిత ప్రజలే. అందువలన పునరవతారిత మానవులలోని యీ మత వైఖరి కనుగుణ ముగ నవ్యమానవులలోని వైఖరికూడ మారి, వైవాహిక సంస్థపట్ల,

దానికిని వారికిని గల సంబంధముపట్ల వారికిగల విశ్వాసముతే మారును. వారిలో పూర్వమే యున్నటువంటి విశ్వాసములలో మార్పులు కలుగుటవలన, తమనుగురించి, తమకును సంఘమును గల సంబంధములను గూర్చిన అభిప్రాయములు మారి, వారి నూతనాభిప్రాయముల ననుసరింతురు. ఈ నూతనాభిప్రాయము వలన నూతనోత్సాహము, శ్రద్ధ బయలుదేరి, సృజనశక్తిని సంచిత మొనర్చుటగా పరిణమించి, తన్మూలమున నీ నూతన వైఖరియందు స్థిరవిశ్వాసమును కలుగజేసి సహజమయిన అలవాటుగా మార్చివేయును. అప్పుడు వారు వైవాహిక సంఘమందు బాధ్యతా యుతులగుదురు. ఇది వారి కభ్యుదయ పథమగుటవలన, కాలక్రమమున, తప్పనిసరిగ మరల మరల నవతరించవలసిన యవసరమును (compulsory re embodiment) పోగొట్టును.

సంపర్క సంసర్గముల రెండు మార్గముల ద్వారా మానవులు మానవేతరులు కూడ యీ స్థితికి వచ్చెదరు. ఈ స్థితి వివిధ దశల యందును శక్తిపరిణామమునకు సహాయకారియగుచు వారిని పురోగమింపజేయును. ఒకరి నొకరు కలిసికొని, ఎడతెరపిలేకుండ ఒకరి నొకరు మరల మరల కలిసికొనుచునే యుండుటను సంపర్కమందురు. నిరంతర సంపర్కమును సంసర్గమందురు. ఒకే రకమయిన లక్షణములు కలవారి సంసర్గము సామరస్యము కలిగియుండును. తమను గూర్చియు, విశ్వము, సర్వాంతర్యామితో తమకు గల సంబంధమును, బాధ్యతను, ఆశయమును, ఆ ఆశయ నిర్వహణమును గూర్చియుగల భావములు విచక్షణ ఆలోచన, సిద్ధాంతము, మానము, సంజ్ఞ, భాషణక్రియలలో ఈ సంపర్క సంసర్గములు జరుగుచునేయుండును. సమస్త వ్యక్తుల మధ్యను పై భావముల సంపర్క సంసర్గములకు, వ్యక్తులయొక్క సర్వావస్థల యందును, ఒకానొక అవిచ్ఛిన్న, నిర్భేద్య సంబంధమున్నది. ఈ

సంబంధము మూలముననే అన్ని విధముల సాక్షాత్కారములు సాగు చున్నవి. ఈ సంబంధ మూలముననే విశ్వమందలి రూపవిచ్ఛిన్నము లును సాగుచున్నవి. విశ్వజీవి యొక్క ప్రేమ జ్ఞాన సామర్థ్యముల ఆరోహణావరోహణ లీ సంబంధ మూలముననే సాగుచున్నవి. ఈ సంబంధ మూలముననే, సశరీరులు, అశరీరులునయిన జీవులలోని ఆధ్యాత్మిక లక్షణములతో విశ్వజీవియొక్క నిరంతర సామరస్య సంసర్గము సాగుచు, సమస్త జీవులతోడను సామరస్యమును, తన్మూలమున విశ్వ సామరస్యమును సాధించుటకు సహాయపడుచున్నది.

విశ్వమును గూర్చియు, విశ్వమందలి వస్తు విషయాదులను గూర్చియు వేర్వేరు అభిప్రాయములను గలిగినట్టియు తమకుగల బాధ్యత, కర్తవ్యములు, సిద్ధాంతములనుగూర్చి విభిన్నములగు నిశ్చయములు కలిగిన పలువురు వ్యక్తులు కలిసి ఒక ప్రయాణము చేయు చున్నారనుకొనుడు. అందులో కొందరు పరిశుభ్రమయినవారు. మరి కొందరపరిశుభ్రమయినవారు. కాని వారందరు కలిసి అట్టి గుంపుల కనువైన స్థావరములు గల యొక మార్గమున ప్రయాణముచేయు చున్నారు. ఆ స్థావరములలో శుభ్రమయినవి, అపరిశుభ్రమయినవి, అనేక రకములున్నవి. అన్ని రకములయిన అలవాట్లు, స్వభావములు ఇష్టములు కలవారి కనువగు ప్రదేశములును కలవు. వారందరు నొక స్థావరమునకుజేరి అందలి యిండ్లలోనికి తొంగిచూడ ప్రారంభించిరి. మొదటి యిల్లు పరిశుభ్రముగ నున్నది. పరిశుభ్రతయందు ప్రీతిగల పరిశుభ్ర వ్యక్తులందు ప్రవేశించిరి. కొందరపరిశుభ్ర వ్యక్తులు మరి యొక యింటజేరిరి. మరి కొందరు తొంగిచూచి లోనప్రవేశించుటకు సందేహించుచుండిరి. కొందరపరిశుభ్ర వ్యక్తులు నిస్సంకోచముగ లోనప్రవేశించిరి. ఇంటిలోగల సౌకర్యములను గమనింపదొడగిరి. పరి శుభ్ర వ్యక్తులు ఆ యింటిలోగల సౌకర్యముతో తృప్తిని, ప్రీతినిపొంది

అందు నివసింప నిశ్చయించిరి. అటు పిమ్మట ఆ యింటిలోని వారితో వ్యవహరించవలసివచ్చెను. ఆ యింటి వారి భావములు, విశ్వాసములు వైఖరి, స్వభావములు, ఇష్టములు, అలవాట్లు వేరుగ కనపడెను. ఆ కారణము వలన వారాయింటిలోనుండలేక వేరొక యింటికొరకు అన్వేషింప దొడగిరి. ఇంటిలోనికి తొంగిచూచుచున్న అపరిశుభ్ర వ్యక్తులీలోపున ఆ యింటిలో ప్రవేశించిరి. ఈ యపరిశుభ్ర వ్యక్తులకు అచ్చట గల సౌకర్యములు అసంతృప్తికరము లయినప్పటికిని, ఇంటిలో నున్న వారు మాత్రము అనుకూలురుగ కనపడిరి. ఆ యింటిలోని వారి యొక్క యలవాట్లు, ప్రీతి, ఉన్ముఖత, స్వభావములు అనుకూలముగ కనపడెను. ఆ యింటిలోని వారియొక్కయు, ఆగంతుకుల యొక్కయు భావములు, విశ్వాసములు, అలవాట్లు. వైఖరులలో గుణైక్యత కలిగి యుండుటవలన వారు వెంటనే ఆప్తులయిపోయిరి. అనువయిన సౌకర్యము లున్నప్పటికిని మొదటి వారా యింటిలో నుండలేకపోయిరి. ఆ యింటిలోని వారితో మిత్రులు కాలేకపోయిరి. వారి భావములు విశ్వాసములు, వైఖరి, అలవాట్లలోని గుణవిభిన్నతయే యిందుకు కారణము.

అదే రీతిగ, సశరీరులు, అశరీరులు నయిన సమస్త జీవుల కార్యకలాపములలోని శక్తులు, సంపర్క-సంసర్గములు కలిగి సమస్త వ్యక్తుల ద్వారా. వస్తువుల ద్వారా అన్యోన్య మిశ్రితము లగుచుండును. విశ్వమునందలి ప్రదేశమునందు విహరించెడి వ్యక్తుల భావన, విశ్వాసము. ఉన్ముఖత. స్వభావము, వైఖరి, అలవాట్లలో గల శక్తులు ప్రతివస్తువునందు, ప్రదేశమునందు ప్రవేశనీయత్వము, కలిగి వివిధ వస్తువులతోడను. సంపర్క- సంసర్గములను కలిగి వ్యాప్తమగుచుండును. వివిధ వస్తువులు. వ్యక్తులు వారి వారి శరీరముల యుపాధుల ననుసరించి వానిని లీనమొనర్చుకొనుచుండును.

అందువలన మానవుల నభ్యుదయ పథమున పురోగమింపజేయు నవి రక్షణపోషణాదులు మాత్రమే కావనియు, అంతేగాక అవి బాహ్యాభివృద్ధి యందున్ముఖత కలిగించుననియు ఆ రక్షణ పోషణాదుల సంచయమునందు సమర్థులు కానట్టియు, వానిని కూడబెట్టుటకు కావలసిన సౌకర్యములను కలిగియుండ నటువంటి నవ్యమానవులు తెలిసికొనవలయును. పునరవతారిత మానవులు ప్రస్తుతము విభ్రాంతికరమగు పరిస్థితులలో నున్నారు. రక్షణ పోషణాదులను సమకూర్చుటయందు, వారికి గల నేర్పు బాహ్యాభివృద్ధి ముఖముగ నుండును. ఈ విషయమును గ్రహించినచో, పునరవతారిత మానవులు తమకంటె నే విధముగను ఎక్కువ వారని నవ్యమానవు లనుకొన నవసరములేదు; అనుకొనరాదు.

బాహ్యాభివృద్ధి యందున్ముఖతను కలిగించు వస్తుసంపదలను అదృష్టమని భావించుటొక పొరపాటు. తామధికారులమనియు, సంపదలకు తాము స్వంతదారుల మనెడి వింతభావములను మానవులలో కలుగజేసెడి స్వభావమీ వస్తుసంపదలయందు కలదు. ఈ స్వంతమనెడి భావము మానవులయొక్క శక్తి, శ్రద్ధ, యుత్సాహములను గుత్తకు పుచ్చుకొని ఆ వస్తుసంపదలయందే, వాని యభివృద్ధియందే వినియోగపడునట్లు చేయును. ఈ విషయమే మరల మరల అవతరణావశ్యకతను కలుగజేయుచున్నది. అదృష్టమని యనుకొనబడుచున్న యీ దుష్టసంపదలవలన పొందదగు నీస్థితి చాల దురదృష్టకరమయినది. ఓ నవ్యమానవులారా! దురదృష్టవంతులయిన పునరవతారిత మానవులతో మీరు సంపర్క సంసర్గముల కలిగియున్నారు. వారివలె మీరు దుష్టసంపదలను కలిగియుండి ఆ సంపదలచే మీరు పొందబడియుండక పోయినప్పటికిని; తప్పుడలవాట్లు మూలమున, ఆ దురదృష్టము కొరకై మీరా వేదన పడుచున్నారు. సంతోషముగ నుండుడు. ఉత్సాహవంతులు

కండు. మీ కీ దురదృష్ట మింతవరకు కలుగకుండుట వలన నిప్పటికిని మీరు అభివృద్ధినో అభ్యుదయమునో ఎన్నుకొనెడి స్థితియందున్నారు. కనుక నిట్టి స్వతంత్రము మీకు గలదను విషయమును గ్రహించి అభ్యుదయ పథము నెన్నుకొనుడు.

ఒక సామాన్య మానవుల సమూహములో రక్షణ. పోషణాదులు కూడబెట్టుటయందు సమర్థులయిన వారు కొందరును, అసమర్థులయిన వారు కొందరును నున్నారనుకొనుడు. వారందరును కలిసి కాలి నడకను ఒక ప్రయాణమును ప్రారంభించిరి. దానిలో రక్షణ పోషణాదులను కూడబెట్టుటయందు సమర్థులయిన జనులు ఏ బరువులను మోయకుండ ప్రయాణము చేయుచుండిరి. రక్షణ పోషణాదులు లేనివారు, తమబరువులను, కలవారి బరువులనుకూడ మోయుచు ప్రయాణము సాగించుచుండిరి. సంపన్నులయిన వారికి కావలసిన పోషణ పదార్థములు వేరు. వారు, అదృష్ట లక్షణముగ భావించెడి పంచదార పానకముతో వారి దాహమును తీర్చుకొనెడివారు. మిగిలినవారు ముందటి రోజున పులిసిన మజ్జిగనీటితో తమ దాహమును తీర్చుకొనెడి వారు. ప్రయాణములో అసంపన్నులతో సమముగ సంపన్నులు నడువ లేకుండిరి. వారికొరకై మధ్యమధ్య ఆగవలసి వచ్చుచుండెను. వారు అలసిపోయి, నీరసపడి, నడవలేక మిగిలిన వారిని ఆగుమని కోరుచుండెడి వారు. ఎందుచేత ? వారు ముందునకు పోలేకుండిరి. అందువలన నితరులనుకూడ ముందునకు పోనీయకుండ ఆపుచేయుచుండిరి. సంపదలు కలిగియున్నవారు, లేనివారికంటె అధికులనియు, లేనివారు తక్కువవారనెడిభావము, అసంపన్నులలో నుండుటవలన వారితరుల ఆదేశములకు లొంగిపోయి ముందునకు పయనింపక, ప్రయాణమును పూర్తి చేసి తమ గమ్యమును చేరుట యను భాగ్యమును పోగొట్టుకొని. తమ ఆశయమును గోల్పోయిరి. అదే రీతిగ నవ్యమానవులు, పోషణాదులను

కూడబెట్టుటయందసమర్థులయి యుండుటవలన, సంపన్నులవలన కలిగెడు లాభములయందు వారికిగల అభిప్రాయాధిక్యత వలనను, అదృష్టము దురదృష్టములను గూర్చి విశ్వవ్యాప్తమగు తప్పుడు భావనల వలనను, బలము గలిగి యున్నప్పటికిని, సంపన్నులు కాకపోవుటవలన అర్హులయి నప్పటికిని తమ ఆశయమును సాధించుకొనలేకున్నారు.

అదృష్టవంతుల మనుకొనుచుండెడి సంపన్నులయిన దురదృష్ట వంతులతోడి సంపర్క సంసర్గములే యీ యపజయమునకు కారణము. వంట చేయుటకు పచ్చిపుల్లలతో, సగమెండిన పుల్లలనుకూడ పొయిలో నుంచినను వండబడిన పదార్థము సగముడికయో, లేక అసలుడుకకుండగనో యుండును. పచ్చి కట్టెలతో సంపర్కమువలన సగము ఎండిన కట్టెలు కూడ తడిసిపోవును. ఎంత విసిరినను వంట తయారగుటకు కావలసిన మంట మాత్రము బయలు దేరదు. సగ మెండిన కట్టెలలో నొకటి మండుట ప్రారంభించినప్పటికిని, దాని ప్రక్కనున్న పచ్చి కట్టె నీటిని చిమ్మి, మండుచున్న సగము ఎండిన కట్టెను కూడ తడిపివైచి, కళ్ళ మంటలు కల్గించెడి నల్లని పొగను బయలుదేర జేయును. ఆ పొగవలన సగమెండిన కట్టెలనుండి బయలు దేరుచున్న సన్నని మంటకూడ ఆరిపోవును. అంతరాయము లేకుండ సన్నని మంటనిచ్చి వంటను పూర్తిచేయగలిగెడి గుణము, లక్షణములు సగమెండిన కట్టెలలో కొంతవఱకు నున్నప్పటికిని, అవి తమ శక్తిని వినియోగ పరచలేవు. వంటను పూర్తిచేయలేవు. అంతే కాకుండ సన్నని మంటను నిరంతరాయముగ నిచ్చు తమ లక్షణమును పోగొట్టుకొని అవికూడ పచ్చికట్టెలతో గుణైక్యమును పొందును. నవ్య మానవులయిన మీరు, కూడబెట్టగల శక్తిలేని సామాన్య మానవు లయిన మీరు, సగమెండిన పేళ్ళవంటివారు. మీ సహచరులు, సమర్థు లయిన పునరవతారిత మానవులు. వారు నీటిని చిమ్మెడి పచ్చి పేళ్ళ

వంటివారు. ఆ సంపన్నులనుకొనిన దురదృష్టవంతులతోడి సంపర్క-సంసర్గముల వలన మీరును దురదృష్టవంతు లగుచున్నారు.

దురదృష్టవంతులగు పునరవతారిత మానవులు నాల్గు వీధుల మొగను చాలకాలము క్రిందటనే దాటిరి. వారు స్వయముగా కోరుకొనిన ప్రకారమే బాహ్యాభివృద్ధి పథమున పురోగమనము ప్రారంభించి చాలవరకు ముందునకు సాగియున్నారు. కాని వస్తు సంచయ సామర్థ్యము లేకపోవుటవలన అదృష్టవంతులగు సామాన్య మానవులయిన మీలో చాలమంది, నాలుగు వీధుల మొగను దురదృష్టవంతులగు పునరవతారిత మానవుల వెనుకనే పయనించుచు దాటినప్పటికిని, మీ స్వతంత్రమయిన కోరిక ప్రకారముగాక వారి యడుగు జాడలలో పోవుచున్నప్పటికిని మీరింకను ఆ చతుష్పథమునకు దరిదాపులోనే యున్నారు. వస్తు విషయాదులను కూడబెట్టుట యందు మీరు శక్తిహీను లగుటవలన వారిని కలిసికొనవలెనని మీరెంత కోరుకొనినప్పటికిని, దురదృష్టవంతులయిన ఆ సహచరులను మీరు కలిసికొనలేక పోవుచున్నారు.

ఆ మార్గమునందే పురోగమించవలెనని ఎంతమాత్రమును కోరకుడు. అదృష్ట దురదృష్టములను గూర్చిన సరియైన జ్ఞానమును పొంది, మీ విధానముయొక్క ఫలితములను తెలిసికొని అట్టి కోర్కెను దూరము చేయుడు. వస్తు విషయాది సంపదలను మీరు కావలసినన్ని మీరు సంపాదించుకొని తృప్తిని పొందలేక పోవుటను మీరు దురదృష్టమనుకొను చున్నారు. ఇందుకు కారణము మీ సహచరులు అధికమగు ఆశాపరులయి అన్నిటిని కూడబెట్టుకొను చుండుటయే! మీరు పొందనటువంటి తృప్తిని పొందుటకయి మీరు మరల శరీరముల దాల్చుట సమర్థింపదగిన విషయమే! కాని వారి పునరవతరణ

మాత్రము అసమగ్ధనీయము. అందువలన వస్తు విషయాదులను కూడ బెట్టవలెనను దురాశను మీరు దూరము చేసికొనినచో, ఆ క్షణము నుండి మిమ్ములను మరల, మీరు దాటియుండుచున్న ఆ నాల్గు వీధుల మొగవైపు మరల త్రిప్పగలిగిన మహావ్యక్తుల సంపర్క సంసర్గములు మీకు లభించును. సక్రమముగ వ్యవహరించుచున్న వారి సూక్ష్మేంద్రియములనుండి సక్రమ వ్యవహారము లేని మీ సూక్ష్మేంద్రియముల లోనికి, వారిచే వినిర్గతమైన శక్తిబీజములు అప్రయత్నముగ మీలోనికి ప్రసరించును. అప్పుడు మీరు విశృంఖలురై, స్వతంత్రమగు విధమున, మీరు పయనింపదగు మార్గమును గుర్తించి పురోగమింప గలుగుదురు. ఇట్టి స్థితియందు మహావ్యక్తులగు మీ నూతన సహచరులనుండి బాధ్యతాయుతమగు సహాయము మీకు లభించును..

అగుచో బాగుగ ఎండిన కట్టె ఒక్కటియైనను సగమెండిన కట్టె లనేకముతో కలిపి మంట పెట్టినచో ప్రారంభములో ఎక్కువ పొగతో మండుట మొదలిడినప్పటికిని క్రమేపి, పచ్చికట్టెల చివరలనుండి బయటకు వచ్చు నీరు, ఎండు కట్టెల మంటలనుండి బయలుదేరు వేడికి ఇగుర్చుకొని పోవును. ఇంకను కట్టెలచివర మిగిలియుండెడి నీరు ఒక తైలమునంటి పదార్థముగా మారి, ఎండిన కట్టెల మంటలకు దోహద మగును. ఈ రీతిగ ఎండుకట్టెల మంటతోపాటు పచ్చికట్టెలు కూడ మండి పూర్తిగ కాలి ప్రయోజనము సాధింపబడును.

మెల్ల మెల్లగ, ఒకదాని తరువాత మరియొకటి, సగమెండిన పుల్లలన్నియు కాలి నిప్పుగా మారును. ఎండుపుల్లల మంట పొయ్యి లోని వేడిని ఎక్కువచేయును. ఇప్పుడు సగము ఎండిన పుల్లలన్నియు కూడ మొదటినుండియు పూర్తిగ ఎండిన పుల్లలవలెనే వ్యవహరించును. ఇప్పుడు ప్రతి కట్టెకు నిప్పు, మంటయు బయలుదేరి వేడిని పుట్టిం

చును. సగమెండిన పుల్లలలోని నిప్పు, మంట, వేడి అందులోని నీటి నిగిర్చి ఆ పుల్లలు సగము కాలునరికి పూర్తిగ ఎండుపుల్లలు మాదిరిగ మారును.

అదేరీతిగ, మీరు శక్తి పరిణామము నొందినవారి సాహచర్య ములో నున్నచో, అట్టి సహవాసములో నేదియో ఒక స్థితిలో మీకు తెలియకపోయిన కారణము వలన నయిన నేమి, అశక్తత వలననయిన నేమి, మీరు కోరకుండగనే మీలో శక్తిపరిణామము కలుగును. అట్టి స్థితి మీకు తెలియకుండగనే కలుగును. బాహ్యాభివృద్ధి మార్గమున పోవు దురదృష్టవంతుల వెంట మీరు పోకుండుటయే దీనికి కారణము. మీ రట్టి కోర్కెలను విడిచిపెట్టుట, విడిచిపెట్టుటయందు ఉన్ముఖత లేక పోవుట వలన కాకుండా కేవలము అసమర్థత వలన నయినప్పటికిని. శక్తి పరిణామము పొందిన మహావ్యక్తుల సాహచర్యమునకు మీరింకను అర్హులే. వారి సాహచర్యము వలన వారి ప్రబోధము మీకు కలుగును.

విశ్వనిర్మాణ తత్వము ననుసరించియు, విశ్వమందు అశరీర, సశరీర స్థితులలో గల సమస్త వ్యక్తుల నిర్మాణము ననుసరించియు సమస్త వస్తు విషయాదులను జీవులను అభ్యుదయ పథమున పురోగ మింప జేయుటకు ఆధ్యాత్మిక పద్ధతుల యావశ్యకత కలుగును. ఈ సామాన్య మానవులను పురోగమింప జేయుటకు వారికి అభ్యుదయ మును సూచించవలసిన ఒక విశిష్టమైన విశ్వవాంఛితము ఇచ్చుట యేర్పడినది. ఈ విశ్వవాంఛ విశ్వనిర్మాణ సిద్ధాంతముతోడను, వ్యక్తుల వస్తు విషయాదుల అభ్యుదయముతోడను, సామరస్యము కలిగి యుండుట వలన ఒక అనివార్యమైన విశ్వావశ్యకతరూపమును పొంది నది. మానవకర్తవ్యమును మానవోచిత విధమున నిర్వహించి అభ్యు దయ పథమున పురోగమించుటకు మిమ్ములను ప్రోత్సహించుచున్నది.

అందువలన ఈ ఆధ్యాత్మిక పద్ధతుల పరిణత పొందిన మహావ్యక్తులతో మీకు సంసర్గము కలుగుచున్నది.

మానవ శరీరములయందు తినుట, జీర్ణమగుట మున్నగు విధానములను గమనింపుడు. మానవులు ఆహారపదార్థము నెంత అధికముగ కూడబెట్టినప్పటికిని, వారి శరీరముల యొక్క భక్షణశక్తి మాత్రము పరిమితమే యయియున్నది. భక్షించెడి శక్తి మానవులలో నెంతగా నున్నప్పటికిని జీర్ణశక్తి అధికము కాజాలదు. ఒక్కొక్కప్పుడు, ఒకరిచే సంపాదింపబడి, పచనము కూడ చేయబడి, తినబడుటకు సిద్ధముగ నున్న పదార్థములను ఏ స్నేహితులో, బంధువులో అతిథులో వచ్చిన వారికి పెట్టెదరు. తన చేతనే సంపాదింపబడి తన చేతనే పచనము చేయబడి తనచే భుజింపబడిన ఆహారములో నేదేని ప్రమాదకరమైన వస్తువుండి యున్నట్లు తెలిసినయెడల, ఏ వ్రేళ్ల సహాయముతో ఆ ఆహారము తినబడినదో ఆ వ్రేళ్లనే గొంతులోపెట్టి ఆ యాహారమును పైకి క్రక్కి వేయుదురు.

పై యుదాహరణము వలన వస్తువిషయములలో గల అనిశ్చితత్వము, ఉపయోగహీనత స్పష్టమగుచున్నవి. విత్తనములను తినును విత్తనములయందే యుండెడి జీవులున్నవి. భూమిపై జల్లిన విత్తనములను భూతలముపై కొన్ని జీవులు తినుచున్నవి. ఆ విత్తనములు మొలకలెత్తినచో, ఆ లేత మొక్కలను జీవులు తినుచున్నవి. ఆకులేర్పడిన తరువాత వానిని కొన్ని జీవులు తినుచున్నవి. సస్యజీవితములో పెరుగుదల కాలమంతటిలోను, వివిధ స్థితులలోను ఆ సస్యములను తినుచున్న జీవులనేకము లున్నవి. పుష్పించుట ప్రారంభించుట తోడనే, పువ్వులను పిందెలను కాయలను, గింజలను తినెడి జీవులున్నవి. ఆ పండిన పదార్థములను నిలువయుంచిన తరువాత కూడ వానిని నిత్యము తినెడు జీవు

లున్నవి. వానిని భోజనము కొరకు పచనము చేయుటకు నిప్పుమీద పెట్టిన కాలములో కూడ వానిని తినుచునేయుండు జీవులున్నవి.

వండుట ప్రారంభించిన తరువాత గూడ కొంతవరకు వేడిని సహించి వండబడుచున్న ఆహార పదార్థములను తినెడిజీవులున్నవి. వంటపూర్తి యయిన తరువాత, భోజనమునకు సిద్ధమయిన ఆ పదార్థ ములను వేడిచల్లారిన వెంటనే ఆ యాహారమును తినుచుండిన జీవులను చూడగలము. ఆ పదార్థములు మానవులచే భుజింపబడిన తరువాత వారి గర్భాశయములలో కూడ ఆ యాహారమును తినుటకు జీవులు సిద్ధముగ నున్నవి. ఆ యాహారము జీర్ణమయిపోయిన తరువాత శరీర మున కవసరము లేనిదానిని విసర్జించిన పిదప, ఆ మలమును తినెడి, తినుచునే యుండెడి జీవులున్నవి. శరీరములో అంతర్గతమై, లీనమై పోయిన ఆహారమును కూడ, రక్తములోనను, మాంసములోనను, ఆ యెముకలలోగూడ దానిని తినెడి జీవులున్నవి.

ఆహారాదులను కూడబెట్టుటకు సమర్థులు కాని అదృష్టవంతు లగు సామాన్య మానవులారా! ఆహార పదార్థములను కూడబెట్టుట యందు అతి నేర్పరులైన వారితో మీకుగల దీర్ఘ సాహచర్య దోషమువలన కలిగిన మీ తప్పుడు అలవాటులను విడిచిపెట్టుటకు, ఈ ఆహార పదార్థముల భక్షణ, జీర్ణముల యందలి వింతస్థితిని గూర్చిన జ్ఞానము చాలును. తాము మీ యెడల, ప్రపంచము యెడల కనబర చెడి వైఖరియే మానవ స్వభావమునకు సహజమైనదని మీకు వారు బోధించుచున్నారు. మిమ్ములను కూడ వారివలెనే ప్రవర్తింపుడని సలహా నిచ్చుచున్నారు. వారి ప్రబోధములను మీ రనుసరించు చున్నారు.

వారు, ప్రతివారును ప్రతి వస్తువును అమితముగ కూడబెట్ట వలెనందురు. ప్రతివారును వారికి దగ్గరగల బంధుమిత్రాదులను కని పెట్టుచుండవలెనందురు. ఎటువంటి కష్ట నష్టముల కోర్చియయినను, ఇవి చేయవలెనందురు. ఇదియే మానవ కర్తవ్యమును సాధించెడి విధానమందురు. వారి యీ యాశయ సంసిద్ధికై యెన్నియేని యుపా యములను పన్నుచున్నారు. వారి ప్రయత్నము లన్నియును కూడ విభజన, అనైక్యత, కల్లోలములపై నాధారపడి యున్నవి. వారివలెనే మీరందరును కావలెనని వారు మీకు బోధించిరి. మీరు వారి ప్రబోధముల నంగీకరించిరి. కాని వారి బోధనల ప్రకారము మీరు వారివలె నగుటకు తాపత్రయ పడుచుండగ, వారు మరల మీకు అడ్డు తగులుచున్నారు. వారి మాటలకును చేష్టలకును గల వ్యత్యాసమును గమనింపుడు. వారి మాటలే కాదు, ఆ మాటలకు మూలమైన భావనలుగూడ అమానుషము లయినవి. సౌఖ్య క్షేమము లను సమకూర్చుకొనుట యందుగల ఆకాంక్ష మానవులలోనను, మానవేతరులలోనను కూడ నున్నప్పటికిని, సౌఖ్య క్షేమములు అభి వృద్ధిపై నాధారపడి యుండునను జ్ఞానముకూడ మానవులలో నుండును.

ఈ యభివృద్ధి మార్గములో నుండగనే సౌఖ్య క్షేమములు అభ్యుదయ మార్గములో నుండునుగాని బాహ్యాభివృద్ధి మార్గములో నుండవని ద్యోతకమగును. కాని మానవేతరులలో అట్లుగాదు. వారిలో సౌఖ్య క్షేమ సముపార్జనా వేదనయేగాని అవి ఎట్లగునను తెలివిలేదు. అందువలన స్వార్థపరత్వము నెరుగని ఓ నవ్య మానవులారా ! మిమ్ము లను మహా అదృష్టవంతులుగ భావించుకొనుడు. వస్తు విషయాదులను గూర్చియు వాని యుపయోగమును గూర్చియు సక్రమముగ అవగా హన చేసికొనుడు. వస్తు విషయాదులను సేకరించి కూడబెట్టినచో

ఆశయమును సాధింపవచ్చు ననెడి భావమును, ఆ భావమును మీలో కలుగజేసిన వారినికూడ దూరము చేయుడు. పరిణతి పొందిన మహా వ్యక్తులతో సామరస్యము కలిగి వారి సంపర్కములో నుండుటను కొనసాగింపుడు.

నవ్యమానవులింకను సౌఖ్య క్షేమములను పొందుటకు అభివృద్ధి పొందెడు విధానములోనే యున్నారు. వారింకను శక్తి పరిణామము నందు సంసిద్ధిని పొందియుండలేదు. వారి సృజన శక్తి సూక్ష్మశక్తిగ మారియుండలేదు. వారి సూక్ష్మేంద్రియములు సక్రమముగ వ్యవహరించుటలేదు. అందువలన వారికి అభ్యుదయమువలన సౌఖ్య క్షేమములు పొందదగునను తెలివి గలుగకుండెను. వారి ప్రస్తుత దశయందు, మానవ శరీరములుకల మానవేతరులు మాత్రమేయైయున్నారు. అందు వలన వారిలో ప్రమాణ మానవ విజ్ఞానముకంటె తక్కువయగు స్వభావము, సామాన్య వివేక వ్యవహారముకంటె తక్కువయగు వైఖరి కన్పట్టుచున్నవి. ఆప్తులను చూచుకొనుట, పోషణ పదార్థములను సేకరించి అమితముగ కూడబెట్టుటయే వారి లక్షణములు.

సజాతీయములైనవి యేవియైనను ఇతరులచే ఎదుర్కొనబడినప్పుడు, లేదా యే నూతిలోననో గోతిలోననో పడిపోయినప్పుడు ఉత్తమేంద్రియములుకల మానవేతర జీవులేవియు కూడ ఆపదలో నున్న వానిని రక్షించుటకు ప్రయత్నించకుండ ఊరకొనవు. వారివారి శరీర నిర్మాణముల కనువయిన రీతిని, ఆప్తుల రక్షణకొరకై తమ శరీరములను త్యాగము చేయుటకైనను వెనుదీయకుండ ప్రయత్నించును. పందులు కప్పలు సహితము అట్లు చేయును. కాని అదృష్టవంతులను కొనెడి ఆ పుసరవతారితులగు పాతమానవుల దుస్థితిని చూడుడు. వారి బిడ్డలకే యట్టి ప్రమాదము సంభవించి నప్పటికిని తమంత తాము

రక్షణ ప్రయత్నములను చేయకుండ, ఇతరుల సహాయము కొరకు ఆర్తనాదము చేయుదురు. అట్టి సమయములందు నవ్యమానవు లెట్టి యుపాయమునకును వెనుదీయకుండ, ఆపదలోనున్న వారిని రక్షించుటకు నడుముకట్టి పరుగులెత్తి దుమికెదరు. సామాన్య వివేకమును వినియోగించి మానవత్వానుభవము వలన, నీ పరిస్థితియందలి యుచితానుచితములను మీరు పరిశీలింపుడు. అదృష్టమేదియో దురదృష్టమేదియో, ఎవరదృష్టవంతులో ఎవరు దురదృష్టవంతులో యదార్థము తెలిసికొనుడు.

వారి బిడ్డలను వారెందుచేత రక్షించుకొన లేకపోయిరి ? వారి సామాన్య వివేకమును వారనుసరింపక పోవుటవలన, వారికి గల శ్రద్ధ, ఉత్సాహములు అదివరకే వారిచే సంచితములయిన సంపదలయందు, ఆపదకు గురియైన బిడ్డ శరీరమునందు బంధింపబడి యుండెను. వారి సృజనశక్తి గూడ వారికి గల సంపదలయందే బంధింపబడి యుండెను. అందువలన వారు ప్రయత్నింప లేకపోవుచున్నారు. వారిలో తగినంత సూక్ష్మశక్తి లేకపోవుటవలన, బిడ్డయందు నిక్షిప్తమైయున్న తమ ప్రేమశక్తి బిడ్డకు కలిగిన ఆపద మూలమున తిరిగి తమలో కలియుట వలన కలిగిన విభ్రాంతి మూలమున, సంపదల ద్వారా సమస్తమును సాధింపవచ్చు ననెడి తమ విశ్వాసము మూలమునను వారు తమంత తాము ప్రయత్నించలేక సంపదవలన పొందదగు సహాయము కొరకు నేడ్చెదరు. "మీ రందరును వచ్చి, మీ శరీరములను ప్రమాదమునకు లోనుగావించి మా బిడ్డను కాపాడుడు. మీ కిదిచ్చెదను, అదిచ్చెద" మందురు. బిడ్డ కాపాడబడినచో బిడ్డను సర్వాంతర్యామి బ్రతికించె నందురు. సహాయపడిన యితర సోదర మానవులు తా మిచ్చెదమనిన సంపదలకు ఆశించి సహాయపడిరనియు, అందువలన తమకు గల సంపదలే తమ బిడ్డను కాపాడినవనియు భావింతురు.

మీరు బిడ్డ నెట్లు కాపాడ గల్గుదురు ? మీకు సూక్ష్మశక్తి తక్కువయే యయినప్పటికిని మీకుగల శక్తి ఉత్సాహములను బంధించుటకు ఏ సంపదలును మీకు లేశంమున మీ కోరికల కనువర్తనముగ మీ శక్త్యుత్సాహములు అవి వ్యవహరించును. మీ శక్త్యుత్సాహములను బంధించెడి సంపదలు మీకు లేని కారణము వలనను, మీరు సర్వాంతర్యామిపై నాధారపడి యుండుటవలనను మీ సామాన్య వివేకము, వారివలె ప్రాబల్యమును గోల్పోలేదు.

సశరీరులైనను, అశరీరులైనను సహజ వివేకమును కలిగియున్న వ్యక్తులే మానవులు. అభ్యుదయమును పొంది, పరాధీనతా భావమున కతీతులైనగాని సమస్త మానవులు తా మేదియో దానిపై నాధారపడి యుంటిమనియే భావింతురు.

అధిక సంపదలను కలిగియున్న దురదృష్టవంతులైన సామాన్య మానవులారా ! సమస్తమైన ఆయుధముల నుపయోగించెడి నేర్పును కలిగియుండి, సహాయపడెడి యితర మిత్రుల సహాయముతో మీరొక యరణ్యములో నుండి రనుకొనుడు. ఏ పులియో, సింహమో మిమ్మెదుర్కొనిన నపుడు, మీ సహాయకుల నందరను సమకూర్చుకొని, ఆయుధములతో నా జంతువుల నెదుర్కొందురు. మిమ్ముల నెదుర్కొనెడి జంతువు, మీ దృష్టిని మీ సహాయకులపైనను, మీ ఆయుధముల పైనను మరల్ప జేయును. ఆ జంతువు మీ సహాయకుల కంటెను బలీయమైనప్పటికిని, మీరు ఆయుధములకు అతీతమైనప్పటికిని మీ సహాయకులు ఆయుధములపైననే ఆధారపడి యుందురు. అంతమందు మీరు మిమ్మెదుర్కొనిన జంతువునకు లొంగిపోవచ్చును కూడ. మీ యాయుధముల యొక్కయు, సహాయకుల యొక్కయు శక్తులు శత్రువు నెదుర్కొనుటకు చాలవని మీరు తెలిసికొనిన పిమ్మటకూడ,

మీరు ఆయుధములపైనను, సహాయకులపైనను ఆధారపడి యుండుట కలవాటు పడియుండుటచేతను వానిపైననే వారు ఆధారపడియుందురు. సిరి సంపదలను ప్రోగుచేయుట యందు మీ రెంతటి సమర్థులైనను, ఎట్టి శత్రువులకైనను లొంగనటువంటి దానిపై నాధారపడుటయందు సమర్థులు కాకున్నారు. మీ సిరి సంపదలే మిమ్ములను పొందినవా యనునట్లు వారు నిరంతరము వానిపై నాధారపడి యున్నారు. సిరి సంపదలను కూడబెట్టిన వారి శోచనీయ దుస్థితిని గమనింపుడు.

పై విధముగ జంతువులు మిమ్మెదుర్కొనిన ఆపద సమయము నందు, మీ ఆయుధములు, సహాయకులు మకామునందుండి పోయె ననుకొనుడు. అప్పుడయినను మీరు సర్వాంతర్యామిపై నాధార పడరు. అలవాటు ప్రకారము, ఆయుధములను మరచి వచ్చితిమనియే వాపోయెదరు. అట్టి పరిస్థితులను నిందించెదరు. ఆయుధములను మకా ములో విడిచి వచ్చుట స్వయంకృతము కావచ్చును. లేదా యితరుల సలహావలన కావచ్చును. మీరీ రీతిగ అట్టి పరిస్థితులను నిందించు కొనుచు, తత్తరపడు చుండగనే ఆ జంతువు మిమ్మాక్రమింప వచ్చును.

సిరి సంపదలులేని, అదృష్టవంతులగు సామాన్య మానవులే యిట్టి నిస్సహాయ నిరాయుధ పరిస్థితులయం దుండినచో, వారికి ఆయు ధములు, సహాయకులు, సిరిసంపదలు లేని కారణమువలన, నిరంతరము సర్వాంతర్యామిపైననే ఆధారపడి యుండెడి అలవాటువలనను, ఈ ప్రమాద పరిస్థితులలోకూడ సర్వాంతర్యామిపైననే యాధారపడెదరు. తలవని తలంపుగ వారికే ఱాయియో కఱ్ఱయో దొరకవచ్చును. తమ దేహముల సంరక్షణ కొరకై ఆ కఱ్ఱనో, ఱాయినో, ఆ జంతు వుపై ప్రయోగింపవచ్చును. కాని వారు ఆ కఱ్ఱపైనను, ఱాయిపైనను ఆధారపడకుండ సర్వాంతర్యామిపై నాధారపడియే ఆ ఱాయినో

కజ్జినో ప్రయోగించెదరు. సర్వాంతరామిపై నాధారపడుట ప్రేమ వలన కాకపోయినప్పటికిని, నిస్సహాయతవలన నయినప్పటికిని, సర్వాంతర్యామిని గూర్చిన జ్ఞానము వలన కాకపోయినప్పటికిని, అలవాటు వలన సర్వాంతరామిపై నాధారపడినప్పటికిని, వారంతవరకును అదృష్టవంతులే! సర్వాంతర్యామిపై సర్వదా ఆధారయోగ్యము. సర్వాంతర్యామియే సర్వదా సర్వత్ర స్వతంత్రము. తక్కిన వేవియును స్వతంత్రములు కాకపోవుటచే ఆధారయోగ్యములు కావు.

ఏండ్లు తరబడి ప్రయాణము చేసినకాని క్షేమకరమయిన ప్రదేశమును జేరని ఒక నిరంతరమైన ప్రవాహమునందు కొట్టుకొని పోవుచున్న దురదృష్టపు సామాన్యమానవులు తమ రక్షణకొరకై ప్రవాహ వేగమున కొట్టుకొని పోవుచున్న దుంగల నాశ్రయించెదరు. ఆ దుంగలు ప్రవాహవేగముపై నాధారపడియుండును. ఆ ప్రవాహము వరదల యొక్క హెచ్చు తగ్గులపై నాధారపడియుండును. వరదలు వర్షముల మేఘముల యుత్పత్తిపై నాధారపడియుండును. మేఘోత్పత్తి సూర్య రశ్మి, ఉష్ణోగ్రతలపై నాధారపడియుండును. ఆ సూర్యగోళము విశ్వ నిర్మాణమందలి యనేక యితర విషయములపై నాధారపడియుండును. విశ్వనిర్మాణము విశ్వజీవిపై నాధారపడియుండును. విశ్వజీవి సర్వత్ర స్వతంత్రము, సర్వాధారమునైన సర్వాంతర్యామిపై నాధారపడి యుండును. తమ రక్షణ ప్రయత్నము లన్నియు నీ అన్నిటియొక్క సర్వము యొక్క వివిధ స్థితులపై నాధారపడియున్న దుంగలపై నాధారపడియున్నది.

కొందరు జనుల కాధారమునిచ్చిన దుంగలు సురక్షిత స్థానము చేరుటకు అధికముగ నీటివరద కావలసియుండ వచ్చును. అదే సమ యమున మరికొన్ని దుంగల నాశ్రయించిన ప్రజలను సురక్షిత ప్రదేశ

మునకు జేర్చుటకు నీటి తొట్టెలు కావలసియుండవచ్చును. మొదటి దుంగల యొక్క ఆశయ సంసిద్ధి, రెండవ దుంగల యొక్క కర్తవ్య వైఫల్యమునకు కారణమగుచున్నది. ఇట్టి పరాధీనత యెల్లప్పుడును, అన్ని దశలయందును కూడ, అనేక సంభవాసంభవములతో కూడి యున్నది. అందువలన నితరములపై నాధారపడియున్న దుంగల నాశ్ర యించుట సర్వదా క్షేమప్రదము కాక పోవచ్చును.

అదే పరిస్థితుల యందున్న అదృష్టవంతులైన సామాన్య మాన వులు సర్వాంతర్యామిపై నాధారపడి, దుంగలను పట్టుకొందురు. అప్పుడు దుంగలలోని సర్వాంతర్యామి అనగా దుంగలున్న ప్రదేశము లోని సర్వాంతర్యామి, ప్రవాహములోని సర్వాంతర్యామి, వర్షములు, భూమి, సముద్రము, ఆకాశము, వేడి, సూర్యగోళము, విశ్వనిర్మాణ పరిస్థితులు, వారి శరీరములలోని విశ్వజీవి, వారి శరీరములుగల ప్రదే శములోని సర్వాంతర్యామి, వారిలోని సర్వాంతర్యామిపై నాధార పడుదురు. సర్వాంతర్యామి సర్వత్ర స్వతంత్రమగుట వలన సర్వదా ఆధార పడదగినది. వారి శరీరములు రక్షింపబడినను రక్షింప బడక పోయినను, ఆ వ్యక్తులు మాత్రము రక్షింప బడుదురు. వారి సౌఖ్య క్షేమములు సురక్షితములు. సర్వాంతర్యామికి చెందినట్టిదియు, లోనై నట్టిదియు "సర్వము" (all) పైకంటె సర్వాధార్యమైన సర్వాంతర్యా మిపై (All-in-All) నాధారపడినవారు, వారికి మూలమైన విశ్వజీవి యొక్క అనుభూతిని పొంది, మరల మూలస్థితిని పొంది, మూలస్థితితో తాదాత్మ్యము తన్మూలమున సర్వాధారులునై, సర్వాంతర్యామితో నేకత్వమును పొందుదురు.

అనాధార్యములపై నాధారపడిన మానవులు "సర్వాంత ర్యామి" పై గాక "సర్వము" పై నాధారపడినవారు తమకు మూల

మైన విశ్వజీవితో తాదాత్మ్యమును పొందలేక పోవుటయే గాక, ఏకత్వాను భూతినికూడ పొందలేరు. వారు తమ వ్యక్తిత్వమున కతీతులు కాలేరు. విశ్వతత్వస్థితిని సాధించలేరు. మూలమైన విశ్వజీవితో తాదాత్మ్యమును పొందలేరు. అందువలన విశ్వజీవికి జెందినవియైన ప్రమాణములోని యేదియో దానిపై ఆధారపడియుండవలసివచ్చును. ఇట్టి స్థితి రాబోవు ప్రళయకాలమందు "సర్వము"ను బాధాయుతముగ మునిగిపోవువరకును సాగుచునే యుండును.

అందువలన, సర్వాంతర్యామిపై నాధారపడకుండ, సర్వాంతర్యామిపై నాధారపడియున్న సర్వముపై నాధారపడుట మానవులకు తగనిపని. ఒక సంపదలను సంచితము చేయుటకు సామర్థ్యములేని సామాన్య మానవులే మానవానీకమునందు బహుధా అదృష్టవంతులు. కూడబెట్టుటయందు వారు అసమర్థులగుటవలననే, వారు శక్తి పరిణతి పొందిన మహానుభావుల సాహచర్యమున కర్హులగుచున్నారు. కాలక్రమమున, అట్టి శక్తి పరిణామమును వారును పొందుట సాధ్యమగును. అందువలన అట్టివారి సాహచర్యము నందుండి వారి ప్రబోధములను, ప్రేమ శ్రద్ధ, ఉత్సాహములతో అనుసరింపవలెను.

యుక్తాయుక్త విచక్షణ జ్ఞానము మీకు లేకపోవుట వలనను, చాల కాలము పరాధారులపై నాధారపడియున్న వారి సాహచర్యములో నుండుటచేతను. మీలో తగినంత సూక్ష్మశక్తి లేకపోవుట చేతను, మీకుగల యవగాహన శక్తి సహజ వివేకమునకు లోనైన దగుటవలనను, ఈ పరిణతి పొందిన నూతన సహచరుల వైఖరి, విధానము, ప్రబోధములలో మీకు కొంత అసంబద్ధత గోచరింపక మానదు. వారి సూక్ష్మ అతిసూక్ష్మేంద్రియములు సక్రమ వ్యవహారము గలిగియున్నవి. వారు బాధ్యతాయుతులు. ఈ విశ్వమునందు

సర్వము అశాశ్వత మనియు, సర్వాంతర్యామియే శాశ్వతమని యెరిగిన వారు. వారి విధానములు, వైఖరి మీభావనల కతీతములై యుండ వచ్చును. వారి విధానము, ప్రవర్తన అనుభవ సిద్ధములైన భావము లపై నాధారపడి యుండును. శక్తి పరిణామ మూలమున విజ్ఞాన సాఫల్యమును పొంది తమనుగూర్చి తమ శరీరములనుగూర్చి విశ్వమును గూర్చి; సర్వాంతర్యామినిగూర్చి యీ యన్నిటికిని గల పరస్పర సంబంధమును గూర్చి వారి వ్యవహారము, బాధ్యత, కర్తవ్యములపై నాధారపడి యుండును.

అదేరీతిగ, తమ శరీరములతో సహా విశ్వమందలి సమస్త వస్త్వాది విషయముల యెడల వారి వైఖరి, ప్రవర్తనలు, మానవ సమైక్యత, మానవ కర్తవ్యమునందలి యేకత్వము, శాంతి, సంపద, సమైక్యతలతో కూడిన అభ్యుదయ పథమున కర్తవ్యమును సాధించెడి సిద్ధాంతముల సమైక్యతను సూచించును. అందువలన వారి ప్రవర్తన స్వభావములు అసంబద్ధములని మీలో కలిగెడు భావము తప్పయి నప్పటికిని కొంతవరకు సమర్ధనీయమే. ఏలనన మీ భావములు సహజ వివేకము యొక్క ప్రాబల్యము కలిగినవి. మీ సహచరులను గూర్చి సంపూర్ణముగ నవగాహన చేసికొనుటకు మీ సహజ వివేకమునకు సాధ్యముకాదు. ఎందువలన సాధ్యముకానిదియొ కూడ మీకు అవగాహనకాదు. ఇట్టి కారణములను దూరము చేసెడి విధానము కూడ మీకు తెలియదు. మీలో నింత అసమర్థత యున్నను, మీ సహచరు లను మామూలు విధముగకాక కొంచెము ప్రత్యేకముగ సహజ వివేక సహాయమున పరికించిన యెడల అనుభవ సిద్ధమైన విశ్వాస మును పొందుటకును, వారిని సక్రమావగాహన చేసికొనుటకును మీరు శక్తిని పొంద కలుగుదురు.

ప్రపంచమందలి సమస్త జీవ వస్తు విషయాదులను గూర్చిన వారి చర్యలు, మాటలు, ఆలోచనలు విశ్వ సిద్ధాంతానుసారము, మానవ సమైక్యత, మానవ కర్తవ్య సమైక్యత. సిద్ధాంతముల సమైక్యతపై నాధారపడి యుండును. ప్రస్తుతము వారి యాలోచనలు విధానములు మీ యాలోచనల కతీతములై యుండును. కాని వారి చర్యలు మాటలు సామాన్య వివేకముయొక్క ప్రాబల్యముతో కూడిన మీ యూహల కతీతములు కావు. వారి మాటలను స్వయముగను, వారి వలన వినిన యితరుల మూలమునను వినుడు. స్వయముగను, వానిని చూచిన యితరుల ద్వారాయును వారి చర్యలను గమనింపుడు. ఆ మాటలను, చర్యలను పోల్చి చూడుడు. ఆ రెంటియందును, ఆ రెండిటికిని మధ్యను అసంబద్ధత లున్నవేమో పరికింపుడు. అవి పరస్పర విరుద్ధములేమో తిలకింపుడు. వారి చర్యలు మాటల కనువాదములైన యెడల అవిమీకు ముఖ్యములనియును, అభ్యుదయ సూచకములనియును గమనింపుడు. మీ రంగీకరించిన వానిని మీ మాటలలోనికి అనువదింపుడు. ఈ రీతిగ మీరు వారి మాటలను, చర్యలను తన్మూలముగ వారినే అనుసరించుచున్నారు. ఇట్లు చేయుటవలన కాలక్రమమున, మీ మాటలకును చర్యలకును సామరస్యము కలుగును. మీ మాటలును, చర్యలును మీ యవగాహనతో సామరస్యమును పొందును. తన్మూలమున మీకును, మీ రంగీకరించిన వారి మాటలకు, చర్యలకు, మీ యవగాహనలకును సామరస్యము కలుగును.

కాని, మీలో తగినంత సూక్ష్మశక్తి, లేకపోవుటచేత, సూక్ష్మేంద్రియములు సక్రమముగ వ్యవహరింపక పోవుటచేత మీ యంతట మీరు జీవ వస్తువిషయాదులను గూర్చి సక్రమముగ అవగాహన చేసికొనలేరు. అయినప్పటికినీ మీకును, మీ భావనలకును, మాటలకును, చర్యలకును సామరస్యము సాధించెదరు. మీ సహజ

వివేకము సక్రమముగ వ్యవహరించుట వలన కలిగెడు ఫలితమే యీ సాధన. పరిణతి పొందిన మహావ్యక్తులతో నిరంతర సంపర్క సంసర్గ ముల వలన మీ ప్రమాణ మానవ విజ్ఞానమును ప్రయోగించుట సాధ్యమగును.

మానవులుగ, అభ్యుదయమును సాధించుటకు మీ రిక్కడ ప్రథమ సోపానముపై నున్నారు. ఈ ప్రయోజనము కొరకే నిన్నటి మానవేతరులయిన మీరు నేటి మానవులయి యున్నారు. ఇదియే మీ శక్తి పరిణామ విధానమునకు ప్రారంభము. సక్రమానగాహనా మూలమైనట్టియు, జీవ వస్తు విషయాదులతోడి సామరస్య వ్యవహార మూలమున కలిగిన సంతృప్తియందు ఒకానొక వర్ణనాతీతము, ఊహా తీతము, ఆనందదాయకమైన సంప్రీతియున్నది. మీరు శక్తిపరిణామము నొందియుండుట మూలమున, బాహ్యాపథము నందున్నను, అభ్యుదయ పథమునందున్నను మీకు ఆ తృప్తి కలుగును. అది మీ యింద్రి యములకు కలుగదు.

ఇంద్రియముల ద్వారా కలిగెడు ప్రీతియందు మీ సంతోషాను భూతి యొక్క అస్పష్టమగు జ్ఞాపకము మాత్రమే యుండును. కాని ఆ యనుభూతులను మరల మరల పొందుటకు తగు శక్తియుండదు. వ్యక్తులకు కలిగెడు రెండవరకపు ప్రీతి ఒక్కమారే యనుభవించినప్పటికిని, పరిణతి పొందిన మహావ్యక్తుల సాంగత్యము వలన పొందబడిన దగుటవలన జీవ వస్తు విషయాదులతోడి ఆ సామరస్య వ్యవహారము అంతమొందుటయు, పరిణతి పొందిన మహావ్యక్తులతో నిరంతరము సాంగత్యమును, శక్తిపరిణామమును సాధించు విధానముల ననుస రించుచు, తననుగుణముగ వ్యవహరించునట్లు చేయును. ఇట్టి స్థితియందు గలిగిన ప్రీతియందలి ఆనందానుభూతిలో, నిరంతరానందానుభూతి కొరకు

మరల మరల పాటుపడునట్లు చేయగలశక్తి అంతర్గతమై యున్నది. మీ సూక్ష్మేంద్రియములు సక్రమముగ వ్యవహరించుచున్నవి కనుక, మీ భావనలు మాటలు చర్యలు సామరస్యము కలిగియుండుటచే మీ విచక్షణ, అనుభూతి, భావనల ననుసరించి, మీ వ్యవహారములను గూర్చి సరియగు నిశ్చయములకు మీరు రాగలుగుదురు. అందువలన పరిణతి పొందిన మహావ్యక్తులతో నిరంతరము సాంగత్యము కలిగి యుండుటవలన మీ మాటలు, చర్యలు, మీ అవగాహనాశక్తితో సామరస్యము నొందును.

మీ శరీరములతో సహా సమస్త వస్తు విషయాదులతోడి వ్యవహారములయందు, సహజ వివేకము ద్వారా పొందిన యీ సామరస్యము వలన అందరి యెడల మీ వైఖరి విధానములు మారును. అభ్యుదయ పథమున పురోగమించుటకు మానవు లధిగమించవలసిన ప్రథమ సోపానమే యిది. ఇది సంసర్గమువలనను, శక్తిపరిణామము వలనను గూడ సాధించబడగలదు. ఏ రీతిగ సాధింపబడినను, ఈ సామరస్య స్థితియే కొంతవరకు వ్యక్తిసామరస్య (Partial individual harmony) మగును. శక్తిపరిణామ సిద్ధాంతముల ద్వారా పొందెడి యీ యభ్యుదయ విధానములో నీ అసంపూర్తి వ్యక్తిసామరస్యము సర్వతోముఖ - సంపూర్ణ - వ్యక్తి - సామరస్యముగ (all round individual harmony) మారును. ఈ సర్వతోముఖ వ్యక్తి సామరస్యమును సాధించుటయే మానవాభ్యుదయ శిఖరావస్థ. మానవ ప్రయత్న సాఫల్యకిరీటము.

ఈ సర్వతోముఖ సామరస్యమును సాధించిన పిమ్మట, వ్యక్తుల భావనలు, విచక్షణ, నిశ్చయము, మానము, సౌంజ్ఞ, మాటలు, చర్యలు వారివొక్కయు, వారి శరీరముల యొక్కయు నిర్మాణముల యందలి

భౌతిక, లక్షణములతోడను సిద్ధాంతములతోడను సామరస్యము కలిగి యుండును. మానవ కర్తవ్యమును మానవోచితముగ సాధించుటకు సర్వాంతర్యామితో నిరంతర సామరస్యము గల విశ్వరూపమయిన విశ్వజీవితో సామరస్యము గలిగి వ్యవహరింతురు.

సశరీరులును, అశరీరులును నయిన వ్యక్తుల యీ వ్యవహారము లన్నియును విశ్వజీవి యొక్క సారూప్యవ్యవహారములతో సామరస్యము కలిగియుండును. నిరంతరము, శాశ్వతమునయిన యీ విశ్వప్రదేశము నందు, సర్వవ్యాప్తము, అవధిరహితమునయిన విశ్వజీవియొక్క, విశ్వ శరీరపు భావనలు, విచక్షణ, నిశ్చయము, మానము, సంజ్ఞలు, ఆలో చనలు, మాటలు, చర్యలతో సామరస్యము కలిగియుండును. విశ్వజీవి, విశ్వశరీరము వ్యవహరించెడి విశ్వసిద్ధాంతములతో సామరస్యము కలిగి యుండును. విశ్వజీవి, విశ్వశరీరపు పరమాశయములతో సామరస్యము కలిగియుండును. అందువలన విశ్వమందలి సమస్త వస్తు విషయాదుల తోడను, అన్నిటికిని ఆధారమయిన సర్వాంతర్యామి తోడను సామ రస్యము కలిగియుండును.

అదృష్టవంతులయిన నవ్యమానవులారా! వస్తు విషయాదులను అధికముగ కూడబెట్టుట యందు మీరసమర్థులయియున్నారు. పోషణ పదార్థము లన్నియును పరాధీనము లనెడి విషయపరిజ్ఞానము వలన కాకపోయినను, వానిని కూడబెట్టుటకు అసమర్థత వలననయినను, లేక వానిని అధికముగ కూడబెట్టవలెనను కోరిక కలిగియుండుట వలనను, మీరు కనీసపు అసంపూర్ణవ్యక్తి సామరస్యమును పొందుచున్నారు. మీ పూర్వసహచరుల అసామరస్యవ్యవహారము, మీకు పరిణతి పొందిన మహావ్యక్తులతో గల సాహచర్య మిందుకు సహాయపడు చున్నవి. మీ పూర్వపు, ప్రస్తుతపు పరిస్థితుల యొక్క జ్ఞాపకము వల

నను, ఇవన్నియు ఎట్లు, ఎందుకు అనెడి విచారణల వలనను అధిక సంచయ వాంఛను మీరు పూర్తిగా పోగొట్టుకొనవలెను. పరాధారులపై ఆధారపడకూడదను భావముల యొక్క స్మృతులను మీ స్థూల సృజనేంద్రియములపై స్థిరముద్రితము గావింపవలెను. సహజ వివేకానుభవము వలన కలిగిన అనుభవపూర్వకమైన యీ భావముద్రణ వలన మీ స్థూల సృజనేంద్రియములు అధికముగకూడబెట్టుట యనెడు వాంఛలకు చోటీయుటకసమర్థములు కావలెను. సుస్థిరములయి మీ శరీరములతో సహా వస్తువిషయాములతోడి వ్యవహారములలో సామరస్యము నవలంబించుచు దృఢముగ వ్యవహరింపుడు.

ఈ పరిస్థితి యొక కఠినపరీక్షవంటిది. ప్రలోభముతో కూడియున్నది. కొంతవరకు వ్యక్తి సామరస్యమును సాధించినందువలన మీరు మరియొక నిర్మాణాత్మక శక్తికూడ సాధ్యమగును. తత్ఫలితముగ మీరు పూనుకొనిన కార్యములను జయప్రదముగ సాధింపగలుగుదురు. ఈ శక్తి నెందుకొరకయినను ప్రయోగింపవచ్చును. ఈ శక్తి యొక్క లేశమాత్రముతో నయినను సాధారణముగ, మానవులకు అవసరమగు ఆవశ్యక వస్తువిషయాములను సమకూర్చుకొనవచ్చును. రక్షణపోషణాదులకు కావలసిన అతిసామాన్యమైన జాగ్రత్తలను మాత్రమే మీరు కూడ తీసుకొనుడు. వాని బాధ్యత నంతయు మీ పైన పెట్టుకొనవలదు. మిగిలినదంతియు రాజకీయమునకు విడిచిపెట్టుడు. మీ మిగిలిన శక్తినంతను, సృజన విధానములో మీ సృజన శక్తిని అధిక వినియోగము చేయకుండ నిలువజేసి, శరీరములలోననే గ్రహింపబడి తన్మూలమున శరీరములు శక్తివంతములగుటకు వినియోగింపుడు. ఈ శక్తివంతములయిన శరీరములు సూక్ష్మశక్తి పరిణామకారులై, మిమ్ములను మీ శరీరములతోసహా సమస్త వస్తు విషయాదుల యెడల వ్యామోహమునుండి తప్పించి, మానవ సమాజము

నకు బాధ్యులుగ చేయును. కొంతవరకు సామరస్య స్థితివలన పొంద దగిన అత్యధిక ఫల మిదియే. ఇది మీకేగాక మానవ కర్తవ్యమును మానవోచిత రీతిని సాధించుటకు సమస్త మానవానీకమునకు తప్పని సరిగ కావలసినది.

సూక్ష్మేంద్రియములలో తగినంత సూక్ష్మశక్తియుండవలెను. ఆ సూక్ష్మశక్తి ప్రసారము కలిగి యుండవలెను. అప్పుడుకాని సరియైన ప్రేమ బయలుదేరుట, ఆ ప్రేమ నితరులయందు ప్రయోగించుట సాధ్యముకాదు. అందువలన మీకు మీచే సాధింపబడిన కొంత సామ రస్యమును, వస్తు విషయాదులతోడను సమాజముతోడను మీకుగల సంబంధమును, మీరు సాధించిన సామరస్య మూలముతో సమరస ముగ వ్యవహరించెడి సిద్ధాంతములను తరచుగ స్ఫురణకు తెచ్చు కొనుటయేగాక, ఆ స్ఫురణకు తెచ్చుకొనుటను మీకొక యలవాటుగా చేసికొనుట మీకు అభ్యుదయ దాయకమగును. ఈ యలవాటు మిమ్ము లను అధిక సంచయ ప్రలోభమునుండి కాపాడును.

సృజనశక్తినుండి సూక్ష్మశక్తి యుత్పన్న మగును. సృజనశక్తి రక్తమునుండి యుత్పన్నమగును. రక్తము పోషణ పదార్థములనుండి యుత్పన్నమగును. అందువలన మీ శరీరములకు, ఆరోగ్యవంతములుగ నుండుటకు కావలసినంత ఆహారము కావలెను. తత్కారణమువలన, పంట కాలమునుండి మరల పంటకాలము వచ్చువరకు మీ శరీరము లకు కావలసిన ఆహార పదార్థములను పండించుటకు కావలసినంత భూమియు, వ్యవసాయమునకు కావలసిన యితర సాధన సంపత్తిని పొందుటకు మీకు నిరాక్షేపణీయమైన హక్కు, ఆవశ్యకతయు గలవు. అవసరమునకు కావలసినంత మాత్రమేగాని, అధిక సంచయముకొరకు మాత్రము కాదు. మీ శరీరముల రక్షణను రాజకీయమునకు విడిచి

పెట్టినట్లే భూములయొక్కయు, వ్యవసాయ సాధన సంపత్తియొక్కయు. రక్షణ భారమును గూడ రాజకీయమునకు విడిచిపెట్టవలెను.

మీ శరీరములను, భూములను. ఆస్తి పాస్తులను రక్షించుకొను హక్కు మీకు లేకపోయినందున కాదు కాని, సమాజమునందలి వ్యవహార విభాగ విధానము ననుసరించి మీ రట్లు చేయవలెను. అందువలన రాజకీయ సంస్థ పటిష్ఠమై సమాజమునెడల తనకుగల బాధ్యతలను సక్రమముగ నిర్వహింపగలుగును. అంతేగాక, శరీరములను, ఆస్తి పాస్తులను కాపాడుకొనుటకు మీరే పూనుకొనినయెడల, మీ శ్రద్ధాసక్తులా పనియందే లగ్నమై అతి జాగ్రత్తగ పొందుపరచబడినట్టియు, అమూల్యమైనట్టియు, అభ్యుదయ సాధకమైనట్టియు, విశ్వ జీవితో తాదాత్మ్యానుభూతిని గలిగిన శక్తులు వినియోగమైపోవును.

అంతేగాక, మీరే యీ బాధ్యతలకు పూనుకొనినయెడల, మీలో మిగిలియున్న శక్తిశేషము అత్యల్పము, అసమర్థము నగుటవలన సూక్ష్మశక్తిగా మారలేక, సామరస్య సిద్ధిని కొంతవరకు పొందియుండుటవలన నిర్మాణాత్మక శక్తి కలిగియుండుటవలన, అధిక సంచయ ప్రలోభమునకు లోనయి, అట్టి కార్యక్రమమునందు వినియోగ పడవచ్చును. అప్పుడు మీ చర్యలకు మాటలకు నడుమగల సామరస్యము పోవును. అందువలన పరిణతి పొందిన మహావ్యక్తులతోడి సాంగత్యమునకు మీ రనర్హులగుదురు. అట్టివారితో సాంగత్యమునందు మీకు ఇచ్చకూడ పోవును. అధిక సంచయమున కలవాటుపడిన మీ పూర్వ సహచరులతో సమానమయి దురదృష్టమానవులవలెనే మీరును అగుదురు. అందువలన మీ శ్రద్ధాసక్తులను ఆస్తిపాస్తుల రక్షణయందు వినియోగింపక అట్టి బాధ్యతలను రాజకీయమునకు విడిచిపెట్టవలెను.

అట్లు కాకుండ. మీరు ప్రలోభమునకు గురికాకుండ వ్యవహరించినచో వస్తువిషయముల యెడల, సమాజము యెడల మీ వైఖరి,

అధిక సంచయమునందు మీరు ప్రదర్శించు నిర్లిప్తత, మీ పూర్వ సహచరుల యింద్రియములపై ముద్రితములై వారి నాకర్షించును. అధిక సంచయ శక్తి మీరు కలిగియున్నప్పటికిని మీ మాటలకు క్రియలకు గల సామరస్యమువలనను, మీ ప్రస్తుతస్థితి; దానికి మూలము, లక్ష్యము, అభ్యుదయములను మీరు జ్ఞాపక ముంచుకొనుటవలన నిది జరుగును. దురదృష్ట మానవులీ ముద్రణలయందు ప్రీతి, ఆసక్తి లేని వారయినప్పటికిని, సామాన్య మానవ విజ్ఞానము వలన కలిగిన సక్రమావగాహనతో కూడినట్టియు, మాటలును, చర్యల సామరస్యముతో కూడిన మీ వలన వారిలో కలిగిన ముద్రణలను వారు తుడిచివేయలేరు. ఆ ముద్రణలు కూడ పొందిక, పట్టుదల, నిర్మాణ శక్తితో కూడి యుండును.

ఈ ముద్రణలలోని పొందిక, పట్టుదల, నిర్మాణశక్తులు, వ్యక్తుల నిర్బంధితాసక్తులచే కదల్చబడి, అక్కడక్కడకల సారూప్యశక్తులచే సహకరింపబడి, వ్యక్తులయొక్క స్థూల సృజనశక్తులలో సంచలనము కలుగజేసి, వారి యింద్రియముల యందదివరకు గల, అసామరస్య పూర్వకములైన ముద్రణములను తేజోహీనములుగ జేయును. ఈ సంచలనము పూర్వ ముద్రణలన్నియు పూర్తిగ పోవుట గాని, సామరస్య పూర్వక ముద్రణలుగా మారువరకు సాగుచునే యుండును. పూర్వ ముద్రణలు పోయినపుడు, ఈ సంచలన కాలమందు కలుగు అనుభూతుల ముద్రణలుకూడ వారి యింద్రియములపై నేర్పడును. ఏవిధముగ నయినను, సంచలన కాలానంతరమందు వ్యక్తుల సామాన్య వివేకము శక్తివంతమై, సహజ వివేకముతో సమరసముగ వర్తించుటకు వారిని సమర్థులుగ జేసి వస్తు విషయాదులను సక్రమముగ నవగాహన చేసికొని వ్యవహరించునట్లు చేయును. స్థూల సృజనేంద్రియములుకూడ, వాని యవగాహనలను కార్యరూపము నొందిం

చుటయందు ప్రీతిని కలిగియుండును. ఈ రీతిగ వారి యవగాహనలకు, మాటలకు, చర్యలకు సామరస్య మేర్పడుటవలన కొంతవరకు వ్యక్తి సామరస్యము సాధింపబడుచున్నది.

ఇక్కడనుండి శరీరములతో సహా వస్తు విషయాదుల యెడల, మీ యెడల, సమాజము యెడల, వారి వైఖరి, ప్రవర్తన, మీ వైఖరి ప్రవర్తనలవలెనే యుండును. వస్తు విషయాదుల యెడల వారికి గల వ్యామోహము బాధ్యతగామారి, అధికసంచయేచ్ఛపోయి మీ వలెనే అదృష్టవంతులయిన సామాన్య మానవులగుదురు. ఈ విధముగ కాల క్రమమున దురదృష్టజీవులు, ఒక్కరుకూడ లేకుండపోవుదురు. మానవేతర జీవులకు సహజ వివేకము లేదు. కావున "అదృష్టము, దురదృష్టము" అను పదములు వారికి వర్తింపవు. ఈ రీతిగ మానవా నీకములో దురదృష్టమను పదము ప్రయోజన శూన్యమయి శాశ్వత ముగ అనవసరము కూడ నగును.

శరీరముల యొక్కయు, ఆస్తిపాస్తుల యొక్కయు, పోషణ పదార్థముల యొక్కయు రక్షణ భారమును రాజకీయమునకు మీరు విడిచిపెట్టవలసి యున్నారు. మీరనుసరించు విధానము ఆధ్యాత్మిక సిద్ధాంతముల ప్రకారము సక్రమమయినది. మీ యీ సమరస వ్యవ హారము వలన అధిక సంచయము నందు ఆకాంక్ష కలిగియున్న దుర దృష్టవంతులు కూడ కొంతవరకు వ్యక్తి సామరస్య భాగమునుపొందుట నిస్సంశయము. అందువలన వస్తు విషయాదులపట్ల వ్యవహారములలో మీరే విధమునను ఒక్కక్షణమైనను సామరస్యమునకు భిన్నముగ వర్తింపరాదు. అంతేగాక, సర్వధా ఆధార్యము, సర్వత్ర స్వతంత్రము నయిన సర్వాంతర్యామిపై మీకు గల ఆధారమును విస్మరించరాదు.

సామాన్య సంచయమునందు మీకు గల తృప్తి అధికసంచ యము నందలి నిర్లిప్తత, అధికసంచయపరులలో గల అధికసంచయ

వ్యామోహము నంత మొందించును. సామాన్య అవసరములకు కూడ బెట్టెడి విధానములో మీకు కలిగెడి సంతోషోత్సాహములు, మీరు పొందెడి కార్యసాఫల్యములు వారి స్థూల సృజనేంద్రియములయందు ముద్రితము లగును. ఆ ముద్రణలు వారినికూడ క్రమముగ సంతోషోత్సాహములు కలవారిగ జేయును. కాని యిట్టి మార్పు వారి యింద్రియములకు ప్రీతికరమైనది కాకుండుటచే వారిలో సంచలనము బయలు దేరును. ఈ సంచలనము ప్రారంభమైనది మొదలు అంతమగు లోపుగ సంతోషోత్సాహములు గల వ్యక్తుల వైఖరి విధానములు రెండవ వారికంటె బలవంతములై సంచలనము నంత మొందించును.

ఈ స్థితియందు సహజ వివేకము సక్రమముగ నవగాహన చేసి కొనును. అధిక సంచయ ముద్రణలు సంతోషోత్సాహములకు ప్రతి బంధకములని గ్రహించును. ఆస్తిపాస్తులను భారముగ భావించును. ఇట్టి స్థితియందు స్థూల సృజనేంద్రియములు, సహజ వివేకమునకు వశవర్తులగును.

సహజ వివేకమునకు వశవర్తులయిన స్థూల సృజనేంద్రియ ములు, సూక్ష్మేంద్రియములు సక్రమముగ వ్యవహరించుట ప్రారం భించిన తరువాత వానికి వశవర్తులగును. దానితో అట్టి మానవులకు సహజ వివేకమును వినియోగించెడి యావశ్యకతయే యుండదు.

ఇప్పుడు స్థూల సృజనేంద్రియములు అధిక శక్తివంతములగు సూక్ష్మేంద్రియముల సంచాలనము క్రిందనుండును. విశ్వమందలి స్థూల, సూక్ష్మ ఆధ్యాత్మికాది సమస్త విషయముల సాధారణ అసాధారణ భావములను అవి సక్రమముగ గ్రహించి వ్యవహరింప గలుగును. సహజ వివేకము పరిమితమయిన దగుటవలన, తదనుగుణముగ సాధా రణ మానవ విజ్ఞాన పరిధులకు లోనై మాత్రమే మానవులు వ్యవహ రింప గల్గుదురు.

ఇంతవరకును సూక్ష్మేంద్రియములయందు తగినంత సూక్ష్మ శక్తి లేకుండుటచే అవి అసమర్థము లగుటవలన, బాహ్యోన్ముఖము లయిన వ్యక్తి యహములే స్థూల సృజనేంద్రియ సంచాలన గావించు చుండెను. వ్యక్తి యహములకే యింద్రియములు వశవర్తులై యుండెను. వ్యక్తి యహములు బాహ్యోన్ముఖములై యుండుటవలన, అవి జీవులనే విస్మరించి తామే జీవులవలె ఇంద్రియములతో వ్యవహ రింప దొడగినవి. ఇంద్రియములాస్థితి నంగీకరించినవి.

ఇప్పుడు సూక్ష్మేంద్రియములు చైతన్యవంతములై, శక్తివంత ములయి, స్థూల సృజనేంద్రియముల కాధిపత్యము వహించుటవలన వ్యక్తి యహములకుగల వ్యక్తిత్వము, స్థూల సృజనేంద్రియములపై ఆధిపత్యము పోవును. వ్యక్తి యహముల ప్రోత్సాహ మణచిపెట్టబడి నది. వాని స్వాతంత్ర్యము పారతంత్ర్యమై పోయినది. స్వయముగ తెచ్చిపెట్టుకొనిన వ్యక్తిత్వము పోయినది. వ్యక్తులపై అహము లాధార పడి యుండుట విదితమగుటతోడనే, వ్యక్తులు యహములపై తమ యాధిపత్యమును చలాయింతురు. అచ్చటనుండి వ్యక్తి తన అహ ముపై అధికారయుత ప్రవర్తన వైఖరులను ప్రదర్శించును. వెంటనే అహముల బాహ్యోన్ముఖత ఊర్ధ్వముఖముగ మారి, అహము వ్యక్తికి వశవర్తియై వ్యవహరించును.

ఇక్కడనుండి వ్యక్తి అభ్యుదయ మార్గముననున్న అహము ద్వారా వ్యవహరించుచు సూక్ష్మేంద్రియములను అన్ని విధములుగను అన్ని భావములలోనను సంచాలనము చేయును.

స్థూల సృజనేంద్రియములు, సామాన్య వివేకమునకు వశవర్తు లయిన తరువాత, సూక్ష్మశక్తి నిర్మాణమై సూక్ష్మేంద్రియములు వ్యవహరించులోపున, స్థూల సృజనేంద్రియములపై అదివరకుగల

అసామరస్య ముద్రణలుపోయి, సహజ వివేకముయొక్క సక్రమావ గాహనవలన ఆస్తి సంచితములను విస్మరించుటకును తమ అవసరముల కంటె అధికముగ నున్నవాని భారమును రాజకీయమునకు అప్పగించి తమకు అత్యవసరములయి। వానితోడనే తృప్తిపడునట్లును చేయును.

అధిక సంచితముల భారము క్రింద కృంగి యున్నప్పటికంటె, ఈ యుత్సాహానందములు అధికమగు ప్రీతిని కలిగించును. అధిక సంచయ పరులైన నేటి దురదృష్టవంతులు, అసామరస్య సామాన్య మానవులు మీా యుదాహరణ ననుసరించి రేపటి అవసరములు కావ లసినంత మాత్రమునే గ్రహించినట్టియు, సామరస్య వ్యవహారముగల అదృష్టవంతు లగుదురు. అందువలన నెట్టి పరిస్థితులలోను అధిక సంచయ వ్యామోహామునకు లొంగక మీారు విశ్వమందలి దురదృష్ట మానవులకు విశ్వాత్మభావ ప్రబోధ మగునట్లు వ్యవహరించు చుండ వలెను.

ప్రస్తుత ప్రపంచ రాజకీయము తనను విడిచిపెట్టకుండ, తన యందే యుండుచున్న ఆధ్యాత్మికత్వమును గుర్తింపక మతమునకు తాను వశవర్తియయి వ్యవహరించు చున్నందున దుఃఖదాయకము, జాలికరమునగు అశాంతి, కల్లోలము అభిశాపస్వరూపకమగు సంఘర్ష ణలు నేడు రాజకీయమునందు విశ్వజాడ్యమువలె వ్యాపించి యున్నవి. ఈ పరిస్థితికి ఫలితముగ ఒక తప్పుడు నిర్ణయమ్మైనను చేయుటకుకూడ రాజకీయ మసమర్థమయి, అధిక సంచయ పరులతోడను, అధిక సంచ యములతోడను సరియగు విధమున వ్యవహరింపజాలకున్నది.

భావికాలమం దుత్పత్తి కాబోయెడి వస్తు విషయాములను గూర్చి, సమానత్వము లేకపోవుటచే చంచల మైనప్పటికిని, కొంత వరకు సరియయిన నిర్ణయము తీసికొన్నది. కాని యిదివరకే ఉత్పత్తి

మైన వానినిగూర్చి యెట్టి నిర్ణయమును చేయలేదు. అట్టి నిర్ణయము చేయని యెడల రాజకీయ విశ్వ దుఃఖము అనివార్యమగును. అట్టి రాజకీయము సమాజమునకు సక్రమముగ సేవచేయలేదు. సమాజాభ్యుదయమునకు సహాయపడలేదు. అట్టి రాజకీయము తన కర్తవ్యమును బాధ్యతాయుతముగ నిర్వహింపలేక మానవ సమాజమును అవాంఛితమైన యాతనాయుత ప్రళయమువైపు నడిపించును. అనైక్యత, అశాంతి, కల్లోలము, దారిద్ర్యము బాహ్యాభివృద్ధి కలుగజేయును. అందువలన శాంతి, సమైక్యత, అభ్యుదయముల ద్వారా పొందదగు యాతనారహిత విశ్వ విశ్రాంతి దూరమై పోవును.

అవసరమునకు మించిన ఆస్తిపాస్తులను, వెండి బంగారములను అధిక సంచయపరులు రాజకీయమున కందజేసిన చాలవరకు విశ్వజాడ్య నిర్మూలనమయి, రాజకీయము ఆరోగ్యవంతము పటిష్ఠము నగును.

ఆరోగ్యవంతమయిన పరిస్థితులు కలిగిన రాజకీయము తనలో నున్న ఆధ్యాత్మిక మూలమునుండి వ్యవహరించుచు, ఆధ్యాత్మిక మహా వ్యక్తుల యాదేశానుసారము ఐక్యత, శాంతి, సంపదలను నెలకొల్పి అభ్యుదయ పథమున సమాజమును నడిపించుచు సక్రమముగ తన కర్తవ్య సంసిద్ధిని సాధింప గలుగును. మానవుల సమైక్యత, వారి బాధ్యతల సమైక్యత, వారి ఆశయముల యేకత్వము సిద్ధాంతముల యేకత్వమును నెలకొల్పి మానవ కర్తవ్యమును మానవోచితముగ సాధించును.

ఓ సామాన్య మానవులారా! అధిక సంచయ పరుల యొక్కయు, చంచల రాజకీయముల యొక్కయు, నీ విశ్వ విశ్రాంతి సమయమునందు సునిశ్చితమగునట్టియు, సుస్థిరమైనట్టియు, సమరస పూర్వక మగునట్టియు వస్తు విషయాములతోడి మా వ్యవహారము

వారికి మార్గదర్శకము, దృష్టాంతము కావలెను. పరిణతి పొందిన మహావ్యక్తులతోడి మీకు గల సాహచర్యము వలనను, మీకు సర్వత్ర స్వతంత్రము, సర్వాధారము నయిన సర్వాంతర్యామిపై నాధారపడుట వలనను రాజకీయము సమాజముల నడుమ మీకు ఉత్పత్తి వినియోగ ముల సామరస్యము కలిగించుచు, సమాజమునకు రాజకీయమునకు దృష్టాంతరములై విశ్వమంతటిని అభ్యుదయ పథమున విశ్వ విశ్రాంతి వైపు పురోగమింప జేయవలెను.

అందువలన,

(1) పునరవతారిత మానవులు సాధారణ సంచయములతో తృప్తి పడెదరుగాక !

(2) సర్వసామాన్య మానవులు సాధారణావసరముల సంచ యము చేయకలుగుదురుగాక !

(3) సామాన్య మానవులు పరిణతి పొందిన మహావ్యక్తులతో సాహచర్యమును నిరంతరము పొందెదరుగాక !

(4) సమస్త మానవులు శక్తి పరిణామమును పొందెదరుగాక !



## పదునేడవ అధ్యాయము

# ఇండియా హక్కులు - బాధ్యతలు

ఇతర భాగములకంటె ఉన్నత తలమునందుకల భూప్రదేశము ఇండియా లేక భారత మనబడుచున్నది. సమస్త భూప్రదేశము యొక్క అడుగుభాగము తన పాదములు. సరస్సులు, నదులు, పర్వతములు, సముద్రములతో సహా సమస్త భూతలము తన ఊరువులు. భుజములే భారతమనబడెడి నదీసాగర సంయుతమగు భూప్రదేశము. తన శిరమే స్వామాట్పర్వతము, ప్రపంచ భూశిఖరమునయిన హిమాలయములు. నభోతలమే తన కిరీటము. వెనుకటి ప్రళయమునకు తరువాత, చాల కాలమయిన పిమ్మట వరదలు తగ్గుట తోడనే భూప్రదేశము బయట బడెను. అప్పటివరకును విశ్రాంతియందున్న విశ్వజీవికిని, విశ్వ చైతన్యమునకును మేల్కొలుపదియే. విశ్వ చైతన్యోదయమయిన తరువాత చాల కాలమునకు, ప్రపంచము పూర్వపు స్థితిని పొందిన తరువాత ప్రపంచపు ప్రప్రథమ ఘన భూతల ప్రదేశపు టావిష్కరణ మయ్యెను. అదియే స్వామాట్పర్వత శిఖరము. భారతము కిరీటమును దాల్చెడి శిరఃప్రదేశము.

అదివరకే మేల్కొని నప్పటికిని, అంతవరకు చైతన్యవంతముగ లేని విశ్వ చైతన్యమప్పుడు ప్రారంభమయ్యెను. వరదలు తగ్గి, విశ్వ చైతన్యము ప్రారంభమగుట తోడనే ప్రదేశము, పదార్థమూలము కూడ మేల్కొని వ్యవహరింప దొడగెను. భూశిఖరమయిన హిమా

లయములు బయట పడుటతో బాటు, విశ్వ చైతన్య వ్యవహారము (operation of universal dynamism) మూలపదార్థము, (basic matter) ఉత్పత్తి వ్యవహారములతో బాటు మూలపదార్థము పదార్థములు (matter) భూతముల (elements) ద్వారా విశ్వజీవి వ్యవహరించుటయు ప్రారంభమయ్యెను. హిమాలయ శిఖరము బయటపడిన చాలకాలము తరువాత, హిమాలయమున కాధారముయైన సమతల భూప్రదేశము బయట పడుటకు ముందు అన్ని రకముల వ్యక్తిజీవులుగ విశ్వజీవి సాక్షాత్కారమయ్యెను.

హిమాలయమే మానవుల ప్రప్రథమ వాసస్థానము. అచరములయిన సస్యజీవులకును నిదియే ప్రథమ స్థానము. వివిధరకముల మానవేతరులచే స్పృశింపబడిన ప్రథమ భూభాగమిదియే. ప్రప్రథమమున నీ ప్రపంచ శిఖరమైన హిమాలయమునుండియే, భారత శిరః ప్రదేశము నుండియే మానవులతో సహా వివిధజాతులు, వేర్వేరు భూప్రదేశములు బయటపడినప్పుడెల్ల అటు వ్యాపింపదొడగిరి. తరువాత హిమాలయ పీఠమయిన సమతల ప్రదేశమునుండి వ్యాప్తిజెందిరి. అందువలన, హిమాలయములతో కూడిన భారత భూభాగమే విశ్వమందలి సమస్త జీవులకును పుట్టినిల్లు.

హిమాలయ శిఖరా విష్కరణతో, విశ్వ చైతన్య క్రియా కలాపము ప్రారంభ మయినప్పటి నుండియు, విశ్వజీవి వ్యక్తీకరణ మయినప్పటి నుండియు, వివిధ వ్యక్తిజీవులచే శరీర ధారణయు నివాసమును హిమాలయములయందు, భారతమునందే యగుటవలన ఆ భాగములు విశ్వనిర్మాణమునందు ఇతర భాగములకంటె అధికముగ హక్కులను కలిగియున్నవి.

ఈ హక్కులతో కొన్ని నిర్మాణబద్ధమయిన బాధ్యతలు కూడ నున్నవి. విశ్వనిర్మాణ సామరస్యతను సుస్థిర పరచుటయే ప్రథమ

బాధ్యత. విశ్వజీవియొక్క ప్రేమ, జ్ఞాన, సామర్థ్యములచే నావిర్భూత మైన భూతములు, పదార్థములు, పదార్థమూలము వాని సారూప్య సంస్థితి, వ్యవహారములే ఈ సామరస్యము. ఇవి యన్నియును విశ్వజీవిని గూర్చిన సంపూర్ణ జ్ఞానమును, తన మూలముతో విశ్వజీవికి గల యేకత్వము, స్వజ్ఞాన సహితమయిన విజ్ఞానము, శాశ్వతత్వమయిన సర్వాంతర్యామిత్వమును కలిగియున్నది.

సర్వవ్యాప్తమయిన యీ ప్రేమ, జ్ఞాన, సామర్థ్యములలో, ఆవంత యయినను అసారూప్యత యేర్పడినచో విశ్వనిర్మాణములో పదార్థము, పదార్థమూలము, భూతముల సారూప్య వ్యవహారములలో సామరస్యతకు భంగము వాటిల్లును.

మానవులలో విజ్ఞానము, స్వవిజ్ఞానము తగ్గిపోవుట వలనను, ప్రేమ, జ్ఞాన, సామర్థ్యము లసారూప్యముగ పెంపొందుటవలనను, ఈ సామరస్య హీనత సంభవించుచున్నది. మానవులలోని యీ విపర్యయ పరిణామములకు కారణము వారి సూక్ష్మేంద్రియముల యందు కావలసినంత సూక్ష్మశక్తి లేకపోవుటయే ఇందులకు కారణము. సృజన క్రియలయందు సృజనశక్తిని అసారూప్యముగను, అత్యధికము గను వ్యయపరచుటయే. ఇట్లధికముగ మానవ శరీరము నిర్మాణ మగు టకు కారణము మానవులకు సృజన ప్రయోజనమునందు కంటె, సృజన విధానమునందు ప్రీతి యధికమగుటయే. ఇది విభజిత విశ్వము, విభజిత మానవులు అను మత ప్రబోధిత విశ్వాసములపై నాధారపడిన వర్గ స్వార్థత మూలమున కలుగుచున్నది.

విశ్వనిర్మాణ తత్వమునందు ప్రేమ, జ్ఞాన, సామర్థ్యములు విజ్ఞాన, స్వవిజ్ఞానములయొక్క స్థితియును మానవ నిర్మాణ తత్వము నందు గల ప్రేమ, జ్ఞాన, సామర్థ్యములు, విజ్ఞానము, స్వవిజ్ఞానము స్థితి ఒకే విధముగ నున్నవి.

సాధారణముగ, మానవుల ముఖములు ఆరు నుండి యెనిమిది అంగుళముల వ్యాసములో నుండును. నుదురు, కనుబొమ్మలు, కన్నులు, ముక్కు, పెదవులు, దవుడలు, చెవులు ఇవన్నియు ముఖములోని భాగములు. కోట్లకొలదిగ నిర్మింపబడియున్న యీ ముఖములలో నే రెండును పోల్చ నశక్యమయిన ఏకత్వము కలిగియుండ లేదు. కళాకారులయినవారు, కాని వారును కూడ ముఖములలో గల భేదములను గమనింపగలరు. కాని యెంతటి కళాకారులైనను, లేక యెంతమంది కలిసియైనను ఆ పరిధులలో అంత సుస్పష్టముగ విభిన్నములైన ముఖముల చిత్రములను కోట్లకొలది వ్రాయలేరు. సామాన్యముగ మానవ కంఠములు ఒకటిన్నర నుండి రెండంగుళముల వ్యాసము కలిగి యుండును. ఏ రెండు కంఠములనుండి యుత్పన్నమయిన స్వరములు పోల్చుటకు శక్యముగాని ఏకత్వము కలిగియుండవు. శాస్త్రజ్ఞులు అశాస్త్రజ్ఞులు కూడ నిట్టి విభిన్న స్వరములను గుర్తింపగలరు. కాని యెట్టి యంత్రజ్ఞులైనను, ఆ కొలతలలో అన్ని విభిన్న స్వరములనిచ్చు యంత్రములను నిర్మింపలేరు. ప్రపంచ విజ్ఞాన వేత్తలారా! ఈ సర్వ సామాన్య విశ్వ విచిత్రములను గూర్చి మీరేమి చెప్పెదరు? ఇటు చూడుడు. కంఠస్వరములలోను, ముఖములలోనను గల యీ విభిన్నత, ప్రేమ జ్ఞాన సామర్థ్యముల విపర్యయ, అవిపర్యయ ప్రాబల్యము ననుసరించియు, వాని సారూప్య సామరస్య వ్యవహారములను బట్టియు వారికి విశ్వమును గూర్చి, సర్వాంతర్యామిని గూర్చి, వానికిగల పరస్పర సంబంధములను గూర్చి, బాధ్యతలు, కర్తవ్యములు, వాని నిర్వహణ సిద్ధాంతములను గూర్చియు గల విశ్వాసములను బట్టియు మారుచుండును.

ఈ మార్పులు స్థిరములు, అస్థిరములు నను రెండు రకములు. స్థిరమగు మార్పులు కూడ శాశ్వతములు కావు. మరల మార్పుదగి

నవి. తమ పూర్వపు టునికినుండి ముందునకు సాగిన మానవ మానవేత రములయిన ముద్రణలను బట్టి యీ స్థిరమగు మార్పులు పనిచేయును. అవే ముద్రణల ప్రాబల్యమున కొనసాగును. ఈ ముద్రణలు పోయి వినూత్నములయిన ముద్రణలు రావచ్చును. అందువలన పూర్వపుట వతరణలనుండి కొనిరాబడిన ముద్రణాభావములు మార్పులు పొంద శక్యమయినవి. మానవులలోని అస్థిరమగు మార్పులు ఇదివరకు లేన ట్టియు, నీ యునికియందు నూతనముగ కలిగినట్టియు ముద్రణలవలన కలుగును.

ఈ యస్థిరములయిన మార్పులే మానవుల ముఖలక్షణముల లోనను, కంఠస్వరములలోను తాత్కాలికములయిన మార్పులు తెచ్చు చున్నవి. అదేరీతిగ మానవులలోని సాముదాయికములయిన మార్పులు విశ్వజీవిలో కూడ నట్టి మార్పులను కలుగజేయును. విశ్వజీవి యందలి యీ మార్పు, విశ్వశరీర నిర్మాణతత్వమునందు, పదార్థమూల వ్యవ హారమునందు మార్పులు కలుగజేయును. దీని వలన విశ్వమందలి భూత లముయొక్క, భూత పదార్థములయొక్క స్థితిలోకూడ మార్పులు కలి గించును. విశ్వజీవి యందలి అభ్యుదయమున కనుకూలమైనట్టియు అననుకూలమైనట్టియు నిట్టి మార్పులు మానవుల సాముదాయికమగు మార్పులయొక్క అవిపర్యయ విపర్యయ స్థితులపై నాధారపడియుండును. ఈ సాముదాయికమగు మార్పులు, సర్వమును (All) గూర్చిన సాముదాయిక భావములు విశ్వాసములపై నాధారపడి యుండును. విశ్వజీవి యందలి మార్పులు, విశ్వ శరీర తత్వమునందు కూడ మార్పు లను కలుగజేయును. అన్ని పరిస్థితుల యందును విశ్వజీవిలో మార్పు పొందనిది దాని మూలమైన సర్వాంతర్యామితోడి యేకత్వమును గూర్చిన జ్ఞానమే.

విశ్వజీవిలో నేదైన మార్పును తెచ్చుటకు ఏ కొందరు వ్యక్తుల కయినను, ఏ యొక్క వ్యక్తికయినను కూడ సాధ్యమే. విశ్వమును గూర్చి, విశ్వజీవిని గూర్చి, సర్వాంతర్యామిని గూర్చి, విశ్వజీవిని గూర్చి, సర్వాంతర్యామిని గూర్చిన వ్యక్తుల జ్ఞానము, విశ్వమును సర్వాంతర్యామిని గూర్చిన విశ్వజీవియొక్క జ్ఞానము ఒకటైనచో అప్పుడు వ్యక్తులలోని భూతములు, భూతపదార్థములు, పదార్థములు, పదార్థమూలము వ్యక్తి శరీరములోనివియు, విశ్వజీవిలోనివియు, విశ్వ శరీరములోనివియు సామరస్యముతో వ్యవహరించును. ఈ పరిస్థితి యందు వ్యక్తులలో నెట్టి మార్పులు కలిగినను, ఆ మార్పులన్నియు అదేసమయమున విశ్వజీవియందును కలుగును. వ్యక్తిజీవి విశ్వజీవి తోడను, తన్మూలమున సర్వాంతర్యామి తోడను అవినాభావ మేక త్వము కలిగియుండును. విశ్వమునుగూర్చి, విశ్వజీవినిగూర్చి, సర్వాంత ర్యామినిగూర్చి, వ్యక్తులకుగల పరస్పర సంబంధము, కర్తవ్యము సిద్ధాం తములయందు, వారు అవిపర్యయ విశ్వాసములను పొందియుండిన యెట్టి స్థితి సాధ్యమగును. ఇట్టి భావములవలన కలిగిన విశ్వాసము శక్తి పరిణామమునకును విశ్వజీవితో సామరస్యమునకును దారి తీయును.

ఈ క్షణమునందీ ప్రపంచపు టునికి యెంత నిజమో, ఎప్పుడో యొకప్పుడు ప్రళయమునందీ జగత్తు అంతమందుటయు నంతే నిజము. ఆ అంతము యాతనామయము కాకుండా శాంతి విశ్రాంతులతో కూడి యుండునట్లు చేయుటకు అనువైన మార్పులు చేయుట ప్రస్తుతమున్న దుఃఖదాయకమగు పరిస్థితులను లేకుండ జేసి, అవి మరల రాకుండ జేసి, విశ్వవ్యవహారములో విశ్వసిద్ధాంతముల ననుసరించి నడుచు కొనుట మానవుల యొక్క బాధ్యతమై యున్నది. ఈ బాధ్యత విశ్వ మందలి మానవులందరిపైనను గలదు. ముఖ్యముగ విశ్వశరీర నిర్మాణ

తత్వమునందు, విశ్వశరీరమునందు (Universal body) అత్యున్నత స్థానమున నివసించుచున్న భారతీయులపై ప్రత్యేకముగా నున్నది.

అత్యున్నత ప్రదేశమున నివసించియుండుట వలన ప్రళయకాలమునందు దుఃఖపూర్వకముగ సమస్త ప్రపంచము ప్రళయజలములలో మునిగిపోయెడి విధానమును చూచుచు, సమస్త జీవుల దురవస్థను సహించ వలసిన యావశ్యకత భారతీయులకే గలదు. విశాల ప్రపంచ మంతయును మునిగిన తరువాత. భారతమునకు చుట్టునుగల ప్రదేశము అటు పిమ్మట ఆఖరిస్థితిలో భూతరము హిమాలయములు మునుగును.

భారతభూమి యొక్క భౌతికస్థితి విశ్వనిర్మాణ వ్యవహారముల యందును, విశ్వనిర్మాణ పదార్థ సామరస్యత నెలకొల్పుట యందును, దుఃఖమయ ప్రళయపరిస్థితులను శాంతిసంయుతముగ చేయుటకు తగిన మార్పులు చేయుటకు భారతభూమి యొక్కయు, భారతీయుల యొక్కయు బాధ్యతల నెక్కువచేయుచున్నది. ఈ బాధ్యత సమస్త మానవుల పైనను కలదు. కాని, పల్లపు ప్రాంతముల యందలి దేశములలోని ప్రజల యొక్క హక్కు, బాధ్యతలు తదనుసారముగ సమస్తము ఇతర ప్రపంచము నందలి ప్రజల బాధ్యతలును సారూప్యముగ తగ్గును.

అంతేకాక, భారత భూమి యొక్క విశ్వ బాధ్యతలను నెరవేర్చుటకు, విశ్వమంతటిచే అనుసరింపదగు ఆధ్యాత్మిక సిద్ధాంతములు భారతదేశపు ఆధ్యాత్మిక మహావ్యక్తుల ఆధ్యాత్మిక ప్రయత్న ఫలితములే. ప్రప్రథమముగ వారే సమస్త మానవుల యొక్క పతనావస్థను తత్ఫలితమైన దుఃఖస్థితిని గుర్తించిరి. వారును, వారి అనుయాయులును, వారి యాలోచనలను విచక్షణ చేసి. నిశ్చయ పరచి. రూపొందించి, పలికి, సిద్ధాంతరూపమున లిఖిత పరచి. ఆ దుఃఖదాయకమగు మాన

వుల పతనావస్థను మార్చుటకు ప్రయత్నించిరి. వారి యనుయాయులు ఈ సిద్ధాంతములను ప్రయోగించి, పరీక్షించి అవి సంపూర్ణములు, సక్రమములు అని నిర్ణయించిరి. ఇదంతయు ప్రప్రథమమున భారతభూమి యందే సాధింపబడినది. ఇప్పుడీ సిద్ధాంతముల నన్నిటిని వేదములు, ఉపనిషత్తులు అను పేర్లతో భారతీయులు పొందియున్నారు. వారి యనుయాయులు, ఈ సిద్ధాంతములను గూర్చిన అత్యల్పజ్ఞానముతో నయినను, అక్కడక్కడ ప్రపంచమునందన్ని భాగములందును భారత భూమియందు కూడ నున్నారు. ఈ ఆధ్యాత్మిక సంచయము వలనకూడ సమస్త మానవుల యెడల భారతమునకు గల బాధ్యత యింకను అధిక మగుచున్నది.

విశ్వకర్తవ్యమునకుతోడు, విశ్వవ్యాపకమైన రాజకీయసంస్థను, రాజకీయ సంప్రదాయములను నెలకొల్పవలెనని ఆధ్యాత్మిక మహా వ్యక్తులు వాంఛించిరి. వారి తరువాత బయలుదేరిన ఆధ్యాత్మిక వ్యక్తులు విశ్వకర్తవ్యమునకు తోడు మతము, మత సంప్రదాయములను నెల కొల్ప గోరిరి. ఈ రెండు సంప్రదాయములు, గ్రంథములు మిశ్రితములై రాజకీయమత మిశ్రమము ప్రారంభమయ్యెను. వెనుకటి అధ్యాయము లలో చెప్పినట్లు, మున్ముందు రాజకీయ సంప్రదాయముల యొక్క మత గ్రంథముల యొక్క ఆశయములను సాధించి, అటు తరువాత వానిలోని విశ్వకర్తవ్యమును సాధించుటకు, ఆ సంప్రదాయములు గ్రంథములు మిశ్రమములు కూడ ఆధ్యాత్మిక గ్రంథములలో ప్రవేశ పెట్టబడినవి. ఈ రీతిగ ఆధ్యాత్మిక గ్రంథములు ఆధ్యాత్మికమత రాజకీయ మిశ్రమములుగ నేర్పడి మత గ్రంథముల స్థితిలోనికి దిగిపోయినవి. వాని లోని ఆధ్యాత్మికత్వము కూడ మతము యొక్క స్థితిలోనికి దింపబడినది.

మతము స్థాపింపబడినది మొదలు వేర్వేరు కాలములలో వేర్వేరు ప్రదేశములలో బయలుదేరిన ఆధ్యాత్మిక మహావ్యక్తులు తమ

కృషిని సాగించుచునే యుండిరి. గ్రంథములలో సూచింపబడినట్లు, తమ పూర్వులచే కృషిచేయబడినట్టియు ఆయా కాలపు రాజకీయము లతో గల వైరుధ్యముల నధిగమించి, భావికాలములలో అట్టి వైరుధ్య ములు లేకుండజేసి అటు తరువాత మతములో గల విశ్వకర్తవ్యమును సాధింప యత్నించిరి. సమాజమునందు ఆధ్యాత్మిక సిద్ధాంతములను వ్యాప్తిగావించి, తన కర్తవ్యమును స్ఫురింపజేసి తద్వారా మానవ సమైక్యత, శాంతి, సంపద, అభ్యుదయములను సాధింపగోరిరి. వారి ప్రయత్నములు ప్రబోధములు వారు శరీరములను చాలించుటతోడనే నూతన మతములుగనో, ఉపమతములుగనో మత గ్రంథములుగనో పరిణమించినవి. వేర్వేరు కాలములలో, వివిధ ప్రాంతములలో జరిగిన మత సంస్కరణ ప్రయత్నము లన్నియు అదివరకే సమాజమునందు గల కల్లోలము, అశాంతి, విభిన్నత, విభ్రాంతులను, దారిద్ర్యమును. బాహ్యాభివృద్ధిని అధికము చేసెను. ఇదియే ప్రస్తుత ప్రపంచమునందలి సమాజమునకు రాజకీయమునకు, మతమునకు గలిగిన చిక్కు.

ఈ పరిస్థితుల నన్నిటిని సమీక్షించి, విచక్షణచేసి, పరిశీలించి నచో, నేటి రాజకీయ నాయకులు, సాంఘికసారథులు, మతాధి పతులు, అందరును ఇపుడు కాని, యికముందుగాని, ప్రపంచమునందలి యే ప్రాంతము నందైనను, మతమును మరల సంస్కరించుటకు ప్రయ త్నము చేయవలసిన యావశ్యకత కనిపించదు. కాని, భారతదేశము తన బాధ్యతాయుతమైన హక్కులతో, సక్రమతత్వముతో తానింత వరకు మరచిన తన సహజస్థితిని మరల జ్ఞప్తికి తెచ్చుకొని, విశ్వమం దలి సమస్త ప్రాంతముల మానవులయెడల తనకు గల హక్కులను. బాధ్యతలను ఇప్పుడు గుర్తునకు తెచ్చుకొని, నిష్కల్మషముగ సవినయ ముగ, శక్త్యుత్సాహములతో, వస్తు విషయాదులతోడి తన వ్యవహార ముల యందు, విశ్వ సిద్ధాంతాత్మకమైన మార్పులను చేయవలెను.

కాని, వారిచే అదివరకే గుర్తింపబడిన ఒక అతి పురాతనమైనదియు, నిరాశాపూరితమైనదియు. ఇప్పుడు నవరింపబడదగినదియు నగు ఒక పెద్ద లోపము మిగిలియున్నది.

భారత భాగ్యమును సరిదిద్దుచున్న నాయక శ్రేష్ఠులలో కొందరు తమకు తెలియకుండగనే భారతమునకుగల హక్కులను, బాధ్యతలను, భారతము ద్వారా యీ దారిని తెలిసికొనుటకు ప్రపంచమునకు గల హక్కులను స్ఫురణకు తెచ్చుకొని. సమైక్యత, శాంతి సంపదలద్వారా, ప్రపంచమును అభ్యుదయ పథమున పురోగమింప జేయుటకు ప్రబోధించుచున్నారు.

అదే సమయమున, మతసాంఘిక, రాజకీయ నాయకులలో అధిక సంఖ్యాకులు, ముఖ్యముగ **ఆశాభంగము** నొందిన రాజకీయ నాయకుల పై చెప్పిన లోపమును నిచ్చెనగ చేసికొని, రాజకీయాధికార శిఖరారోహణము గావింప యత్నించుచున్నారు. ఈ ఆశాభంగము నొంది కుట్రలు సాగించుచున్న నాయకుల ప్రయత్నములు, అధికారమును పొంది, దేశమును, విశ్వమును యథాతథముగ, అభ్యుదయ మార్గమున బాధ్యతాయుతముగ పురోగమింపజేయుటకు కాదు. ఏలోపము సహాయము వలన వారు రాజకీయ శిఖరారోహణము గావించిరో, ఆ లోపముతో సామరస్యముగల, సిద్ధాంతముల ననుసరించి, ఆ రీతిగ ఆ లోపమును బలపరచి, రాజకీయ నిర్మాణమునందే మార్పులు గావించి, రాజకీయ విధానములకు విధాతలై ఆలోపము ననుసరించి మనవలెననియే వారి యాశ.

ఈ ఆశాభంగమునొంది కుట్రలు సాగించుచున్న నాయకులు గూడ నీ లోపము ననేక పర్యాయములు గుర్తించిరి. ఈ లోపమునకు లొంగిపోవుట వలన, అనగా భారతమునందీ లోపమును కొనసాగ

నిచ్చిన యెడల కలుగు ప్రళయాత్మక పరిస్థితులు నిదివరకు వారనేక పర్యాయములు ప్రకటించిరి. ఆహా! బద్ధజీవులైన ఈ రాజకీయ నాయకుల ఆశాభంగము వారినెంత గ్రుడ్డివారిని చేయుచున్నది. స్వార్థము వలన బద్ధులై స్వార్థపరత్వమునకు బానిసలై ఆశాభంగము నొందిన గ్రుడ్డి మత. రాజకీయ, సామాజిక నాయకులారా! జాగ్రత్తగా గమనింపుడు. మీ పద్ధతులను మార్చుకొనుటకు తగినకాలము అప్పుడే దాటి పోయినది. భారత సంప్రదాయములు మతసంబంధమైనవి కావు. భారతదేశమునకు మతమే లేదు. భారతసంప్రదాయము ఆధ్యాత్మికము, భారతీయ మహాగ్రంథములు ఆధ్యాత్మికములు. భారతమే ఆధ్యాత్మికము. భారతీయ మహాగ్రంథములలో నిరికింపబడిన మతప్రబోధములను పెరికి పారవేయకుండుటయే ఈ లోపము.

భారతదేశపు ఆధ్యాత్మిక మహాగ్రంథములలో అక్కడక్కడ కనపడు విభజిత విశ్వము, విభజిత మానవులు, విభిన్న మానవ ఆశయములు, ఆ ఆశయములను సాధించుటకు చెప్పబడిన వివిధ సిద్ధాంతములు, ఇవన్నియును మతసంబంధమైనవి. ఈ ప్రపంచమునందు ప్రత్యేక ప్రత్యేక వ్యక్తుల యొక్కయు లేదా ప్రత్యేక ప్రత్యేక వర్గములయొక్క బాహ్యాభివృద్ధి సాధనను సూచించునట్టియు. లేదా ఆయా వ్యక్తుల యొక్కయు వర్గముల యొక్కయు జన్మరాహిత్య పూర్వకమైన ప్రబోధములన్నియు మతసంబంధములే. ఈ పద్ధతిలో చేయబడిన ఆలోచనలు, పలుకబడినమాటలు, జరిపిన కార్యకలాపములన్నియు మతాస్పదములే. మతసంబంధములే. మతాత్మకమైన ఆలోచనలు, పలుకులు, కార్యకలాపములు స్వార్థమునుండి పుట్టి, స్వార్థములో పెరిగి స్వార్థపరత్వముచే పరివేష్టింప బడియుండును.

ఇటు చూడుడు. ఆధ్యాత్మిక జిజ్ఞాసపరులు మతానుయాయులైన భక్తులు, ఆధ్యాత్మిక మహావ్యక్తులచే పునీతమొనర్పబడిన పుణ్యక్షేత్ర

ములు, దేవళములు నదులను దర్శింతురు. వారి శరీరముల నా పవిత్రోదకములలోముంచి, మతసిద్ధాంతముల ప్రకారము ప్రార్థనలు సల్పెదరు. స్నానములలో, పూజలలో ప్రార్థనలలో అన్నిటిలోను "నేను" ప్రధాన స్థానమాక్రమించును. "నేను"...... ఒక ప్రత్యేకమైన పేరు గలిగిన నేను......ప్రత్యేకవర్గమునకు చెందిన నేను...... ప్రత్యేక కాలములో, సంవత్సరములో, అయనములో, ఋతువులో, మాసములో, పక్షములో, దినమున ప్రత్యేక ప్రదేశమున, ప్రత్యేకములగు కోర్కెలు తీరు నిమిత్తము, ప్రత్యేక భావములు కలిగిన సర్వాంతర్యామిని పూజించు చున్నాను." ఈ ప్రార్థనలకు, పూజలకు, పంచభూతములను కూడ సాక్షులనుగా తీసికొనివచ్చి, ఆయా ప్రార్థనలను విశ్వమంతు స్థిరపరచు చున్నారు. ఇవియు, ఇట్టి యితర ప్రార్థనలు, ఆధ్యాత్మిక జిజ్ఞాసపరులను కూడ తమకు తెలియకుండగనే మతభక్తుల స్థితిలోనికి దింపివేయుచున్నవి. నేను, నావి అను భావముల కనువుగ ఆలోచించుట, పలుకుట, క్రియలు జరుపుటయందు ఆధ్యాత్మిక జిజ్ఞాసపరులకు హితవు లేకపోయి నప్పటికిని, "మేము, మనకు" అను భావములకే వారనుకూలురయినప్పటికిని, యీ పూజాపాఠముల మూలప్రయోజనమును తెలియకుండ అనుసరించినందు వలన ఆ ఫలితములకు వారును గురియగుచున్నారు.

ఈ పూజల యొక్కయు, ప్రార్థనల యొక్కయు సమస్త ఫలములు అంతమందు భగవదర్పితము లగును లేదా యివన్నియును భగవదర్పణముగనే చేయబడుచున్నవను మతసంబంధమైన వాదమునకు ఆధ్యాత్మిక మూలములేదు. ఆ పూజాఫలితము లన్నియు నుండనే యున్నవి. అంతేకాక ఆ పూజా సమర్పణయు నక్కడనే యున్నది. పూజా ఫలితములను అంతమందు భగవదర్పణ చేసినప్పటికిని పూజా ఫలితము లనుభవించుటయందు పూజాకర్త యొక్క స్వార్థపరత్వము

లేకపోలేదు. అందువలన, నిట్టి పూజా ఫలితములు సంపూర్ణముగ భగవదర్పణ మగుటలేదు. అందువలన నట్టి పూజాకర్తలు తత్ఫలములను పొందక తప్పదు.

ఇట్టి కర్మల యొక్క ఫలితముల వలన పూజాకర్తలు తమ శరీరములు గతించిన తరువాత మరల శరీరములను తప్పక ధరింపవలసి వచ్చును. మరల శరీరములను దాల్చవలెవనెడి కోరిక లేనట్టి ఆధ్యాత్మిక జిజ్ఞాసపరులు కూడ నిందుమూలమున మరల నవతరింపక తప్పదు. "ఈ పూజల యొక్క ఆశయము విశ్వాభ్యుదయము. ఇవి లోక మానవ కళ్యాణము కొఱకు, భగవదర్పితముగ చేయబడుచున్నవ"ను వాదము కూడ అంగీకార యోగ్యము కాదు. ఈ పూజ యందలి, వాని ఫలితముల యందుగల స్వార్థము, అంతిమ సమర్పణములో కలియదు. నేను నాది యను భావముతో చేయబడిన వేవియైనను, అవి యెంత వైభవముతో చేయబడినవైనప్పటికిని, అది స్వార్థముతో కూడియున్నదగుట వలన సర్వాంతర్యామి యగు భగవంతుని కర్పించదగినదియు కాదు. అర్పణయు కాదు. వారి ఆశయము విశ్వాత్మకమగుట వలన ఆ ఫలితములు సర్వాంతర్యామికి సమర్పింప దగినదియే యనుకొనుడు. అందువలన అప్పుడది స్వార్థముతో కూడియున్నప్పటికిని, దాని ఫలితము భగవదర్పితము చేయబడియుండుట వలన, దాని కర్తచే అది పొందబడకుండుట వలన, ఆ సమర్పణ సర్వాంతర్యామికి చెందునేయనుకొనుడు. అప్పుడది ఒక వ్యక్తి యొక్క స్వార్థకృత్యముచే సాధింపబడిన, స్వార్థరహిత విశ్వప్రయోజన కారియగును. అట్టి సంభావ్యతయే కర్తయొక్క విశ్వాత్మకత్వమును సమర్పితమైన కర్మలయొక్క విశ్వాత్మభావమును ఈ రెండింటికిని తమకు మూలమైన విశ్వజీవితో గల యేకత్వమును, తన్మూలమును అర్పణలను పొందిన సర్వాంతర్యామితో నేకత్వమును నిరూపించును. ఇదిట్లుండగా నిట్టి పూజలు "మేము" "మనవి" అను

దృష్టితో విశ్వాత్మకముగ చేయవలసిన అవసరము తప్పనిసరియని దృఢమగుచున్నది. పూజాదులు చేసెడివారు, చేయబడిన పూజలు, ఈ రెండును పూజింపబడిన విషయము యొక్క- ఆధ్యాత్మికత్వముతో సామరస్యము కలిగియుండుటచే, విశ్వాభ్యుదయ మనెడి విశ్వావశ్యకతతో నేకత్వమును పొంది, విశ్వశాంతి స్థాపింపబడి, ప్రళయకాలము నందు సర్వమునకు, విశ్వజీవికి తన్మూలమున సర్వాంతర్యామిలో విశ్వ విశ్రాంతి కారకమగును.

స్వార్థపరులైన వ్యక్తులచే చేయబడిన స్వార్థభూయిష్టమైన పూజాదులు, అవి స్వార్థముతో కూడి యుండినవగుట వలన విశ్వమందు వాని స్థిరీకరణ, అట్టి పూజల వలన ఆ కర్తలకు కలుగు అనివార్య ఫలితములు వలననే విశ్వాభ్యుదయము కొఱకు మానవులు పూజలు, ప్రార్థనలు చేయవలసిన యావశ్యకత యేర్పడు చున్నది. అయినప్పటి ని యీ పూజలు. ప్రార్థనలు, మతవిధానముననే. స్వార్థపరత్వముతో విశ్వమందు స్థిరీకరణ చేయబడుటచే ప్రస్తుత మున్న దుఃఖపూర్వక పరిస్థితులే కొనసాగుచు, దుఃఖమయ ప్రళయమునకే దారితీయును. ఇది అనివార్యముకాదు. ఆవశ్యకము కాదు. తప్పించుకొనవలసిన విశ్వదురదృష్ట సంఘటన, కాలిలో ముల్లు గ్రుచ్చుకొనిన యెడల, ఆ ముల్లును మరి యొక ముల్లు సహాయముతో తీసివేసి రెండు ముండ్లను ఆవల పారవేయుట అను పద్ధతి ఉత్తమ మయినదే.

కాని గ్రుచ్చుకొనిన ముల్లును తీసివేయుట కుపయోగించెడి రెండవముల్లు, మొదటి ముల్లువలెనే విరిగెడు లక్షణము కలిగియుండిన అదికూడ కాలిలో విరిగియుండి నొప్పిని అధికము చేయును. ఈ రీతిగ గుచ్చుకొనిన ముల్లును పెరికివేయు ప్రయత్నము లింకను చేయబడు చునే యున్నవి. భారతదేశపు రాజకీయ శరీరమునందు గుచ్చుకొనిన

ముండ్ల సంఖ్యకూడ అధికమగుచున్నది. వానివలన భారత జీవికి కలుగు నొప్పికూడ అధికమగుచున్నది. ఓ భారతీయ మతాధిపతులారా ! మత స్వార్థపరత్వము వలన, స్వార్థపరత్వపు దుశ్చర్యలవలన, కలిగింపబడిన దీనపరిస్థితిని, ఉద్రేకరహితముగ స్పష్టముగ పునరాలోచన చేయుడు. మతము వలన కలిగిన యీ దీనపరిస్థితులనెడు గ్రుచ్చుకొనిన ముల్లును మత కార్య కలాపములనెడి, అదేరీతిగ విరిగెడి లక్షణముగల ముల్లుతో తీసివేయలేరు. అందులకు ఆధ్యాత్మికత్వము, ఆధ్యాత్మిక కార్యకలాపములే అర్హమైనవి. ముండ్లను తీసివేయుటకు తప్పక ముండ్లనే యుపయోగింపవలెను. కాని ఆ యుపయోగించెడి ముల్లు గ్రుచ్చుకొనిన ఆ ముల్లును తీసివేయుటయందు గల్లు ఒత్తిడిని గ్రహించుకొను శక్తిని కలిగియుండవలెను. అట్టి కార్యకలాపము లన్నియును అనంతము, అవిభాజ్యము నయిన ఆధ్యాత్మిక మూలమునుండి సాగవలెను. "నేను" నకు బదులు "మేము", "నన్ను" నకు బదులు "మమ్ము" అను భావములను ప్రయోగించవలెను.

సామాన్యముగ నెవరైనను, ఏదైనను ప్రీతికరమైన పదార్థములు తినుచుండినయెడల తమకు ఆప్తులైన వారిని తలచుకొని, వానినో, అట్టి యితర పదార్థములనో వారి ఆప్తులకుకూడ కలుగజేయవలెనని కోరుకొందురు. కాని మతముయొక్క శాపమును చూడుడు. ఆ మత ప్రోక్తమైన పూజాపాఠము లన్నిటియందును "నేను, నన్ను" లే ప్రతిధ్వనించుచున్నది. "నేను ప్రార్థించితిని, నేను ప్రార్థించుచున్నాను. ఇది నాకు కావలెను. అది నాకు కావలెను. ఇది నాకిమ్ము. అది నాకిమ్ము" అని యుండును. ఈ ప్రార్థనలు జరిపెడి సమయములందు, ప్రార్థనలు చేయువారి బిడ్డలో, మనుమలో ఏ యితర ఆప్తులో దగ్గర కూర్చొనియో, నిలుచునియో, ఆడుకొనుచునో యుండవచ్చును. ఒకప్పుడు వారి యొడిలో కూర్చొని యుండవచ్చునుకూడ. కాని

ఆ ప్రార్థనలు ఆ బిడ్డలకు వర్తింపవు. ఆ ప్రార్థనలలోని కోరికలు, వాని వలని ఫలితములు ఆ బిడ్డలకు చెందవు. వారు తమ ప్రార్థనలయొక్క ఫలితములలో ఆ బిడ్డలను భాగస్వాములను చేయరు. ఎందుచేత ? ఆ చేసెడి ప్రార్థనలయందు, వానివలన కలిగెడి ఫలితములయందు, చేసెడివారికే నమ్మకములేదు. నేటి ప్రపంచమునందు మత వ్యవహారముల తీరు ఇట్లున్నది. భారతమునందలి అధిక సంఖ్యాకులకు కూడ ఇది పరిపాటియైపోయినది.

మత విధానములలోనను, మత సూత్రములలోనను, మతాచారములలోను, ఇతరుల అభ్యుదయమునను ప్రార్థనాదులను సలుపుట, యజ్ఞయాగాదులను చేయుట ఉండనేయున్నది. అట్టితరి, ప్రతివారును తమకు తామే వ్యక్తిగతముగ బాధ్యులనుటయు, ఇతరులను అనివార్య పునరవతరణ నుండి విముక్తులను చేయుట అసంభవము కావున ఒకరి బాధ్యత మరియొకరికి లేదనుట అసమంజసము. అసమర్థనీయము, ఇవియే మతమునకు ఆధ్యాత్మికత్వమునకుగల తారతమ్యము. సమైక్యతకు, విభిన్నతకు, విశ్వాత్మభావమునకు, అవిశ్వాత్మ భావమునకు గల తారతమ్యము. ఒకరిని గూర్చిన బాధ్యత, ఒకరి ముక్తికొరకు మరియొకరు శ్రమించుట అను భావములు ఆధ్యాత్మికములు. ఒరులను గూర్చిన బాధ్యతా రాహిత్యము. ఇతరుల ముక్తి కొరకు శ్రమించుట అసంభవమనెడి భావములు మత సంబంధములు. భారతదేశపు అధిక సంఖ్యాక సమాజము నందలి మతానువర్తుల భావము లాధ్యాత్మికము లైనప్పటికిని వీరిలో మతమునందు సక్తత ఎక్కువగ నున్నది. అందువలన వస్తు విషయామలతోడి వీరివ్యవహారములలో ఆధ్యాత్మిక వాదన, సంప్రదాయ సిద్ధమైన మతాచారములు ఇతర భాగములలోని సమాజముల యందుకంటె అధికముగ నున్నది. వారి వాదనలన్నియు ఆధ్యాత్మిక భావమునుండి పెంపొందినవి. వారి యలవాట్లు మాత్రము

మతాచారములనుండి, మతమునందలి ఆసక్తినుండి బయలుదేరినవి. అందువలన వారు ఆధ్యాత్మిక భావనల ననుభూతిచెందు మతసూత్రములపై నాధారపడిన మతవిధానముల ననుసరింతురు. తమ విశ్వాత్మానుభూతిచెందని అవిశ్వాత్మక విధానముల ననుసరింతురు.

అభ్యుదయ పథమున పురోగమించుటకు విశ్వామోదితమైన సిద్ధాంతము ప్రకారము చీకటినుండియే వెలుతురునకు, తప్పునుండి ఒప్పునకు గాక వెలుతురునుండియే వెలుతురునకు, ఒప్పునుండియే ఒప్పునకు పురోగమింపవలె ననెడి వాదమును మీరు నొక్కివక్కాణింతురు. కాని ఆచరణలో మాత్రము చీకటినుండి వెలుతురునకు, తప్పునుండి యొప్పునకు పురోగమించుటయే అలవాటైనది. ఇదియే మీ లోని మతముయొక్క శాపము. అందువలన నీ శాపమును విదలించివేయుడు. ఈ ఏకాకితనము విడిచి మీకు సహజ సంప్రదాయమైన విశ్వాత్మభావము ననుసరింపుడు. మీ ఆధ్యాత్మిక గ్రంథసంచయమునుండి అవిశ్వాత్మకత్వమును దూరము చేయుడు. ఈ గ్రంథ సంచయము మీ వద్దనే యున్నది. అవి లిఖిత రూపక మయినప్పటినుండియు మీ వద్దనే యున్నవి. మీ పూర్వులు, వారికి పూర్వులు మానవుల దీనావస్థను గమనించి, అనుభూతిని పొంది, విచక్షణచేసి, సంశోధించి నిశ్చయించి. ప్రయోగించి, కూర్చి, పలికి, అట్టి వాని నోకచోచేర్చి. వానికి లిఖిత పూర్వకమైన రూపమునిచ్చి, 'వేదము—వేదాంతము' అను పేర్లతో వానిని మీ కందిచ్చిరి.

మీ స్వభావము, ప్రవర్తన, అలవాట్లలో అభిశాస్య లక్షణము హెచ్చగు చున్నప్పటికిని, ఆధ్యాత్మికత్వములో విశ్వాసము లేకపోయి నప్పటికిని, మతమునందు శ్రద్ధాసక్తుల లనేకమగుచున్నప్పటికిని, మీలో ఆధ్యాత్మిక భావములున్నవి. మీ భావనలయందు మీకు విశ్వాసము

లేకపోయినప్పటికిని ఆ భావము లాధ్యాత్మికము లగుటవలన, విశ్వ ప్రయోగార్హమగుట వలన, మీ మతాసక్తులను మార్చుకొనవలెను. వస్తువిషయాదులతోడి వ్యవహారములయందు మీ రెప్పుడో మరచి పోయిన వైఖరి, విధానములు, ప్రవర్తనలు మరల అలవాటు చేసి కొనవలెను. మీ భావన విశ్వాభ్యుదయమునకు మూలమగుట వలన విశ్వావశ్యకతా సంసిద్ధికి ఆధారమగుటవలన, ప్రళయము విశ్వ విశ్రాంతి దాయకమగుటకు శాంతిపూర్వకముగ అభ్యుదయ పథమున ప్రస్థానమగత్య మగుటవలన, మిమ్ములను మీరు సరిదిద్దుకొనుటకు ఇతరుల కంటె మీకు ఎక్కువ అవకాశము లున్నవి.

మంచిచెడ్డలను మీరు ఇతరులకంటె ఎక్కువ బాగుగ తెలిసికొన గలరు. మీ జ్ఞానాభివృద్ధి చాల ఎక్కువది. అదొక గొప్ప విషయము. మీ ప్రేమాభివృద్ధి, ఆ ప్రేమయొక్క సక్రమవినియోగము మాత్రము చాల తక్కువ. ఇది శోచనీయమైన విషయము. మీకు మంచిది కాదు. మీలో భారతదేశపు అధికసంఖ్యాక సమాజములో, వస్తువిష యాదుల మంచిచెడ్డలనుగూర్చిన పరిజ్ఞానమునుగూర్చి చెప్పినప్పటికినీ, తెలిసికొనలేని వారు కూడ నున్నారు. కాని వారి ఆచారవ్యవహార ములు మాత్రము సక్రమమైనవి. వారి ప్రేమ పరిపూర్ణమైన దగుట వలన, ఆ ప్రేమ యొక్క సక్రమ వినియోగ మిందులకు కారణము.

ఇదియే చాలును. కాలక్రమమున తమను గూర్చియు, వస్తు విషయాదులను గూర్చిన సక్రమజ్ఞానమును సంపాదించుటకు ఇదియే చాలును. వారి శరీరము లంతమగులోపున వారట్టి జ్ఞానమును సాధింప లేకపోయినప్పటికిని, వారి వ్యవహారము సరియైనదగుట వలన వారు మానవ కర్తవ్యమును మానవోచితముగ సాధింప గలుగుచున్నారు. వారి ప్రవర్తన, వైఖరి, అలవాట్లు, వారి తోడను, విశ్వనిర్మాణ విధా

నము తోడను, సామరస్యము కలిగియుండుటచే, ఆధ్యాత్మిక మూల మైన దగుటవలన, సమైక్యత, శాంతి, సంపద, అభ్యుదయముల ద్వారా మానవ కర్తవ్యసంసిద్ధిని పొందుట కనువైన వగుటవలనను, వారి ప్రేమ ప్రయోగము సక్రమమై యుండిన చాలును. కాని, వారు తర్కవివాదములలో మీరు సాటి వారు కారను కారణముచే, వారి ప్రవర్తన, వైఖరి, అలవాట్లను మీరు గుర్తింపరు. వారు జ్ఞాన వంతులు కాకపోయినప్పటికిని, సక్రమ ప్రేమ ప్రయోగము వలన వారు తమ కర్తవ్యమును, విశ్వకర్తవ్యమును సాధింప గలరు. సక్ర మావగాహన శక్తి కలిగి యున్నప్పటికిని, మీరు మీ ఆశయమును సాధింపరు. సాధింపనూ లేరు. తన్మూలమున, మీ ప్రేమను క్రమముగ వినియోగింప లేకపోవుటవలన, విశ్వ కర్తవ్యమును సాధింపలేరు.

మీ భావన, విశ్వాసముల నడుమగల అసామరస్యము వలనను, మీ ప్రేమ జ్ఞానముల అసారూప్యము వలనను, మీ అభ్యుదయమును మీరు పొందుటకు అసమర్థులగుటయేగాక, యితరుల అభ్యుదయమును చూచి హర్షింపలేక పోవుచున్నారు. అందువలన భారత దేశమునందలి అధిక సంఖ్యాక సమాజముయొక్క అభ్యుదయమునకు మీరు అడ్డుపడుచున్నారు. మీరు నివసించు ప్రదేశమును బట్టియు, ఆ ప్రదేశమునకు విశ్వనిర్మాణములోగల స్థానమును బట్టియు, మీరు మిక్కిలి బాధ్యతాయుతమగు స్థితిలో నున్నప్పటికిని విశ్వాభ్యుదయమునకు బండరాళ్ళవలె అడ్డుపడుచున్నారు.

సరియైన జ్ఞానములేనిదే, సక్రమమైన ప్రేమ బయలుదేరదను సామాన్యాభిప్రాయమును గూర్చి మీరు పునరాలోచన చేయవలెను. మన పూర్వులలో కొందరను మనము "అసురులు, రాక్షసులు" అని పిలుచుచున్నాము. మీరీనాడు పొందియున్న జ్ఞానముకంటె వారధికము

గనే జ్ఞానమును పొందియున్నారు. ఇది అందరును ఎరిగినట్టిదియు, ఆమోదించినట్టిదియు నైన విషయమే. ఈ యసురులు జ్ఞానాధిక్యతయే గాక, అధికమైన సామర్థ్యమును కూడ కలిగియుండెడివారు. అయినచో వారు చేసిన యే పనులవలన, వారికి అసురులు, రాక్షసులు అను చెడ్డ పేర్లు వచ్చినవి ? వారికిగల జ్ఞాన సామర్థ్యాధిక్యతలు వారికి చెడ్డపేర్లు రాకుండ కాపాడలేకపోయినవా ? వారి ప్రేమ సక్రమమైనది కాక పోవుటయే యిందులకు కారణము. వారి హృదయములు విశాలము కాకపోవుట, వారి ప్రేమ సరియయినది కాకుండుటయే ఇందులకు కారణము. వారి స్వార్థపరత్వము వారి మత విశ్వాసములు వారి హృదయము విశాలము కాకుండ అడ్డుపడి, వారికి ఆధ్యాత్మిక విజ్ఞాన సామర్థ్యములుండి యున్నప్పటికిని, వారికి అసుర, రాక్షసాది దుష్ట నామములు ప్రాప్తించునట్లు చేసినవి.

సమస్త జీవ వస్తు విషయాదులలోనను, వాని చుట్టును కూడ ప్రేమ జ్ఞాన సామర్థ్యములు సహజముగ నున్నప్పటికిని ప్రేమలేనిదే (ఆ ప్రేమ క్రమమయినది కావచ్చును. కాకపోవచ్చును) జ్ఞాన సామర్థ్యములు జడముగ నుండును. విపర్యయమైనను ప్రేమ చైతన్యవంతమయినది. అదియే జ్ఞాన సామర్థ్యములను వ్యవహరింపజేయును. అదియే జ్ఞాన సామర్థ్యములకు మూలము. అది వానిలో సహజముగ సంతర్గతమై యున్నది. జ్ఞానము పూర్వానుభవము వలన పొందబడినది. అది అనుభవజన్యము. అనుభవ ప్రాప్యము. ప్రేమయొక్క లక్షణము, వ్యవహార విధానము, స్వరూపములే జ్ఞాన సామర్థ్యములలోను వస్తు విషయాదులలోనను వాని చుట్టును ఉన్నవి. ప్రేమ తనలో తాను, జ్ఞానములోనను, జీవవస్తు విషయాదులలోనను, వాని చుట్టును వ్యవహరించుటకు సామర్థ్యమొక సాధనము.

అసురులు, రాక్షసులు, అనబడిన మన పూర్వులకు గల మత విశ్వాసములు వారికి గల ప్రేమను కళంకిత మొనర్చి, క్రమము తప్పించి వారిని స్వార్థపరులుగ జేసినవి. వారి స్వార్థప్రేమ, వారికిగల జ్ఞాన సామర్థ్యములలో నిమిడి, వారికి శక్తినిగూర్చినది. అందువలన, మానవులతో సహా, సమస్త వ్యక్తుల, వస్తు విషయాదులతోడి వ్యవహారములయందు, వారి వైఖరి, ప్రవర్తన, అలవాట్లు, స్వార్థప్రేమతో కూడియున్న జ్ఞాన సామర్థ్యములచే నిర్వహింపబడి యుండుటవలన వారికి అసురులు, రాక్షసులు అను బిరుదులు ప్రాప్తించినవి.

ఆధ్యాత్మిక మహావ్యక్తుల సన్నిధియందు భగవదవతార స్వరూపులైన మహావ్యక్తుల హస్తములచేత తమ దేహముల నంతము గావించుకొనినచో, విశ్వజీవితో, భగవంతునితో, సర్వాంతర్యామితో సన్నిహితత్వము, ఏకత్వము, తదనుభూతి కలుగు ననెడి జ్ఞానముతో, విశ్వాసముతో ఆ రాక్షసు లట్లు చేసెడి వారనెడి వాదము సత్య దూరము. మరల భూమిపై నవతరించెడి యవకాశమును లేకుండ చేసికొనుటను వారు కోరియుండి రనుటయు అసమర్థనీయము. విశ్వ నిర్మాణ మూల సిద్ధాంతములకు, మానవ నిర్మాణ తత్వమునకు కూడ విరుద్ధము.

తమ పితరులను హృదయపూర్వకముగ ప్రేమించెడి వ్యక్తులు, తమ పితరులు దయాసమన్వితు లనెడు విశ్వాసము గలవారు, వారితో సమైక్యత పొందుటకై వారివలన తమ శరీరములకు మృత్యువును పొంద గోరెడివారు తమ పితరులను భక్తి శ్రద్ధలతో ప్రేమింతురు. ఆ పితరులు కూడ తమ బిడ్డల యెడల ప్రేమకల వారగుటచే తమలో నైక్యము కావలెనని బిడ్డలు కోరెడి కోరికలను ఎరిగియుండిన వారగుటచే బిడ్డలను సంతోష పెట్టుటకు సిద్ధముగనే యుందురు. ఆ బిడ్డలు సంపూర్ణ

ష్ఠమైన విశ్వాసముతో, ప్రేమతో, గౌరవముతో, పితరుల దరిజేరి, వారి పాదములపైబడి, తమ్ము శరీరములనుండి విముక్తులజేసి తమతో కలుపుకొనమని ప్రార్థించినచో, ఏ స్పర్శవలననో తృణప్రయోగము వలననో తమ బిడ్డల కోరికలను తీర్చుటకు ఆ పితరులు శక్తివంతులై యున్నారు.

దురాత్ములైన ఆ యసురులు, రాక్షసులయొక్క యుద్దేశ్యములు మీ రనుచున్నట్లు తమ విమోచనము కొరకే యనుకొనినను, ఆ యుద్దేశ్యమును సాధించుటకు వా రనుసరించిన దుష్టప్రవర్తన, నీచవిధానము, అలవాట్లకు బదులు మరియొక విధమగు ప్రవర్తన, అలవాట్లు వైఖరులను ప్రదర్శించి ఆ సర్వాంతర్యామి స్వరూపుల హస్తముల యందు మృత్యువును పొందియుండెడివారు. అందువలన వారి యుద్దేశ్యమును గూర్చి మీకు గల యభిప్రాయము, దానికి మూలముకూడ తప్పయినవే. అంతేకాక ఆ యసురులే, రాక్షసులే యజ్ఞ యాగాదులను చేసి తమ జీవితమును పొడిగించు కొనుటకును మృత్యువును లేకుండ చేసికొనుటకును అనేక పర్యాయములు ప్రయత్నించిరి. అందులో కొందరు సర్వాంతర్యామి స్వరూపులతో యుద్ధముచేయుచు మృత్యువును లేకుండ చేసికొనుటకు తపోనిష్ఠలకు పూనుకొనిరి. మీ యుద్దేశ్యము తప్పయినదనుట కింతకంటె ఏమి నిదర్శనము కావలెను. మీ కింకను నమ్మకము కలుగకుండినచో ఇకనైనను ఆలస్యము చేయకుండ మీ యభిప్రాయములను, విశ్వాసములను మార్చుకొనవలెను. మీ విశ్వాసములోని స్వార్థతను నిస్వార్థముగను, మతపద్ధతిని ఆధ్యాత్మిక పద్ధతిగను, నేను – నాకు అనెడి యలవాట్లను "మేము – మనకు" గను మార్చుకొనవలెను. మీ మతసంబంధ విశ్వాసములను, మీలో నున్నట్టియు, మీకు పూర్తిగ నమ్మిక లేనట్టియు ఆధ్యాత్మిక తత్త్వము లందు విశ్వాసములుగ మార్చుకొనవలెను.

ఈ మార్పులను మీరు సాధ్యమైనంత కొలది కాలములో సాధించని యెడల మీరుకూడ మీ పూర్వులు పొందినట్లుగనే అట్టి అసుర రాక్షస బిరుదములను పొందుట కష్టాలగుదురు. మీ సంతతి వారగు భావి మానవులు మిమ్ము అసురులుగను, రాక్షసులుగను వర్ణింతురు.

అందువలన, ఎంతమాత్రమును వెనుదీయక, మీ మత విశ్వాసములను, ఆధ్యాత్మిక విశ్వాసములుగ మార్చుకొనుడు. పరిణతి పొందిన మీ ప్రవర్తన, అలవాట్లు వైఖరులకు అనుగుణముగ నుండునట్లు మీ పూజాది మత వ్యవహారముల నన్నిటిని తగు విధముగ సరిదిద్దుకొనుడు.

మీ పూజాది కార్యక్రమములలో మీ పూజాపాఠములలో అపభ్రమ కారకమగు "నేను" అను పదమును లేకుండ చేయుడు. "ప్రత్యేకమైన పేరుగలిగిన నేను, దీనికొరకు, దానికొరకు" అను సంకల్ప వాక్యములను "నేను - నాకు" అను భావములకు బలమును కలిగించెడి వాక్యములను, భావములను, ఆధ్యాత్మిక గ్రంథములనుండి తీసివేసి, మనము, మనకు అనెడి పదములను, భావములను అందు పొందు పరచుడు. మానవాళిక మందరను తీసికొనివచ్చి, అందరును అట్టి పూజాదులలో పాల్గొనునట్లు చేయుడు. ఒక్కొక్కప్పుడు మీరు ఒంటరిగనే అట్టి పూజాదులను చేయవలసి వచ్చును. అప్పుడుకూడ, మన మందరము, మనకందరకు, అనుభావములతోడనే పూజాదులను నిర్వర్తింపుడు. మత నమ్మకముల ప్రకారము మీరుచేయు పూజలలో ఇతరులెవ్వరును పాల్గొనకుండగనే వారి మేలుకొరకు మీరు పూజలను నిర్వర్తించినపుడు అట్టి పూజలో పాల్గొననివారలకుగూడ లాభదాయకమయినయెడల, ఆధ్యాత్మిక విశ్వాసముల ప్రకారము అది యింకను

లాభదాయకమగును. దానివలన ప్రయోజనమును అధికముగ నుండును. అందు మీ విశ్వాసమును అధికమగుచుండును.

ఇట్లు, జరుపబడిన పూజాదులు స్వార్థ ప్రయోజనముతో చేయ బడి యుండనందున, ఆశించిన ఫలములలో స్వార్థపరత్వము లేనందున, ఈ పూజాదులను అంతమందు సర్వాంతర్యామి కంకిత మొనర్చ నక్క రనేలేదు. అట్టి పూజాఫలములు అందరికిని అభ్యుదయకారి యగుట వలనను, అందరును పూజా నిర్వహణమునందు భాగస్వాము లగుట వలనను ఆ మత ప్రోక్తమగు పూజావిధానము వలన ఫలమును పొందెడి వారు ఆధ్యాత్మిక పూజావిధానమునందు భాగస్వాములగుదురు. ఇక్కడ ఆశించువారును లేరు. ఆశింపబడెడిదియును లేదు. పూజా వ్యవహారమునకును, తత్ఫలమునకును నడుమ కాల విలంబనము లేదు. మత వ్యవహారములలోవలె పూజ ఫలితములను కల్పింపదు. తానే ఫలితమైపోవును. అది అందరిచేతను, అందరి లాభముకొరకు, అందరి ఆధ్యాత్మికాభ్యుదయము కొరకును, ఒప్పునుండి ఒప్పునకు చేయబడు చున్నందున నే యిట్టి సత్ఫలితములు కలుగును.

ఈ రీతిగ, పూజాకర్త, పూజ యుద్దేశ్యము, ఫలితము సర్వము, సర్వాంతర్యాముల నడుమ సామరస్యత, సమైక్యత సాధింపబడి మరల ప్రతిష్ఠింపబడును. ఈ రీతిగ సశరీరులు, అశరీరులు నయిన వ్యక్తుల యునికి, వ్యవహారములు, ఏకైకము, ఎడతెగనట్టిదియునైన ఆధ్యాత్మిక విషయముగ మార్చి ఫలప్రదమై, ప్రళయకాలమువరకు సాగి, శాంతి, సమైక్యతల ద్వారా అభ్యుదయ ప్రదమయి విశ్వ విశ్రాంతి ప్రదాయక మగుచున్నది. ఈ రీతిగ మానవ కర్తవ్యము మానవోచిత రీతిని సాధింప బడును. విశ్వమందలి విశ్వావశ్యకత ఫలప్రదమగును. ప్రపంచమునందు అనివార్యమయిన అభిశాప్య రూపములగు దుఃఖము లేకుండ, శాంతి సంయుతమై, విశ్రాంతి దాయకమగును.

విశ్వ హృదయమయిన భారతము మీద, విశ్వ భుజస్కంధము లయిన ఇతర ప్రాంతములలోనను, విశ్వ విధానమును సరిదిద్దెడి బాధ్యత వహించిన వ్యక్తులు, బాధ్యతాయుతముగ, త్రికరణశుద్ధిగ, విశ్వత్వ భావముల యందచంచల విశ్వాసముతో వ్యవహారములను సరిదిద్దు చున్నారు. ఎన్నడో మరుగుపడి, ఇటీవలనే జ్ఞప్తికి తెచ్చుకొనిన, విశ్వ నిర్మాణ సౌధమునందలి భారతీయ ప్రత్యేక బాధ్యతలను గుర్తించుకొని, అధిక బాధ్యతాపరులై, విశ్వ ప్రయోజన సంసిద్ధికొరకు, వారు వ్యవ హరించుచున్నారు. భారత రాజకీయ, సామాజిక నిర్మాణములందు గల మతమనెడి దోషము కాలక్రమమున తనంతతానే పోవునని నాయకు లింకను అశ్రద్ధ చేసినచో, ఆ దోషము నివారించుటయందు జాలి వహించి, ఏమరుపాటుతో నున్నచో దానినొక నిచ్చెనగ నుప యోగించుకొని రాజకీయ సౌధారోహణ గావించుటకై ఆశాభంగము నొందిన రాజకీయ వేత్తలు చేయు ప్రయత్నములు, సఫలములు కావ చ్చును. ప్రస్తుత రాజకీయ మహానాయకులీ యుపద్రవమును గుర్తించి, భావికాలపు అభిశాప్యపు పరిస్థితులను తప్పింప యత్నింపవలెను.

ఈ దోషముయొక్క ప్రమాద భూయిష్ఠములగు ఫలితములను తక్కువగ పరిగణించుటకు కారణము లిదివరకు లేవు. ఇప్పుడును లేవు. ఇక ముందుకూడ నుండవు. ఆ దోషము ఇప్పుడు మిక్కుటముగ లేదని మీరనుకొనుచుండ వచ్చును. అది మిక్కుటముగ నుండుటయే గాక, వినాశకరముగ కూడ నున్నది. దాని వ్యవహార విధానములు మారి నవి. తన నిర్మాణస్థితిని మార్చుకొన్నది. విశ్వాత్మక స్వరూపమును ధరించి, ఐక్యత, శాంతి, విశ్రాంతులవలె గన్పట్టుచు, రాజకీయ నిర్మా ణము, విధానములవలన నిర్మితమగుచున్న సమైక్యత, శాంతి, విశ్రాంతు లను తానే తినివేయుచున్నది. ఇప్పుడు భారత రాజకీయముచే, సమై క్యత శాంతి సంపదలు ఏమాత్రము నెలకొల్ప బడియున్నను, అవి

మతముయొక్క కోరికవలనను కాదు, సహాయము వలనను కాదు. మతముచే కల్పింపబడు అడ్డంకులను వ్యతిరేకతను అధిగమించియే స్థాపింపబడినవి. ఆశాభంగము నొందిన రాజకీయ నాయకులీ మతమును దోషము నాధారముగ జేసికొని, రాజకీయ సౌధము నధిరోహించి దానిని తమ యిష్టము వచ్చినట్లుపయోగించుకొని, ప్రస్తుత పురోగమనమునకు కారణము, ఆధారము నయిన మూలసిద్ధాంతములనే మార్చ గోరెదరు.

ఈ దోషమును సరిదిద్దుటకు ప్రపంచమునందలి వివిధ ప్రాంతములలో వేర్వేరు కాలములలో చేసిన ప్రయత్నము లన్నియును విఫలములైనవి. గతకాలములో, ఎన్నడును, ఎచ్చటను, ఈ దోషనివారణకు సకాలములో యత్నింపలేదు. ఎల్లప్పుడును కాలాతీతమైన పిమ్మటనే అట్టి యత్నములు జరిగినవి. ఈ దోషమును నివారించుటయందు గత కాలములో మిక్కిలి యశ్రద్ధ చేయబడినది. చేసిన ప్రయత్నములలో కొంచెముకూడ ప్రేమలేకుండ చేయబడినవి. ఈ దోషము తనను పోలిన యితర దోషములను, అధికముగ ఇతర క్లిష్టసమస్యలను, తన్నివారణోపాయములకు విఘ్నములను ప్రపంచమునందన్ని ప్రాంతములయందును కలిగించినది. ప్రపంచమునందలి యితర ప్రాంతీయులకు ఆధ్యాత్మిక సిద్ధాంతముల వ్యాప్తి ఆలస్యముగ జరిగియున్నది గనుగ వారీ దోషమునకు గురియగుటను కొంతవరకు సమర్థింపవచ్చును. కాని భారతదేశ మీ దోషమునకు బానిసమై యుండుట కొంచెముకూడ సమర్థనీయముకాదు. ఆధ్యాత్మిక సిద్ధాంతములు సునిశితముగ చొచ్చుకొని పోవుచు, గంభీర దృక్కులతో పరికించుచుండగ, మీరు వానిని సక్రమముగ గ్రహించుటకు మారుగ విభ్రాంతి పూర్వక దృక్కులతో వానిని చూచుచున్నారు. భారత మానవానీకమునకు, భారత రాజకీయ నాయకులకు కొంతవరకు సమర్థనీయమైన కారణములుండి

యుండెడివి. ఏలనన, కొలదికాలము క్రితమువరకు రాజకీయ పారతంత్ర్యమునందుండె యుండిరి. కాని యిప్పుడు మీరు రాజకీయముగ సర్వస్వతంత్రులయిన తరువాతకూడ ఇంకను నీ దోషమునకు బానిసలై యుండుట కొంచెముగూడ సమర్థనీయముగాదు. మీరా దోష నివారణమందే నిమగ్నులయి యున్నారు. ఆ ప్రయత్నమునందు ముందునకు సాగుచున్నారు. కాని మీ విధానము తగినదిగలేదు. కావలసిన ఫలితమునకు మారుగ కోరిన ఫలితముల నిచ్చునదై యున్నది. అనగా ప్రజల కోరికలు వారి యిష్టముల ననుసరించి యుండును. వారి యిష్టములు అభ్యుదయమునో, బాహ్యాభివృద్ధినో అనుసరించియుండును. అభ్యుదయము, బాహ్యాభివృద్ధి ప్రజలలో పరిణామము పొందినశక్తి యుండుట, ఉండకపోవుటనుబట్టి యుండును. అందువలన ప్రజలకు తమకు కావలసిన దానికిని, తాము కోరెడి దానికిని తారతమ్యము తెలిసికొనుట కష్టము. ప్రజలు సాధారణముగ తమకు ప్రీతికరమగు వానినే కోరుకొందురు. వారట్లే చేయుచున్నారు.

ఈ రీతిగ, ప్రజలు సమాజమునందు తమకు గల హక్కులను, ఉన్నత స్థితిని ఏదో రీతిగ కాపాడుకొనుటకు, వారికి గల అధికార గౌరవములను సౌఖ్యములను నిలబెట్టుకొనుటకు ఈ మతదోషముయొక్క సలహాను, సహకారమును, అధికారమును ఆశ్రయించుచున్నారు. మత నాయకులయొక్క కోరిక తమ హక్కులను కాపాడుకొనుటయే. అందు కొరకీ దోషము అనివార్యముగ నుండవలసినదే. అప్పు డది రాజకీయ ఉపనాయకుల కందుబాటులోనుండె, వారికి రాజకీయ శిఖరారోహణావకాశము నిచ్చి, పురోగతిని తారుమారు చేయగలుగును. వారు రాజకీయాధికారములు పొందుటయే తటస్థించిన యెడల, వారి కోర్కెలను తీర్చుకొనుటకు, సాధింపబడిన కొద్ది సమైక్యత, శాంతి సంపద

లను, రాజకీయ నిర్మాణ మూలమునుండి తినివేయుట కెంతో కాలము పట్టదు. వారిలో చాలమంది నేడుకూడ సిగ్గులేకుండ, ఇతరులకు, మన కందరకుకూడ తలవంపు కలుగునట్లు మన రాజకీయ స్వాతంత్ర్యమునకు పూర్వపు కాలమును, స్థితిని పొగడుదురు. స్వాతంత్ర్యము వచ్చిన తరువాతకంటె అంతకు ముందే తమ హక్కులు బాగుండెడి వందురు. ఇప్పుడు తమ హక్కులు తగ్గిపోవుచున్న వందురు. ఇది కావలసిన ఫలితము కాదు.

కావలసిన ఫలితము భారతదేశము తనయునికినిబట్టి తనకుగల యున్నత స్థితినిబట్టి, సమస్త మానవులయొక్క, విశ్వముయొక్క బాధ్యతలను నిర్వహించుట కనువై యుండుటయే. సమైక్యత, శాంతి, సంపద, అభ్యుదయము, రాజకీయ సిద్ధాంతములకు విధానములకు సామరస్యము ఇవి యిందుల కనువైన పరిస్థితులు. అందువలన కోరిన ఫలితముల నిచ్చు నీ దోషములను వెంటనే ఆలస్యము లేకుండ భారత దేశము నందలి ఆధ్యాత్మిక గ్రంథములలోనుండి తీసివేయవలెను. ఆ దోష నివారణ ప్రయత్నము ఇదివరకును ఇప్పుడుకూడ భారతదేశము నందు తప్ప ఇతర ప్రదేశముల యందెచ్చటను జరుగలేదు.

పూర్వకాలమున, భారతమునందు విశ్వవిఖ్యాతిగాంచిన ఒక ఆధ్యాత్మిక మహావ్యక్తి వలన, ఒక గొప్ప ప్రయత్నము జరిగినది. మతముతో సంబంధము లేకుండ, సరాసరిగ, సమాజము నాధ్యాత్మిక ముగ జేయుటకు ఆ మహావ్యక్తి యత్నించెను. ఈ మహాప్రయత్నము భూత భవిష్యద్వర్త మానకాలము లందలి మతములను పరివర్తింప జేయుటకు చేయబడినది. ఈ ప్రయత్నము రాజకీయము యొక్క సహాయము నపేక్షింపలేదు. వినియోగపరచుకొనలేదు. అందువలన అది భారతదేశమునందు వర్ధిల్లలేకపోయినది. భారతదేశమునుదాటి యితర

దేశములకు పోయి అక్కడ వర్థిల్లినది. దాని విధానము వ్యక్తిత్వ భావమునుండి వ్యక్తులు విశ్వాత్మభావమును పొందుట. వ్యక్తినుండి, వర్గస్వార్థత ద్వారా ఆధ్యాత్మికత్వమును పొందగోరలేము. వ్యక్తి స్వార్థతనుండి నిస్వార్థతనే పొందగోరి నప్పటికిని, వర్గస్వార్థతయొక్క, అనగా మతము యొక్క అనావశ్యతను గూర్చి అది చెప్పకపోవుటచే, మత నిర్మూలనము నది కోరియుండక పోవుటచే సమాజమును విశ్వాత్మకీయముచేయు ఆ ప్రయత్నము కూడ కాలక్రమమున ఒక మతమై పోయెను. మానవులాధ్యాత్మికత్వము ననుసరించునట్లుచేయు నీ మహా ప్రయత్నము, మతముగ పరిగణింపబడి నప్పటికిని, అది తన ప్రయత్నములలోనను, విధానములోనను అనాధ్యాత్మికములైన సిద్ధాంతముల నెన్నడును ప్రయోగింపలేదు. భారతదేశమునందును, ఇతరప్రదేశము లందును చేయబడిన ప్రయత్నములన్నియు మతము యొక్క సంస్కరణకే. స్వార్థపరత్వమునే మూలముగ కలిగియున్నట్టియు, స్వార్థపరత్వమున వ్యవహరించుచున్నట్టి మతములు సంస్కరింపబడి నప్పటికిని వాని మార్గములు విధానములు మారునుగాని వాని సిద్ధాంతములు, మూలము మారవు. ఆ విధానములలో కలిగిన మార్పులయినను, ఏ కొలదో కాలమో యుండును గాని శాశ్వతముగ నుండవు. మతమటువంటిది. అటు తరువాత ఆధ్యాత్మిక మహావ్యక్తులు చేసిన ప్రయత్నములన్నియు విఫలములై, మతముల కోరికలే నెరవేరెను.

ప్రపంచము నందలి కొన్ని ప్రాంతములలో ఆధ్యాత్మిక మహా వ్యక్తులు సశరీరులై యున్నప్పుడు, సత్ఫలోదయ సూచకములగు లక్షణములు కొన్ని కనపడినవి. వారి శరీరములు గతించిన తరువాత ఆ లక్షణములు తగ్గుట ప్రారంభించి కొలది కాలములో పూర్తిగ తగ్గిపోయెను. మరి కొన్ని ప్రదేశములలో, ఆధ్యాత్మిక మహావ్యక్తులు సశరీరులై యుండగనే, ఆ లక్షణములు క్షీణించుట ప్రారంభించి, వారి దేహాంత

ముతో బాటవియు అంతమయ్యెను. దీనికి కారణము ఆ ప్రజలలో గల స్వార్థపరత్వము. వానిలోని వర్గములకు గల హక్కులే. సాధారణముగ వ్యక్తు లందరును వర్గ స్వార్థత పెంపొందించు కొనుటవలన, విశ్వస్వార్థతకు అనగా నిస్వార్థత కనస్పులైరి. అందువలన, వ్యక్తి స్వార్థతనుండి మానవోచితమగు స్వార్థతద్వారా, వర్గస్వార్థత, మత స్వార్థతలలో పడకుండ, తమలో గల స్వార్థతను పోగొట్టుకొనుచు, ఆధ్యాత్మిక గ్రంథములలోని అట్టి స్వార్థతలను కూడ పోగొట్టుచు, సమాజము పురోగమింపవలెను.

ప్రపంచము నందలి యే ప్రాంతముల యందైనను, ఏ మత గ్రంథములలో గూడ ఆధ్యాత్మికత్వము, ఆధ్యాత్మిక సిద్ధాంతములు సంపూర్ణముగ చెప్పబడియుండలేదు. కాని, భారతీయ అధిక సంఖ్యాక సమాజపు గ్రంథములు మత గ్రంథములు కావు. అవి ఆధ్యాత్మిక గ్రంథములే. విశ్వవిషయములు, మానవుల విషయములు, సమస్త జీవ రాసుల విషయములు, వానికి గల పరస్పర సంబంధము, బాధ్యత, ఆశయము, తమ మూలాశయ సంసిద్ధి, ఆద్యంతములు లేని సర్వాంత ర్యామి యందు విశ్వాసము వానియందు చెప్పబడెను.

అందువలన రాజకీయాధినేతలు, సమాజనాయకులు కూడ పూనుకొని ప్రయత్నించినప్పటికిని, ప్రపంచమునందు మతము లేకుండ చేయుట చాల కష్టమయిన పని. ప్రపంచము నందలి కొన్ని భాగముల లోని జనులు అధికముగ ధనధాన్యములను కూడబెట్టుటయందు ఎక్కువ నేర్పుగలవారు. వారు అత్యధిక ఆహారపు నిల్వలను కలిగియున్నారు. ధనధాన్యాదులలో ప్రజలను వశవర్తులుగ జేసికొను శక్తియున్నది. అట్టి పదార్థాధీనతకు స్వార్థపరత్వమే మార్గమగుటచే మానవులు తమ ఆస్తులకు తామే ఆస్తులై పోవు చున్నారు. వారిలోగల శక్తి వ్యామో

హంముతో కూడియుండుటవలన వారు స్వార్థపరత్వము నధిగమింప లేరు. వ్యక్తి స్వార్థతకు, తమ వర్గస్వార్థతకు అతీతులు కాలేరు. అందు వలన ఆయా ప్రాంతీయ అధినేతల కార్యము కష్టమయ్యెను.

కాని, భారతదేశములోని పరిస్థితులు వేరు. ఆదికాలము నుండియు ఆధ్యాత్మిక గ్రంథములను కలిగియుండుటచే, అవి తమ పూర్వులచే శబ్దరూపము నొందింపబడిన కాలమునుండియు చాల కాలము వారి శక్తి ఆ గ్రంథములయందు లగ్నమగుట చేతను, భారతీయులు మిగిలిన దేశములలోని ప్రజలకంటె ఆధ్యాత్మికత్వమునకు సన్నిహితులు. వారి కితరులకంటె ఆధ్యాత్మికానుభవము తాత్వికము గను, ప్రత్యక్షముగను కూడ గలదు. అంతేగాక, వారికి ఆధ్యాత్మిక మహావ్యక్తు లగు వివేకానంద, రామతీర్థ, మహాత్మాగాంధీవంటి యిటీవలి దృష్టాంతరములు కూడ కలవు. అదియును గాక, వారికి అధిక సంపదలు లేకపోవుటవలన, కలిగిన పరిస్థితుల యానుకూల్యము కూడ గలదు. వారు తాము విస్మరించిన కర్తవ్య స్ఫురణలను, కర్తవ్య సంసిద్ధి కనువగు సిద్ధాంతములను తమ మూలములో నేకత్వానుభూతిని పొంది, అనివార్యమగు పునరవతరణావశ్యకత కతీతులయి, వారి పరమాశయమును మానవోచితముగ నిర్వహించుట కవకాశములు కలిగి యున్నారు.

భారతదేశ రాజకీయ స్వాతంత్ర్య సిద్ధికి ప్రజల యొక్క యుద్యమమే గాక అనేక యితరవిషయములు సహాయపడినను, వారి యుద్యమములో ప్రయోగింపబడిన ఆధ్యాత్మిక సిద్ధాంతములే ప్రముఖ కారణము. భారతరాజకీయ స్వాతంత్ర్యము సంసిద్ధి విశ్వావశ్యకత యగుటచే, దాని వెనుక విశ్వప్రయోజన మిమిడియుండుటచే, ఆ స్వాతంత్ర్య సంసిద్ధికై ప్రయోగింపబడిన ఆధ్యాత్మిక సిద్ధాంతములు

ప్రత్యక్షముగను, పరోక్షముగను అట్టి స్వాతంత్ర్య సంపాద్య కారకము లయిన యితర విషయములను కలుగజేసెను.

ఈ విధముగ భారతదేశ మిప్పుడు స్వతంత్ర దేశమైనది. భారతీయు లిప్పుడు భావివిధానమును సాధనక్రమమును ఆలోచించి, పునరాలోచించి, నిశ్చయించి, స్థిరపరచుటకు సర్వసమర్థులు. అందు వలన భారతదేశమందలి ప్రస్తుత పరిస్థితులు ఇతరదేశములలోకంటె, విశ్వబాధ్యతా నిర్వహణకు, దాని వెనుకగల ప్రయోజనసాధనకు, అనువై యున్నది. కనుక, భావివిధానమును గూర్చిన నిర్ణయములు విశ్వావశ్యకతతో దాని వెనుక గల ప్రయోజనముతో సామరస్యము కలిగియుండవలెను. ప్రళయకాలమందు దుఃఖరహితముగ, శాంతిమయముగ ప్రపంచ, అభ్యుదయముల ద్వారా మానవ కర్తవ్యమును సాధించుటయే ఈ విశ్వావశ్యకతకు వెనుక గల యుద్దేశ్యము. అందువలన, ఆ యాశయ సంసిద్ధికి వినియోగింపబడు సిద్ధాంతములు విశ్వప్రయోగానుకూల్యము కలిగియుండవలెను.

ప్రస్తుతము భారతీయుల రాజకీయమైన ఆలోచన, నిశ్చయము, తీర్పు, సామరస్యము కలిగియున్నది. ఈ సామరస్యము విశ్వావశ్యకత, కర్తవ్యము, సిద్ధాంతములతోకూడ సామరస్యము కలిగి అదేమార్గమున ముందునకు సాగుచు విశ్వసంస్తుతి బాహ్యముగనైనను పొందుచున్నది. బాహ్యమేలనన, కొన్ని ప్రాంతముల ప్రజానాయకులు తమతో నిష్టముగ, ప్రీతితో సహకరింపక పోయినప్పటికిని భారతీయ నాయకులు ధైర్యముగ, గంభీరముగ, వినయముతో, విశ్వావశ్యకతా సాధనకును, విశ్వకర్తవ్య సంసిద్ధికిని ముందునకు సక్రమముగ పురోగమించుచున్నారు. ఈ ప్రస్థానము నరికట్టుటకు కొన్ని ప్రాంతముల నాయకులు చేసిన, చేయుచున్న ప్రయత్నము లన్నియు వ్యర్థమగుట

వలన, ఇష్టము లేకపోయినప్పటికిని భారతీయ పురోగమనమును బాహ్యముగనైన వారు సంస్తుతించుచున్నారు.

ఈ యనిష్ట సహకారమునకు కారణముగ వారికి ఒక ప్రత్యేకమగు ఉద్దేశ్యమున్నది. ఆ యుద్దేశ్యము భారతీయ కర్తవ్యమునకు విరుద్ధమైనది. ఆ యుద్దేశ్యము అవిశ్వాత్మకము. అది వర్గస్వార్థముతో కూడియున్నది. అందువలన మతసంబంధ మయినది. వారి స్వార్థమునకు మూలమైన ఆశయున్నది. భారతదేశములోని అధిక సంఖ్యాక సమాజములోని ఆశాభంగము నొందిన రాజకీయ నాయకులు, సమాజముతో గల మత మనెడి దోషము నొక రాజకీయపు నిచ్చెనగా నుపయోగించుకొని వర్గ స్వార్థ సహకారముతో రాజకీయ సౌధాగ్రము నధిష్టించి రాజకీయ వ్యవస్థ కధినాయకులై తమ కనుకూలురు కాకపోవుదురా యని వారి యాశ. వారి వాంఛితఫలము ప్రాప్తించినచో, భారతము యొక్కయు, తన్మూలమున ప్రపంచము యొక్కయు పరమాశయము సాధింపబడదు. వీని లక్షణములు భారతమునందును, ఇతర చోటుల యందును కనపడుచునే యున్నవి కనుక యిక్కడ వివరింప నక్కరలేదు.

అందువలన అధికసంఖ్యాక సమాజము నుండి, వారి గ్రంథములనుండి మతమును తొలగించుట భారతదేశమునకు అత్యంత అనివార్యావశ్యకత. ఇందు నిమిత్తమై ఒక తీవ్రప్రయత్నము ప్రస్తుతము సాగుచున్నది. ఈ ప్రయత్నము కూడ ప్రజలు కోరిన ఫలమును పొందుటకే గాని, ప్రజలకు అవసరమయిన ఫలప్రాప్తి కొరకు కాదు. పూర్వ మెన్నియో పర్యాయము లిట్టి విఫల ప్రయత్నములు జరిగి ప్రస్తుతపు దీనపరిస్థితిని పునఃప్రయత్నములను కలిగించినవి. మానవులు అరవ పతనావస్థకు పడిపోయిన తరువాత సర్వాంతర్యామి సాక్షాత్కా

రమ్మలైన మహావ్యక్తులు, ఆధ్యాత్మిక మూలముపై నొక సమాజము నేర్పరచి, మానవేతరుల కొరకు మానవ శరీరములను సృజించుటకు, మానవులకు పునరవతరణావశ్యకతను నివారించుటకును, ఆధ్యాత్మిక సిద్ధాంతానుసారము వైవాహిక సంస్థను స్థాపించిరి. అటు తరువాత, మానవ శరీరములకు రక్షణ పోషణాదులను సమకూర్చుటకు, అట్లు సమకూర్చబడిన రక్షణ పోషణాదులను సమాజము దుర్వినియోగము చేయకుండ చూచుటకును, ఆధ్యాత్మిక సిద్ధాంతముల ననుసరించియే రాజకీయసంస్థను కూడ నెలకొల్పిరి. అటు తరువాత సమాజము రాజకీయము కలిసి సమాజము నందలి ఆధ్యాత్మికతకు, ఆధ్యాత్మిక సిద్ధాంతముల రక్షణ కొరకు, సమాజముతో రాజకీయము సామరస్యము గలిగి వ్యవహరించుటకు ఒక సమన్వయకారిగ ఆధ్యాత్మిక సిద్ధాంతముల ననుసరించి మతమును స్థాపించిరి. తదుపరి మతము యొక్క వైఖరిమారి, రాజకీయములలో కలుగజేసికొని, రాజకీయముపైన, సమాజముపైన, తనకు అధికారము నారోపించుకొని, ఆధ్యాత్మికత్వమును పూర్తిగ గోల్పోయి, తన వ్యక్తిత్వము భంగపరచు కొనకుండ రాజకీయముతో నవినాభావముగ మిశ్రితమై, సమాజమును, రాజకీయమును కూడ ఆధ్యాత్మికత్వ హీనులుగచేసి, వాని యందలి ఆధ్యాత్మికత్వమును నశింపజేయుచున్నది. ఈ కార్యకలాపమునందు మతమింకను విజయము పొందియుండ లేదు. భావికాలము నందుకూడ పొందలేదు. కాని ప్రపంచము నందంతటను సమాజమును, రాజకీయమును తనకు బానిసలుగ చేసికొనుట యందు మాత్రము జయము గాంచినది.

తుట్టతుదకు, ఈ శతాబ్దప్రారంభ కాలమునందు చాల పెద్దదియైన భూ భాగమునందలి ప్రజలు మత భూయిష్టమైన రాజకీయ దాస్యమునుండి విముక్తులై, ఆ ప్రాంతము నంతను తత్ఫలితములనుండి విముక్తుల జేసెను. ఆ ప్రాంతపు జనులు ఈ మహాఫలితమును కొంత

వరకును, రాజకీయ సిద్ధాంత ప్రయోగము వలనను, కొంతవరకును ఆధ్యాత్మిక సిద్ధాంత ప్రయోగము వలనను ప్రజాసమైక్యతకు భంగము లేకుండ సాధించిరి. అప్పటినుండి ఆ ప్రజలు, ఆ ప్రాంతము, సగర్వముగ మానవ పరమాశయ సంసిద్ధి దాయక పథమునందు సమైక్యత, శాంతి, సంపద, అభ్యుదయ సిద్ధాంతములను ప్రయోగించుచు పురోగమించుచున్నారు.

అటు తరువాత, గత దశాబ్ది మధ్యకాలమందు మరియొక పెద్ద ప్రదేశపు ప్రజలు, భారతీయులు కూడ రాజకీయ దాస్యమునుండి విముక్తులై, ఆ దాస్యఫలితములనుండి ఆ ప్రాంతమును విముక్తను గావించిరి. ప్రజలలో శాంతి సమైక్యతల ద్వారా, సంపూర్ణముగ ఆధ్యాత్మిక సిద్ధాంత ప్రయోగము వలననే, వారీ విజయమును సాధించిరి. అప్పటినుండి, ఆ ప్రజలు, ఆ ప్రాంతము సవినయముగ, సగర్వముగ, గంభీరముగ అభ్యుదయ పథమున పురోగమించుచున్నది. వస్తు విషయాదులతోడి వ్యవహారమునందు ఆధ్యాత్మిక సిద్ధాంత ప్రయోగమునకు భారతీయులు స్వతః అలవాటు పడియుండుట వలన, వారు తమ అభ్యుదయమునకే గాక, సమస్త మానవాభ్యుదయమునకై వ్యవహరించుచున్నారు.

ఇటీవల, విశ్వవిఖ్యాత ఆధ్యాత్మిక మహావ్యక్తులలో కొందరు, మన పూర్వులలో కొందరయిన వివేకానంద, రామతీర్థ, గాంధి మహాత్ముని వంటివారలు, వస్తు విషయాదులతోడి తమ వ్యవహారములలో, తమ ప్రవర్తన వైఖరులలో విశ్వాత్మకముగ భావించి, ఆలోచించి, పలికి, వ్రాసి వ్యవహరించిరి. హక్కులు, విభజనలు, అవధులు, పరిమితులపై నాధారపడిన ప్రవర్తన వైఖరులను వారు పోగొట్ట గోరిరి. వారు సమస్త మానవులకు సామాన్య మానవ అవసరములు అవశ్యముగ సమకూర్పబడవలెననిరి. అధికముగ కూడబెట్టిన సంపదలను

అవి లేనిచోట పంచి యీయవలెననిరి. దేవళము లన్నియు ప్రజలందరకును తెరువబడవలెననిరి. అందరకును అన్ని విధముల సమానత్వము కావలెననిరి. మానవుల యందు దనాధ్యాత్మికత్వము కొంచెముకూడ నుండరాదనిరి. విశ్వమందలి మానవులందరిని ముఖ్యముగ భారతీయులను ఈ విధముగ ప్రబోధించి ఆధ్యాత్మికపరుల గావింపగోరిరి. విశ్వమందలి సమస్త మానవులు విశ్వాత్మకులు కావలెననిరి.

భారత ప్రజానీకము, ఆధ్యాత్మికముగ పరిణతి పొందుటకు అనువైన పరిస్థితులలో లేకపోవుటను గ్రహించి, ఆ మహావ్యక్తులు తమ శక్త్యుత్సాహములను అనువైన పరిస్థితులను కలుగజేయుటకు వినియోగించిరి. వారి ఆధ్యాత్మిక పురోగమనమున రాజకీయ దాస్యము అడ్డంకిగా నుండుటను గ్రహించి దానిని ముందుగ పోగొట్ట పూనుకొనిరి. అందువలన రాజకీయ పరిస్థితులలో మార్పు లత్యంతావశ్యకము లయ్యెను. వారు రాజకీయ స్వాతంత్ర్యమును కలుగజేయ నిశ్చయించుకొని, అట్లు కలుగజేసిరి. వారి ప్రవర్తన లన్నియును ఆధ్యాత్మికము. వారి యలవాట్లు ఆధ్యాత్మికములు. కాని రాజకీయముగ స్వతంత్రులయిన వెంటనే భారతీయులు తమ పూర్వపు అనాధ్యాత్మిక వైఖరి, విధానములను అనుసరింప దొడగిరి. ఈ విధానము క్రమక్రమముగ నిర్వహింపబడి, యిప్పుడు వెనుకటి కంటె తీవ్రతరముగ నున్నది.

ఆధ్యాత్మిక మహావ్యక్తులైన వివేకానంద, రామతీర్థ, మహాత్మా గాంధీలు భారత సమాజమునుండి మతము అను పదమును తుడిచివేయమని చెప్పకపోయినప్పటికిని, మతము ప్రబోధకము లయినట్టి పద్ధతులను, దానికి తోడ్పడు సమస్త వస్తు విషయాదులను తుడిచివేయవలెననియే ప్రబోధించిరి.

కొందరు ప్రజలకు మరికొందరిపై గల హక్కులే మతమై యున్నవి. ఈ మతమునకు ప్రాతిపదిక వ్యక్తి స్వార్థము, వర్గస్వార్థమును నై యున్నవి. భారతీయులలో ఆనాడే కొలదియైన ఐకమత్యముండి యుండిన యెడల అవి యీ వర్గ స్వార్థత మూలమున నై యుండెడిది. అందువలన ఇది మతము పేరిట వర్ధిల్లు అత్యంతావశ్యకమైన రాజకీయ దాస్య విముక్తిని సాధించుటకు, తమ ప్రధానాశయమును సాధించుటకు మహావ్యక్తు లీ మతమును తుడిచివేయవలెనని ప్రత్యేకముగ కోరలేదు. దానికి బదులు మతముయొక్క ఆశయమును నిలువబెట్టి, మత లక్షణములు గల చర్యలన్నిటిని తుడిచి పారవేయుమని ప్రబోధించిరి.

తుద కిప్పుడు భారతమునం దధికసంఖ్యాకులు ఆ మహావ్యక్తుల సేవను మతసంస్కరణ యనుచున్నారు. వారి సేవాఫలితమును మత పునరుద్ధారణ యనుచున్నారు. వారిని మతోద్ధారకు లనుచున్నారు. అనగా నిదికూడ కొన్నివర్గములకు మరికొన్ని వర్గముల మీద హాల హక్కులను ప్రబోధించు నన్నమాట. కాని ఆ మహావ్యక్తులసేవ స్వార్థ పరత్వమును, హక్కులను నిర్మూలించుటకే, అనగా మతనిర్మూలనమునకే! ముఖ్యముగ భారతమునందలి అధికసంఖ్యాక సమాజములో! వారు నిజముగ సమాజమునందలి ఆధ్యాత్మికత్వ పునరుద్ధారకులు. వారే విశ్వాత్మక మహావ్యక్తులు.

ఈ రీతిగ భారతీయ అధికసంఖ్యాక సమాజమునందలి మత వ్యక్తులు వివేకానంద, రామతీర్థ, మహాత్మా గాంధీవంటి మహావ్యక్తులను మతముల స్థితికి దింపివేసిరి. వారి కార్యకలాపములు మత వ్యవహారము లనిరి.

మతమునకు సంబంధించిన లక్షణములను చర్యలన్నిటిని దూరము చేయవలెనని వారెన్ని పర్యాయములు స్పష్టము చేసినప్పటికిని, మతముయొక్క ఉద్దేశ్యమైన ఆధ్యాత్మిక పునరుద్ధారణావశ్యకతను విశద పరచినప్పటికిని, మతమే వారి కార్యకలాపముల కడ్డుదు ఎదురగుటవలన అనగా మతము పేరిటనే ఏ కొలదియైనను స్వమైక్యత యుండి యున్నందున వారు 'మతము' అను పదమునే దూరము చేయమని వారు ప్రత్యేకముగ చెప్పలేదు. ఆ చెప్పకపోవుటయను కారణమున, వారి యనంతరము, మతము మరల బలవత్తరమగుచున్నది. ఇంకను మతమును కొనసాగించుటవలన, భారతమునందలి అధిక సంఖ్యాక సమాజమునందు కలుగు దుష్ఫలితములు సువిదితమే. ఆ మహావ్యక్తులీ మత నిర్మూలనమునకే ప్రయత్నించి రనుటయు ఆ మతమను పదమును వారుపయోగించకుండుటకు కల కారణములును లోకవిదితమే!

ఈ తరువాత, మరియొక పెద్ద దేశపు ప్రజలు మతభూయిష్ట రాజకీయమునుండి విముక్తిగాంచిరి. ఆ దేశముకూడ స్వతంత్రమయ్యెను. కొంతవరకు రాజకీయ విధానములను, కొంతవరకు ఆధ్యాత్మిక విధానములను అనుసరించి వారు స్వాతంత్ర్యమును సాధించిరి. అప్పటినుండి వారు స్థిరముగ, చైతన్య యుతముగ, విశ్వసిద్ధాంతముల ననుసరించుచు, మానవ పరమాశయసిద్ధి దాయకమగు పథమున పురోగమించు చున్నారు.

భారత దేశమునందు, మతము సమాజమును బానిసగ చేసికొనుటయందు విజయము గాంచెను. సమాజమును మాత్రమే బానిసగ చేసికొన గలిగెను. కాని రాజకీయమును చేసికొనలేకపోయెను. మత రాజకీయ బానిసత్వమునుండి విముక్తి పొందిన యితరదేశపు

మహానాయకులీ గుణపాఠమును గుర్తించి, వారి దేశములు కూడ మరల మతములకు బానిసలు గాకుండ కాపాడుకొనెదరుగాక ! ప్రస్తుతము ఈ మూడు ప్రాంతముల రాజకీయములే మత ప్రాబల్యము లేకుండ సిద్ధాంతముల ననుసరించి సాగుచున్నవి. ప్రపంచమందలి మిగిలిన ప్రాంతములలోని రాజకీయములు, ఉద్దేశ్యములు రాజనీతి ననుసరించి సాగుచున్నవి. ప్రపంచమునందలి మతము, రాజకీయములు, ఆధ్యాత్మికత్వముల స్థితి యిది. మతము, రాజకీయమునకును సమాజమునకును సేవ చేయవలసి యున్నది. అందువలన మతము ఈ రెండింటికిని ఉమ్మడి సేవకుడు. రాజకీయము సమాజమునకు సేవచేయవలెను. అందువలన అది సమాజపు సేవకుడు. సమాజము భగవంతునికి అనగా సర్వాంతర్యామికి సేవకుడు. ఇవి యన్నియును ఆధ్యాత్మిక మూలములైనవి. ఆధ్యాత్మిక సిద్ధాంతములద్వారా సాధింపబడ వలసియున్నది. వీని నన్నిటిని సాధించుటకు మార్గము వైవాహికసంస్థ. అది మానవులకు మానవేతరులకు ప్రస్తుత మానవ పరిస్థితి ననుసరించి సంబంధమును కల్పించు సంధి.

ఈ విధముగ సర్వాంతర్యామియొక్క క్రొత్త సేవకుడు, అన్నిటికంటెను చివర స్థాపింపబడిన మతసంస్థ. ఇది సమాజ రాజకీయ సేవకుల సేవలో చిన్న సేవకుడు. ఆ మతము విశ్వాత్మకత్వమును గోల్పోయి, అనైక్యత, అశాంతి, కల్లోలముల కాలవాలమై, విశ్వాత్మకత్వమును నిల్పుకొను శక్తినికూడ గోల్పోయి యుండుటచే, సమాజ రాజకీయముల సేవలోనుండి దానిని తొలగించుట తప్ప యితర మార్గములేదు. ఆ పనిని వెంటనే చేయవలెను.

ఈ మతమును స్థిరముగ నెవరొక్కని వ్యవహరించుటకు మానవుల అసంసిద్ధత యిచ్చట ప్రత్యక్ష మగుచున్నది. ప్రపంచము నందనేక

మతము లున్నవి. వానిలో కొన్నిటిని మాత్రమే ముఖ్యమతములుగా పరిగణించుచున్నారు. చాల మతములును, అప్రధానములుగ పరిగణింపబడుచున్న కొన్ని చిన్న మతములలో విశ్వాత్మకత్వము ఎక్కువగ నున్నది. ఈ చిన్న మతములలో కొన్ని పెద్దమతములకంటె పురాతనమైనవి. అయినప్పటికిని మతములలో నీ చిన్న పెద్ద తారతమ్యమెందులకుండ వలయును ? ఈ తారతమ్యమునకు ప్రాతిపదిక, ఆయా మతావలంబుల సంఖ్యను బట్టియే. సంఖ్యాధిక్యత. ఇతరులకంటె తమ కధికముగ లభించు హక్కులు, సదుపాయములపై నాధారపడి యుండును.

ప్రత్యేక హక్కులను, సదుపాయములను కల్పించి సంఖ్యాబలము నధికపరచుకొనుట రాజకీయములను వశపరచుకొనినపుడే మతములకు సాధ్యమయ్యెడిది. ఈ స్థితియందు మతముల ప్రాముఖ్యత వానికి గల రాజకీయ ప్రాబల్యము పైననే యాధారపడి యుండెడిది. నేడును అట్లే యున్నది. ఇక ముందును అంతే. ప్రతి మతగ్రంథము లోని ఆధ్యాత్మిక సూత్రముల ననుసరించి చూచినచో మతములచే రాజకీయాధికారము గ్రహింపబడుట మతముయొక్క ఉద్దేశ్యములకు విరుద్ధము. అయినప్పటికిని అనాధ్యాత్మికములైన యిట్టి మతములే ప్రముఖ మతములుగ చలామణి యగుచున్నవి. మతమునందలి యీ దుర్వికారము నుపేక్షించుచు నూరకుండుట మానవాళికి తగదు.

అంతేకాక, విశ్వాత్మకత్వము నందున్ముఖులైన మానవు లధిక సంఖ్యాకులుగా నున్నపుడు తమ వైఖరి, విధానములు అలవాట్లలో, ఆధ్యాత్మికత్వ ప్రయోగమున కున్ముఖులై, జీవ వస్తు విషయాదుల తోడి తమ వ్యవహారములయందు, ఆధ్యాత్మిక విశ్వాసముల నుపయోగింప గోరునపుడు, మతము సాధింపవలసిన కర్తవ్యము లిపుడుగాని

యికనుండుగాని లేవు. అందువలన మత నిర్మూలన మత్యంతా వశ్యకము.

భారతీయులు తొందరగ సాధింపవలసినవి ఐక్యత, శాంతి, సాంఘిక సమానత్వము, ఆర్థిక సమానత్వమునని అందరు నాయకులు చెప్పుచున్నారు. కాని యేదిముందు ఏదివెనుక అను విషయములో నాయకులకు ఏకాభిప్రాయము లేదు. ఏమయినప్పటికిని, భారత వ్యవహారాధినేతలయిన రాజకీయ నాయకులు శాంతి సమైక్యతలను ప్రధానముగ పాటించి, వాని స్థాపనకై పనిచేయుచున్నారు. ఇది సరియైనదే. కాలము పరిస్థితుల యొత్తిడిని పరిగణింపదు. పరిస్థితులు ప్రజల అత్యాశలను దురాశలను గౌరవించవు. శాంతి సమైక్యతా సాధనకై అశాంతి, అనైక్యత, కల్లోలములను జన్మతో కలిగిన హక్కులను పోగొట్టుకొనుమని ప్రబోధించుచున్నారు. ఇది సాధింపబడిన గాని ఆర్థిక సమానత్వము రాదనుచున్నారు. మానవాభ్యుదయమునకీ మూడును ముఖ్యలక్షణములు. ఈ మూడును వేరువేరైనప్పటికిని కలిసియే యున్నవి. ఒకదానిని గుంజినచో, ఆయూపు అన్నిటికిని తగులును.

అశాంతి, కల్లోలము, విభజన వర్గపు హక్కులను విడనాడుడని ప్రజలకు నాయకులు చేసెడి ప్రబోధము, శాంతి, సమైక్యత, ఆర్థిక సామాజిక సమానత్వములకై చేసెడి ప్రబోధమే. అభ్యుదయ పథమున పురోగమించుటకు ప్రోద్బలము నిచ్చుటయే. ఇదియే ఆధ్యాత్మికత్వము.

మరల వారు తమ ప్రబోధములలో "మీకు తోచిన మతమును మీరుంచు కొనుడు. అది మీకును భగవంతునికి నడుమ మాత్రమే యుండవలెను. అవి సమాజ రాజకీయ విషయముల కడ్డు తగులరాదు." అనికూడ అనుచున్నారు. మీ మతములలో తాను కలుగజేసికొనదని రాజకీయము హెచ్చరించు చున్నది. అది సమాజమును పునరుద్ధరింప

గోరి ఆ పనియందు నిమగ్నమై యున్నది. ఇక్కడనే రాజకీయ నాయకులకు పునరాలోచనావశ్యకత యున్నది.

మూర్తీభవించిన వర్గ స్వార్థతను ప్రజలకు విడిచిపెట్టి, దానికి భంగము కలుగనీయమని వాగ్దానముచేసి, తన్మూలమున దానిని సమస్త హక్కులతో పెరగనిచ్చి మరల ప్రజలను వారి భావనలను, ప్రవర్తనలను, వైఖరులను మార్చుకొనుమని చెప్పుట పరస్పర విరుద్ధముగ కనబడుచున్నది.

ఆహా! మనము మన ఆవశ్యకతలను సాధించెడి విధానములలో గల వైరుధ్యములను, అసామరస్యతలను తెలిసికొనలేని అసమర్థులమై పోయితిమి. అభ్యుదయమునకు చీడపురుగు, విశ్వయాతనా కారకమగు మత విషయములలోనా యిట్టి తప్పును జరుగ నిచ్చుట!

భారతదేశమునందు మతమునకు అధిక సంఖ్యాక సమాజముపై ప్రాబల్యము లేదు. సమాజమే దాని నంటిపెట్టుకొని యున్నది. మతము యెడల ప్రజలకుగల సానుభూతి మతమునందుగల విశ్వాసము వలనగాదు. ప్రస్తుతము మతమువలన సమాజమునందు తమకు గలిగిన ప్రత్యేక హక్కుల యెడల గల వ్యామోహము వలనను, ఆ హక్కులను పోగొట్టుకొనకుండ నిరంతరముగ కొనసాగించు కొనవలె ననెడి కోరికవలన మాత్రమే. వారికి మతమునందు విశ్వాసము లేకపోయినది ఇప్పుడే కాదు — ఆధ్యాత్మిక గ్రంథములు మతములోనికి దింపబడి నప్పటి నుండియు లేదు. వారి కిట్టి విశ్వాసమే యుండినచో వారి పూజా పాఠములలో, ప్రార్థనలలో "నేను, నా కొరకు" వంటివియు, వారి బిడ్డలను, మనములను ఆ ఫలితములనుండి దూరము చేయుట వంటివియు నుండి యుండవు. అంతేగాక, వారి భావములు ఆధ్యాత్మికములు. ఆ భావములలో వారికి విశ్వాసము లేకపోయినప్పటికిని అవి

ఆధ్యాత్మిక ప్రాబల్యము కలవియే. ప్రపంచము నందలి యితరభాగము లందు ప్రజలకు మతమునందు విశ్వాస ముండెడిది. ఇంకనూ గలదు. వారి కాధ్యాత్మిక భావనలు లేవు. భారతదేశము నందలి అధిక సంఖ్యాక సమాజము తప్ప, తక్కిన సమాజము లన్నియు నింతే!

అందువలన సమాజమునందు కొన్ని హక్కులు గలవారు మాత్రమే మతమునందు ఎక్కువ ప్రీతి గలిగి యుందురు. భారతదేశపు అధిక సంఖ్యాక సమాజమునందుకూడ అట్టి వారిలోనే మతమునందు ప్రీతి యెక్కువగ నున్నది. మరల నీ హక్కులు గల వారిలో హక్కుల విభజన లున్నవి. అధికముగ హక్కులు గలవారు, అధికముగ మత భక్తులు. వారిలో మతము తక్కువగ నున్నది. ఏ హక్కులు లేని వారు మతము లేనివారు. అయినను, వారికిగూడ అధికముగ మతము గలవారు కొలదిగ మతము కలవారు కలిసి ఒక విధమగు మతము నిచ్చిరి. అదియే బెదరింపుల మతము. ఆంక్షల మతము.

కుళాయిలనుండి, చెరువులనుండి, భోజన విక్రయ శాలలనుండి, బాటలనుండి, దేవాలయములనుండి మతములను తీసివేయవలె ననెడి మీా యాదేశము ఆ స్థలములు ప్రజోపయోగకరములై యుండుట చేతనై యున్నది. కాని అంతకన్న ముఖ్యమైన ఆధ్యాత్మిక గ్రంథముల నుండి మతమును నిర్మూలించు టేల తలపెట్టరు?

ఆధ్యాత్మిక గ్రంథములలోని మతమే అందలి మతభాగముతో సమాజమునందు తమకు గల హక్కులను నిలబెట్టుకొనుటకు ప్రజలను ప్రోత్సహించును. అందుచేత వారు మతము నంటిపెట్టుకొని యుందురు. దీనిని గూర్చి అంతిమ నిర్ణయముచేసి, ఆ నిర్ణయమును ప్రజల కంద జేసి, తదనుసారము ప్రజల కుపయోగించెడి ప్రదేశములనుండి మత మును తీసివేసినపుడు, ఆధ్యాత్మిక గ్రంథములనుండి మతమును తీసి

వేయమని ప్రజల నాదేశించుటలో మీకు సంకోచమేల ? ఈ ప్రతిష్టంభనకు మూలమును తెలిసికొనుటలో గల మీ అసమర్థత్వమే యిందుకు కారణము.

హృదయ పరివర్తన, హృదయమునందు మార్పులు కావలెనందురే ! కాని కుళాయినుండి గుడివరకు మతమును తీసివేసినచో హృదయ పరివర్తన కలుగునా ? ప్రజల హృదయములు కుళాయిలవద్ద, చెరువులవద్ద, నూయివద్ద, అన్నవిక్రయశాలవద్ద, బాటలమీద, గుడివద్దను ఉన్నవా ? అవి వారికి గల ప్రత్యేక హక్కులలో నున్నవి. ప్రత్యేక హక్కులకు మూలము ఆధ్యాత్మిక గ్రంథములలో చేర్పబడినది. అదియే మతము. కుళాయినుండి గుడివరకు నున్నవియు ఆ హక్కులే. ఈ హక్కులు ఆధ్యాత్మిక గ్రంథములలో దాగియుండిన మతమువలన పుట్టినవి. మీరు చేసెడి ప్రయత్నము, ఎక్కడ మతములేదో అక్కడనుండి దానిని తీసివేయుట కొరకే. ప్రజల హృదయములు విశాలపరచి, ఆధ్యాత్మిక గ్రంథముల నుండి యీ మతమునకు మూలమును, ప్రోత్సాహ కారకులను పెరికివేయుడు.

ప్రస్తుతము భారతదేశమున సాగుచున్న భాషా వివాదములు, ప్రత్యేక హక్కులను కాపాడుకొనుటకునో, అధికము గావించుకొనుటకునో, సాగుచున్న మతాత్మక వివాదములే. మతానుయాయులైన మానవు లెక్కువగా గలచోట్ల యీ వివాదము ఎక్కువగా సాగుచున్నది. రాజకీయాధికారమును వశపరచుకొని, రాజకీయముద్వారా కూడ తమకు గల హక్కులను స్థిరపరచుకొనుటకు సాగుచున్నవి. ఆధ్యాత్మిక గ్రంథములలో పొందుపరుపబడిన మతము ద్వారా యీ హక్కు లింతకు పూర్వమే దత్తమైనవి. ఆధ్యాత్మికత్వము ప్రకారము, అధికారము బాధ్యతాయుతమైనవిధి. మతము ప్రకారము అది ప్రత్యేక

హక్కులతో కూడిన సంతోషానుభూతి. అందు వలన ఆధ్యాత్మిక గ్రంధముల నుండి వానిలో చేర్చబడిన మతభాగములను తొలగించుట అత్యంతావశ్యకము.

భారత రాజ్యాంగ వ్యవహారము సంఘ సమానత్వమును సాధింప యత్నించు చున్నప్పుడు వారిలో అధిక సంఖ్యాక సమాజము సందలి మతముల వారందరును మున్ముందు ఆర్థిక సమానత్వము జేసి నచో, తరువాత మిగిలినవన్నియు వచ్చుననిరి. ఆర్థికసమానత్వ విచారణ ప్రారంభమయినప్పుడు అది ప్రత్యేక హక్కుల నిర్మూలనపై నాధారపడి యున్నదని గ్రహించిరి. ఉన్న హక్కుల పరిమాణమును బట్టి చూడగా, దాని ప్రకారము ఆర్థిక సమానత్వము సాధ్యపడదని నిర్ధారణమైనది. ఆర్థిక సమానత్వమును సాధింపవలెననెడి ప్రయత్నము ఒకదాని తరువాత మరియొకటి మతమునకు ప్రజలకు గల హక్కుల నతిక్రమింప నారంభించినది. అప్పుడు పెద్ద ఆందోళన ప్రారంభమైనది. "మా హక్కులకు భంగము కలుగ రాదు. మెరకను త్రవ్వి పల్లము చేయుట వలన గాదు సమానత్వమును సాధించుట ; అది సరియైన మార్గము కాదు. సరియగు పద్ధతి వేరు. మెరకను అట్లే యుంచుడు. పల్లమును కప్పి మెరక చేయుడు. ఈ రీతిగ మీరు సమానత్వమును సాధింపవలెను. పల్లమును దేనితో కప్పెదరు ? ఎట్లు మెరక చేయుదురు. అనునవి మాకు సంబంధములేని విషయములు. మా హక్కులైన మెరకలను కాపాడుకొనుటయే, పెంచుటయే మాకు కావలసిన విషయము. అందు వలన మెరకను పల్లము చేయకుండగనే పల్లమును మెరక చేయుటయే మేము కోరెదము." అను ఆందోళన రేకెత్తెను. అంతే గాక వారి సహాయార్థము భారత రాజ్యాంగ ప్రణాళిక యందలి ప్రాథమిక హక్కులకు ( Fundamental rights ) సంబంధించిన సూత్రములను చూపుచుండిరి. మేమును ప్రజలమే; మేమును సమాజమే.

అధికులుగ నుండుట మా ప్రాథమికహక్కు. మా ఆధిక్యత మతసమ్మత మైనది. మీరు దానిని భంగపరచ రాదని” వారు వాదించుచున్నారు.

నిజమగు పరిస్థితులను పరిశీలింతము. ఇక్కడ విషయము మెరక పల్లములను సమానము చేయుటకాదు. అభ్యుదయగమన వేగమే ప్రధాన విషయము. ప్రత్యేక హక్కులు గలవారు, మెరకపై నున్నారు. వారికి గల సౌకర్యముల ననుసరించి ముందునకు తొందరగ సాగు చున్నారు. అట్టి ప్రత్యేక హక్కులు లేనివారు అసౌకర్యముల వలన, ముందునకు త్వరగా సాగలేకున్నారు. సౌకర్యములు గలవారి గమనము కొంత కాలము వరకైనను ఆపుచేసినచో అప్పుడు సౌకర్యములు లేని వారు పురోగమించి వారిని కలసికొనగలరు. అప్పుడు మెరకను పల్లము చేయ వలసిన యవసరము లేకుండగనే పల్లమును మెరక చేయుట యగును. మతానువర్తులైన, హక్కులు గలవారు దీనికిని అడ్డుచెప్పు చుండిరి. మెరకను పల్లము చేయుటయు, వేగమును తగ్గించుటయు రెండును వారికి అనిష్టమే. రాజ్యాంగము నందలి ప్రాథమిక హక్కు లను మరల చూపుచున్నారు. ప్రాథమిక హక్కుల వెనుక ప్రాథమిక పరమాశయము లున్నవని గమనింపవలెను. ప్రాథమిక బాధ్యతలతో గూడిన ఈ హక్కులు, ఆ ఆశయముల ప్రకటన మాత్రమే. ఆ పర మాశయమే ఆర్థిక సమానత్వసంపాదన. ప్రాథమిక హక్కులలో స్వయంభూతమైన ప్రాథమిక పరమాశయ నిర్వహణార్థము మెరకను తీసివేసి పల్లమును పూడ్చుటయో మెరకయొక్క పెరుగుదలను ఆపు చేసి రెండును సమానమగు వరకు పల్లమును పెంచుటయో ప్రాథమిక మగు విధి. మతము వలన ప్రత్యేక హక్కులను పొందిన మానవులారా! మీరు కూడ ప్రజలగుట వలన, మీ ప్రాథమిక పరమాశయమును సాధించుటకు మీ ప్రాథమిక విధులను మీరు నిర్వర్తింప వలెను. ప్రత్యేక ప్రాథమిక హక్కులు మీ ప్రత్యేక హక్కులను కాపాడు

కొనుటకు కాదు. కాని, ప్రాథమిక పరమాశయమును సాధించుటకు ప్రజలలో ప్రజలుగ మీ ప్రాథమిక విధులను నిర్వర్తించి, సాంఘిక ఆర్థిక, సమానత్వములను స్థాపించుటకై యున్నది.

అందువలన, మీ హక్కులను సురక్షితముగ నుంచుకొనవలె ననెడి లోభము, అందుకొరకై మతము నంటిపెట్టుకొని యుండుటను, అధిగమింపవలెను. అందుకొరకై ఆధ్యాత్మిక గ్రంథములలో కలిసి యున్న ఇట్టి ప్రలోభ కారకములగు మతభాగములను తొలగింప వలెను. ప్రజలలో, సాంఘిక, ఆర్థిక, సమానత్వములను సాధించి మీ ప్రాథమిక హక్కులను వినియోగించుకొనుడు.

అధిక సంఖ్యాక భారతసమాజ సభ్యులారా! ఇతర సమాజ ముల వారలకు వారి వారి గ్రంథముల నుండి మత భాగములను తొల గించుడని సలహానిచ్చుటకు ప్రపంచ రాజకీయ విధానముల ప్రకారము మీకు హక్కులు లేకపోయినప్పటికిని మీ యాధ్యాత్మిక గ్రంథముల నుండి వానిలో కలసిన అట్టి భాగములను తొలగించుటకు మీకు హక్కు గలదు. అట్లు చేయుటకు మీకు స్వాతంత్ర్య మున్నది. అందు వలన, ఆధ్యాత్మిక మహావ్యక్తుల సంఘము నొక దానినేర్పాటు గావించి ఆధ్యాత్మిక గ్రంథముల యందు ప్రక్షిప్తములైన మత భాగ ములను గుర్తించి, వేరుచేయించుడు.

ప్రార్థనలు, పూజలు, ఏ దేవాలయములలో, ఏ విగ్రహముల యెదుట, ఏ రూపములో నెవ్వరు చేసినను సర్వాంతర్యామిని గూర్చి యే గావున, ఆ సర్వాంతర్యామి, ఆ విగ్రహములు గల ప్రదేశము లలో నిరంతరమును నుండును. కావున, అన్ని దేవాలయములును, ఎవ్వరికిని, ఎట్టి అధిక హక్కులును లేకుండ భారతీయ అధిక సంఖ్యాక సమాజ సభ్యులకే గాక యితరు లందరికిని, ప్రార్థనచేయగోరు ప్రతి వారికిని అందుబాటులో నుండవలెను.

మీలో ఈ సమైక్యతను సాధించిన తరువాత ప్రాథమిక విధుల (fundamental duty) ద్వారా మీ ప్రాథమిక హక్కులను (fundamental right) పొంది, సామాజికముగను, ఆర్థికముగను, రాజకీయముగను, ఆధ్యాత్మిక విధానముల ద్వారా మీ ప్రాథమిక ఆశయములను సాధింపవచ్చును. అప్పుడిది మీలోనే కాకుండ, భారతదేశము నందలి యితర సమాజములలోనను, తద్వారా ప్రపంచమందంతటను సాధింపవచ్చును. ప్రపంచమునందలి యితర ప్రాంతపు రాజకీయ నాయకులయొక్క అనిష్ట సహకారమును భారతదేశపు రాజకీయ విజ్ఞానములతో ఇష్ట సహకారముగ మార్చబడి భారతదేశమునకు శాంతి యుతముగ పురోగమించుటకును, తనయొక్క విశ్వకర్తవ్యమును సాధించుటకును అవకాశములు కలుగును.

ప్రపంచ మహాజనుల యొక్కయు, నాయకుల యొక్కయు, ఈ సహకారము నాయకులను, ప్రజలనుగూడ విజ్ఞానవంతుల గావించి, బాధ్యతలను, కర్తవ్యములను, ఆ కర్తవ్యమును సాధించుటకు వినియోగించెడి సిద్ధాంతములను వారి దృష్టికి తెచ్చును. ఆ బాధ్యత, కర్తవ్యము, సిద్ధాంతములలో సత్వర విశ్వసమైక్యతా స్థాపన, విశ్వశాంతి, విశ్వాభ్యుదయము, అంతర్భూతమై యున్నవి. దుఃఖపూరిత ప్రళయోన్ముఖము కాకుండ ప్రపంచమును కాపాడగలదు. ఈ ఆశయమునకై నాయకులు, ప్రజలు పూర్ణ హృదయముతో, వారిపై గల బాధ్యతా పరిజ్ఞానముతో వ్యవహరించి సాధింతురు.

ప్రజోపయోగము కొరకు మతమును తీసివేయు పద్ధతి ననుసరించి, ఆధ్యాత్మిక గ్రంథములు భారత ప్రజలకేగాక ప్రపంచమందలి సమస్త ప్రజానీకము నవియును నైయున్నవి. ప్రపంచ ప్రజలీ విషయమును పూర్తిగ గ్రహించినను, గ్రహింపక పోయినను, ఈ విషయము

మనకు స్పష్టముగ తెలియును. భారత దేశము విశ్వమందు తనకుగల బాధ్యతను నిర్వహించుటకు ప్రపంచ ప్రజల సానుభూతి, సహకారము అత్యంతావశ్యకము. విశ్వ నిర్మాణమునందలి భారతమునకు గల ప్రత్యేక స్థితియే యిందుకు కారణము.

ఇట్టి సానుభూతి, సహకారములను భారతీయులు పొందుటకు, ఆధ్యాత్మిక గ్రంథముల యందలి సిద్ధాంతములను ప్రపంచ ప్రజలకు సక్రమావగాహన యగునట్లు చేయవలెను. ఆ గ్రంథముల నిప్పుడున్నట్లే ప్రపంచ ప్రజలకు ప్రదర్శించినయెడల మరియొక చిక్కు కలదు. ప్రపంచ ప్రజలలో సగముమంది మతానువర్తులు. మిగిలిన వారిలో సగముమంది మతమువలన కలిగిన హక్కులను అంటిపెట్టుకొని యున్నవారు. ఈ రీతిగ ప్రపంచ ప్రజలలో ముప్పాతికమంది వివిధ తరహాలలో ప్రత్యేక హక్కుల నంటిపెట్టుకొని యున్నవారే. వారందరును ఆధ్యాత్మిక గ్రంథములలో కలసియున్న యీ మతభాగములనే పైకొని ఆధ్యాత్మికత్వమున కెదురు తిరిగెదరు.

అందువలన, ఆధ్యాత్మిక గ్రంథములలో కలిసియున్న మతమును తొలగింపని యెడల, కుళాయినుండి కూడ దానిని తొలగింపలేని దుస్థితిలోనికి భారత రాజకీయము వచ్చును. ప్రపంచ మహాజనులలో మూడు వంతుల మంది మతానుయాయుల సహాయముతో, భారతము నందలి మతానుయాయులు, భారత రాజకీయ విధానముల కెదురు తిరిగి, బాధ్యతా నిర్వహణమున కడ్డు తగిలెదరు.

మానవుల ఆరవ పతనావస్థనుండి, నేటి వరకును, భారత దేశమునందు వ్యవహరించిన ఆధ్యాత్మిక మహావ్యక్తుల కార్యకలాప

ముల వలన, మనమేమి చేయవలెనో ఎట్లు చేయవలెనో నిర్ణయించు కొనెడి స్వాతంత్ర్యము (Politcal) ఇప్పుడు మనకు కలిగినది. ఆ మహా వ్యక్తులలో నూటికి తొంబదియైదు మందిని కూడ ప్రపంచ మెరుగదు. ప్రపంచమునకును, భారతదేశమునకును గల విశ్వనిర్మాణాత్మక సంబంధమును గూర్చి మనకు ప్రస్తుతముగల జ్ఞానము వారిదే! సక్రమ బాధ్యతా నిర్వహణ పథమునందు మనకుగల యున్ముఖత వారిదే! మన విధానమునందు కలుగుచున్న అడ్డంకుల నెదుర్కొనెడి శక్తియును వారిదే! మనచే సాధింపబడ వలసిన ప్రయోజనమును వారిదియే! ఈ యవగాహన, ఉన్ముఖత, శక్తి, ప్రయోజనముల కెన్నడును విఘాతములేదు. అవి యింత వరకును నిరంతరాయముగ సాగుచున్నవి. అవి ప్రారంభమైన కాలము మొదలు ప్రళయము వరకు వానికి అడ్డంకు లుండవు. ప్రపంచము ప్రళయకాలమునందంతమయ్యెడి దుఃఖమయ విధానములో మార్పులు తెచ్చి, అంతమును శాంతి, విశ్రాంతి మయముగ చేయు వరకును వారు పనిచేయుచునే యుందురు. ఈ ప్రయత్నము సఫలమైన విశ్వ విశ్రాంతియు, ఈ ప్రయత్నము విఫలమైన కలుగు దుఃఖమయ అంతమును భారతదేశముపై, విశ్వవిషయములయందు భారతదేశము వ్యవహరించు విధానములపై నాధారపడి యుండును.

ఆ మహావ్యక్తుల యవగాహన, ఉన్ముఖత, శక్తి, ప్రయోజనముల ప్రవాహమునకు మనము కాలువల వంటివారము. ఆధ్యాత్మిక గ్రంథములలో కలిసిన మతమును తీసివేయక, యథాతథముగ నుంచి, ఆధ్యాత్మిక మహావ్యక్తుల విజృంభణమునకు మన మడ్డంకులము కారాదు. విశ్వ ప్రయత్నము వలన, విశ్వావశ్యకతా నిర్వహణ కను

వగు నట్లుగా తదావశ్యకతయే తయారుచేసి నప్పటికిని, ఆధ్యాత్మిక గ్రంథములలో జేరిన మతమును తొలగించుట కశ్రద్ధచేసి మనము నిందార్హులము కారాదు.

విశ్వజీవి గర్భకోశమైన భారతమా! సమస్త జీవులకు ఆది-నివాసమా! మేఘములే మీ కిరీటము. హిమాలయమే మీ శిరము. విశ్వ చైతన్య ప్రారంభములో నేర్పడిన సమతల భూప్రదేశములే మీ భుజస్కంధములు. సమస్త ప్రపంచము మీ శరీరము. నదులు, సాగరములు, జీవ వస్తు విషయాదులు మీ శరీరములోనే యున్నవి. విశ్వ మానవ సమైక్యతకు, శాంతి సంపదల కొరకు, సర్వాభ్యుదయమునకు సవినయముగ, సగర్వముగ మీరు ముందుకు నడచుచున్నారు. భారతమని పిలువబడెడు ప్రపంచము యొక్క భుజములు, శిరమును అయిన మీరు విశ్వ ప్రళయములో పాదములనుండి భుజములు, శిరము వరకు మునుగుటను చూడవలయును గనుక, మీరే అన్ని భాగముల కంటె చివర మునుగుదురు గనుక, మునిగెడు విధానమిప్పుడు జరుగుచున్నది కనుక, ఆ విధానము దుఃఖమయ పరిస్థితులతో నిండియున్నది గనుక ప్రపంచ నిర్మాణమునందు మీ స్థితి యితరుల కంటె బాధ్యతాయుతమయి యున్నది. కనుక, మీ శక్తిని ప్రపంచ మందలి జీవరాసులపై, వారికి అర్హత లేకున్నను విశ్వావశ్యకతను బట్టి వర్షింపజేసి విధానమునందు పూర్తిగ మార్పులు తెచ్చి అంతమును విశ్రాంతి పూర్వకముగ, శాంతిమయముగ మీరు మార్చవలెను. మీ విశ్వ బాధ్యతను ప్రేమ పూర్వకముగ, దయాసమన్వితముగ నిర్వర్తించి, ప్రపంచమును విపత్తునుండి కాపాడవలెను.

అందువలన,

భారతము నందలి అధిక సంఖ్యాక సమాజము ఆధ్యాత్మిక విశ్వాసములను పొందును గాక !

భారత విధానము లెల్లప్పుడును శాంతి యుతములై యుండును గాక !

ప్రపంచము నందలి సమస్త మానవులు భారత విధానములతో హృదయ పూర్వకముగ సహకరింతురు గాక !

ప్రపంచ పురోగమనము నందలి ప్రస్తుత పరిస్థితులు శాంతి మయ మగు గాక !



## పదునెనిమిదవ అధ్యాయము

# మంగళవాక్యము

ఈ విశ్వమందు జరుగుచున్న మంచిచెడ్డ లన్నిటికిని విశ్వమునందు, విశ్వజీవియందు వీనికి మూలమునందు సర్వాంతర్యామి సాక్షాత్కరించి సర్వత్ర తానే యుండుటవలన జరిగిన ప్రథమక్రియయే కారణము. ఇదియే విశ్వమందు జరిగిన యేకైక క్రియ. మిగిలిన వన్నియు నీ క్రియకు ప్రతిక్రియలుగ జరుగుచున్నవియే. ఈ క్రియ, ప్రతిక్రియ, వాని ఫలములు వేరువేరు కావు. ప్రథమక్రియ యందలి సిద్ధాంతములు, సర్వాంతర్యామినుండి వేరుచేయబడనేరవు. అందువలన సర్వాంతర్యామి, ప్రథమక్రియ, దాని ననుసరించిన అనేక ప్రతిక్రియలు, వాని ఫలితములు, మంచివైనను చెడ్డవైనను విశ్వమందు రూపొందుచు విడదీయ బడరాని వగుటచే, ఏకైకమై యున్నవి. అనేకములైన ప్రతిక్రియలయొక్క పరిణామములు, మంచిచెడ్డలు, జయాపజయములు ఆప్రతిక్రియలపై వినియోగించిన సిద్ధాంతములలో స్వయంభూతములై యున్నవి. అందువలన మానవుల కార్యకలాపముల జయాపజయములు వాని పరిణామములు ఆ కార్య కలాపములలోననే అంతర్యాప్తమై యున్నవి.

సర్వాంతర్యామి యొక్క యీ ప్రథమ చర్యను అపార్థము చేసికొనుటకు, ఒక సూక్ష్మమైన, మహా సూక్ష్మమైన కారణ మిట నున్నది. విశ్వమందలి ఆదిక్రియ; తానే అనేకములైన ప్రతిక్రియలకు

మూలము, ఆధారము అగుటవలన దానివలన కలిగిన మంచి చెడుగు లతో గూడిన పరిణామము లన్నిటికిని బాధ్యత ఆ యాదిక్రియయే యగు నని కొందరపార్థము చేసికొందురు. ఫలితముల యొక్క మంచిచెడ్డలు ప్రతిక్రియల నెదుర్కొనుటకు మానవులచే వినియోగింపబడెడు సిద్ధాంతములపై నాధారపడి యుండుటచే, వానికి ఆదిక్రియ బాధ్యత వహింపదు. ప్రతిక్రియల నెదుర్కొనెడు వ్యవహారముల యందుపయోగింపబడెడు సిద్ధాంతముల యందలి తప్పొప్పులు, ఆ వ్యవహరణలోనే యంతర్భూతమై యుండుటచే మంచిచెడ్డలును, జయాపజయములును కూడ వాని యందంతర్భూతములై యుండును. అందువలన ప్రతిక్రియల యొక్క మంచి పరిణామములకు గాని, చెడ్డ పరిణామములకు గాని బాధ్యత వహింపవలసినది, వినియోగింప బడిన సిద్ధాంతములే కాని ప్రతిక్రియయును కాదు, ఆది క్రియయును కాదు. సక్రమమైన సిద్ధాంతములచే నెదుర్కొనబడిన ప్రతిక్రియల ఫలములు మంచివగును. తప్పు సిద్ధాంతములతో నెదుర్కొనిన చెడ్డఫలములు కలుగును.

ప్రతిక్రియలన్నియు, ఆదిక్రియయొక్క ఫలితములు గావున, ఆ ప్రతిక్రియలను మానవు లెదుర్కొన వలసి వచ్చుటకు బాధ్యత ఆదిక్రియది కాదా ? కాదు. ఆ బాధ్యత ఆదిక్రియది కాదు. ప్రతిక్రియల నెదుర్కొనుటకు, మానుటకు మానవులు సర్వస్వతంత్రులు. ఎదుర్కొనిన నెదుర్కొనవచ్చును. లేకున్న మానవచ్చును. అందువలన ప్రతిక్రియాఫలితములకు ఆదిక్రియ బాధ్యత వహింపదు. తత్కారణమున ఆదిక్రియకు మూలమయిన విశ్వజీవి, ఆ విశ్వజీవికి మూలమయిన సర్వాంతర్యామికూడ, ఆ ప్రతిక్రియా ఫలితములకు బాధ్యత వహింపరు.

అటులైన, మానవులీ ప్రతిక్రియల నెదుర్కొనుట యందుగాని, అందు నిమిత్తమై తప్పు సిద్ధాంతముల నుపయోగింప కుండుటయందును,

సర్వాంతర్యామి సహాయపడ వలదా ? అట్లు సర్వాంతర్యామి పూను కొని, సహాయపడినచో, ఏమి చేయవలెనో ఎట్లు చేయవలెనో నిర్ణ యించు కొనెడి స్వాతంత్ర్యము మానవులకు లేకుండపోవును. సర్వాంత ర్యామి మానవ స్వాతంత్ర్యము నపహరించి నట్లగును. వ్యక్తులకు సంబంధించిన యే కొన్ని విషయములలోనే అట్లు చేయుట వలన సర్వాంతర్యామి పక్షపాతము వహించినట్లగును. తద్వారా పరిమితు లకు లోనగును. సర్వాంతర్యామి ప్రేమ, జ్ఞాన, సామర్థ్య విజ్ఞానముల సంపూర్ణత్వమే కాకుండ, సర్వత్ర స్వతంత్రము, నిష్పాక్షికము నగుట వలన మానవ చేష్టితములకు అడ్డుపడనేరదు. అయినప్పటికినీ, విశ్వ జీవి, ఆ విశ్వజీవికి మూలమును, ఆధారమునైన సర్వాంతర్యామి, మానవ వ్యక్తులు, వారి శరీరములచే నాక్రమితమైన ప్రదేశాంత ర్యామి యైన సర్వాంతర్యామి, సర్వసంస్థిత మగుటవలన, మానవులకు తామనుసరించుచున్న విధానముల మంచి చెడ్డలను గూర్చియు, జీవ వస్తు విషయాదులతోడి వ్యవహారముల యందలి యుక్తాయుక్తములను గూర్చియు, అనుక్షణము స్ఫురణకు తెచ్చుచునే యుండును. మాన వులు తాము కోరినట్లు చేసికొనెడి స్వాతంత్ర్యమున కడ్డురాదు. శక్తి పరిణామము పొందని వ్యక్తులు, బాహ్యాముఖమైన అహంకార ప్రాబ ల్యము నందున్నవారు, తమ సహజ వివేక ప్రబోధములను గ్రహించ లేక ఎప్పటి కప్పుడు వారికి కలిగిన స్ఫురణలను తెలిసికొని, అందుల కనుగుణముగ వ్యవహరింపలేక, వస్తు విషయాదులతోడి వ్యవహార ముల యందు తప్పుడు సిద్ధాంతములను ప్రయోగింతురు.

చేయనున్న పనులు తప్పు మార్గములో నున్నయెడల, ఈ పని చేయవలదు, ఆ పని చేయ వలదు అని ఆ వ్యక్తుల సహజ వివేకము ప్రబోధించుచునే యుండును. కాని ఆ వ్యక్తులు తమ స్థూల సృజనేం ద్రియములు తప్పు పనులు చేయకుండ నరికట్టుటకు శక్తివంతులు కాక

పోవుటవలన సహజ వివేకముయొక్క స్ఫురణలను గమనించి వ్యవహరింపవలెనని తామనుకొని నప్పటికిని, జీవ వస్తు విషయాదులతోడి వ్యవహారములలో తప్పు సిద్ధాంతములను ప్రయోగించి, తప్పు పనులే చేయదలచుచున్నారు. సహజ వివేక ప్రాబల్యమునకు లోనైన వ్యవహారాదులలో తాము చేయుపని తప్పుపని యైనపుడు, అది తప్పని యెరుగని వారుండరు. తప్పు లన్నియును, అవి తప్పులని పూర్తిగ ఎరిగి యుండియే చేయబడుచున్నవి. తప్పుచేయు వారిలో నూటికి తొంబది మంది జనులు తప్పులు చేయకుండ నుండగోరెదరు. అయినను వారు తప్పులను చేయుచునే యున్నారు. కొందరు తమ పూర్వకర్మయే యిందులకు కారణమను కొందురు. ఇదివరలో తాము చేసిన కర్మ తమచే నిప్పుడు మంచి పనులనో చెడ్డపనులనో చేయించుచున్నదందురు. మరి కొందరు భగవద్విలాసమందురు. సర్వాంతర్యామియే తమచేత తప్పొప్పులను చేయించుచున్నదను కొందురు. అనగా నేటి మానవ కార్యకలాపములన్నియు పూర్వమెప్పుడో చేయబడిన కార్యకలాపములచే ప్రోద్బలితములై వాని ఫలములగుచున్నవి. అట్లయినచో ఈ పూర్వ కర్మలనునవి అన్నియును ఎప్పుడో ఒకప్పుడంతమొంది యుండవలసినది. నిన్నటి కార్యకలాపములు మొన్నటి కర్మల ఫలితములై యుండవలెను. మొన్నటివి ఆ క్రిందటి రోజు వాని ఫలితములై యుండవలెను. అట్లయినచో వానికి అంతమేయుండదు. కాని, భావికాలములో అన్నియు మంచి పనులే చేయుటవలననో, లేక కొంత కాలమే విధమయిన పనులను చేయకుండుట వలననో, అవి యంతమగునందురు. అట్లయినచో, అన్నియు మంచి పనులే చేయుటకు కోరికను కల్పించునట్టియో, లేక యెట్టి పనులును చేయకుండ నుండుటకు తగిన యవకాశములు కల్పించునట్టియో తగిన పూర్వకర్మలుండియుండవలెను. మానవుల కిప్పుడిటువంటి యున్ముఖతలను కలుగ జేసెడి

పూర్వకర్మలు కలిగియుండుటకు, వారికి అంతకు పూర్వపుటవతరణలో అన్నియు మంచి పనులే చేయుట కవకాశములు కలిగియుండి యుండ వలెను. అప్పుడు అన్ని పూర్వకర్మలు, వాని ఫలితములు ఇదివరకే అంతమై యుండవలసినది. ఇప్పుడన్నియు మంచి పనులే చేయుటకో, ఏ పనులును చేయకుండుటకో అగత్యమే యుండకపోయి యుండును. నేటి యునికి, శరీర ధారణయు అవసరము లేకపోయి యుండును.

అట్లయిన నిన్నటి పనులకును, నేటి కార్యకలాపములకును సంబంధము లేదా ? అగును. నిన్నటి కర్మలకు, నేటి కార్యకలాపములకు ప్రత్యక్ష సంబంధము లేదు. కాని వానికి పరోక్ష సంబంధమున్నది. పూర్వకర్మలు వ్యక్తుల యూహములపై ప్రాబల్యము కలిగియుండును. ఊహములు స్థూల సృజనేంద్రియములపై ప్రాబల్యము కలిగియుండును. కాని సూక్ష్మేంద్రియములలో తగినంత సూక్ష్మశక్తియుండి, అవి సహజ వివేకమున కధీనమైన స్వభావోన్ముఖతలతో మానవులు వ్యవహరించునట్లు ఊహములను ప్రోద్బల పరచువరకును నిట్లు సాగు చుండును. సూక్ష్మేంద్రియములు సక్రమముగ వ్యవహరింపనంత వరకు నిన్నటి కార్యకలాపములకు పరోక్షముగ నేటి కార్యకలాపములపై ప్రభావ మున్నది.

ఈ పూర్వకర్మ సంబంధమైన పరోక్ష ప్రభావము నేటి స్వాతంత్ర్యము నరికట్టలేదు. నేటి "నిన్న", నిన్నటి దినపు "నేడు" అయి యుండుటవలన, మొన్నటి కార్యకలాపములు ఫలములు "నిన్న"ను స్పృశించలేదు. "మొన్న" మొన్నటి "నేడు" అగుటవలన ఆ క్రిందటి రోజు కార్యకలాపములు ఫలములు "మొన్న"ను స్పృశించలేదు. అందువలన పూర్వకర్మలయొక్క ఫలములకు మానవస్వేచ్ఛా స్వాతంత్ర్యములపై ప్రభావము లేదు. వాని స్వభావోన్ముఖతల ననుసరించి

రొక నిర్ణయము చేయదలచినపుడు, ఒక పనిని తప్పు చేయకుండ సరిగా చేయవలెనని వ్యక్తులు తలచినపుడు నిన్నటి కర్మలు సరియయిన నిర్ణయము చేయుట కష్టపడలేవు సరిగదా, శక్తి పరిణామము నొంది వారి సూక్ష్మేంద్రియములు సక్రమముగ వ్యవహరింప ప్రారంభించినది మొదలు, వారి నిర్ణయములలోనను, కార్యకలాపములలోనను కలుగ జేసికొనలేవు.

శక్తి పరిణామము సాధింప బడినపుడు, సూక్ష్మేంద్రియములు సక్రమముగ వ్యవహరించుట ప్రారంభించినపుడు, అప్పటినుండి వానితో పాటు బాహ్యాముఖములై యున్న యహములు కూడ అభ్యుదయ పరముగ మారిపోవును. వారివారి స్వభావము, ఉన్ముఖత, ప్రీతికూడ పరివర్తన పొందును. అంతవరకును స్థూల సృజనేంద్రియముల స్వభావోన్ముఖతలతో సామరస్యము కలిగియున్న తమ పూర్వ స్వభావోన్ముఖతలనుండి వేరగుదురు. ఇక్కడనుండి, అభ్యుదయ పథమునందు గల వారి యహముల స్వభావ వైఖరులు సూక్ష్మేంద్రియముల స్వభావ వైఖరులతో సామరస్యము పొందును. స్థూల జగత్తులోని సూక్ష్మ విషయములను, విశ్వమందలి ఆధ్యాత్మిక విషయములను భావించి, అనుభవించి, ప్రకటించుటకు సూక్ష్మేంద్రియములు శక్తికలిగి యుండుట వలనను, అందులకై యుద్దేశింపబడినవగుట వలనను, స్థూలమందలి సూక్ష్మస్థితులను, విశ్వమందలి సూక్ష్మ ఆధ్యాత్మిక స్థితులను, ప్రపంచ మందలి వస్తు విషయాదులలోని సూక్ష్మ స్థితుల సక్రమావగాహనకు సహాయపడును.

సక్రమావగాహన, జ్ఞానము మానవ హృదయమును పరివర్తన మొనర్చి వారిలో సక్రమ ప్రేమోత్పన్నత గావించును. సక్రమమైన ప్రేమలో, ప్రపంచ వ్యవహారములో సక్రమముగ వినియోగింపబడి

నచో వ్యక్తులకు వస్తు విషయాదులకు కూడ అభ్యుదయ కారకమగు శక్తి యున్నది. జీవ వస్తు విషయాదులతోడి వ్యవహారములలో సరి యైన అవగాహన శక్తితో కూడియున్న సక్రమప్రేమ, ప్రయోగింప బడుట వలన అట్టి వ్యవహారములలో మానవులకు సంపూర్ణ తృప్తి కలుగును. సక్రమావగాహన గల మానవులు అభ్యుదయ దాయక మగు వ్యక్తి యహములద్వారా బాధ్యతాయుతముగ కర్తవ్యము నందు సాధించుటకు వ్యవహరింతురు.

వ్యక్తుల యహములు బాహ్యాముఖముగ నున్నంతవరకే, స్థూల సృజనేంద్రియములతో సామరస్యము కలిగి యున్నంతవరకే, పూర్వ కర్మలు, వాని ఫలితములు, ఆ వ్యక్తులతో పరోక్షసంబంధము కలిగి యుండును. అదియైనను సహజ వివేకము సామరస్యముగల భావములు, ఉన్ముఖతల ననుసరించి వర్తించుటకు గల స్వాతంత్రమునకు భంగము కలుగజేయకుండగనే! మానవ స్వాతంత్రముతో కలుగజేసికొనకుండ, పక్షపాతము వహించి అవధిగతము కాకుండ సర్వాంతర్యామి ఇట్లు వ్యవహరించును. అందువలన నేటి మానవ కార్యకలాపములు నిన్నటి వానివలన అవధిగతము కాలేదు. మానవ కార్యకలాపములలో నూటికి తొంబది నూతనమై యుండును. అవి రేపటి కార్యకలాపము లపై ప్రభావము కలిగియుండును. రేపటి కార్యకలాపములలో కూడ నూటికి తొంబది నూతనమై యుండును. పూర్వకర్మ, దాని ఫలము లను విశ్వసించి మానవులే కార్యకలాపములు చేయకుండ నుండవలె ననుకొనినప్పటికిని, నిన్న జరిగిదానికి మొన్నటివానిని నిందించుచు, నేటి కార్యకలాపముల బాధ్యత, నింద నిన్నటి వానికి నిచ్చుచు మానవ కార్యకలాపము లిట్లు నిరంతరము సాగుచున్నవి.

నేడు మనము చేసినది నిన్నటి దాని ఫలితమనియు, అందువలన మనము చేయుచున్నట్లు తప్ప మరియొక విధముగ చేయలేమనియు, నిన్నటి కార్యకలాపముల ఫలితములను బట్టి, ఈ రీతిగ చేసెడి ప్రలోభమునుండి మనము తప్పించుకొనలేమనియు ఒక నమ్మకము. అందువలన మనము చేసెడి పనులను చేయుచునే యుందుము. దినాంతము నందు చేసిన పనుల ఫలితముల నన్నిటిని మాటలద్వారా సర్వాంతర్యామి కంకితము చేయుదుము. అందువలన అప్పటి కప్పుడు నిరంతరమైన కర్మఫలములు అంతమొందునని నమ్ముదుము. ఇదియొక ఆధార రహితమైనట్టి విభ్రాంతి పూర్వక విశ్వాసము.

సత్క్రమావగాహన లేకపోవుటయే ఈ విభ్రాంతికి మూలము. ఒకదాని తరువాత మరియొకటిగ అసంఖ్యాకములుగ మానవ శరీరములు దాల్చినగాని, అభ్యుదయ పథమున పురోగమనము సాధ్యము కాదనియు పునరవతరణావశ్యకత సహజమనియు, అనేక మానవ శరీరములనుదాల్చి సుఖదుఃఖానుభవములను పొందినగాని తృప్తి సిద్ధింపదనియు గల విశ్వాసము యీ విభ్రాంతికి కారణము. శారీర సంపర్కములతో సుఖ దుఃఖానుభూతులను పొందెడు స్థూల సృజనేంద్రియములకు అనుభూతియందు సంతృప్తిని పొందెడు శక్తి లేదు. స్థూల సృజనేంద్రియముల వ్యవహారముల యందుకూడ సంతృప్త్యనుభూతిని పొందగలిగినవి సూక్ష్మేంద్రియములే. సత్క్రమ వ్యవహారము కలిగినది మొదలు స్థూల సృజనేంద్రియములవలన కలిగిన సుఖ దుఃఖానుభూతులలో సూక్ష్మేంద్రియములు తృప్తిని పొందుట ప్రారంభించును.

ఐదు, పదేండ్ల నడుమ వయస్సుగల శరీరములు గలిగిన వ్యక్తులకు, సృజన క్రియానుభూతులను గూర్చి చెప్పినచో, వారి యింద్రియము లింకను పెంపొందక పోవుటచే, వారికి అట్టి సంభాషణ యెట్టిప్రీతిని కలుగ జేయదు. పది పదిహేనేండ్ల మధ్య వయస్సు గలవారికి ఇతరులు చెప్పినను, చెప్పకపోయినను వారి యింద్రియ

ములు పెంపొంది యుండుటవలన సృజన క్రియానుభూతులయందు వారాసక్తిని ప్రదర్శింతురు. అదే రీతిగ, సూక్ష్మేంద్రియములు సక్రమముగా వ్యవహరింపక పోవుటవలన, వారి స్థూల సృజనేంద్రియముల సుఖదుఃఖానుభూతులవలన తృప్తిని బడయుటయు నసంభవమే. తగినంత సూక్ష్మశక్తి బయలుదేరిన తరువాత, సూక్ష్మేంద్రియములు సక్రమముగ వ్యవహరించుట ప్రారంభమయిన తరువాత, వ్యక్తులకు శరీర సంపర్కాదులవలన కలుగు సుఖదుఃఖానుభూతులయందు ఆసక్తి తగ్గి, కాలక్రమమున, ఈ ఆసక్తి లేకపోవుట అలవాటయి పోవును. సంతృప్తియే యీ నిరాసక్తతకు కారణము. అందువలన సంతృప్తిని పొందుటకు కావలసినవి యెక్కువ అవతరణలుకాదు. సూక్ష్మశక్తి బయలు దేరుటయే. ఇది ఒక్క యవతారములోనే సాధింపవచ్చును.

పరిణామము పొందిన సృజనశక్తియే సూక్ష్మశక్తి. సృజనశక్తియే శరీరములయందు యేర్పడినచో, అచ్చటనే, సృజన క్రియలయందు వినియోగపరచకుండ నిలువ జేయబడుటవలన అది పరిణామమును పొందును. సంతృప్తితో కూడిన అభ్యుదయమునకును, పునరవతరణావశ్యకతకు అతీతు లగుటకును సృజనశక్తిని కూడబెట్టుట అవసరము. సక్రమముగ వ్యవహరించు సూక్ష్మేంద్రియములు గలవారితో సాంగత్యమువలన సృజనశక్తి సంచయము జేయుట కున్ముఖత కలుగును. అట్టి వారితో సంపర్క సంసర్గములవలన, వారిచే వినిర్గతమై విస్తృతమైన సూక్ష్మశక్తి, యితరులు కోరనప్పటికిని వారిలో ప్రవేశించును. ఇట్లు జరుగునని తెలియనివారు తెలిసికొన లేకపోయి, అట్టి శక్తులను పొందుటకు వారు అనర్హులైనప్పటికినీ వారు పొందెదరు. అట్టి వారి విషయమును తెలిసికొని అర్హతను సంపాదింపక పోయినప్పటికిని వారును, వారి శరీరములును ఇతరులవలన విసర్గతమైన శక్తులను ఆకర్షింపు జేసికొనుటకు, అనాలోచితముగ, అప్రయత్నముగకూడ గ్రహించుటకు, వారి యొక్కయు, వారి శరీరములయొక్కయు నిర్మాణ

క్రమమువలననే అర్హతను పొందియున్నారు. అట్టిశక్తి ప్రసారములకు దూరముతో సంబంధము లేదు. సక్రమముగ వ్యవహరింపని సూక్ష్మేంద్రియములు గలవారిలోనికి సూక్ష్మశక్తి ప్రవేశించినది మొదలు తమ సృజన శక్తులను కూడబెట్టి సూక్ష్మశక్తులను పెంపొందింప జేసికొనుటను మిక్కిలి ఉత్సాహముతో ప్రయత్నింప ప్రారంభింతురు. ఈ శక్తి ప్రసారమునే "కృప" యందురు.

ఎన్నియో అవతారముల నెత్తి స్థూల సృజనేంద్రియ వ్యవహారములయందు సంతృప్తిని పొందినగాని అభ్యుదయమును పొందలేరనియు, ఆకారణముగ మరల మరల అవతరింప వలసిన అవసరము కూడ తప్పదనియు, అందుచే పునరవతరణ సహజమనియు స్థిరమైన విశ్వాసము కలదు. ఇందుకు మరియొక కారణము ఆధ్యాత్మిక గ్రంథస్థములయిన ప్రవచనములను తప్పుగా అవగాహన చేసికొనుట. శరీరములతో సంపర్కము ద్వారా స్థూల సృజనేంద్రియములయొక్క సుఖదుఃఖానుభూతులయందు తృప్తిని పొందుటకు జీవులకు అనేక అవతరణ లవసరములని ఆ వచనములు సూచించును. అక్కడ యున్న పదము "జీవి" కాని "మానవజీవి" కాదు. ఇదియొక విభ్రాంతికర విషయము. మానవులుకాని యితర జీవులన్నిటికినీ, ఉన్నతేంద్రియములను పొంది మానవులగుటకు ఎన్నియేని శరీరములను దాల్చవలసిన అవసరము కలదు. కాని సుఖదుఃఖానుభూతులయందు తృప్తికొరకై మానవ జీవులు మరల మరల యవతరింప నక్కరలేదు.

నవ్యమానవులుగ అవతరించిన జీవులు సమాజమునందు బాధ్యత గలిగి వ్యవహరించుచున్న మానవులతో సంపర్క సంసర్గముల వలన శక్తి పరిణామమును పొంది, తాముకూడ బాధ్యతాయుతులయి వ్యవహరింతురు. అటు తరువాత, ఉన్నతము, అత్యున్నతము, మహో

న్నతములయిన బాధ్యతలుగల, ఆధ్యాత్మిక మహావ్యక్తులే సంపర్క-సంసర్గముల వలన మరల అవతరింపవలసిన అవసరమున కతీతులయి, విశ్వనిర్మాణ సంబంధమునందు అత్యున్నతములయిన బాధ్యతలు. కర్తవ్యము కలవారయి, క్రమముగ వానిని గూడ నధిగమించి, ఉన్నత. అత్యున్నత, మహోన్నతములైన ఆధ్యాత్మిక బాధ్యతాయుత జీవులయి, తమకు మూలమయిన విశ్వజీవితో నేకత్వానుభూతిని పొంది విశ్వజీవితో నైక్యమగుదురు.

ఇవి యన్నియును, సంతృప్తిని సాధించుట, మరల మరల అవతరించవలసిన అవసరమునకు అతీతులగుటయు, ఒకేయొక శరీర కాలమునందును, తదనంతరపు టశరీరకాలము నందును సాధింపబడగలవు. మానవేతర జీవులు మానవులగుట కెన్నియో సారులు జన్మలెత్తవలసియుండును. కాని మానవ జీవులయి, మానవ శరీరములతో నవతరించిన తరువాత, మరల అవతరించవలసిన అవసరము నధిగమించుటకును, మానవ మూలముతో, సర్వమునకు మూలముతో, విశ్వజీవితో, ప్రథమక్రియతో, సర్వాంతర్యామి ప్రథమ రూపముతో. తద్వారా సర్వాంతర్యామితో నేకత్వమును పొందుటకు మానవ జీవిగా ఒక్కమారవతరించిన చాలును.

ఈ యాధ్యాత్మిక సిద్ధాంతముల నవగాహన చేసికొనుటలో గల కొంత విభ్రాంతి మూలమున, సంతృప్తిని సంపాదించుటకు, మరల మరల అవతరించవలసిన అవసరముల నధిగమించుటకు అనేక అవతరణలవసరమను నమ్మకము బయలుదేరినది. నిజమునకు, మానవేతరులు మానవులగుటకు అనేక జన్మ లెత్తవలసిన యవసరము గలదని గ్రహించి యుండవలసినది. సస్యజాతులు అల్పేంద్రియ మానవేతరులయి, అవి మరల ఉత్తమేంద్రియ మానవేతరులయి, కాలక్రమమున

ఉన్నతేంద్రియములను పొంది సహజ వివేకముతో కూడిన మానవ జీవులయి, మానవ శరీరములతో నవతరించుటతో జీవుల యభ్యుదయ ప్రస్థానములో ప్రథమదశ పూర్తి యయినది. ఇందుకు రకరకముల మానవేతర శరీరములలో అనేక మానవేతర జన్మల నెత్తుట యవసరము. ఈ మానవేతర జీవుల అభ్యుదయ ప్రస్థానము పరిసమాప్తి పొందుటతో, అవి ఉన్నతేంద్రియములను పొంది, మానవజీవు లగు టతో మానవులుగ నవతరించుటతో జీవుల అభ్యుదయ ప్రస్థానము నందలి రెండవదశ ప్రారంభమగును.

ఇచ్చటనుండి, మానవులుగ అభ్యుదయమును పొందుటకు, వారి సూక్ష్మేంద్రియములలో సూక్ష్మశక్తి బయలుదేరుట ప్రారంభ మగును. అంతిమ దశయయిన మూడవదశ ఆ యా యింద్రియము లలో అతి సూక్ష్మాని ఉన్నతశక్తులు బయలు దేరుటతో ప్రారంభ మగును. ఈ అతి సూక్ష్మాది యింద్రియములు సక్రమముగ వ్యవ హరించుటవలన, వ్యక్తి జీవులుగ తృప్తి పొందుటయు అశరీరపు కాలమునందు పునరవతరణావశ్యకత నధిగమించుటయే గాక వ్యక్తి త్వమునే యధిగమింతురు. సహజ వివేక యుతులగు మానవులుగా ప్రారంభించి, శక్తి పరిణామములద్వారా రెండవ, మూడవ దశల నధిగమించి సంతృప్తిని, జన్మరాహిత్యమును సాధించుటయు, ఆధ్యా త్మిక సిద్ధాంతములద్వారా, విశ్వావశ్యకత ననుసరించి, ఒకే యొక యవతరణలో సాధింపనగును. ఇది పునఃప్రతిష్ఠిత మానవాభ్యుదయ సంస్థితి. ఈ స్థితి యెప్పటికినీ అట్లే యుండును.

మరల మరల మానవులుగ జన్మించుచుండుట తప్పనిసరి యనియెడి యీ విపర్యయావగాహన, విభ్రాంతివలన, మానవ శరీరముల చావు పుట్టుకలతో, మానవ వ్యక్తులు మరల మరల అవతరించుట అవ సరము లయ్యెను. అంతే కాకుండ, పునరవతరణావశ్యకత నధిగమింప

లేకుండుట సరిగదా, వ్యక్తుల సశరీర స్థితియందు, వస్తు విషయాదుల తోడి వ్యవహారమునందు సంతృప్తిని పొందలేకుండుటకూడ తటస్థించెను. ఉన్నతేంద్రియములను పొందెడివరకును మానవేతర జీవుల కార్యకలాపములు మానవులుగ నవతరించిన తరువాత వారికి "నిన్నటి" కార్యకలాపము లగును. సుఖదుఃఖ పూర్వకములయిన వాని ఫలితములను ఈనాడు వారు మానవులుగ ననుభవించవలెను. ఈ సుఖదుఃఖానుభూతుల యందలి స్వభావము, వైఖరులను వారీనాడు మార్చుకొనవలెను. మానవేతరులయిన వారి నిన్నటి కర్మలను, వారికిప్పుడు కలిగిన సహజ వివేక ప్రభావమువలన మార్చవచ్చును. వారి సూక్ష్మేంద్రియములు సక్రమముగా వ్యవహరించుట ప్రారంభించిన యెడల, సాధారణముగ ఒక్క సశరీరకాలములోనే యిట్టిమార్పు సాధ్యమగును. కాని, నిన్నటి మానవ జీవుల యొక్క కర్మ ఫలములను నేటి తమ సహజ వివేక ప్రభావమువలన మాత్రము మార్చలేరు. ఒక్క యవతరణలోనే గాదు. ఎన్ని యవతరణలైనను సరే! ఈ విధాన మీ రీతిగ నంతులేనిది.

వస్తు విషయాదులతోడి వ్యవహారమునందు, సశరీరస్థితియందు సంతృప్తిని బడయుటకు సాధారణముగ అనేక అవతరణ లవసరమను సిద్ధాంతము మతము పుట్టినప్పటి నుండియు ప్రబలమయి యుండెను. అందువలన, స్థూల సృజనేంద్రియముల ద్వారా సుఖదుఃఖానుభూతుల యనివార్యత, మరల మరల యవతరించుట, శరీరములకు చావు, పుట్టుకలు. తదనుగతములయిన సుఖదుఃఖానుభవములు, అభ్యుదయమునకు తప్పని సరిగ అవసరమను దృఢవిశ్వాస మేర్పడినది. ఈ విధానము అంతులేని దగుటవలన అభ్యుదయమును పొందెడి యవకాశములు శూన్యములయినవి. "మరలమరల శరీరములను ధరించి, వచ్చుచు పోవుచు,

తననుగతమైన సుఖదుఃఖముల ననుభవించెదము గాక ! అదియే మన యునికికి పరమాశయము !" అను భావము లేర్పడెను.

ప్రతి "నిన్న" యు ఒకనాడు "నేడే". ఒకనాడయినను "నేడు" కాని "నిన్న" యెన్నడును లేదు. ప్రతి "నేడు" యును నిన్నటికి "రేపు", నిన్నటికి "రేపు" కాని "నేడు" యెన్నడును లేదు. ఒక "రేపు" నకు "నేడు" కానట్టియు, ఒక "యెల్లుండి" కి "నిన్న" కానట్టియు, ఒక "రేపు" కూడ యుండదు. నేటి "నిన్న", నిన్నటి "నేడు", నేటి "నేడు" నిన్నటి "రేపు", నేటి "రేపు" రేపటి "నేడు" అగును. ఈ రీతిగ "నిన్న" నేటిలో నున్నది. "నేడు" నేటిలో నున్నది. "రేపు" కూడ నేటిలో నున్నది. భూతకాలము వర్తమానములో నున్నది. భవిష్యత్తు కూడ వర్తమానములో నున్నది. వర్తమానము కూడ వర్తమానములో నున్నది. ఇట్టి భూత భవిష్యద్రహిత మయినట్టియు, నిత్య స్థితమయినట్టియు, వర్తమానములో సర్వవ్యాప్తమయిన విశ్వజీవి, తనకు మూలము ఆధారమునగు సర్వాంతర్యామిలో నున్నది. సర్వాంతర్యామి సాక్షాత్కార మయిన విశ్వజీవియే సర్వము. ప్రేమ జ్ఞాన సామర్థ్యముల సంపూర్ణత్వమయిన ఈ విశ్వము, ఈ వర్తమానము వందున్నది.

ఈ యవతరణ, విశ్వము జీవ వస్తు విషయాదులుగ సర్వాంతర్యామి సాక్షాత్కారము, మరల సర్వస్థితమైన సర్వాంతర్యామిలోనికి సర్వవ్యాప్తమైన విశ్వజీవిద్వారా వీటన్నిటియొక్క విశ్వీకరణయు (unmanifestation) అవిభాజ్య, శాశ్వత, కాల, ప్రపంచములందు సాగుచున్నవి.

జీవులు, వస్తువిషయాదులయొక్కయు వ్యక్తిత్వమునందలి విశ్వత్వముయొక్కయు భావ సిద్ధాంతముపై నాధారపడి యిది సాధింపబడు

చున్నది. తదనుసారముగ, వ్యక్తుల విశ్వీకరణముతో బాటు, వస్తు విషయాదుల విశ్వీకరణముకూడ అప్రయత్నముగ జరుగుచున్నది. సస్య జీవులు అభ్యుదయపథమున పురోగమించుచు అల్పేంద్రియములనుపొంది, మానవేతర శరీరములనుదాల్చి, ఆయా యింద్రియములకు, శరీరములకు అనువయిన భావనానుభూతులను పొంది, సుఖదుఃఖముల ననుభవించి, అటుపిమ్మట ఉత్తమేంద్రియములను పొంది, ఆ యుత్తమేంద్రియముల ద్వారా భావనానుభూతులను సుఖదుఃఖములను అనుభవించి వెల్లడించుటకు అనువయిన, శరీరములను దాల్చి అటు తరువాత ఉన్నతేంద్రియములను పొంది సహజ వివేక వ్యవహారణకు, భావనానుభూతులకు అనువయిన మానవ శరీరములను దాల్చి మానవులయ్యెడి విధానము నిరంతరముగ సాగుచున్నది. ఇదియే మానవేతర జీవుల విశ్వీకరణ విధానము.

సస్యజాతులు అల్పేంద్రియములను పొంది అల్పేంద్రియ మానవేతర జీవులగుట, అవి మరల కాలక్రమమున ఉత్తమేంద్రియములను పొంది ఉత్తమేంద్రియ మానవేతర జీవులగుట, అవి మరల ఉన్నతేంద్రియములను పొంది మానవ జీవులగుటతో మానవేతర జీవుల విశ్వీకరణము, వారివలనను, మానవుల వలనను వినిర్గతమై విస్తృతమగుచున్న శక్తుల కలయిక వలన సాధింపబడుచున్నది. ఈ మూడు దశల యందును, ఆ యా జీవులయొక్క శక్తి సంపదలను బట్టియు, ఆశయములను, ఆకాంక్షలను బట్టియు, ఆ యా జీవుల కనువయినట్టియు వారి యింద్రియముల ద్వారా సుఖదుఃఖానుభూతుల ప్రకటనను, భావనానుభూతులను బట్టియు సాగుచున్నవి. ఇంతవరకు, మానవదశవరకు, మానవేతర జీవులు, శరీరములు, వస్తు విషయాదులలో గల భావనానుభూతులు, సుఖదుఃఖ ప్రకటనలను తమ శరీర గతేంద్రియముల ద్వారా చేయుటయేగాని, వానివలన అవి తృప్తిని పొందలేకున్నవి.

ఈ రీతిగ మానవ జీవులగుట, మానవ శరీరములను నిర్మించుకొనుట, పొందుట మానవేతర జీవుల విశ్వీకరణ యగుచున్నది. జీవుల యొక్కయు, వాని నిర్మాణమందలి విశేషములను బట్టియు మానవేతర జీవులు సౌఖ్య క్షేమములను మాత్రమే ఆకాంక్షించుచుండును. ఉన్న తేంద్రియములు లేకపోవుటవలన అవి సాధించుటెట్లో తెలిసికొనలేవు. ఆ యింద్రియములే మానవేతర జీవులు పొందగోరు ఉన్నతేంద్రియములు, మానవుల సహజ వివేకము.

అనేకములయిన జన్మలద్వారా మానవేతర జీవులీ యింద్రియములను పొంది మానవ జీవులగుటలో మానవేతర జీవులకు అభ్యుదయ సంపూర్ణత్వము సిద్ధించుచున్నది. ఒకే యొక మానవ జీవితములో పూర్తికాదగు మానవాభ్యుదయ విధానమున కిది ప్రారంభదశ.

మానవ, మానవేతర జీవులను విశదపరచునది సహజ వివేకమే యగుట వలన, సౌఖ్యక్షేమాకాంక్షతో కూడిన మానవేతరోన్ముఖతయే మానవులలో కూడ నుండుటచే, మానవేతరోన్ముఖత కొనసాగింపే మానవోన్ముఖత యగుటవలన, సౌఖ్యక్షేమములెట్లు పొందవలెనో తెలియునది సహజ వివేక మగుటవలన, వస్తు విషయాదులతోడి వ్యవహారములలోని తప్పొప్పులను తెలిసికొను శక్తి కలిగి యుండుట చేతను, ఏమి ఆలోచించవలెనో, ఏమి కూడదో, ఏమి మాటలాడవలెనో, ఏమి మాటాడరాదో, మానవులుగ ఏమి చేయవలెనో, ఏమి చేయకూడదో, నిర్ణయించునది సహజ వివేక మగుట వలన, అనియే అభ్యుదయ విధానమును సూచించును.

జీవ వస్తు విషయాదులతోడి వ్యవహారములలో సహజ వివేక ప్రబోధములను గ్రహించి, సక్రమ వైఖరి విధానములు కలిగి యుండవలెనని మానవులు కోరినప్పటికిని, వారి స్థూలసృజన శక్తులు బాహ్యో

న్ముఖములైన అహంములకు వశవర్తులై యుండుట వలన, ఆ యహంము లనే జీవులుగ వారి యింద్రియములు గ్రహించుట వలన, ఆ స్థూల సృజనేంద్రియములు ఇంకను మానవేతర స్వభావము కలిగి యుండుట వలనను, వారి సహజ వివేక ( Common sense ) ప్రబోధములను వారు గ్రహించ లేకున్నారు.

తమ బాహ్యోన్ముఖములైన యహంములే తమకు మారుగ వ్యవహరించు చున్నవనియు, ఆ యహంములే స్థూల సృజనేంద్రియ సంచాలనము గావించు చున్నవనియు, తమ యింద్రియములయొక్కయు, అహంముల యొక్కయు, స్వభావములలో సామరస్య ముండుట వలన, జీవులకు తెలియదు.

మానవానీకమునకీ పరిస్థితి తెలియక పోవుటవలన, వారు వస్తు విషయాదులతోడి ప్రవర్తన, వైఖరి, అలవాట్లలో అవిపర్యయముగ నుండకోరుట చేతను, స్థూల సృజనేంద్రియములను సహజ వివేక ప్రోద్బలము ననుసరించి వ్యవహరించునట్లు చేయుటకై వారు ప్రయత్నించు చున్నారు. కాని, స్థూల సృజనేంద్రియములు మానవేతర స్వభావములు కలిగియుండి, మానవేతర స్వభావములే గల బాహ్యోన్ముఖ అహంముల ప్రాబల్యమునకు లొంగియుండుటచే వారి యాదేశానుసారము వ్యవహరించుటకు అసమర్థములై యున్నవి. మానవానీకమునకు గల ప్రస్తుత విపరీత స్థితి యిదియే !

తమ యింద్రియములను తమ యిచ్ఛానుసారము వ్యవహరింప జేయుటకు చేసెడి యత్నము వృథా ! మానవులు సహజ వివేకయుతు లగుటచే మానవులయినారు. కాని వారి యహంములు స్థూలసృజనేంద్రియములు మానవేతరమే ! అహంములయొక్క, యింద్రియములయొక్క స్వభావములు కూడ మానవోచితములయినపుడే, మానవుల స్వభావ

న్ముఖతలతో సామరస్యమేర్పడును. ప్రస్తుతము వలెకాక, సక్రమముగ, మానవోచితముగ వ్యవహరించుటకు మానవుల కవకాశము కలుగును.

అదియును గాక, సరాసరి తమ స్థూల సృజనేంద్రియములను తామే వ్యవహరింప జేయురీతిని, మానవ నిర్మాణము జరిగియుండ లేదు. ఈ యింద్రియములకు వ్యక్తులతో ప్రత్యక్షసంబంధము లేదు. వ్యక్తులకును, ఈ యింద్రియములకును, నడుమ అహములున్నవి. ఈ యింద్రియములను సంచాలనము చేయునవి అహములే. వాని వాని పూర్వ జన్మాను గతమైన స్వభావవైఖరుల ననుసరించి, అవి సంచాలనము చేయుచున్నవి.

వ్యక్తులకును, స్థూల సృజనేంద్రియములకు నడుమ సంబంధములు అహములే. ఈ సంబంధ మూలకమయిన అహముల ప్రత్యేక స్థితివలన స్థూల సృజనేంద్రియములు వానినే జీవునిగా భావించుచున్నవి. అందువలన, తమ యింద్రియములను వశవర్తులను చేసికొనుటకు మానవులు పడెడు ఆవేదన, తమ అహములనే వశపరచు కొనుటకు పడినచో, జీవుల యొక్క స్వభావ వైఖరులను అహము లనుసరించినచో, సహజ వివేకానుసారమవి ప్రవర్తించినచో, అహములు కూడ మానవోచితము లగును.

జీవులయొక్క స్వభావోన్ముఖతల యందు ప్రీతిని గలిగి వానిని అహములు అనుసరించుట ప్రారంభించి నప్పుడు, అప్పటినుండి యవి అభ్యుదయ కారులగును. అభ్యుదయ కారులగుటతోడనే, వాని స్వభావోన్ముఖతలు, జీవుల స్వభావోన్ముఖతలతో సామరస్యము కలిగి యుండును. స్థూల సృజనేంద్రియములు, విచక్షణ శక్తిలేని వగుటచే అహములకు వశవర్తులై, అహములచే నియుక్తమగు కార్యకలాపము లందు నిమగ్నమగు లక్షణములు కలవగుటచే వాటికి వశవర్తులుగనే

యుండును. అహములు జీవులకు తామే యధీనులగు స్థితిని గుర్తించిన వెంటనే, జీవుల స్వభావ వైఖరులతో నవి సామరస్యమును పొందిన వగుటచే, ఇంద్రియములను తదనుగుణముగ అవి సంచాలనము చేయును. ఈ రీతిగ జీవులు, తమకు గల వ్యక్తిత్వమును గుర్తించి, అహములు తమకు సేవకులని గ్రహించి, తమ తరఫున స్థూల సృజనేంద్రియములను తమ కర్తవ్యసంసిద్ధికై మానవోచితరీతిని సంచాలనము చేయునని గ్రహించుట వలన తమకు తమ అహములకు సహజ వివేకమునకు, స్థూల సృజనేంద్రియములకు నడుమ సామరస్య స్థాపన చేయగల్గు చున్నవి. విశ్వసిద్ధాంతానుసారము ఈ యహములలోని పరివర్తన ఒక సశరీరపు కాలములోని (60, 70 సం॥) మూడు వంతుల కాలములో సాధ్యమగును.

అహములు పరివర్తన పొంది, జీవుల స్వభావోన్ముఖతలతో సామరస్యము కలిగి జీవుల యాధిపత్యమునకు వశవర్తులగుట ఆధ్యాత్మిక సిద్ధాంతానుసారము జరుగుచున్నది. బాహ్యోన్ముఖ అహములు గలవారి యొక్కయు, అభ్యుదయోన్ముఖ అహములు గలవారి యొక్కయు, వినిర్గత, విస్తృతశక్తి సమ్మేళనమువలన నిది సాధింపబడు చున్నది. వస్తు విషయాదుల తోడి వ్యవహారములలో నిరంతరము జీవులచే వినిర్గత మగుచున్నశక్తి యణువులతో ప్రదేశమంతయు నిండి యుండెను. ఈ శక్తి విస్తృతమైన అనంత ప్రదేశమునందు అభ్యుదయోన్ముఖ అహములు గల వ్యక్తుల శక్తులు నున్నవి. శక్తికి సదా సారూప్య శక్తులుగల అహములలోనికి యింద్రియములలోనికి ప్రవేశించుట ఒక లక్షణము కనుక అభ్యుదయ బాహ్యాశక్తుల ప్రసారము వస్త్రాదులలోను, వస్త్రాదుల ద్వారాయున్నూ నిరంతరము సాగు చుండును.

ఈ నిరంతర శక్తి ప్రసార సాగరమునందు మానవులు వస్తు విషయాదులతోడి వ్యవహారములలో సహజ వివేక ప్రబోధితులై తమ తప్పులను తెలిసికొని తప్పులనుండి తప్పించుకొనుటకు తమ అసమర్థతను కూడ తెలిసికొని, ఒక్క క్షణమైనను తీవ్రమగు భావములలో నిమగ్నులయిన యెడల, ఆ వ్యక్తులు, వారి అహములు, ఇంద్రియములు, ఆ క్షణమందు ప్రసరితమగుచున్న అభ్యుదయ శక్తులను గ్రహించుట కర్హులగుదురు. ఆ శక్తి నివాసమునకు అర్హులగుదురు. వారు అభ్యుదయ శక్తి గ్రాహకులై, శక్తిని గ్రహించెదరు. వారు అట్టి శక్తులను తమనుండి బయటకు పోనీయరు. ఇది సాధింపబడినప్పటి నుండియు, వ్యక్తుల యున్ముఖతలతో వారి అహములు యింద్రియములు ప్రీతిని పొందుట యేకాక ఆ వ్యక్తుల యధికారము నంగీకరించి వారితో సామరస్యమును పొందును. ఇక్కడనుండి వ్యక్తులు అభ్యుదయపథమున నిరంతరాయముగ పురోగమింతురు. శక్తి గ్రాహకత్వమును పొంది, అభ్యుదయశక్తిని గ్రహించుటకు, తమలోగల తప్పుడు స్వభావమును గూర్చియు, వానినుండి తప్పించుకొనుటకు తమ యసమర్థతనుగూర్చియు తీక్ష్ణభావములు, అభ్యుదయశక్తి ప్రసారములును ఒకే సమయమున నరుండవలెను. ఆ యేక సమయత్వము లేనియెడల వారిలో ప్రవేశించిన అభ్యుదయశక్తి వారినుండి బయటకు ప్రవహించును. ఈ పరిస్థితులలోనే మానవులచే అభ్యుదయ శక్తి గ్రహణము జరుగుచున్నది. ఇట్లు అభ్యుదయ శక్తులను పొందుటను "కృప" యందురు.

ఇట్టి పరిస్థితు లేర్పడుటకు కాలము, ప్రదేశము, పరిస్థితులు, పరిసరములు అనువై యుండవలెను. వీనిలో పరిస్థితులను, కాలమును మానవు లెదుర్కొనుచునే యున్నారు: కాని మిగిలిన రెండింటిని ప్రదేశమును, పరిసరముల నెదుర్కొనుట లేదు. పరిస్థితు లనువైనపుడు కాలము లేకపోవచ్చును. కాలము అనువయినపుడు ప్రదేశము పరిసర

ములు అనువయినవి కాకపోవచ్చును. ఈ మూడింటిలోనను, ఏ యొక్కటి లోపమైనా, రెండున్ననూ చాలదు. అందువలన కాలము, ప్రదేశము, పరిస్థితులు మూడును పరిసరముల కనుకూల మయినప్పుడే మానవులు అభ్యుదయ శక్తులను గ్రహింపగలిగి, కృపాపూర్వక అభ్యుదయ మానవు లగుదురు.

మానవులయొక్కయు, వారి శరీరములయొక్కయు అభ్యుదయ ప్రాప్తికి గల స్వాతంత్ర్యము సాంఘికము, రాజకీయము అను రెండు రకములు. ఈ రెండును ఆధ్యాత్మికత్వముపై నాధారపడి అన్యోన్య సంపూరకములుగ నున్నవి. మానవులు తమ అహముల యొక్కయు, స్థూల సృజనేంద్రియముల యొక్కయు, ప్రాబల్యము నుండి విముక్తి పొంది మానవోచితమగు వ్యవహారమును, ప్రవర్తనలను కలిగి యుండుట బంధనములోని స్వాతంత్ర్యము. జీవవస్తు విషయాదులతోడి వ్యవహారములలో, తమ సహజ వివేక ప్రోద్బలముల ననుసరించి, మానవులేదో యొక విధమున వ్యవహరింప నిశ్చయించినపుడు, వారి యహములు, స్థూలేంద్రియములు ఒకప్పు డెదురు తిరుగును. అట్టి స్థితి యందు, ఆ కాలమునందు, ఆ పరిస్థితులయందు, ఆ ప్రదేశమునందు ఆ యహములను, ఇంద్రియములను తిరుగుబాటులో ప్రోత్సహించునవి యేవియు నుండకూడదు. అంతేకాకుండ, అదేరీతిని వ్యవహారము సాగించుటకు తమ ప్రవర్తనాదుల కనువైన స్వభావము కలిగి యుండు టకు వ్యక్తులకు ప్రోత్సాహ ముండవలెను. అట్లు కలిగిన స్థితి, పరిస్థితులు, కాలము, ప్రదేశముల సామరస్యము కలిగినస్థితి. ఈ సమరస పరిస్థితులయందు అభ్యుదయ శక్తి గ్రహణము, కృపాప్రసారము, గ్రహణమును జరుగును. దానితోపాటు ప్రమాణ మానవ విజ్ఞానము ననుసరించి, ప్రవర్తన వైఖరుల నవలంబించుటకు మానవులకు స్వాతంత్ర్యము ప్రారంభమగును. అహములు, స్థూల సృజనేంద్రియ

ముల మానవేతర ప్రాబల్యము నధిగమించి, మానవ వ్యవహార వైఖరుల నలవరచుకొనుట కూడ, ఆధ్యాత్మిక సిద్ధాంతానుసారము ఒక శరీర కాలములో నడివయస్సు వచ్చుసరికి సాధ్యమగును.

అప్పటినుండి మానవులు ప్రపంచమందు మానవోచితముగ వ్యవహరించుటకు స్వతంత్రులు. వారి యుహములును, స్థూలేంద్రియములును వారి నెదిరింపవు. అవి తటస్థముగ కూడ నుండవు. అవి వశవర్తులై యుండును. ఇదియే బంధనములోని స్వాతంత్ర్యదశ. స్థూల సృజనేంద్రియముల యొక్కయు, అహంముల యొక్కయు ప్రాబల్యము నుండి స్వాతంత్ర్యము - ఇచ్చట వారి యున్ముఖతలు స్వభావముతో సామరస్యము కలిగి యుండును. అహంములయొక్కయు, ఇంద్రియముల యొక్కయు స్వభావ వైఖరులు వ్యక్తుల స్వభావ వైఖరులతోడను, సహజ వివేకముతోను సామరస్యము కలిగియుండును. ఇక్కడ, వారు అదే శరీరములలో, మానవేతరము నుండి మానవత్వమునకు మార్పును పొంది యున్నారు. వారు ప్రయోగించెడి వస్తు విషయాదులతోడి వ్యవహారములలో వారు ప్రయోగించెడి సిద్ధాంతములు సక్రమమైన వగుటవలన వారికి తృప్తి లభించును. సహజ వివేకేంద్రియము వలన ప్రయోజనము మానవ శరీరములు గల వారందరిని మానవులుగ జేయుటయే. ఆ యాశయ మిచ్చటితో అంతమగును.

సహజ వివేకముయొక్క భావనానుభూతుల కతీతమయిన వస్తు విషయాదులు కూడ నీ విశ్వమందుండుటవలన, మానవులు పొందెడి తృప్తి ఆ వస్తు విషయాదులతోడి తమ వ్యవహారముల వలన కలిగినదే యగుటవలన వ్యవహరించెడి రీతివలననే కాని, వ్యవహారములతో కాక పోవుటవలన కొంత యసంతృప్తి మిగులుచున్నది. వారు వ్యవహరించెడి విధానమునందు తృప్తిని పొందుచున్నారు, కాని వ్యవహారము

నందు కాదు. ఈ పరిస్థితివలన వారికి వ్యవహరించుటయందు కోర్కె, అందసంతృప్తియు బయలుదేరును. ఈ యసంతృప్తి మానవులుగనే యుండుటయందు గాఢోన్ముఖతగ వారిలో పరిణమించును. అందువలన మరల మరల మానవ శరీరములతో పునరవతరణావశ్యకత కలుగు చున్నది.

ఈ పరిస్థితిలో, మానవులు, వ్యవహార విధానముతో తృప్తిని పొందుటవలన, బంధనములోని బానిసత్వము నుండి, బంధనములోని స్వాతంత్ర్య స్థితిని వారు సాధించుటవలన, జీవవస్తు విషయాదులను గూర్చి వాని యశాశ్వతత్వమును గూర్చి సక్రమావగాహన పొంది యుండుటవలన, వ్యవహారమునందే తృప్తిని పొందుటకును వారి సూక్ష్మేంద్రియములు సక్రమముగ వ్యవహరించుటకు తగినంతశక్తిని పొందుటకును ప్రారంభింతురు.

మానవుల యభ్యుదయ క్రమములో సహజ వివేకపు టుప యోగము, సామర్థ్యము, వారు తమ యహములను బానిసత్వపు స్థితిని దాటువరకు మాత్రమే. మానవ సహజ వివేకానుసారము వారు తమ అహములను ఇంద్రియములను సంచాలన జేయునంతవరకు మాత్రమే. బంధనమునందలి స్వాతంత్ర్యము సాధింపబడిన తరువాత వ్యవహార విధానములతో తృప్తిని పొందియుండుటచేత, వారి యున్ముఖత యిప్పుడు వ్యవహారములతో తృప్తిని పొందుటకే యగుటచేతను, మానవ వ్యవహార విధానములలోకంటె, వ్యవహారముల యందే తృప్తిని బడసెడు ఇంద్రియములు వారు కలిగి యుండుటవలనను, ఆ యింద్రియములు సూక్ష్మేంద్రియము లగుటవలనను చాలినంత సూక్ష్మ శక్తిని పొంది సమర్థవంతముగ వ్యవహరించి, మానవ వ్యవహారణలో తృప్తిని పొందునట్లు చేయును.

ఈ యున్ముఖత, ఉత్సాహమువలన, మానవులు స్థూల సృజన కార్యకలాపములనుండి అకస్మాత్తుగ విరమింతురు. వారి యహములు, వారి స్థూలేంద్రియములు వారితో సమరసముగ నుండుటవలన వారికి వ్యవహారములయం దుత్సాహోన్ముఖత లుండవు. స్థూల సృజనేంద్రియ కార్యకలాపములనుండి విరమించుటతోడనే, వారిలో ఆ యా శక్తుల సంచయము ప్రారంభమగును. మానవులలోని యింద్రియముల నిర్మాణము ననుసరించి, ఏ శక్తియైనను అధికముగ సంచిత మొనర్పబడిన యెడల అది వెంటనే మరియొక శక్తిగ పరివర్తన పొందును. ఆ ప్రకారముగ స్థూలమునుండి సృజనమునకు, సృజనమునుండి సూక్ష్మమునకు శక్తి పరిణామము జరుగును. ప్రస్తుత మానవ పతనావస్థయందు కూడ ఈ పరిణామము శక్తి సంచయము ప్రారంభింపబడిన అయిదారు సంవత్సరములలో జరుగును. ఇట్టి స్థితియందు తగినంత సూక్ష్మశక్తి పరిణామముతో, సూక్ష్మేంద్రియ సక్రమ వ్యవహారణతో మానవుల బంధనములోని స్వతంత్ర దశ పూర్తియయి బంధనమునుండి స్వాతంత్ర్య దశ ప్రారంభమగును.

ఇచ్చటనుండి, సూక్ష్మేంద్రియములు సక్రమముగ వ్యవహరించుచున్నవి కనుక, వారి యహములు అభ్యుదయకరముగ నుండును. బంధనములోని స్వతంత్ర స్థితిలోని సహజ వివేకముయొక్క భావనానుభూతుల ప్రకటన శక్తి కతీతములయిన భావనానుభూతులను ప్రకటించుటకు సూక్ష్మేంద్రియము లిప్పుడు సమర్థవంతము లగుటవలన, ప్రపంచమునందు వ్యవహరించుటకు అత్యావసరములయిన జీవవస్తు విషయాదుల భావనానుభూతి ప్రకటనలు చేయును. అందువలన బంధనములోని స్వతంత్ర స్థితి ననుసరించి వారివారి స్వభావోన్ముఖతల ననుసరించి వారు తృప్తిని బడయుదురు.

ఇక్కడ మానవులు బంధనము నుండి స్వతంత్రులు. మానవోచితముగ వ్యవహరించుటయందు వారు తృప్తినిగాంచెదరు. ఈ మానవ వ్యవహారమునందు సాధింపబడెడు నీ తృప్తివలన కాలక్రమమున వ్యక్తిత్వ స్థితియందే విముఖత కలుగును. వ్యక్తిత్వ స్థితి యున్నంతవరకు, వ్యవహరణ తప్పనిసరిగనుక, వ్యక్తుల ఉన్ముఖత వ్యవహారములయందే సంతృప్తిని పొందుట యగుటవలన వ్యక్తిత్వ స్థితియందు విముఖత అట్టి స్థితియందు పొందిన సంతృప్తివలన కలుగును. ఏ శరీరములో నుండగ బంధనము నుండి స్వతంత్రత సాధింపబడినదో, ఆ శరీరము నశించిన తరువాత మరల యవతరణముండదు. ఆ శరీరము లంతమయిన తరువాత, అశరీరపు కాలాంతములోగా ఆ వ్యక్తులు అనివార్య పునరవతరణావశ్యకత కతీతులగుదురు. వ్యవహరణయందు తృప్తిని పొందకుండ శరీరములను చాలించిన వ్యక్తులు వ్యక్తిత్వ స్థితి యందు తృప్తిని పొందకపోవుటచే మరల యవతరింతురు. ఇట్టి పునర్జన్మ రాహిత్యము స్వతంత్రములో స్వతంత్రము. మానవులిట్టి స్థితిని ఒక సశరీర కాలములో మూడవవంతు కాలములో పొందుటకు సాధ్యమగునట్లు నిర్మితమైయున్నారు.

బంధనములోని బానిస దశనుండి, బంధనములోని స్వతంత్ర స్థితికి, అక్కడనుండి సూక్ష్మేంద్రియ సక్రమ వ్యవహరణ కనువయిన శక్తి పరిణామము పొంది స్వతంత్రములో స్వతంత్రులగుటకు కావలసిన శక్తులు విస్తృతమై జీవులచే గ్రహింపబడుటకు, ప్రదేశమొక ప్రధాన విషయము. వ్యక్తిత్వ దశయందు తృప్తిని పొందెడి యున్ముఖతగల బానిసత్వములోని స్వతంత్ర దశలో, నిది మరియు నవసరము. ఇక్కడ ఏకాంత ప్రదేశము కావలెను. పరిసరములందు, శ్రవణ గోచరేంద్రియములు కందుబాటులో ప్రలోభకరమగు వస్తు విషయాదు లుండకూడదు. సాహచర్య ప్రలోభమును కల్పించెడి జీవులు వస్తువులు పరిస

రములలో నుండరాదు. ఇట్టి సురక్షిత ప్రదేశములలో బంధనముల నుండి తొలగించెడి స్థితిని పొందుట సాధ్యమగును.

వారి శ్రవణగోచరేంద్రియముల కందుబాటులో భయోత్పాతములగు పరిస్థితు లుండవలెను. అట్టి ప్రయత్నములయందు ఏకాగ్రత, ధ్యానము అప్రయత్నముగ సాగును. తమ కాధార్యములయిన వస్తు విషయాదులు పరిసరములలో లేనందున, లేవను విషయము, భయము యొక్క యునికి వారెరిగియుండుట వలన, ఒక అనువైన పరిస్థితి యేర్పడును. అనివార్య పునరవతరణావశ్యకత నధిగమించవలె ననెడి యాసక్తి వలనను, ప్రదేశము, పరిస్థితివలన యేర్పడిన స్థితి వలనను స్వవిశ్వాసము, స్వశక్తి బయలుదేరి భయము నశించును. ఈ స్వశక్తి స్వవిశ్వాసములు భయసంహారకములు. వారప్పుడు భయరహితు లగుదురు. నిర్భీకత్వములో వారు స్థిరులగుదురు, వారు నిర్భయులు.

సూక్ష్మేంద్రియ సక్రమ వ్యవహారణ వలనను, వస్తు విషయాదులతో, వాని మూలముతో, వాని సంబంధము, బాధ్యత, ఆశయము, సిద్ధాంతములతో నేకత్వానుభూతివలన, ప్రదేశము, కాలము పరిస్థితుల కలయికవలన నేర్పడిన ఈ సామరస్యతలో నిర్భీతి అభ్యుదయ నాణెమునకు ఒకవైపు. మానవకర్తవ్య సంసిద్ధియే ఆ నాణెమునకు రెండవవైపు. వారి నిర్భయత్వము, సమస్త జీవులతో, విశ్వజీవితో, వాని మూలము నాధారమయిన సర్వాంతర్యామితో నేకత్వ మూలకమగుట వలన వారుకూడ సర్వాంతర్యామిలో నున్నారు.

ఇట్టి పరిస్థితుల నుండి కలుగగల సక్రమావగాహనా మూలకమగు ఆధ్యాత్మిక విజ్ఞానమిట్లు చెప్పును. "ఈ ప్రపంచమునందు నాకంటె ఇతరు లెవ్వరును లేరు. అశరీర స్థితియందు కూడ నాకన్న యితరు

లెవ్వరును యుండరు. నేనెవరికి భయపడవలెను. నాకు చెందని విష యము లేవియును లేవు. నేనెందుకు భయపడవలెను ?"

ఈ ప్రపంచము నందుకాని, మరియొకచోటగాని. నావికానట్టియు నా యభ్యుదయమునకు కానట్టియు విషయాదులెవ్వియునూ లేవు. నే నెట్లు భయపడ గలను ?

భూమిపైననూ, క్రిందనూ, శరీరములతో కూడిన సమస్త జీవులు విశ్వములో, ప్రదేశములో నుండుట వలన, ప్రదేశము వారిలో నుండుట వలన, ప్రదేశము నందంతటను పరిపూర్ణముగ, నిరంతరముగ, విశ్వజీవి యుండుట వలనను, విశ్వజీవితో సర్వాంతర్యామి యుండుట వలనను, మానవులు తేమను గూర్చి యుపయోగించెడు "నేను" అను పదములో ఈ సమస్తము నిమిడి యున్నవి. ఆ పదము సమస్త జీవులతోడి యేక త్వముతో కూడియున్నది. "నేను" సర్వవ్యాపిని, శరీరములతో కూడి యున్న సమస్త జీవరాసులు, భూమ్యాకాశములతో సహా నాలో నున్నవి. నేను అవిభాజ్యముగ వానిలో నున్నాను. అన్ని విషయ ములు నాకు చెందినవి. నాకై యుద్దేశింపబడినవి. అన్నియు నేనే. నేనే అన్నియును, నా మూలమును, ఆధారమునగు సర్వాంతర్యామియును. మానవుల స్వతంత్రములోని స్వతంత్రస్థితిలో, శరీరముల మరణము వారిపై ప్రాబల్యము కలిగియుండదు. శరీరముల యొక్క జనన మరణ ములు ఒకే నాణెముయొక్క రెండు వైపులు నగుట వలన, జన్మమృత్యు ప్రాబల్యమునకు వారతీతు లగుదురు. వారు అశరీర, సశరీర స్థితుల కతీతు లగుదురు. ఈ రీతిగ పునరవతరణ వారికి అనవసరమగును. ఒక సశరీర కాలములోని మూడు భాగములలో ప్రథమ భాగము నందిట్టి స్థితిని పొందగలరు.

మానవానీకపు మాతా పితరులారా! కీర్తి సంపదల సము పార్జనార్థము, మీ బిడ్డలు మిమ్ములను విడిచి మీకు కనపడకుండ

దూర ప్రాంతములకు పోవుటకు మీరు ప్రోత్సహింతురు. అత్యధికము లయిన కీర్తి సంపదలతో వారిని మీరు చూడ గోరెదరు. వారి కీర్తి సంపదల వలన లబ్దిని పొందగోరి, వారితో భాగస్వాములగుచున్నారు. మీరట్లు చేయుచున్నారు. చేసి లబ్దిని పొందుచున్నారు. కాని, మిమ్ము లను మీరు పరీక్షించుకొనుడు. మీ తృప్తి కొరకయినను, మీ రాలో చింపుడు. దూరమున నున్న మీ బిడ్డల యొక్క క్షేమసంపదలను గూర్చి, ఒక్క పూట యయిన, మీరు భయపడకుండ గడిపియున్నారా? మనకు కనిపించెడి, వినిపించెడి, యీ ప్రపంచము నందెచ్చట యే దుర దృష్ట సంఘటన సంభవించిననూ, మీలో భయము కలిగించి, దూరము నందుగల మీ బిడ్డల యొక్క క్షేమమును శంకింపజేయును. ఒకొ్కక్క ప్పుడు, హటాత్సంఘటనలు సంభవించునపుడు, ఈ భయోత్పన్నస్థితి గంట లును, రోజులు, నెలలును, సంవత్సరముల వరకూ కూడ మీలో సాగు చునేయుండి, విపరీత పరిస్థితులేర్పడి అట్టి యాపద మీ బిడ్డలకు కూడ సంభవించును. ఈ విపత్తు మొకటి హటాత్సంఘటన వలన, మీ బిడ్డ లను గూర్చిన భయము వలన కలుగుచున్నది. అట్టి పరిస్థితు లేర్పడు టను మీరు కోరరు. అయినను, మీరు దానియందిరుకుకొనియున్నారు. మీ బిడ్డ లధికములైన కీర్తి సంపదలను పొందుటయందు నేర్పును సంపాదించుటలోను, తత్సంపాదనార్థము దూరప్రదేశములకు పంపుట యందును మీ రెంత బాధ్యులో నిట్టి ప్రమాదము కలుగుటకు కూడ మీ రంత బాధ్యులే!

ప్రేమాస్పదు లయిన మాతా పితరులారా! మీరు మాతా పితరులు కనుక ప్రేమాస్పదులు. మీరు మానవ లోకమునకే పితరు లగుట వలన పుణ్యులు. ఏమి చేయవలెనో, ఏమి చేయకూడదో, ఎట్లు చేయవలెనో, ఎప్పుడు చేయవలెనో — ఎందుకు మాటలుండనిండు — తెలియకపోవుట వలన, మీరు జాలి పడదగినవారు. మీ రిట్టి కల్లోల

పరిస్థితికి పాల్పడుటకు కారణము — మీ సహజ వివేక (Common-Sense) ప్రబోధములను మీరు గుర్తింపక పోవుటయే.

ఏ విధానములో పెంచబడిన పిల్లలు ఆ రీతిగా వ్యవహరించు చుందురు. ఇక ముందునుండి యయినను పిల్లలను పెంచెడి విధానమును మీరు మార్చవచ్చును. మార్చవలెను. అట్టి మార్పులు మీ కొరకు, మీ బిడ్డల కొరకు చేయవలెను. నేటి మీ బిడ్డలతో రేపు మీ కుండగల సంబంధమును జ్ఞాపకము తెచ్చుకొనుడు. ఇప్పటివలెనే బిడ్డలను పెంచుచు వచ్చిన యెడల రేపు మీకును, మీ బిడ్డలకును మధ్య సంబంధము లెట్లుండునో యూహింపుడు. నేడు వారు మీ కేమయి యుండిరో రేపు మీరు వారికట్లు కాబోవుచున్నారు. ఇది విశ్వావశ్యకతానుసారము కాదు. ఈ అంతులేని సంభ్రమణ, బిడ్డలు పితరులకు పితరులగుట మానవేతర లక్షణమే కాని, మానవ లక్షణము కాదు. ఆ సంభ్రమణము లన్నియు మీ మానవేతర స్థితియందు మీరు ఉన్నత శక్తులను సంపాదించు వరకును మాత్రమే మీకు అవసరమయి యుండినది.

మీరు సహజ వివేకమును పొంది, మానవులయి, మానవ శరీరములతో మనుచున్నప్పటికిని, మీ స్థూల సృజనేంద్రియములకు, అహములకు, అలవాటు చొప్పున వశవర్తులై యున్నారు. మీ సహజ వివేక ప్రబోధములను మీరు గ్రహింపలేకుండుటయే యిందుకు కారణము. మీరు మానవులైనను కూడ మీ అహములు, స్థూల సృజనేంద్రియములు మానవేతరములవలెనే యున్నవి. వాని స్వభావ వైఖరులు పూర్వపు రీతిగనే యున్నవి. మీరు సహజ వివేకము నుపయోగించి మీ అహములు, యింద్రియములు, దానితో సామరస్యము కలిగి వ్యవహరించునట్లు చేయకున్నచో, మీరును, మీ బిడ్డలును కూడ

ఎప్పటివలెనే యుండకతప్పదు. శరీరములోతప్ప మీకును, మానవేతర జీవులకును తారతమ్యములేదు. అందువలన, మీ బిడ్డల పెంపక విధానములను తప్పక మార్చుకొనుడు.

నిర్భయత్వమును వారిలో పెంపొందింపుడు. నిర్భీకులుగ నుండుటను వారికి నేర్పుడు. స్వవిశ్వాసమును, స్వశక్తిని వారు కల్గించుకొనునట్లు ప్రోత్సహింపుడు. కీర్తి సంపదల సంపాదననుండి వారు విరమింప నక్కరలేదు. కీర్తి సంపదలను సంపాదించెడి నేర్పుతోపాటు స్వవిశ్వాసము, స్వశక్తిని అలవరచుకొని నిర్భీకులుగ నుండునట్లు కూడ చేయుడు. మానవ శరీరములకు ఇరువది లేక ముప్పది సంవత్సరములు వయస్సు వచ్చుసరికి వృత్తివిద్యలను నేర్చుటముగియును. వానితోపాటు పెంపొందించుకొనినచో స్వశక్తి, స్వవిశ్వాసము, నిర్భీతత్వము కూడ అప్పటికి సమకూడును. ఇవన్నియును పొందుట పూర్తియగుటతోడనే గృహస్థులయి బిడ్డల తండ్రులగునట్లు చేయకుడు. ఇక్కడనే మీ ప్రేమ విశేషము కావలెను. ఆధ్యాత్మిక సిద్ధాంతముల ద్వారా నిర్భయత్వము, స్వవిశ్వాము పొందునట్లు చేయుడు. ఇందుకు అనువయిన ప్రదేశములలో అనువయిన పరిస్థితులయందు వారుండుటకవకాశములను కలుగజేయుడు. మానవేతర స్థితినుండి వారి యభ్యుదయానంతరము వారి యహములయొక్కయు, ఇంద్రియముల యొక్కయు స్వభావము, ప్రీతుల ననుసరించి అట్టి కార్యకలాపములను కొనసాగించుచు వానియందు నిమగ్నమగు స్వభావము ప్రీతిని వారి యింద్రియములు అహములు కలిగియుండును. మానవులలోని మానవలక్షణమైన సహజ వివేకమిట్టి స్థితియందు వారికేమి చేయవలెనో, ఏమి చేయకూడదో, ఎట్లు చేయవలెనో, ఎప్పుడు చేయవలెనో, వారి స్వభావోన్ముఖతలతో సామరస్యము గల జీవ వస్తు విషయాదులతో నెట్లు వ్యవహరించవలెనో సూచించును. ఈ సమయమునందు మానవులు తమ సహజ వివేక

ముతో సామరస్యము కలిగియుండవలెను. కాని యిట్టి స్థితియందు స్థూల సృజనేంద్రియములు, అహములు వారి పూర్వ కార్యకలాపముల యందు ప్రీతిని కలిగియుండుట వలన, వారికి పూర్వపు వ్యక్తితుల్య మయిన అహముల ప్రోత్సాహమువలన అవి వ్యక్తుల కెదురు తిరుగును. అందుచే నిట్టి సమయములందే, కాలముతో సమరసమయిన ప్రదేశ ములందు మీ బిడ్డ లుండవలెను. అప్పుడే పరిస్థితులు, కాలము, ప్రదే శముల యొక్క సామరస్యమువలన, సామరస్యము గల స్థితివలన, ఏకా గ్రత, ధ్యానము, నిర్భయత్వము, ఆశయమునందు నిమగ్నత వలన జీవ వస్తు విషయములతో వారికి కలుగు నేకత్వానుభవము ద్వారా స్వవిశ్వాసము, స్వశక్తి వారిలో కలుగును. అందు మూలమున శరీర మరణముల ప్రాబల్యమున కతీతులగుట వలన, ఈ స్వవిశ్వాసము, స్వశక్తిని పొందిన తరువాత, వారు పునరవతరణ ప్రాబల్యమునకు కూడ అతీతులగుదురు. వారి శరీరములు గతించిన తరువాత పునరవతరణా వశ్యకత నధిగమింతురు.

అందువలన వృత్తి విద్యల యందుత్తీర్ణు లయిన తరువాత. వారిని ప్రోత్సాహపరచి, వారికి సౌకర్యములు కలుగజేసి, సుమారు మూడు సంవత్సరముల కాలమైనను, మీరు వారిని చూడకుండ, నిర్భ యత్వము నలవరచుకొనుటకు ప్రోత్సహింపుడు. స్వవిశ్వాసము, స్వశక్తి, వాని ద్వారా నిర్భయత్వమును పొందిన తరువాత వారెట్లు వ్యవహరింపవలెనో యని వారికి అనుభవ జన్యమైన స్వభావమున కనువుగ వ్యవహరించుటకు వారికి స్వాతంత్ర్యమునిండు. జీవ వస్తు విష యాదులతోడి వ్యవహారములయందు వారి యున్ముఖతలతో సామ రస్యము గల స్వభావము ననుసరింపనిండు. వారి యందు విశ్వాస ముతో నుండుడు. సమాజములో వారి బాధ్యతల యవగాహన సక్ర మముగ నుండునని విశ్వసింపుడు. సమాజమునందు, గార్హస్థ్యమునందు

నవ్యమానవులు, తత్తుల్యులైన పునరవతారిత మానవులు, గార్హస్థ్య మున కతీతులయిన సంతృప్తిపరులు, అను మూడు తెగలున్నవి. నవ్యుల యొక్కయు, తత్తుల్యులయిన పునరవతారిత మానవుల యొక్కయు, యుద్దేశ మొకటే — మానవేతర జీవులకు మానవ దేహములను కల్పించుట. బాధ్యతాయుతులైన మానవులు మానవ శరీర నిర్మాణ మను ఉద్దేశమును నెరవేర్చుటకై వ్యవహరించుచుండవచ్చును. వారు వైవాహిక సంస్థ కతీతులై ఉన్నత బాధ్యతాశయములతో వ్యవహరింపగోరెదరు. మూడవతరగతికి చెందిన గార్హస్థ్యసంస్థ కతీతులైనవారు మానవేతర జీవులు మానవ వ్యక్తులగుట కనువయిన పరిస్థితులు కల్పించుటకు పాటుపడుచుందురు. అందువలన మీ బిడ్డలను తమ యస్వస్థతలను గూర్చియు, వైవాహిక సంస్థ ఆశయములను, విధానములను గూర్చియు అందలి సభ్యులను, సభ్యులు కానివారిని గూర్చియు ఆలోచించి వారేమి చేయవలెనో వారి నిర్ణయములను వారినే చేసికొననిండు. సమాజముతో వారెట్టి సంబంధమున కష్టాలో, అట్టి సంబంధమును వారిని పొందనీయుడు.

తమ యనుభవముల ననుసరించి తమ యున్ముఖతలను గూర్చి వారు చేసికొను నిర్ణయములపై మీ ప్రాబల్యమును ప్రయోగింపకుడు. కట్టుకొనెడి బట్టలయందు మీ యిష్టములను, మీ కొలతలను మీ బిడ్డలపై రుద్దరు. మీ కోరిక ప్రకారము ఒక్క జతబట్టలు తయారు చేయుటకు కొంత గుడ్డ కావలసి యుండును. మీ బిడ్డలకు వారి కోరిక ప్రకారము ఒక జత బట్టలకు కొంత తక్కువయో, యెక్కువయో, లేక మరియొక రకము బట్టలో కావలసియుండవచ్చును. మీకొక వంటకము ఎక్కువ యిష్టము కావచ్చును. మరియొకటి యిష్టము కాకపోవచ్చును. మీ బిడ్డలకు, మీకు ఇష్టముకాని మరియొక వంటకము ఇష్టము కావచ్చును. ఇట్టి మార్పులవలన మీకు నొప్పి కలుగదు. అంతేకాక మీకు

సంతోషము కూడ కల్గును. ఈ విషయములందు వారి యిచ్ఛలకు స్వాతంత్ర్యము నిత్తురు. ఆహారములయందు మీ రుచులు, బట్టలయందు మీ యభిరుచులు వారిపై రుద్దిన ఎంత వింతగ నుండును! మీరట్లు చేయరు. మీ యభిరుచులకు, మీ రుచులకు మీ బిడ్డలు సరిపెట్టుకొన వలెనని మీరు కోరరు. ఎందుచేత? మానవులలో వ్యక్తినుండి వ్యక్తికి అభిరుచులు, రుచులు భిన్నముగ నుండునని మీకు తెలియును. ఈ సక్రమావగాహన వలన మీ బిడ్డలయందు మీకుగల ప్రేమవలన, మీరు మీ బిడ్డలను వారికి కావలసిన ఆహారములను, వస్త్రములను ఎన్నుకొనుటయందు స్వాతంత్రముగ విడిచిపెట్టుచున్నారు.

అదేరీతిగ వృత్తి విద్యా సముపార్జన పూర్తియయిన తరువాత, స్వవిశ్వాసము, స్వశక్తి, నిర్భయత్వము పొందినతరువాత, మీ బిడ్డల లోని స్వభావోన్ముఖతలలో భిన్నత్వ ముండునని మీరు సక్రమముగ నవగాహన చేసికొనినయెడల, వారు సమాజముతో తమ స్వభావముల కర్హమగు సంబంధములను గూర్చి చేయు నిర్ణయములతో మీరు కలుగజేసికొన యత్నింపరు. భిన్నమయిన విధానములలో పెంచబడు టచే, మీ బిడ్డల స్వభావోన్ముఖతలను మీరు తెలిసికొనలేరు. కాని యీ విషయమును గూర్చి యిప్పుడు, చెప్పబడిన తరువాత, మీ బిడ్డల యొక్క స్వభావోన్ముఖతలలోని విభిన్నత్వములను సక్రమావగాహన చేసికొని వారు అవిపర్యయ నిర్ణయము చేసికొనుటకు మీరు ప్రోత్సహించెదరు గాక.

వారు సౌఖ్య క్షేమములతో నుండుటను మీరు ప్రేమింతురు. మీ యభీష్ట ప్రకారము బట్టలు కట్టుకొని వారట్లుండవలెనని మీరు కోరరు. అదేరీతిగ కీర్తిసంపదలను సంపాదించెడి నేర్పును, నిర్భయత్వమును పొంది, అటుపిమ్మట తమ యర్హతల ననుసరించి భావిజీవిత

క్రమమును నిర్ణయించుకొనెడి స్వతంత్రతను పొందినచో, వారి నిర్ణయము, వారి యర్హతలకూ, సమాజపు టావశ్యకతలకూ, సమాజముతో తమకుగల సంబంధమునకూ, సామరస్యము కలిగి అభ్యుదయ పథమునందుండును. ఈ పరిస్థితియందు వారును, వారి శరీరములును, విభిన్న శ్రేణుల శక్తుల యవరోహణకు, ఆకర్షణకు అనువుగ నుందురు. ఇప్పుడు సశరీరులై యున్నట్టియు, తెలిసినట్టియు, తెలియనట్టియు ఆధ్యాత్మిక మహావ్యక్తులచే వినిర్గతమై విస్తృత మగుచున్న విశ్వాత్మభావము కలిగి విశ్వావశ్యకతాసిద్ధి దాయకము లయినట్టియు, విశ్వమానవాభ్యుదయము ద్వారా విశ్వావశ్యకతా సంసిద్ధి నాకాంక్షించు శక్తులు మీ బిడ్డలలోను వారి శరీరములలోను ప్రవేశించి, వారిచే గ్రహింపబడును.

ఆధ్యాత్మిక సిద్ధాంతములద్వారా విశ్వమానవ కర్తవ్య నిర్వహణమునకు సాధనములై, విశ్వ మానవ నిర్మాణ సిద్ధాంతముల ననుసరించి, మానవ సమైక్యత, బాధ్యత, కర్తవ్య సమైక్యత, శాంతి, సంపద అభ్యుదయములద్వారా, కర్తవ్య సంసిద్ధికిని, ప్రళయకాలము నందు విశ్వ విశ్రాంతి ప్రాప్తికిని మీ బిడ్డలు సాధనము లగుదురు. అందువలన, జీవవస్తు విషయాదులతోడి వ్యవహారములలో తామాధ్యాత్మిక సిద్ధాంత ప్రాబల్యమునకు సాధనములగునట్లుగ, మానవులు భావించి, ఆలోచించి వ్యవహరింతురుగాక.

మీ బిడ్డలయెడ మీరు ప్రదర్శించిన శ్లాఘనీయ విధానము వలన, వారు సక్రమముగ వ్యవహరించి, తామభ్యుదయ పథమున పురోగమించుచు, సమాజముపట్ల తమకుగల బాధ్యతలను సక్రమముగ నిర్వహించుచు, మీ రెంతయో కాంక్షించెడి సౌఖ్య క్షేమములను వారనుభవింతురు. వారు సౌఖ్య క్షేమములవలన ఫలప్రాప్తిని

